PRINTED BY
V. RAMASWAMY SASTRULU & SONS,
AT THE 'VAVILLA' PRESS, MADRAS.—1928.

# ప్రకాశకుల విజ్ఞప్తి.



సహృదయులారా!

ఆంధ్ర వాఙ్మయమునఁ బేరెన్నికఁగన్న శతకములను విషయములనుబట్టి విభాగములు గావించి సంపుటములుగఁ బ్రచురింపఁ దలంచి యనేకశతకములను ముద్రితాముద్రితముల నార్జించి శుద్ధప్రతులు పీఠికలు వ్రాయించి సిద్ధపఱచితిమి. శ్రీయుత గురుజాడ అప్పారావుగారిద్వారా మాయుద్యమమును విని శ్రీవిజయనగర సంస్థానాధీశ్వరులగు మీర్జా శ్రీ రాజా శ్రీపూసపాటి విజయరామగజపతి మహారాజా మన్నెసుల్తాన్ బహదర్ వారు కాగితములవ్యయము భరించి శతకసంపుటముల ప్రచురణమునకుఁ దోడుపడుదుమని వాగ్దానమొనరించి యిమ్ము సర్వవిధములఁ బ్రోత్సహించి మాయుద్యమమునై సానుభూతిఁ జూపిరి.

కాని, శతకకవులచరిత్రము వ్రాయుచు శ్రీ వంగూరు సుబ్బారావుగారు మాయొద్దనుండి శతకప్ర

తులు దీసికొని తిరుగ నొసంగక యెన్ని పర్యాయము లడిగినను ఇదిగో అదిగో యని మాకీయకపోవు టచే సంకల్పించిన శతకసంపుటప్రచురణమునకు శ్రీవిజయనగర మహారాజావారి తోడ్పాటుపొం దుటకు అంతరాయము కలిగినది. వ్యయప్రయాస ములకు లోనై వ్రాయించిన ప్రతులు గైకొని పని ముగిసినను తిరుగ నొసంగక పోవుట యేగాక వంగారు సుబ్బారావుగారు కీర్తిశేషులగుటకుఁ గూడ విచా రించి మరల మొదలెత్తి చిరకాలముక్రిందట సంక ల్పించిన శతకసంపుటప్రకటన మిప్పటికి సాగించితిని. క్రమముగ వేలు వేలుసంపుటములుగ భక్తి, శృం గార, నీతి, మతవిషయశతకములతో నింకఁ గొన్ని సంపుటములను బ్రచురింపనున్న మాయుద్యమమున కాంధ్రమహాజనులతోడ్పాటవసరము.

ఈ భక్తిశతక తృతీయ సంపుటమునందుఁ గూడ నిరువదిశతకములఁ జేర్చితిమి గాని ఇందలి భద్రగిరిశతకమును శ్రీరమణీమనోహరశతకమును శ్రీపీఠికాపురము మహారాజావారు దయతోఁ బ్రత్యంతరము వ్రాసికొనుటకు నొసంగిరి. యాదగిరీంద్ర, నృకేసరి, శ్రీకృష్ణ లోనగు సముద్రి తశతకములను శ్రీశేషాద్రిరమణకవు లొసంగిరిగాన వారియెడఁ గృతజ్ఞులము. శతకములఁ బ్రత్యంతర

ములసహాయమున సంస్కరించి విపులములగు పీఠికలు వ్రాసి యొసంగి శ్రీ శేషాద్రిరమణకవులు శతకసంపుట ప్రకటనమునకు మిగులఁ దోడ్పడుటచే సర్వాంగ సుందరమగు నీభక్తిరసతృతీయ శతకసంపుటము ప్రచురింపఁ గలిగితిమి.

ఆంధ్రమహాజనుల యాదరణప్రోత్సాహములఁ బట్టి కడమసంపుటములనుగూడఁ ద్వరలోఁ బ్రచురించుటకుఁ బ్రయత్నింప నున్నారము.

తండయార్పేట,
చెన్నపురి.
24-4-1928.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు
అండ్ సన్స్.

# విషయసూచిక.



---

# భక్తిరసశతకములు

# మూడవసంపుటము.

# పీఠిక.

ఈనారాయణశతకము వ్రాసినకవిపేరు శతక పద్యములందుఁ గానరాదు. వ్రాఁతప్రతులలో నొక దానిలోమాత్రము బమ్మెరపోతన రచించినటుల గద్యము గలదు. ఈగద్యము గ్రంథకర్త వ్రాసినదె యని విశ్వసింప వీలులేదు. ప్రత్యంతరములందుఁ గవిపేరే కానరాదు. పద్యములపోలికను బట్టియు భాగవతపద్యములను బోలినపద్యము లుంటవలనను బోతనరచితమె యని శతకకవులచరిత్రమునందుఁ జర్చింపఁబడినదిగాని ప్రమాణసమన్వితముగాని యాచర్చవలనఁ బ్రకృతమున కుపయోగము కానరాదు. భాగవతమున కీవలిశతకములందుఁ జాలవఱకు మత్తేభశార్దూలములందుఁ బోతన ననుకరించుట తెలుచుఁగాఁ గాననగును. శైలినిబట్టిచూచినను గుణదోషములనుబట్టిచూచినను భాగవతమునకు భోగినీదండకమునకుఁ బోలికగాఁ గనిపింపదు. పోతనయే రచించెననువాదము నంగీకరించినచో నీ

శతకము వీరభద్రవిజయరచనానంతరము పూర్తి
చేయఁబడినటుల విశ్వసింపఁజనును.

నారాయణశతకము దేశమున మిగుల వ్యాప్తి
నొందినశతకములలో నొకటి. దీని ప్రత్యంతరము
లాంధ్రదేశమునందలి యన్ని భాగములలో లభించు
చున్నవి. అందెందును గవి యెవరో యెఱుంగనగు
నాధారములు గానరావు. వెల్లంకి తాతంభట్టు,
కస్తూరిరంగకవి యీశతకమును దమలక్షణగ్రంథ
ములలో నుదాహరణము దీసికొనిరి గాన నీశత
కము పదునేనవశతాబ్దమునాఁటి వ్యాప్తిలో నున్న
టులఁ దలంపవచ్చును. లాక్షణికవిరుద్ధములగు లోప
ము లీశతకమునందుఁ జాలగలవు. ఒకటిరెండుదక్క
మిగిలిన తెగదోషములు భాగవతమునందు లేనివి గాన
నిది పోతనకృతము కాదేమోయని సంశయింప వీలు
కలుగుచున్నది. శ్రీకృష్ణునిశృంగారచర్యలు భాగవ
తానుసారముగ నీకవి కొన్ని పద్యములందుఁ
జేర్చెను. శ్రీకృష్ణలీలలను వర్ణించు ప్రతికవియుఁ
దెలిసి కొన్ని తెలియక కొన్ని భాగవతదశమస్కంధ
భావములు కృష్ణకర్ణామృతభావములు సంగ్రహిం

చుట గలదుగాన నిట్టి భావసామ్యములు కవినిర్ణ
యమున కుపకరింపవని మా యాశయము.

ఈశతకమునందలి 104 వ పద్యమువలనఁ గవి
యీశతకమును అదిదశకము, అవతారదశకము,
దివ్యరూపదశకము, నామదశకము, కృష్ణావతార
వింశతి, జ్ఞానవింశతి, మోక్షవింశతి యని విభాగము
గావించినటులఁ దెలియుచున్నది. వ్రాతప్రతులయం
దుఁ బద్యములవరుస తప్పుపడియున్నది. ముద్రిత
ప్రతియందు నూఱుపద్యములె కలవు. ఇతరప్రతు
లందుఁ గొన్నిటఁ గొన్ని పెచ్చుపద్యములు గాన
వచ్చుచున్నవి. ప్రతిపద్యమునకుఁ బాఠభేదములు
పెక్కుచూపట్టుచున్నవి. ప్రత్యంతరసహాయమునఁ
గవిభావముల కనుసరించుపాఠములనె యిందుఁ
దీసికొంటిమి. ప్రత్యంతరములనుండి యింక నైదు
పద్యములను సమకూర్చితిమి. ఇంకను బ్రత్యంతర
ముల శోధించినచోఁ గొన్ని క్రొత్తపద్యములు
లభింపవచ్చును. శతకప్రతులయందుఁ బద్యముల
వరుస భిన్నముగా నుంట దశకానుసారముగాఁ
బద్యములను విడదీయ వీలులేకపోయినది. భావి

పరిశోధనమున శతకకర్తనామము తెలియవచ్చెనేని కాలనిర్ణయమునకుఁ బ్రయత్నింప వీలుకల్గును. పోతనయే రచించెనని విశ్వసించువారికిఁ గవికుల స్థలనివాసాదులనుగూర్చి మాభాగవత పీఠికవలనఁ దెలిసికొనవచ్చును. నారాయణశతకవ్రాఁతప్రతులు గలవారు తమప్రతులలోనిపాఠములు క్రొత్తపద్యములు కవినామముగలపద్యము కలవేమో పరిశీలించి ప్రతి నొసంగుదురేని కృతజ్ఞులమై ముందుఁ జేయఁబోవు ముద్రణమున కీశతకమును సంస్కరించెదము.

సరిచూచుకొనుటకై వ్రాఁతప్రతి నొసంగి తోడ్పడిన జగ్గయ్యపేట వాస్తవ్యులగు ఊటుకూరి శ్రీరాములుగారియెడఁ గృతజ్ఞులము.

నందిగామ }
1-6-26. }

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు.

శ్రీ ర స్తు.

# నారాయణశతకము.



శా. శ్రీరామామణిపాణిపంకజ మృదుశ్రీతజ్ఞపాదా
బ్జశ్రీం, గాఢాకారశరీర చారుకరుణాగంభీర
సద్భక్తమం, దారాంభోరుహపత్రలోచన కళా
ధారోరుసంపత్సుధా, పారావారవిహార! నాదు
రితముల్ భంజింపు నారాయణా. 1

మ. కడకుం బోయక వేయినోళ్ళ గలయాకాకోద
రాధీశుండుం, గడముట్ట న్వినుతింపలేక నిగుడన్
గ్రాలంగ నొప్పారు మి, మ్మడరన్ సన్నుతిసేయ
నాదువశమే యజ్ఞాని లోభాత్ముండన్, జడుండ
న్నజ్ఞుండ నైకజిహ్వుండ జనస్తబ్ధుండ నా...

శా. నే నీదాసుండ నీవు నాపతివి నిన్నేకాని యొం
డెవ్వరిన్, ధ్యానింపం బ్రణుతింప నట్లగుటకు
న్నానేర్చుచందంబునన్, నీనామస్తుతు లాచరిం
చునెడల న్నేతప్పులుం గల్గినన్, వానిన్ లోఁ
గొనుమయ్య తండ్రి! విహితవ్యాపార నా...

మ. నెరయ న్నిర్మల మైననీస్తుతికథానీకంబు పద్యాం
బులో, నొరుగుల్ మిక్కిలి గల్గె నేనియుఁ గడు
న్యోగ్యంబె చర్చింపఁగాఁ, గుఱుగజ్జైనను వంక
బోయినఁ గడుం గుజ్జైనఁ బేడెత్తినం, జెఱుకుం
గోలకు తీపు గాక కలదే చే దెందు నా... 4

మ. చదువుల్ పెక్కులు సంగ్రహించి పిదపం జాలం
గ సుజ్ఞానియై, మదిలోఁ బాయక నిన్ను నిల్పఁ
దగు నామర్మంబు వీక్షింపఁడే, మొదలం గాడిద
చారుగంధవితతుల్ మోవంగ శక్యంబె కా, కది
సౌరభ్యపరీక్ష జూడ కుశలేయవ్యక్త నా... 5

మ. లలిఁ గబ్బంబు కరాట మివ్వసుధ నెల్ల న్మించెఁ
బో నీకథా, వలి కర్పూరము సించిన న్నితరమా
వ్యర్థార్థకామోదముల్, వెలుచం బూనినయ
క్కరాటము తుదిన్ బేతేకరాటంబె పో, చలదిం
దీవరపత్రలోచనఘనశ్యామాంగ నా... 6

మ. మనమార న్నచలేంద్రజాధిపతికి న్నస్త్రాగ్రమా
ణిక్యమై, మునికోపానలదగ్ధరాజతతికి న్ముక్తి
స్ఫురన్మార్గమై, యొనయన్ సాయకశాయికిం జన
నియై యేపారుమిన్నేటికిం, జనిమూలం బగు
నంఘ్రి నాదుమదిలోఁ జర్చింతు నా... 7

శా. నీపుత్రుండు చరాచరప్రతతుల న్నిర్మించి పెం

పారఁగా, నీపుణ్యాంగన సర్వజీవతతుల న్నిత్యం
బు రక్షింపఁగా, నీపాదోదక మీజగత్త్రయముల
న్నిష్పాపులం జేయఁగా, నీపెం పేమని చెప్ప
వచ్చు సుగుణా నిత్యాత్మ నా... 8

శా. బ్రహ్మాండావలిలోన సత్త్వగుణివై బాహ్యాంబునం
దాదిమ, బ్రహ్మాఖ్యం బరతత్త్వబోధములకున్
భవ్యాధినాథుండవై, బ్రహ్మేంద్రామరవాయుభు
క్పతులకున్ భావింపరాకున్న నా, జిహ్వావ్యాప్తుల
నెన్న నాడువశమే చిద్రూప నా... 9

మ. ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్
భృత్యులై, పరమామ్నాయము లెల్ల వందిగణ
మై బ్రహ్మాండ మగారమై, సిరి భార్యామణియై
విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై, వరుస
న్నీఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నా... 10

మ. మగమీనాకృతి వార్ధిఁ జొచ్చి యసురన్ మర్దించి
యవ్వేదముల్, మగుడం దెచ్చి విరించి కిచ్చి
యతని న్మన్నించి చేపారఁగా, బగ సాధిం
చినదివ్యమూర్తి వని నే భావింతు నెల్లప్పుడున్,
ఖగరాజధ్వజ భక్తవత్సల జగత్కారుణ్య నా...

మ. అమరుల్ రాక్షసనాయకుల్ కడఁకతో నత్యంత
సామర్థ్యులై, భ్రమరీదండము మందరాచలముగా

బాథోనిధిం ద్రచ్చఁగాఁ, దనుకించె భువనత్ర
యంబును గిరుల్ దంతావళుల్ మ్రొగ్గినం, గమ
ఠంబై ధరియించి మించినజగత్కల్యాణ నా...

శా. భీమాకారవరాహమై భువనముల్ భీతిల్లి కంపింప
ను, ద్దామోర్విం గొనిపోయి నీరనిధిలోఁ డాఁ
గున్నగర్వాంధునిన్, హేమాక్షాసురు వీఁకఁ
డాఁకి జయలక్ష్మిన్ గారవింపంగ నీ, భూమిం దక్షి
ణదంష్ట్ర నెత్తిన నినుం బూజింతు నా... 13

శా. స్తంభంబందు నృసింహమై వెడలి యచ్చండాట్ట
హాసధ్వనుల్, దంభోళిం గడువంగ హేమకశి
పోద్దండాసురాధీశ్వరున్, శుంభద్గర్భము వ్రచ్చి
వానిసుతునిన్ శోభిల్ల మన్నించియు, జ్జంభారాతిని
బ్రీతిఁ దేల్చిన నినుం జర్చింతు నా... 14

మ. మహియు న్నాకసమున్ం బదద్వయపరీమాణం
బుగాఁ బెట్టి యా, గ్రహ మొప్పం బలిమస్తకం
బొకపదగ్రస్తంబుగా నెమ్మితో, విహరించిం ద్ర
విరించి శంకరమహావిఖ్యాతదివ్యాకృతిన్, సహ
జంబై విలసిల్లువామనలసచ్చారిత్ర నా... 15

మ. ధరణిన్ రక్తమహాహ్రదంబు లెలమిం ద్రైలోక్య
నిర్దిష్టమై, పరగం బైతృకతర్పణంబుకొఱకై
ప్రఖ్యాతిగాఁ దీవ్రతన్, నిరువయ్యొక్కటిమారు

క్షత్రవరుల న్నేపార నిర్జించి త, త్పరశుభా౹
జితరామనామము కడుఁ ధన్యంబు నా... 16

మ. వరుసం దాటకిఁ జంపి కౌశికు మఘుసార్వస్థ్యంబు గా
వించి శ్రం, కరుచాపం బొగిఁ ద్రుంచి జానకిఁ దగం
గళ్యాణమై తండ్రి పం, పరుదారఁ వనభూమి
కేఁగి జగదాహ్లాదంబుగా రావణుఁ, ధరణిం
గూల్చినరామనామము కడుఁ ధన్యంబు నా...17

మ. యదువంశంబునఁ గృష్ణు కగ్రజుఁడవై *యాభీల
శౌర్యోన్నతిఁ, మదవద్ధేనుక ముష్టికాద్యసు
రులఁ మర్ధించి లీలారసా, స్పదకేళీరతి రేవతీవ
దనకంజాతాంతభృంగంబనఁ, విదితంబౌ బలరా
మమూర్తివని నిఁ వీక్షింతు నా... 18

మ. పురముల్మూఁడును మూఁడులోకములు నేప్రొద్దు
న్విదారింపఁ ద, త్పురనారీ మహిమోన్నతుల్
సెడుటకై బుద్ధుండవై బుద్ధితో, వరబోధద్రుమ
సేవఁ జేయుటకునై వారిం బ్రబోధించి య, ప్పుర
ముల్ గెల్చిన మీయుపాయము జగత్పూజ్యం
బు నా... 19

మ. కలిధర్మంబునఁ బాపసంకలితులై గర్వాంధులై
తుచ్ఛులై, కులశీలంబులు మాని హేయగతు

* యేపారునుద్దండశక్.

లం గ్రొవ్వారు దుష్టాత్ములం, బలిగాఁ జేయఁ దలంచి
ధర్మ మెలమిం బాలించి నిల్పంగ మీ, వలనం గ
ల్గన్యవతార మొందఁగల నిన్ వర్ణింతు నా...20

మ. ఇరవొందన్ సచరాచర ప్రతతుల న్నెన్నంగ శక్యం
బుకా, కరయన్ పద్మభవాండ భాండచయము
న్నారంగ మీకుక్షిలో, సరుదార న్నుదయించుఁ
బెంచు నడఁగు న్నన్నారి కేళ్ళోద్భవాం, తరవాః
పూరము చంద మొంది యెపుడున్ దైత్యారి నా.

మ. దళదిందీవరనీలనీరదసముద్యద్భాసితాకార శ్రీ,ల
లనా కౌస్తుభచారువక్ష విబుధశ్లాఘోన్నవ స్థాన
కో, మలనాభి చరణారవింద జనితామ్నాయా
ద్య గంగా! లస, జ్జలజాతాయతనేత్ర నిన్ను
మదిలోఁ జర్చింతు నా.... 22

మ. జగదాధారక భక్తవత్సల కృపా జన్మాలయా పాం
గ! భూ, గగనార్కేందుజలాత్మ పావక మరు
త్కాయా! ప్రదీపప్రభో, గిగణస్తుత్య మహా
ఘునాశన! లసద్దీర గుణసంసేవితా!, త్రిగుణాతీత!
ముకుంద! నాదుమదిలో దీపింపు నా... 23

శా. భూతవ్రాతము సంబుజాసనుఁడవై పుట్టింతు వి
ష్ణుండవై, ప్రీతిం బ్రోతు హరుండవై చెఱుతు ని
ర్భేద్యుండవై త్రైగుణో, పేతంబై పరమాత్మవై

నిలుతు నీపెంపెవ్వరుం గాన ర,జ్ఞాతోద్భూత సు
జాత పూజిత పదాబ్జశ్రేష్ఠ నా... 24

మ. వరనాభీధవళాంబుజోదరమునన్ వాణీశుఁ గ
ల్పించి య, ప్పురుషశ్రేష్ఠుని ఫాలమందు శివునిం
బుట్టించి యామేటికిం,బరమోత్తంసముగా వియ
త్తలనదిం బాదంబులం గన్న మీ, సరి†యెవ్వా
రలు మీరుదక్కఁగ రమాసాధ్వీశ నా... 25

మ. ప్రభ మీనాభి జనించినట్టి విలసత్పద్మోరుసద్మంబు
నం, బ్రభవంబైన విరించిఫాలజనితప్రస్వేదసంభూ
తుఁడై, యభిధానంబును గోరి కాంచెను భవుం
డార్యేశు లూహింపఁగా, నభవాఖ్యుండవు ని
న్నెఱుంగవశమే యబ్జాక్ష నా... 26

మ. పటుగర్భాంతరగోళభాగమున నీబ్రహ్మాండభాం
డంబు ప్రా, కటదివ్యాద్భుతలీలఁ దాల్చి మహి
మం గల్పాంత మంభోధిపై, వటపత్రాగ్రముఁ జెం
ది యొప్పినమిము వర్ణింపఁగా శక్యమే, నిటలా
క్షాంబురుహాసనాదికులకు న్నిర్వాణ నా... 27

మ. సవిశేషోరుసువర్ణబిందువిలసచ్చక్రాంకలింగాకృ
తిన్, భవుచే సుధ్రువుచేఁ బయోజభవుచేఁ బద్మా
రిచే భానుచే, ధ్రువుచే నాదివిజాధినాయకులచే

† యింకెవ్వరు నీవెకర్తవు రమాసంబంధ.

దీవ్యన్మునీంద్రాళిచే, నవదివ్యార్చన లందుచుం
దువు రమానారీశ నా... 28

మ. సర్వంబుల్ వసియించు నీతనువునన్ సర్వంబునం
దుండఁగా, సర్వాత్మా! వసియించు దీవనిమదిన్
సార్థంబుగాఁజూచి యా, గీర్వాణాదులు వాసు
దేవుఁడనుచున్ గీర్తింతు రేప్రొద్దు నా, శీర్వా
దంబు భవన్మహామహిమ లక్ష్మీనాథ నా... 29

మ. గగనాద్యంచిత పంచభూతమయమై కంజాత జాం
డావలిన్, సగుణబ్రహ్మామయాఖ్యతం దనరుచున్
సంసారివై చిత్కళా, సుగుణంబై విలసిల్లుదీవు
విపులస్థూలంబు సూక్ష్మంబునై, నిగమోత్తంస
గుణావతంస సుమహా నిత్యాత్మ నా... 30

మ ఎలనారన్ భవదీయనామకథనం బేమర్త్యుచిత్తంబు
లోఁ, బొలుపారం దగిలుండునేని యఘముల్
పొందంగ నెట్లో పెదున్, కలయం బావకుచేతఁ
బట్టువడు నకాష్ఠంబుపైఁ గీటముల్, నిలువ
న్నేర్చునె భక్తపోషణ కృపానిత్యాత్మ నా...

మ. కలయం దిక్కులు నిండి చండతరమై కప్పూరు
మేఘౌఘముల్, వెలయన్ ఘోరసమీరణ
స్ఫురణచే వేపాయుచందంబునన్, జలదంభోళి
మృగాగ్ని తస్కర రుజా శత్రోరగవ్రాతముల్,
దొలఁగున్నీదగు దివ్యమంత్రపఠనన్ దోషఘ్న నా.

మ. కలుషాగాధ వినాశకారి యగుచుం గైవల్యసం
ధాయియై, నలి నొప్పారెడు మంత్రరాజమగు
నీనామంబు ప్రేమంబుతో, నలర న్నెవ్వనివాక్కు
నం బొరయదే నన్నీచు ఘోరాత్మయుఁ, వెల
యఁ భూరుహకోటరంబడియ సూ వేదాత్మ నా.

మ. పరమంబై పరతత్త్వమై సకలసంపత్సారమై భవ్య
మై, సురసిద్ధోరగ యక్షపతీముని రక్షోహృద్గ
హాభ్యంతర, స్థిరసుజ్ఞానసుదీప్తమై శ్రుతికళాసి
ద్ధాంతమై సిద్ధమై, సరిలేకెప్పుడు నీదునామ మ
మరుఁ సత్యంబు నా... 34

మ. అధికాఘౌఘతమో దివాకరమునై యద్రీంద్ర
జా జిహ్వకుఁ, సుధయై వేదవినూత్నరత్నము
లకుఁ సూత్రాభిధానంబునై, బుధసందోహము
నోహరాంకురమునై భూదేవతాకోటికిఁ, విధు
లై మీబహునామరాజి వెలయుఁ వేదాత్మ నా.

మ. పోనర స్మృక్తికిఁ ద్రోవ వేదములకుం బుట్టిల్లు మో
దంబునం, దునికిస్థానము యిష్టభోగములకు న్ను
త్పత్తి యే ప్రొద్దునుఁ, ఘనపాపంబులవైరి పద్రి
పులకుఁ గాలావసానంబు మీ, వినుతాంఘ్రి
ద్వయపద్మసేవనగదా విశ్వేశ నా... 36

మ. భవరోగంబులమందు పాతకతమోబాలార్కబిం.

బంబు క, ర్మవిషజ్వాలసుధాంశుగామృతతుషార
వ్రాతపాథోధిమూ, ర్తివి కైవల్యపదావలోకనక
ళాదివ్యాంజనశ్రేష్ఠమై, భువిలో మీఁదగుమంత్ర
రాజమమరున్ భూతాత్మ నా... 37

మ. వరుసన్ గర్మపిపీలికాకృత తనూవల్మీకనాళంబు
లోఁ, బరుషాకారముతో వసించినమహాపాపో
రగశ్రేణికిం, బరమోచ్చాటనమై రహస్యమహిం
మంబాటింపుచు న్నుండు మీ, తిరుమంత్రంబగు
మంత్రరాజ మమరుం దివ్యాత్మ నా... 38

మ. హరుని న్నద్రిజ నాంజనేయుని గుహు న్నయ్యం
బరీషున్ ధ్రువుం, గరిఁ బ్రహ్లాదు విభీషణాఖ్యుని
బలిన్ ఘంటాశ్రవు న్నారదున్, గరమొప్ప న్విదు
రున్ బరాశరసుతున్ గాంగేయునిన్ ద్రౌపదిన్,
నరునక్రూరునిఁ బాయకుండునుభవన్నామంబు నా.

శా. శ్రీకిన్మందిరమైనవక్షము సురజ్యేష్ఠోద్భవస్థాననా,
భీకంజాతము చంద్రికాంతరసుధాభివ్యక్తనేత్రం
బులున్, లోకస్తుత్యమరున్నదీజనక మాలోలాం
ఘ్రియున్ గల్గు నా, లోకారాధ్యుఁడవైననిన్నె
పుడు నాలోఁ జూతు నా... 40

శా. విందుల్ విందులటంచు గోపరమణుల్ వ్రేపల్లె
లోఁ బిన్ననాఁ, డందెల్ మ్రోయఁగ ముద్దుమో

మలర నిన్నాలింగితుఁ జేయుచో, డెందంబుల్
దనివార రాగరసవీటీలీలలఁ దేల్చుమీ, మంద
స్మేరముఖేందురోచులు మము నన్నించు నా...

శా. వెందుల్వచ్చిరి మీయశోదకడకు న్వేగంబె పొమ్మ
య్యారయో, నందానందన! చందనాంకురము! కృ
ష్ణా! యింకఁ బోవేమి మా, మందం జాతరసేయఁ
బోదమిదె రమ్మా యంచు మిమ్మెత్తుకో, చందం
బబ్బిన నుబ్బకుండుదురె ఘోషస్త్రీలు నా...42

శా. అన్నా కృష్ణను నేఁడు వేల్పులకు మీఁదన్నార
మీచట్లలో, వెన్నల్ నుట్టకు మన్ననాక్షణము
నన్వీశ్వాకృతిమూర్తివై, యున్నఁ దిక్కులు
చూచుచుఁ బెగడి నిన్నోలి నుతుల్ సేయు
చుఁ, గన్నుల్ మూయ యశోదకుఁ జిఱుతవై
కన్పింతు నా... 43

శా. ఉల్లోలంబులుగాఁ గురుల్ నుదుటిపై నుప్పొంగ
మోమెత్తి ధమ్మిల్లం బల్లలనాడ రాగరససమ్మిశ్రం
బుగా నీవు వ్రే, పల్లెం దాడుచు గోపగోనివహా
గోపస్త్రీలయుల్లంబు మీ, పిల్లంగ్రోవిని జుట్టిరాఁ
దిగుచు నీపెంపొప్పు నా... 44

మ. కసవొప్పఁ పసి మేసి ప్రొద్దుగలుగం గాంతా
రముం బాసి య, ప్పసియున్నివును వచ్చుచో

నెదురుగాఁ బైకొన్నగోపాంగనా, రసవద్వృత్త
పయోధరద్వయహారిద్రాలేపనామోదముల్, ప
సిఁ గొంచున్ బసిఁ గొంచువచ్చుటలు నే భావిం
తు నా... 45

శా. చన్నుల్ మీఁదికి చౌకళింప నడుముం జవ్వాడ
కందర్పసం, పస్నాఖ్యంబు నటించుమూఁడిక్కఁ కబ
రీభారంబు లూటాడఁగా, విన్నాణంబు నటింప
గోపిజన గోబృందంబుతో వచ్చు మీ, వన్నెల్
కన్నుల ముంచి గ్రోలుటలు నే వర్ణింతునా ...

మ. పెరుగుల్ ద్రచ్చుచు నొక్కగోపిక మిముం
బ్రేమంబునం జూచి రా, గరసావేశత రిత్తద్రచ్చ
నిడ నాకవ్వంబు నీవు న్మనో, హారలీలం గనుఁ
గొంచు ధేనువని యయ్యాఁబోతునుం బట్టితీ, వర
వృత్తాంతము లేను పుణ్యకథగా వర్ణింతు నా...

శా. కేలన్ గోలయు గూటిచిక్కము నొగిం గీలించి
నెత్తంబునం, బీలీపింఛముఁ జుట్టి నెన్నడుమునం
బింఛావళిన్ గట్టిక, ర్ణాలంకారకదంబగుచ్ఛమధు
మత్తాలిస్వనంబొప్పనీ, వాలన్ గాచినభావమిట్టి
దని నే వర్ణింతు నా... 48

శా. కాళిందీతటభూమి నాలకదుపుల్ కాలూఁది మే
యన్ సము, త్తాలాలోల తమాలపాదపశిఖాం

తప్తుండవై వేణురం, ధ్రాళిలిన్ రాగరసంబునిం
డ విలసద్రాగంబు సంధించి గో, పాలవ్రాతము
గండుగోయిలలుగా వర్ణింతు నా... 49

శా. రాణించెన్ గడునంచు నీసహచరుల్ రాగిల్లి స్రో
లంగ మీా, వేణుక్వాణము వీనులంబడి మనోవీ
ధుల్ బయల్ముట్టఁగా, ఘోణాగ్రంబులు మీాఁ
దికెత్తుకొని లాంగూలంబు లల్లార్చి గో, శ్రేణుల్
చిందులుద్రొక్కియాడుటలు నేఁ జర్చింతు నా.

మ. పసులంగాపరి యేమెఱుంగు మధురప్రాయోల్ల
సద్వృత్తవా, గ్విపరారావముమోవిదా వెదురు
గ్రోవిం బెట్టినాఁడంచు నిన్, గసటుల్ సేయఁగ
నాఁడుగోపికల తద్గానంబులన్ మన్మథ, వ్యసనా
సక్తలఁ జేయుచందములు నే వర్ణింతు నా...51

మ. జడిరెుంతేఁ దడవయ్యె జెయ్యి యలసెన్ శైలం
బు మాచేతులం, దిడుమన్నన్ జిఱునవ్వుతో వ
దలినన్ హీనోక్తి గిపెట్టనె, కృడుగోవుల్ బ్రి
యమంద నింద్రుఁ డడలంగోవర్ధనాద్రీంద్రమున్,
గొడుగై యుండగఁ గేలఁ బూనితిగదా గోవిందనా.

మ. లలితాకుంచితవేణియందడవి మొల్లల్ జాజి ఫా
లస్థలిన్, దిలకం బొయ్యనజాఱఁ గుండలరుచుల్
దీపింప లేఁ జెక్కులన్, మొలకన్న వ్వులచూపు

లోరగిల మే స్మవ్వంకలఁ బోవఁగా, నలిఁ గై
కొందువుగాదె నీవు మురళీనాట్యంబు నా...
శా. మాపాలం గడుగ్రొవ్వి గోపికలలో మత్తిల్లి వ
ర్తింతువే, మాపాలెంబుల వచ్చియుండుదు వెస
న్మాపాలలోనుండుమీ, మాపాలైన సుఖాబ్ధిలో
మునుఁగుచుఁ మన్నించి తా గొల్లలఁ, మాపా
లంగలవేల్పు వీవెయని కా మన్నింతు నా...54
మ. ఒక కాంతామణి కొక్కఁడీవు మఱియు న్నొక్క
ర్తె కొక్కండవై, సకలస్త్రీలకు సంతసంబలర రా
సక్రీడతన్మధ్యక, ల్పక మూలంబున వేణునాదరస
మొప్పంగాఁ బదార్వేలగో, పికలం జెంది వినోద
మొందు నెడ నీ పెంపొప్పు నా... 55
మ. లలితంబైన భవత్తనూవిలసనఁ లావణ్యదివ్యా
మృతం, బలుఁగులార్వరఁగ నీకటాక్షమునఁ దామం
దంద గోపాంగనల్, తలఁపుల్పాదులుగట్టి కందళి
తనూత్నశ్రీలు వాటింతురా, నెలఁతల్ తీవెలు
చైత్రవిస్ఫురణమా నీయొప్పు నా... 56
శా. లీలఁ బూతకిప్రాణవాయువులు పాలింద్లందు
వెళ్ళించి దు, శ్శీలుండై చను బండిదానవు వెసం
జిందై పడందన్ని యా, రోల న్మద్దులుగూల్చి ధే
నుదనుజుఁ రోఁజంగ నీల్గించి వే, కూలం గంసు
నిఁగొట్టి గోపికలకోర్కుల్ దీర్తు నా... 57

మ. రసనాగ్రంబున నీదునామరుచియున్ రమ్యం
బుగాఁ జెప్పకు, న్నసలారంగ భవత్కథాభిరతి
యున్ హస్తాబ్జయుగ్మంబులన్, వెసనీపాదసుపూ
జితాదియుగమున్ విజ్ఞాన మథ్యాత్మకున్, వెస
నింపొందనివాఁడు దాఁ బశువుసూ వేదాత్మ నా.

మ. వరకాళిందితరంగడోలికలలో వైకుంఠధామం
బులో, వెరవొప్పార నయోధ్యలో మధురలో
వ్రేపల్లెలో ద్వారకా, పురిలో నాడెడుభంగి నాదు
మదిలో భూరిప్రసన్నాననాం, బురుహం బొప్ప
నటించుటొప్పును సీతాంభోజాక్ష నా... 59

శా. చల్లల్వేఱొకయూర నమ్ముకొను నాసంబోవు
చోఁ ద్రోవ నీ, వుల్లాసంబున నడ్డకట్టి మదనో
ద్యోగానులాపంబులన్, చల్లన్ జల్లనిచూపు జ
ల్లుమని గోపస్త్రీలపైఁ జల్లు మీఁ, చల్లంబోరు తె
ఱంగు చిత్తమున నే జర్చింతు నా... 60

మ. కలయ న్వేదములున్ బురాణములు బ్రఖ్యా
తంబుగా తెల్పి మీఁ, వలనన్ భక్తివిహీనుఁడై నపిద
పన్ వ్యర్థప్రయత్నంబె పో, గులకాంతామణి
గొడ్డువోయినగతిం గ్రొవ్వారు సస్యంబు దా, ఫ
లకాలంబున నీచపోవుపగిదిన్ పద్మాక్ష నా...61

శా. స్నానంబుల్ నదులందు జేయుట గజస్నానంబు

చందంబగున్, మౌనంబొప్ప జపించువేద మటవీ
మధ్యంబులో నేడ్పగున్, నానాహోమము లెల్ల
బూడిదలలోన న్వేల్చునెయ్యై చను, న్నీ నామో
క్తియు నీపదాబ్జరతియున్ లేకున్న నా... 62

మ. అలనీటందగు రొంపిపైఁ జిలికిన న్నానీటనేపా
యు నా, యిలపాపంబులు దుష్కరత్వము మహా
హోమంబునం బొందినం, బలువై జీవుని దొప్పఁ
దోఁగినవి యీబాహ్యంబునం బాయునే, పొలి
యుంగాక భవత్సుపాదజలముం బ్రోక్షింప నా.

మ. తనచిత్తాబ్జము మీపదాబ్జములకుం దాత్పర్య
సద్భక్తితం, తున బంధించిన బంధనంబుక తనం
దుష్పాపపుంజంబు లె, ల్లను విచ్ఛిన్నములై యడం
గు మహామోల్లాసాబ్ధియైనట్టి దా, సున కింపొందు
ను మోక్షవైభవము దా సుశ్లోక నా... 64

మ. తనువుం జీవుఁడు నేకమైనపిదపన్ ధర్మక్రియాచారం
భుఁడై, యనయంబున్నది దన్నెఱుంగక తుదిన్నా
మాయచే మగ్నుఁడై, తనుతత్త్వాది వియోగమై
నపిదపం దానేర్చునే నీదుద, ర్శన మింపారఁగ భ
క్తివైభవమహాసంకాశ నా... 65

మ. తనకున్ సాత్వికసంపదాన్వితమహాదాసోహభా
వంబునన్, ననయంబున్నది నన్యదైవభజనం బారం

గ దూలింపుచుఁ, జనితాహ్లాదముతోడ నీచరణ
ముల్ సద్భక్తి పూజించి నిన్, గనుగొన్నంతనె
కల్మషంబు లడఁగుం గర్మఘ్న నా... 66

మ. పరికింపన్ హరిభక్తి భేషజునకున్ భవ్యంబుగా
మీఁద మీ, చరణాంభోరుహదర్శనంబు గలదే
సంప్రీతి నెట్లన్నఁ దా, ధరలోఁ జోరుఁడు గన్న
దుస్తరపరద్రవ్యంబుపై నాసలం, బోరయన్నేర్పు
నె దుర్లభంబగు గృహాంభోజాక్ష నా.. 67

మ. పరమజ్ఞానవివేక పూరిత మహాభవ్యాంతరాశం
బునన్, పరగ న్నీనిజనామమంత్ర మొనరన్ భక్తి
న్ననుష్ఠింపుచుం, దురితాన్వేషణకాలభూతము
వెసన్ దూలంగ వాకట్టువాఁ, డరుగున్ భవ్యప
దంబు నొందుటకునై యవ్యక్త నా... 68

మ. సరిఘోరాంధక బోధకారణ విపత్సంసార మూ
లిన్యముల్, పరమానంద సుబోధకారణ లసద్భ
ష్యంబుపైనూఁది యా, నిరతజ్ఞానసుకాంతి దర్ప
ణమునన్నిస్సంగుఁడై తన్నుఁదా, నరయం గాంచి
నవాఁడు నిన్నుఁ గనువాఁ డబ్జాక్ష నా... 69

మ పరుషాలాపములాడ నోడి మదినీహాప్రార్జనారం
భుఁడై, నిరసించేరికిఁ గీడుసేయక మది న్నిర్ముక్త
కర్ముండునై, పరమానందనిషేధముల్ సమ

ముగా భావించి వీక్షించునా, పరమజ్ఞాని భవ
త్కృపం బొరయు నోపద్మాక్ష నా... 70
మ. ఒరులం దన్ను నెఱుంగు నయ్యెఱుకయు న్నొ
ప్పార నేకాంతమం, దరయం బైపడు నన్యభామి
నులపై నాకాంక్ష దూరత్వముం, మరణావస్థను
నీదునామములె సన్మానంబునం దోఁచుటల్, ధర
లోన న్నివి దుర్లభంబులు సుధాధామాక్ష నా.
మ. వెరవొప్ప న్బహుశాస్త్రమంత్రము లొగి న్వీ
క్షించి వేతెల్పిమీ, వరనామామృతపూర మా
నుచుఁ దగన్ వైరాగ్యభావంబునన్, సరి నశ్రాం
తముఁ గోరువారు పిదపన్ సంసారమాతుఃపయో,
ధరదుగ్ధంబులు గ్రోలనేరరు వెసన్ దైత్యారి నా.
శా. వేదంబందు సునిశ్చయుండగు మహావేల్పెవ్వఁ
డోయంచు నా, వేదవ్యాసపరాశరుల్ వెదకిన
న్వేఱొండు లేఁడంచు మీ, పాదాంభోజము
లెల్లప్రొద్దు మదిలో భావింతు రత్యున్నతిన్, శ్రీ
దేవీ వదనారవిందమధుపా శ్రీరంగ నా... 73
మ. సుతదారాప్తజనాది విత్తములపై శూన్యాభిలా
షుండునై, యతనోద్రేకయుతంబులై పొదలున
య్యెయింద్రియవ్రాతముల్, మృతిఁబొందించి ద
మంబునన్ శమమునన్ మీఱంగవర్తించు ని, ర్గ
తసంసారి భవత్కృపంబొరయు నోకంజాక్ష నా.

మ. ప్రమదంబారఁగ పుణ్యకాలగతులన్ భక్తిన్నను
ష్ఠింపుచున్, సమర న్నన్నసువర్ణగోసలిలకన్యాధా
రుణిగ్రామదా, నము లామ్నాయవిధోక్తి భూసు
రులకున్ సన్మార్గుఁడై యిచ్చువాఁ, డమరేంద్రార్చి
తవైభవోన్నతుఁడగు న్నామీఁద నా... 75

మ. ఇల నెవ్వారిమనంబులో నెఱుకదా నెంతెంత గ
ల్గుండునా, కొలదింజెంది వెలుంగుచుండు కలయ
న్గోవింద నీరూపులన్, యలర న్నంబుమితంబు
లై సరసిలో నంభోరుహంబుల్ దగన్, నిలనొ
ప్పారెడుచందమొందెదెపుడు న్నీలాంగ నా. 76

మ. మదిలో నుత్తమభక్తిపీఠముపయిన్ మానాథ
మీపాదముల్, గదియం జేర్చినవానికేనొడయఁ
డన్ గాదంచు నత్యున్నతిన్, పదిలుండై సమవ
ర్తి మృత్యువునకున్ బాఠంబుగాఁ బల్కు మీ,
పదపద్మార్చకు లెంతపుణ్యులో కృపాపారీణ నా.

మ. కులమెన్నం గొలదేల యేకులజుఁడుం గోత్రాభి
మానాభిలా, షలు నజ్ఞానముబాసి జ్ఞానము మ
దిన్ సంధించి శుద్ధాత్ముఁడై, యలరారం బరుసం
బుసోఁకు నినుమున్ హేమాకృతిస్తోమమై, వెల
యు న్నాగతి వాఁడుముక్తికరుగున్ వేదాత్మ నా.

మ. నిరతానందనియోగులై నియతులై నిర్భాగ్యులై

నీచులై, కరుణావిహీనమనస్కులై మలినులై కష్టా
త్ములై నష్టులై, పరుషవ్యాధినిబద్ధులై పతితులై
భగ్నాంగులై మగ్గువా, రరయ న్నిన్నొగి నాత్మ
యం దిడనివా రజ్ఞాతు నా... 79

మ. ఘనభోగాస్పదులై గతౌఘమతులై కారుణ్యులై
ముక్తులై, ధనకీర్తిప్రదులై దయాభిరతులై ధర్మా
త్ములైనిత్యులై, మనుజాధీశ్వరులై మనోజనిభులై
మాన్యస్థులై స్వస్థులై, యొనరన్నొప్పెడువారు
నీపదరుచుల్ యూహించు నా... 80

మ. విదితామ్నాయ నికాయభూతములలో విజ్ఞాన
సంపత్కళా, స్పదయోగీంద్ర మనస్సరోజములలో
లో బ్రహ్మేంద్రదిక్పాలక,త్రిదశవ్రాతకిరీటరత్న
ములలో దీపించుచున్నట్టి మీ, పదపద్మంబులు
భావగేహమున నే భావింతు నా... 81

మ. వెలయన్ యౌవనకాలమందు మరుఁడున్ వృ
ద్ధాప్యవేళంబులన్, బలురోగంబులు నంత్యమం
దు యముఁడుం బాధింపఁబట్టైన యీ, పలుజన్మం
బులు చాలదూలితి నసుం బాలింపవే దేవ మీ
ఫలితానంద దయావలోకనము నాపైఁజూపు నా.

మ. బలుకర్మాయత పాశబంధవితతిన్ బాహాపరిశ్రేణి
కిన్, జలయంత్రాన్వితబంధయాతనగతిన్ సంసార

కూపంబులోఁ, నలరం ద్రిమ్మరుచుండునన్ను నకటా!
యాఁర్తుండనై వేఁడెదన్, వెలయ న్నీకృపచేతఁ
జేకొనవె నన్ వేవేగ నా... 83

మ. మమహంకారవికారసన్నిభమహామత్తాదిలోఁ
భాంధకా, రముచే ముక్తికి నేఁగుమార్గ మెఱుఁ
గన్ రాదింక నాలోన నీ, విమలాపాంగదయాది
వాకరరుచిన్ వెల్గింపు మింపార నోఁ, కమలానంద
విహారవక్షులలితా! కంజాక్ష నా... 84

మ. పరిపంథిక్రియ నొత్తి వెంటఁబడు నప్పాపంబుఁ
దూలించి మీ, చరణాబ్జస్థితిపంజరంబు శరణేచ్ఛం
జొచ్చితిం గావుమీ, బిరుదుం జూడుము మీ
రు సూడఁగ భవద్భృత్యుండు దుఃఖంబులం,
బొరయ న్మీకపకీర్తిగాదె శరదంభోజాక్ష నా...

మ. సతతాచారము సూనృతంబు కృపయున్ సత్యం
బునున్ శీలమున్, నతి శాంతత్వము చిత్తశుద్ధి
కరమున్ నధ్యాత్మయున్ ధ్యానమున్, ధృతియున్
ధర్మము సర్వజీవహితముం దూరంబుగాకుండ స,
మ్మతికిం జేరువ మీనివాససుఖమున్ మానాథనా.

మ. భవనాశిన్ గయ తుంగభద్ర యమునన్ భాగీ
రథిం గృష్ణ, వే త్రవతి న్నర్మద పెన్న గౌతమి ప
యోరాశి న్వియద్గంగయుం, దవగాహంబున నైన

పుణ్యములు బెంపారంగ నేఁ డిచ్చుటన్, భవ
దంఘ్రి స్మరణంబునంగలుగు నోపద్మాక్ష నా...
మ. ధర గ్రామాధిపు నింటిదాసుఁడు వెసం దా ద్రో
హముం జేసినన్, పరగం జెల్లుట సూచితీ భవన
సంపాద్యుండ వైనట్టి మీ, వరదాసావలి దాస
దాసినని దుర్వారౌఘముల్ జేసితిన్, కరుణం
జేకొని కావుమయ్య త్రిజగత్కల్యాణ నా...
మ. గణుతింపన్ బహుధర్మశాస్త్ర నిగమౌఘుం బెప్పు
డు న్నిన్నకా, రణబంధుండని చెప్ప నత్తెఱఁగు
దూరంబందకుండంగనే, బ్రణతుల్ జేసెదఁ గొం
తయైన గణుతింపం బాడిలేకుండినన్, ఋణమా
నానుతినీవు శ్రీపతివి నీకేలప్పు? నా... 89
మ. కరినాథుండు జలగ్రహగ్రహణ దుఃఖాక్రాంతుఁ
డై యాశ మీ, శరణంబన్నఁ గృశానుభాను శత
తేజస్స్ఫూర్తి యైనట్టి మీ, కరచక్రంబున నక్ర
కంఠము వేసన్ ఖండించి మించెం దయా, పరస
ద్భక్తభయానకప్రకర సత్ప్రాకట్య నా... 90
శా. ఏ భావంబున నిన్ దలంచె గజయూథేంద్రుండు,
ఆపన్నుఁడై, యేభావంబున ద్రౌపదయ్యెడ రమా
ధీశా యనె న్వాయసం, బేభావంబున నీశరణ్య
మనెనో యీనీకృపాదృష్టిచే, నాభావంబున నీత
లంపుఁ గలుగ న్నాకిమ్ము నా... 91

శా. నీలగ్రీవుఁడు చేతిపున్క విడిచె న్నీయింతి భిక్షం
బునన్, నీలగ్రీవుఁడు యీశ్వరాఖ్యఁ దనరె న్నీ
నామజప్యంబునన్, నీలగ్రీవుఁడు మించి త్రుంచెఁ
బురముల్ నీప్రాపు సేవించినన్, నీలగ్రీవముఖా
బ్జ భాస్కరకృపా నిత్యాత్మ నా... 92

మ. నిను వర్ణింపనివాఁడు మూఁగ మదిలో నీనామ
ముల్ వీనులన్, విని మోదింపనివాఁడు చెవ్డుమరి
నిన్ వేడ్కన్ మనోవీథినిన్, గని పూజింపనివాఁ
డు నాశకరుఁడౌ కర్మక్రియారంభుఁడై, తనలోఁ
గాననివాఁడు నీచమతివౌ తత్వజ్ఞ నా... 93

మ. నిను వర్ణింపని నీచబంధమతి దా నిర్మగ్నమూఢా
త్ముఁడై, పెనుదైవంబులఁ గోరి తా మనమునన్
సేవించుచందంబు తా, ననలంబారిన భూతియందు
వెలయ న్నాజ్యాహుతుల్ వూని వే, ల్చినచందం
బున వ్యర్థమై తనరుఁ జూ చిద్రూప నా... 94

మ. నినువర్ణింపనిజిహ్వ దాఁబదటికా? నీలాభ్ర దేహాం
గకా, నినునాలింపనిచెవ్లు దాఁ బదటికా? నీరేజ
పత్రేక్షణా,నినుఁబూజింపనికేలు దాఁ బదటికా?
నిర్వాహకత్మాతలా, నినుఁజింతింపనియాత్మ దాఁ
బదటికా? నిర్వాణ నా... 95

శా. నీవేతల్లివి నీవెతండ్రి వరయ న్నీవే జగన్నాథుఁ

డా, నీవేనిశ్చలబాంఛవుండ వరయ న్నీవేమునిస్తుత్యుఁడా, నీవేశంకరమూలమంత్ర మరయన్ నీవే జగత్కర్తవున్, నీవేదిక్కనువారి వారలె కడున్నీవారు నా... 96

మ. అపరాధంబులు నిన్నునమ్మి వినుమే నాజన్మపర్యంతమున్, విపరీతంబుగఁ జేసినాఁడనిఁక నీవేదిక్కునాలోనికిన్, గపటం బింతయులేక దండధరుకుం గట్టీక రక్షింపు మీ, కృపకుం బాత్రుఁడనయ్య ధర్మపురిలక్ష్మీనాథ నా... 97

శా. చెల్లంజేసితి పాతకంబులు మదిన్ శ్రీనాథ మీ నామముల్, పొల్లుల్ బోవనినమ్మి పద్యశతమున్ బూర్ణంబుగాఁ జెప్పితిన్, చెల్ల బోనను నమ్మె వీఁడని దయం జేపట్టి రక్షింపుమీ, తల్లిందండ్రియు నీవుగాక యొరులే తర్కింప నా... 98

మ. నరసింహాచ్యుత వాసుదేవ వికసన్నాళీకపత్రాక్షభూధరగోవిందముకుంద కేశవ జగత్త్రాతాహితల్పాంబుజా,దరదామోదర తార్క్ష్యవాహనమహాదైత్యారివైకుంఠమం, దిర పీతాంబర భక్తవత్సల కృపన్ దీపింపు నా... 99

మ. కడకంటంగడవేని సంపదలొగిం గానింపు లక్ష్మీశ పా, లకడలిన్ బన్నగశాయివై భువనముల్ గ

ల్పించు సత్పుత్రునిన్, బొడమంజేసిన నాభిపంక
జ జగత్పుణ్యాత్మ భాగీరథీ, పడతింగన్న పదార
విందములనే భావింతు నా... 100

మ. తపముల్ మంత్రసమస్తయజ్ఞఫలముల్ దానక్రి
యారంభముల్, జపముల్ పుణ్యసుతీర్థసేవఫల
ముల్ సద్వేదవిజ్ఞానముల్, ఉపవాసవ్రతశీలకర్మ
ఫలముల్ యొప్పార నిన్నాత్మలో, నుపమింపం
గలవారికే గలుగు వేయున్నేల నా... 101

శా. శ్రీనారాయణ యన్నం జాలు దురితశ్రేణి న్ని
వారింపంగా, నానందస్థితి గల్గునంచు నిగమార్థా
నేక మెల్లప్పుడున్, నానాభంగులం జెప్ప నేను
విని శ్రీనారాయణా యంచు ని, న్నే నెప్పు
డు గొల్తు బ్రోవంగదె తండ్రీ నన్ను నా... 102

మ. కలితాఘౌఘువినాశకారి యగుచుం గైవల్యసం
ధాయి యై, నలి నొప్పారెడుమంత్రరాజ మగు
నీనామంబు ప్రేమంబునన్, అలరన్నెవ్వనివాక్కు
నం బొరయదో యన్నిచుదేహంబు దా, వెల
యన్ భూరుహకోటరంబదియ సూ వేదాత్మ నా.

మ. రమణీయంబుగ నాదిమంబునవతారంబున్ భవ
ద్దివ్యరూ, పమునామామృతమున్ దలంప దశక
ప్రాప్తయ్యెం గృష్ణావతా, రము సుజ్ఞానము మో

క్షమ్ముఁ ద్వివిధసంప్రాప్తిఁ శతాంధ్రాఖ్యకా,
వ్యము నర్పించితి మీపదాబ్జములకుఁ వైకుం
ఠ నా... 104

శా. నీమూర్తుల్ గన నీకథల్ వినఁ దుదిఁ నీపాదని
ర్మాల్యని, ష్ఠామోదంబు నెలుంగ, నీచరణతో
యంబాడ, నైవేద్యముల్, నీమంబొప్ప భజింప
నీజపము వర్ణింపఁ గృపం జేయవే, శ్రీమించఁ
బహుజన్మజన్మములకుఁ శ్రీయాది నా... 105

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర
కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య
ప్రణీతంబైన నారాయణశతకంబున సర్వంబును సం
పూర్ణము.

# పీ ఠి క.

ఈశతకము వ్రాసినది శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునందుఁ బేరెన్నికగన్న ధూర్జటి మహాకవి యని పరంపరగాఁ జెప్పుకొనుటెగాని శతకాద్యంతములలో నావిషయము నిరూపించుపద్యములు కానరావు. అంతమున నింకఁ గొన్ని పద్యములు లోపించినటు లుంటచేఁ గవిజీవిత మందుండునేమో యని భ్రాంతి కలుగుచున్నది.

ధూర్జటి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు భారద్వాజగోత్రుఁడు. ఇతఁడు చిరకాలము కృష్ణరాయల యాస్థానమునందుండి విద్యావినోదములలోఁ బాలుగొనుచున్నను కృతులనుమాత్రము నరాంకితముగావింపలేదు. తాను జెప్పికొన్న "నీకుంగాని కవిత్వమెవ్వరికి నే నీనంచు మాఁదెత్తితిన్ జేకొంటిన్ బిరుదంబు" అను ప్రతిజ్ఞకు భిన్నముగా నడుచుకొనలేదు. "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేలగల్గె నీయతులితమాధురీమహిమ" యని రాయలయంతవానిచేఁ గొనియాడఁబడిన యీకవిరాజన్యుని కవితాప్రశస్తిని ప్రత్యేకించి ప్రశంసింపఁబనిలేదు.

"హా తెలిసెన్ భువనైకమోహనోద్ధత సుకుమారవారవనితా జనతాఘనతాపహారిసంతతమధురాధరామృతసుధారసధారలు గ్రోలుటన్ జుమీ"

పద్యభాగమునకుఁ గాళహస్తీశ్వరశతకము తార్కాణాయై ధూర్జటికిఁగల భోగలాలసత్వము నిరూపించుచున్నది. ధూర్జటి యొడలు వధూస్తనాస్ఫోటనములచేఁ గాయలు కాచినవఁట, కామినీసుఖముపై నింక రోఁత పుట్టలేదఁట, దేవకాంతలఁ గవసినను కామతాప మాఱదఁట, రతిద్వారసౌఖ్యములు చాలునఁట. ఈ ప్రసంగములను శతకస్థమగు రాజదూషణము సమన్వయించి, పరిశీలించితిమేని విరక్తుఁడై వార్ధకమున నీశతకమును గవి రచించెనని తోఁచును. ఐహికములరోసి యీశతకము రచించి కవి కాళహస్తీశ్వరునిసన్నిధిలోఁ జేరెనని కొందఱు చెప్పుచున్నారు. కాళహస్తిమాహాత్మ్యములోఁ జెప్పఁబడిన తిన్ననికథ యిందు రెండు మూఁడుచోటులఁ జేర్కొనఁబడెను.

ఈశతకము మనోహరధారాశోభితమై మృదుపదగుంఫితమై ధూర్జటికవితామాధురీమహిమకుఁ దార్కాణముగ నున్నది కవి శతకములో వ్యాకరణనియమములఁ బాటింపనిచోటులు పెక్కులుగలవు. ధూర్జటి పదునాఱవశతాబ్దమున శ్రీకృష్ణరాయల యాస్థానమున నుండెను.

నందిగామ.
1 - 1 - 25.

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శ్రీ ర స్తు.

# శ్రీ కాళహస్తీశ్వర శతకము.

——→(o)←——

శా. శ్రీవిద్యుత్కలితాజవంజవమహాజీమూతపాపాం
బుధా, రావేగంబున మన్మనోబ్జసముదీర్ణత్వంబుఁ
గోల్పోయితిన్, దేవా మీకరుణాశరత్సమయ
మింతేఁ జాలుఁ జిద్భావనా, సేవం దామరతం
పరై మనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా. 1

శా. వాణీవల్లభ దుర్లభం బగుభవద్ద్వారంబున న్నిల్చి
ని,ర్వాణశ్రీఁ జెఱపట్టఁ జూచిన విచారద్రోహ
మో నిత్యక, ళ్యాణక్రీడలఁ బాసి దుర్దశలపాలై
రాజలోకాధమ, శ్రేణీద్వారము దూఱఁ జేసె
దెపుడో శ్రీ... 2

శా. అంతా మిథ్య తలంచిచూచిన నరుం డట్లౌ టె
ఱింగిన్ సదా, కాంత ల్పుత్త్రులు నర్థముల్ తనువు
నిక్కంబంచు మోహార్ణవ, భ్రాంతిం జెంది చరిం
చుఁగాని పరమార్థంబైన నీయందుఁ దాఁ, జింతా
కంతయుఁ జింత నిల్పఁడుగదా శ్రీ... 3

శా. నీవా సందొడఁబాటుమాట వినుమా నీచేత
జీతంబు నేఁ, గానిం బట్టక సంతతంబు మది వేడ్క
న్నొల్తు నంతస్సభ, తాన్నీకంబున కొప్పగింపకుము
న న్నాపాటియే చాలుఁ దే, జీనొల్లం గరినొల్ల
నొల్ల సిరులన్ శ్రీ... 4

మ. భవకేళీమదిరామదంబునమహాపాపాత్ముఁడై వీఁడు
న,న్ను వివేకింపఁ డటంచు నేను నరకార్ణోరాశి
పాలైనఁ బ,ట్టవు బాలుం డొకచోట నాటతమి
తోడ న్నూతఁ గాలంగఁ దం,డ్రి విచారింపక
యుండునా కటకటా శ్రీ... 5

శా. స్వామిద్రోహముఁ జేసి యే నొకనిఁ గొల్వంబో
తినో కాక నే, నీమాట న్విన నొల్లకుండితినొ
నిన్నే దిక్కుగాఁ జూడనో యేమీ యిట్టివృథా
పరాధి నగున న్నీదుఃఖవారాశివీ, చీమధ్యంబున
ముంచి యుంపఁదగునా శ్రీ... 6

మ. దివిజక్ష్మారుహధేనురత్నఘనభూతిప్రస్ఫురద్రత్న
సా,నువు నీవిల్లు నిధీశ్వరుండు సఖుఁ డర్ణోరాశి
కన్యావిభుం, డు విశేషార్చకుఁ డింక నీ కెన
ఘనుండుం గల్గునే నీవు చూ,చి విచారింపవు
లేమి నెవ్వఁ డుడుపున్ శ్రీ... 7

శా. నీతో యుద్ధముఁ జేయ నోపఁ గవితానిర్మాణశక్తి

న్నినుం, బ్రీతుం జేయఁగలేను నీకొఱకుఁ దండ్రిం
జంపఁగాఁ జాల నా, చేత న్రోఁకట నిన్ను మొత్త
వెఱతుం జీకాకు నాభక్తి యే, రీతి న్నాకిఁక
నిన్నుఁ జూడఁగలుగున్ శ్రీ... 8

శా. ఆలుంబిడ్డలుఁ దల్లిదండ్రులు ధనం బంచు న్మహా
బంధనం, బేలా నామెడఁ గట్టినాఁడ విఁక ని న్నే
వేళఁ జింతింతు ని,ర్మూలంబైనమనంబులోనఁ గడు
దుర్మోహాబ్ధిలోఁ గ్రుంకి యీ, సీలాపాలపుఁజింత
నె ట్లుడిపెదో శ్రీ... 9

శా. నిప్పై పాతకతూలశైల మడఁచు న్నీ నామము
న్మానవుల్, తప్పన్ దవ్వుల విన్న నంతకభుజాద
ర్పోద్ధతక్లేశముల్, తప్పుం దారను ముక్తులౌదు
రని శాస్త్రంబు ల్మహాపండితుల్, చెప్పంగాఁ దను
కింక శంక వలెనా శ్రీ... 10

శా. పీడెం బబ్బినయప్పుడుం దమనుతు ల్విన్నప్పుడుం
బొట్టలోఁ, గూడున్నప్పుడు శ్రీవిలాసములు పైకొ
న్నప్పుడుం గాయకుల్, పాడంగా వినునప్పుడుం
జెలఁగు దంభప్రాయవిశ్రాణన, శ్రీడాసక్తుల నేమి
చెప్పవలెనో శ్రీ... 11

మ. నిను సేవింపఁగ నాపద ల్పొడమనీ నిత్యోత్సవం
బబ్బనీ, జనమాత్రుం డననీ మహాత్ముఁ డననీ

సంసారమోహంబు పై,కొననీ జ్ఞానము గల్గనీ
గ్రహగతుల్ గుందింపనీ మేలువ,చ్చిన రానీ
యవినాకు భూషణములో శ్రీ... 12

శా. ఏ వేదంబుఁ బఠించె లూత భుజగం బేశాస్త్రము
ల్చూచెఁ దా, నేవిద్యాభ్యసనంబొనర్చెఁ గరి
చెం చేమంత్రమూహించె బో,ధావిర్భావనిదాన
ముల్ చదువులయ్యా! కావు! మీపాదసం,సేవా
సక్తియె కాక జంతుతతికిఁ శ్రీ... 13

శా. కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు
వక్షోజముల్, రాయ న్రాపడె ఓష్ఠము మన్మథ
విహారక్లేశవిభ్రాంతిచేఁ, బ్రాయం బాయెను బట్టఁ
గట్టఁ దల చెప్పఁగ రోఁతసంసార మేఁజేయంజాల
విరక్తుఁ జేయఁగదవే శ్రీ... 14

శా. ని న్నేరూపముగా భజింతు మదిలో నీరూపు
మోఁకాలొ స్త్రీ,చన్నో కుంచమొ మేఁకపెంటి
కయొ యీసందేహము ల్మాన్పి నా, కన్నార
న్భవదీయమూర్తి సగుణాకారంబుగాఁ జూపవే,
చిన్నీరేజవిహారమత్తమధుపా శ్రీ... 15

మ. నిను నావాఁకిలి గావు మంటినొ మరున్నీలాలక
భ్రాంతిఁ గుం,ఠెన పొమ్మంటినొ యెంగిలిచ్చి తిను
తింటేఁగాని కాదంటినో, నిను నెమ్మిం దగ విశ్వ

సించు సుజనానీకంబు రక్షింపఁజే,సిన నావిన్నప
మేల న్కైకొనవయా శ్రీ... 16

శా. బాలన్ ఉవ్వఁగఁ జేతులాడవు కుమారా రమ్ము
రమ్మంచు నేఁ, జాలన్ జంపఁగ నేత్రము ల్దివి
యఁగా శక్తుండ నేఁగాను నా,శీలం బేమనిచెప్ప
నున్న దిఁక నీచిత్తంబు నాభాగ్య మో,శ్రీలక్ష్మీ
పతిసేవితాంఘ్రియుగళా శ్రీ... 17

శా. రాజుల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు వారిచ్చు
నం,భోజాక్షీచతురంతయానతురగీభూషాదు లా
త్మవ్యథా, బీజంబుల్ తదపేక్ష చాలుఁ బరి
తృప్తిం బొందితిన్ జ్ఞానల, క్ష్మీజాగ్రత్పరిణామ
మిమ్ము దయతో శ్రీ... 18

శా. నీరూపంబు దలంపఁగాఁ దుద మొద ల్లేఁ గాన
నీవైనచో, రారా రమ్మనియంచుఁ జెప్పవు వృథా
రంభంబు లింకేటికిన్, నీర స్మంపుము పాల ముం
పు మిఁక నిన్నే నమ్మినాఁడం జుమీ, శ్రీరామార్చి
తపాదపద్మయుగళా శ్రీ... 19

శా. నీకు న్మాంసము వాంఛయేని కఱవా నీచేత లే
డుండఁగాఁ, జోకైనట్టికుఠార ముండ ననలజ్యో
తుండ నీ రుండఁగాఁ, బాకం బొప్ప ఘటించి చే
తిపునుక న్భక్షింప కాబోయచేఁ, జేకొం టెంగిలి
మాంస మిట్లు దగునా శ్రీ... 20

శా. రాజై దుష్కృతిఁ జెందెఁ జందురుఁడు రారాజై
కుబేరుండు దృగ్రాజీవంబునఁ గాంచె దుఃఖము
కురుక్ష్మాపాలుఁ డామాటనే, యాజిం గూలె
సమస్తబంధువులతో నారాజశబ్దంబు ఛీ, ఛీ
జన్మాంతరమందు నొల్లనుజుమీ శ్రీ... 21

శా. రాజద్రాతురుఁ డైనచో నెచట ధర్మం బుండు
నేరీతి నా, నాజాతి క్రియ లేర్పడున్ సుఖముమా
న్యశ్రేణి కెట్లబ్బు రూ, పాజీవాళికి నేది దిక్కు
ధృతి నీభక్తుల్ భవత్పాదసీ, రేజంబుల్ భజి
యింతు రేతెఱఁగునన్ శ్రీ... 22

మ. తెరఁగల్ పిప్పలపత్త్రముల్ మెఱుఁగుటద్దంబుల్
మరుద్దీపముల్, కరికర్ణాంతము లెండమావులత
తుల్ ఖద్యోతకీటప్రభల్, సురవీథీలిఖితాక్షరం
బు లసువుల్ జ్యోత్స్నాపయఃపిండముల్, సిరు
లం దేల మదాంధులౌదురు జనుల్ శ్రీ...23

శా. నిన్ను న్నమ్మినరీతి నమ్మనొరులన్ నీకన్న నా కెన్న
లే, రన్నల్దమ్ములు తల్లిదండ్రులు గురుం డాపత్స
హాయుండు నా, యన్నా! యెన్నఁడు నన్ను సం
సృతివిషాదాంభోధి దాఁటించి య, చ్ఛిన్నానంద
సుఖాబ్ధిఁ దేల్చెదొ కదే శ్రీ... 24

శా. నీపంచం బడియుండగాఁ గలిగిన న్భిక్షాన్నమే

చాలు ని, క్షేపం బబ్బిన రాజకీటముల నే సేవిం
పఁగా నోప నా, శాపాశంబులఁ జుట్టి త్రిప్పకు
ము సంసారార్థమై బంటుగాఁ, జేపట్టం దయ గ
ల్గెనేని మదిలో శ్రీ... 25

శా. నీపేరున్ భవదంఘ్రితీర్థము భవన్నిష్ఠ్యూతతాం
బూలముల్, నీపళ్లెంబుప్రసాదముం గొనికదా నే
బిడ్డఁ డైనాఁడ న, న్నీపాటిం గరుణింపు మోప
నిఁక నే నెవ్వారికిం బిడ్డఁగాఁ, జేపట్టం దగుఁ బట్టి
మానఁదగ దో శ్రీ... 26

శా. అమ్మా యయ్య యటంచు నెవ్వరిని నే నన్న న్ని
వా నిన్ను నే,సుమ్మీ నీమదిఁ దల్లిదండ్రుల నటంచు
న్జూడఁగాఁబోకు నా, కిమ్మైఁ దల్లియుఁ దండ్రి
యున్ గురుఁడు నీవేకాక సంసారపుం, జిమ్మంజీఁక
టిఁగప్పినన్ గడుపునన్ శ్రీ... 27

మ. కొడుకుల్ పుట్ట రటంచు నేడ్తు రవివేకుల్ జీవన
భ్రాంతులై, కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున
కనేకుల్ వారిచే నేగతుల్, వడసెం బుత్రులులే
నియాశుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్, చెడునే
మోక్షపదం బపుత్రకునకున్ శ్రీ... 28

మ. గ్రహదోషంబులు దుర్నిమిత్తములు నీకళ్యాణ
నామంబు ప్రత్యహముం బేర్కొనును త్తమో

త్తముల బాధం బెట్టఁగా నోపునే, దహనుం గప్పఁ
గఁజాలునే శలభసంతానంబు నీసేవఁజేసి హత
క్లేశులు గారుగాక మనుజుల్ శ్రీ... 29

మ. అడుగం బోనిఁక సన్యమార్గరతులం బ్రాణావనో
త్సాహినై, యడుగంబోయినఁ బోదు నీదుపద
పద్మారాధకశ్రేణియు, న్నెడకు న్నిన్ను భజింపఁ
గాఁ గనియు నాకేలాపరాపేక్ష కో, రెడి దింకేమి
భవత్ప్రసాదమె తగుఁ శ్రీ... 30

మ. మదమాతంగము లందలంబులు హారు ల్మాణిక్య
ము ల్పల్లకుల్, ముదితల్ చిత్రదుకూలము
ల్పరిమళంబు ల్మోక్ష మీఁజాలునే, మదిలో వీని
నపేక్షసేసి నృపధామద్వారదేశంబుఁ గాఁచి
దినంబుల్ వృథపుత్తు రజ్ఞు లకటా శ్రీ... 31

శా. రోసీరోయదు కామినీజనులతారుణ్యోరుసౌఖ్యం
బులఁ, బాసీపాయదుపుత్త్రమిత్రజనసంపద్భ్రాం
తివాంఛాలతల్, కోసీకోయదు నామనం బకట
నీకుం బ్రీతిగా సత్క్రియల్, చేసీచేయదు దీని
త్రుళ్ళణఁపవే శ్రీ... 32

శా. ఎన్నే ళ్లుండితి నేమిగంటి నిఁక నే నెవ్వారి రక్షిం
చెదఁ, నిన్నే నిష్ఠ భజించెద న్నిరుపమోన్నిద్ర
ప్రమోదంబు నా, కెన్నం డబ్బెడు నెంతకాల

మింక నే నిట్లున్న నే మయ్యెడిం, జిన్నంబుచ్చక
నన్ను నేలుకొనవే శ్రీ... 33

శా. చావం గాలము చేరువౌ టెఱిఁగియుం జాలింపఁ
గా లేక త, న్నే వైద్యుండు చికిత్సఁ బ్రోవఁ గలఁడో
యేమందు రక్షించునో, యే వేల్పుల్ కృపఁ జూతు
రో యనుచు నిన్నింతైనఁ జింతింపఁ డా, జీవశ్రా
ద్ధముఁ జేసికొన్న యతియుం గా శ్రీ... 34

మ. దినముం జిత్తములో సువర్ణముఖరీతీరప్రదేశా
మ్రకా, ననమధ్యోపలవేదికాగ్రమున నానందంబు
నం బంకజా, సననిష్ఠ న్నినుఁ జూడఁ గన్న నది
వో సౌఖ్యంబు లక్ష్మీవిలా,సిని మాయానటనల్
సుఖంబులగునే శ్రీ... 35

శా. ఆ లంచు న్మెడఁ గట్టి దానికి నపత్యశ్రేణిఁ గల్పిం
చి త,ద్బాలవ్రాతము నిచ్చిపుచ్చుకొనుసంబంధం
బు గావించియు, మూలర్కంబున బాంధవంబనెడి
ప్రేమం గొందఱం ద్రిప్పఁగా, స్త్రీల న్నీలయమర్చి
న ట్లాసఁగితో శ్రీ... 36

మ. తనువే నిత్యముగా నొనర్చు మదిలేదా చచ్చి
జన్మింపకుం,డ నుపాయంబు ఘటింపు మీగతుల
వెంటన్నేర్పు లేకున్న లే,దని నా కిప్పుడె చెప్పు
చేయఁగలకార్యం బున్న సంసేవఁ జే,సి నినుం
గాంచెదఁగాక కాలమున నో శ్రీ... 37

మ. పదునాల్గేలెమహాయుగంబు లొకభూపాలుండు;
చెల్లించెన, య్యుదయాస్తాచలసంధి నాజ్ఞనొకం
డాయుష్మంతుఁడై వీరియభ్యుదయం బెవ్వరు
చెప్పఁగా వినరొ యల్పుల్మత్తులై యేల చ,
చ్చెదరో రాజుల మంచు నక్కటకటా శ్రీ...

శా. రాజన్నంతనె పోవునా కృపయు ధర్మం బాభిజా
త్యంబు వి,ద్యాజాతక్షమ సత్యభాషణము విద్వ
న్మిత్రసంరక్షయున్, సౌజన్యంబు కృతం బెఱుం
గుటయు విశ్వాసంబు గాకున్న దు,ర్బిజశ్రేష్ఠులు
గాఁ గతంబుగలదే శ్రీ... 39

మ. మును నీచే నపవర్గరాజ్యపదవీమూర్ధాభిషేకంబు
గాం,చినపుణ్యాత్ములు నేను నొక్కసరివో చిం
తించి చూడంగ నె,ట్లనినం గీటఫణీంద్రపోతమద
వేదండోగ్రహింసావిచా,రినిఁ గాఁగా నినుఁ
గానఁగాక మదిలో శ్రీ... 40

మ.పవమానాశనభూషణప్రకరము ల్భద్రేభచర్మంబు
నా,టవికత్వంబు ప్రియంబులై భుజగశుండా
లాటవీచారులన్, భవదుఃఖంబులఁ బాపుటొప్పు
గొలఁదిం బాటించి కైవల్యమి,చ్చి వినోదించుట
కేమికారణమయా శ్రీ... 41

మ. అమరస్త్రీల రమించినం జెడదు మోహం బింత

యుఁ బ్రహ్మాస్త్రము సిద్ధించిన నాపదీఅదు నిరూ
ఢ క్రోధముఁ సర్వలోకముల న్మ్రింగిన మాన
దిందుఁగల సౌఖ్యంబొల్ల నీసేవఁ జేసి మహాపాతక
వారిరాశిఁ గడతుఁ శ్రీ... 42

మ. చనువారిం గని యేడ్చువారు జముఁడా సత్యం
బుగా వత్తు మే, మనుమానం బిఁక లేదు నమ్ము
మని తా రావేళ నారేవునఁ, మునుఁగంబో
వుచు బాసచేయుటసుమీ ముమ్మాటికిఁ జూడఁ
గాఁ, జెనఁటుల్గానపు దీనిభావ మిదివో శ్రీ...

మ. భవదుఃఖంబులు రాజకీటముల నేఁ బ్రార్థించినం
బాయునే, భవదంఘ్రిస్తుతిచేతఁగాక విలసద్బాల
క్షుధాక్లేశదుఃష్టవిధుల్ మానునె చూడ మేఁక మెడ
చంటం దల్లి కారుణ్యదృష్టివిశేషంబున నిచ్చుచం
టబలె నో శ్రీ... 44

మ. పవి పుష్పంబగు నగ్ని మంచగు నకూపారంబు
భూమీస్థలం, బగు శత్రుం డతిమిత్రుఁడౌ విషము
దివ్యాహారమౌ నెన్నఁగా, నవనీమండలిలోప
లఁ శివశివేత్యాభాషణోల్లాసికిఁ, శివ నీనామ
ము సర్వవశ్యకరమౌ శ్రీ... 45

శా. లేవో కానలఁ గందమూలఫలముల్ లేవో గు
హల్ తోయముల్, లేవో యేఱులఁ బల్లవా

స్తరణముల్ లేవో సదాయాత్మలో, లేవో నీవు
విరక్తుల నృనుప జాలింబొంది భూపాలురన్ సేవ
ల్సేయఁగఁ బోదు రేలొకో జనుల్ శ్రీ... 46

మ. మును నేఁ బుట్టినపుట్టు లెన్నిగలవో మోహాం
బుచే నందుఁ జే, సినకర్మంబులప్రోవు లెన్నిగల
వో చింతించినం గాన నీ, జననంబే యని యు
న్న వాఁడ నిదియే చాలింపవే నిన్నుఁ గొ, ల్చినపు
ణ్యంబునకుం గృపారతుఁడవై శ్రీ... 47

మ. తను వెందాఁక ధరిత్రినుండు నను నందాఁక న్మ
హారోగదీ, పనదుఃఖాదులఁ బొందకుండ నను
కంపాదృష్టి వీక్షించి యా, వెనుక న్నీపదపద్మ
ము ల్దలఁచుచు న్విశ్వప్రపంచంబుఁ బా, సినచి
త్తంబున నుండఁజేయఁగదవే శ్రీ... 48

మ. మలభూయిష్ఠమనోజధామము సుషుమ్నాద్వా
రమో యారు కుం, డలియో పాదకరాక్షియుగ్మ
ములు షట్కంజంబులో మోముదా, జలజంబో
నిటలంబు చంద్రకళయో సంగంబు యోగంబొ
గా, సిలి సేవింతురు కాంతలన్ భువిజనుల్ శ్రీ.

మ. జలకంబుల్ రసముల్ ప్రసూనములు వాచా
బంధముల్ వాద్యము, ల్కలశబ్దధ్వను లంచి
తాంబర మలంకారంబు దీప్తు ల్తైలుం, గులు నై

వేద్యము మాధురీమహిమగాఁ గొల్తు న్నినున్
భక్తిరం,జిలదివ్యార్చనగూర్చి నేర్చినక్రియన్ శ్రీ.

శా. ఏలీల న్నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షాధ్వని
వ్యంగ్యశ,బ్దాలంకారవిశేషభాషల కలభ్యం బై
ననీరూపముం, జాలుంజాలుఁ గవిత్వము న్నిలు
చునే సత్యంబు వర్ణించుచో, ఛీ! లజ్జింపరుగాక
మాదృశకవుల్ శ్రీ... 51

శా. పాలుం బువ్వయుఁ బెట్టెదం గుడువరా పాపన్న
రాయన్న లే, లే లెమ్మన్న నరంటిపండ్లుఁ గొనితే
లేకున్న నే నొల్లనం, టే లాలింపరె తల్లిదండ్రు
లపు డట్లే తెచ్చి వాత్సల్య ల, క్ష్మీలీలావచనం
బులం గుడుపరా శ్రీ... 52

మ. కలలంచు న్శకునంబులంచు గ్రహయోగంబంచు
సాముద్రికం,బులటంచుం దెవులంచుదిష్టమనుచు
న్భూతంబులంచు న్విషా, దులటంచు న్నిమిషార్ధ
జీవనములందుం బ్రీతిఁ బుట్టించి యీ, సిలుగుల్
ప్రాణుల కెన్ని చేసితివయా శ్రీ... 53

మ. తలమీఁదం గుసుమప్రసాద మలికస్థానంబుపై
భూతియున్, గళసీమంబున దండ నాసికతుద
న్గంధప్రసారంబు లో, పల నైవేద్యముఁ జేర్చు
నేమనుజుఁ డాభక్తుండు నీకెప్పుడుం, జెలికాఁ
డై విహరించు రౌప్యగిరిపై శ్రీ... 54

శా. ఆలుం బిడ్డలు మిత్రులుణ్ హితులు నిష్టార్థంబు
లీనేర్తు రే, వేళ న్వారి భజింపఁ జాలిపడ కావి
ర్భూతమోదంబునం, గాలం బెల్ల సుఖంబు నీ
కు నిఁక భక్తశ్రేణి రక్షింప కే, శ్రీ లెవ్వారికిఁ
గూడఁ బెట్టెదవయా శ్రీ... 55

మ. సులభు ల్మూర్ఖులు నుత్తమోత్తములు రాజుల్గల్గి
యే వేళ న, న్నలఁతం బెట్టిన నీపదాబ్జములఁ
బాయం జాల నేమిచ్చినం, గలధౌతాచల మే
లు టంబునిధిలోఁ గాపుంపు టబ్జంబుపైఁ, జెలు
వొప్ప న్సుఖియింపఁ గాంచుట సుమీ శ్రీ...56

మ. కలధౌతాద్రియు నస్థిమాలికయు గోగంధర్వము
న్బన్నగముం, బులితోలు న్భసితంబుఁ బాఁపతోడ
వు లోఁకుండఁ దోఁబుట్లకై, తొలి నేవారలతోఁ
డఁ బుట్టఁగఁ గళాదు ల్గల్గె మేలయ్యె నా, సిలు
వు ల్దూరము చేసికొం టెటఁగియే శ్రీ... 57

మ. శ్రుతు లభ్యాసము చేసి శాస్త్రగరిమ ల్శోధించి
తత్త్వంబులణ్, మతి నూహించి శరీర మస్థిరము
బ్రహ్మం బెన్న సత్యంబుఁ గాం, చితి మంచుణ్
సభలణ్ వృథావచనము ల్చెప్పంగ నేకాని ని,
ర్జితచిత్తస్థిరసౌఖ్యముల్ దెలియరో శ్రీ... 58

మ. గతి నీ వంచు భజించువార లపవర్గం బొందఁ

గా నేల సం, తతముం గూటికినై చరింప విన
లేదా 'యాయురన్నం ప్రయచ్ఛతి' యంచు
న్మొఱవెట్టఁగా శ్రుతులు సంసారాంధకారాభిదూ,
షితదుర్మార్గులు గానఁ గానఁబడవో శ్రీ... 59

మ. రతిరాజద్రుతిమీఱునొక్క మటిగోరాజాశ్వ ని
న్నొక్కఁబో, నతఁడాదర్పకు వేగనొత్తఁ గవ
యం బాఁబోతునుం దాఁకియు, గ్రతఁ బోరాడఁ
గ నున్న యన్నడిమి లేఁగ లోవెలె శోకానల,
స్థితిపాలై మొఱవెట్టినన్ మనుపవే శ్రీ... 60

శా. అంతా సంశయమే శరీరఘటనం బంతా విచా
రంబె లో, నంతా దుఃఖపరంపరార్జితమె మే నం
తా భయభ్రాంతమే, యంతానంతశరీరశోషణ
మె దుర్వ్యాపారమే దేహికిన్, జింత న్నిన్నుఁ
దలంచి పొందరు నరుల్ శ్రీ... 61

శా. సంతోషించితిఁ జాలుఁజాలు రతిరాజద్వారసౌ
ఖ్యంబులన్, శాంతిం బొందితిఁ జాలుఁజాలు బ
హురాజద్వారసౌఖ్యంబులన్, శాంతింబొందెదఁ
జూపు బ్రహ్మపదరాజద్వారసౌఖ్యంబు ని, శ్చింత
న్శాంతుఁడ నౌదు నీకరుణచే శ్రీ... 62

శా. స్తోత్రం బన్యులఁ జేయనొల్లనివ్రతస్థులోవెలె
వేసంబుతోఁ, బుత్త్రపుత్త్రకళత్రరక్షణకళాబుద్ధిన్

నృపాలాధముల్, బాత్రంబంచు భజింపఁబోదు
రిదియు న్భాగ్యం బెరో వారిచారిత్రం బెన్నఁడు
మెచ్చ నెంచ మదిలో శ్రీ... 63

మ. అకలంకస్థితి నిల్పి నాద మనుషుంటూరావముల్
బిందుదీ, పకళాశ్రేణివివేకసాధనము లొప్పన్బ్ర
ని యానందతా, రకదుర్గాటవిలో మనోమృగ
ము గర్వస్ఫూర్తి వారించువా, రికిఁ గా వీడు
భవోగ్రబంధలతికల్ శ్రీ... 64

మ. ఒకయర్థంబును నిన్ను నే నడుగఁగా నూహింప
నెట్లైనఁ బోన్ము కవిత్వంబులు నాకుఁజెంద నివి
యేమోయంటివా నాదుజిహ్వకు నైసర్గికకృత్య
మింతయసుమీ ప్రార్థించు టే కాదు కోరికల
న్నిన్నును గాన నాకు వశమా శ్రీ... 65

మ. శుకము ల్కింశుకపుష్పము ల్గని ఫలస్తోమంబ
టంచు న్సము, త్సుకతం జేరఁగఁ బోవ నచ్చట
మహాదుఃఖంబు సిద్ధించుఁ గ, ర్మకళాభాషల కెల్లఁ
బ్రాపు లగు శాస్త్రంబు ల్వీలోకించువా, రికి నిత్య
త్వమనీష దూరమగుచుల్ శ్రీ... 66

మ. ఒకరింజంపి పదస్థులై బ్రతుకఁ దా మొక్కొక్క
రూహింతురే, లొకొ తామెన్నఁడుఃజావరో త
మకుఁ బోవో సంపదల్ పుత్రమి, త్రకళత్రాదుల

తోడ నిత్యసుఖమందం గందురో యున్నవా, రికి
లేదో మృతి యెన్నఁడుం గటకటా శ్రీ... 67

శా. నీకారుణ్యముఁ గల్గినట్టినరుఁ డేనీచాలయంబుం
జొరం, డేకార్పణ్యపుమాట లాడ నరుగం డె
వ్వారితో వేషముల్, గైకోఁ డేమతము ల్భజిం
పఁ డిల నేకష్టప్రకారంబులన్, జీకాకై చెడిపోఁ
డు జీవనదశన్ శ్రీ... 68

శా. జ్ఞాతుల్ ద్రోహులు వాండ్రు సేయుకపటేర్ష్యాది
క్రియాదోషముల్, మాతండ్రాన సహింపరాదు
ప్రతికర్మం బించుకేఁ జేయఁగాఁ, బోతే దోష
ముగాన మాని యతినై పోఁగోరినన్ సర్వదా,
చేతఃక్రోధము మానదెట్లు నడుతున్ శ్రీ... 69

మ. చదువుల్ నేర్చినపండితాధములు స్వేచ్ఛాభాష
ణక్రీడలన్, వదరన్ సంశయభీకరాటవులఁ ద్రోవ
ల్దప్పి వర్తింపఁగా, మదనక్రోధకిరాతు లందుఁ గని
భీమప్రౌఢిచేఁ దాఁకినం, జెదరుం జిత్తము చిత్త
గింపఁగదవే శ్రీ... 70

శా. రోసిం దేఁటిది రోఁత లేఁటివి మనోరోగస్థుఁడై
దేహి తాఁ, బూసిం దేఁటిది పూఁత లేఁటివి మ
దాపూతంబు లీదేహముల్, మూసిం దేఁటిది
మూఁత లేఁటివి సదా మూఢత్వమే కాని తాఁ,
జేసిం దేఁటిది చేఁత లేఁటివి వృథా శ్రీ... 71

శా. శ్రీశైలేశు భజింతునో యభవుఁ గాంచీనాథు
సేవింతునో, కాశీవల్లభుఁ గొల్వఁబోదునొ మహా
కాళేశుఁ బూజింతునో, నాశీలం బణువైన మేరు
వనుచున్ రక్షింపవే నీకృపా, శ్రీశృంగార విలా
సహాసములచే శ్రీ... 72

మ. అయవార్లై చరియింపవచ్చుఁ దనపాదాంభోజ
తీర్థంబులన్, దయతోఁ గొమ్మనవచ్చు సేవకుని
సర్థప్రాణ దేహాదు ల, న్నియు నాసొమ్మనవచ్చుఁ
గాని సిరుల న్నిందించి ని న్నాత్మ ని, ష్క్రియ
తం గానఁగరాదు పండితులకున్ శ్రీ... 73

శా. మాయాజాండకరండకోటిఁ బొడిగా మర్దించి
రో విక్రమా, జేయుం గాయజుఁ జంపిరో కపట
లక్ష్మీమోహముం బాసిరో, యాయుర్దాయభుజం
గమృత్యువుననాయాసంబునన్ గెల్చిరో, శ్రే యో
దాయకు లౌదు రెట్టు లితరుల్ శ్రీ... 74

మ. చవిగాఁ జూడ వినంగ మూర్కొనఁ దనూసంఘ
ర్షణాస్వాదమొం, దవినిర్మించెద వేల జంతువుల
నేతత్క్రీడలే పాతక, వ్యవహారంబులు సేయునే
మిటికి మాయావిద్యచేఁ బ్రొద్దు పు, చ్చి వినో
దింపఁగ దీన నేమిఫలమో శ్రీ... 75

మ. వెనుకం జేసిన ఘోరదుర్దశలు భావింపంగ రోఁ
తయ్యెడున్, వెనుక న్ముందట వచ్చుదుర్మరణము

ల్వెతకింప భీ తరొయ్యెడుఁ, నను నేఁ జూచియు
నావిధు ల్దలఁచియు న్నాకేభయం బయ్యెడుం,
జెనకుం జీఁకటి నారయోఁ గాలమునకుఁ శ్రీ...76

మ. పరిశీలించితి మంత్రతంత్రములు చెప్ప న్వింటి
సాంఖ్యాదియో, గరహస్యంబులు వేదశాస్త్ర
ములు వక్కాణించితిన్ శంకవో, దరయం గుమ్మడి
కాయలోను యవగింజంతైన నమ్మించి సు,స్థిర
విజ్ఞానము త్రోవఁ జెప్పఁగదవే శ్రీ... 77

మ. మొదలం జేసినవారిధర్మములు నిర్మూలంబు
గాఁ జేసి దు,ర్మదులై యిప్పుడు వారె ధర్మము
లొనర్పం దమ్ము దైవంబు న,వ్వదె రా నున్నదు
రాత్ములెల్ల దమత్రోవం బోవరే యేలచే,సెదరో
మీఁదు దలంచి చూడ కథముల్ శ్రీ... 78

శా. కాసంతైనసుఖం బొనర్చునొ మనఃకామంబులీడే
ర్చునో, వీసం బైనను వెంట వచ్చునొ జగద్వి
ఖ్యాతి గావించునో, దోసంబు ల్వెడఁబాపునో
వలసినందోడ్తో మిముం జూపునో, ఛీ! సంసార
దురాశ యేలుడుపవో శ్రీ... 79

మ. ఒకపూఁ టించుకకూడు తక్కువగు నే నోర్వంగ
లేఁ డెండకో, పక నీడ న్వెదకుం జలిం జడిసి
కుంప ట్లెత్తుకోఁ జూచు వా, నకు నిండ్లిండ్లను

దూఱు నీతనువు దీనన్వచ్ఛసౌఖ్యంబు రో, ని
కడాసింపరు గాక మర్త్యు లకటా శ్రీ... 80

శా. కేదారాదిసమస్తతీర్థములు కోరి్కం జూడఁబో
నేఁటికిన్, గాదా ముంగిలి వారణాసి కడుపే
కైలాసశైలంబు మీ, పాదధ్యానము సంభవిం
చునపుడే భావింప సజ్జ్ఞాన ల, క్ష్మీదారిద్ర్యలు
గారె లోకు లకటా శ్రీ... 81

మ. తమకంబొప్పఁ బరాంగనాజన పరద్రవ్యంబులన్
మ్రుచ్చిలం, గమహాద్రోగము సేయు నెమ్మనము
దొంగంబట్టి వైరాగ్యపా, శముఁలం జుట్టి బిగిం
చి నీదుచరణస్తంభంబునం గట్టివై, చి ముదం
బెప్పుడుఁ గల్గఁ జేయఁగదవే శ్రీ... 82

శా. వేధం దిట్టఁగ రాదుగాని భువిలో విద్వాంసు
లం జేయనే, లా ధీచాతురిఁ జేసెఁ జేసినగులా
మాపాటనే పోక తు, ద్బాధాదుల్ కలిగింప
నేల యది కృత్యం బైన దుర్మార్గులం, జీ! ధాత్రీ
శులఁ జేయనేఁటి కకటా శ్రీ... 83

మ. పుడమి న్నినొక్కబిల్వపత్త్రమున నేఁ బూజించి
పుణ్యంబునుం, బడయన్నేరక పెక్కుదైవముల
కుం బప్పుల్ ప్రసాదంబులుం, గుడుముల్ దోసె

లు సారెపత్తు లడుకుల్ గుగ్గిళ్లునుం బెట్టుచుం,
జెడియెందుం గొఱగాకపోదు రకటా శ్రీ... 84

శా. విత్తజ్ఞానము పాదు చిత్తము భవావేశంబు ర
క్షాంబువుల్, మత్తత్వంబు తదంకురం బనృత
ముల్ మారాకు లత్యంతదు, ర్వృత్తుల్ పువ్వు
లు పండ్లు మన్మథముఖావిర్భూతదోషంబులుం, జి
త్తాభుత్యన్నతనింబభూజమునకున్ శ్రీ... 85

శా. నీపైఁ గావ్యము చెప్పుచున్న యతఁడు న్నీపద్య
ముల్ వ్రాసి యి, మ్మా పారం బొనరింతు నన్న
యతఁడున్ మంజుప్రబంధంబు ని, ష్టాపూర్తిం
బఠియించుచున్న యతఁడున్ సద్బాంధవుల్ గా
క చీ, చీ పృష్టాగతబాంధవంబు నిజమా శ్రీ...

శా. సంపద్గర్వముఁ బాఱఁదోలి రిపులన్ జంకించి యా
కాంక్షలన్, దంపుల్వెట్టి కళంకము ల్నఱికి బం
ధక్లేశదోషంబులం, జింపుల్సేసి వయోవిలాస
ములు సంక్షేపించి భూతంబులం, జెంప ల్వేయక
నిన్నుఁ గాన నగునా శ్రీ... 87

శా. రాజశ్రేణికి దాసులై సిరులఁ గోరం జేరఁగా సౌ
ఖ్యమో, యీజన్మంబు తరింపఁ జేయఁగలమి
మ్మే ప్రొద్దు సేవించు ని, ర్వ్యాజాచారము సౌఖ్య
మో తెలియలేరా మానవు ల్పాపరా, జీజాతా
తిమదాంధబుద్ధు లగుచున్ శ్రీ... 88

శా. నిన్నుం జూడరొ మున్నుఁ జూడరొ జనుల్ నిత్యం
బుఁ జావంగ నా, పన్ను ల్గన్ననిధాన మయ్యెడి
ధనభ్రాంతి న్విసర్జింపలే, కున్నా రెన్నఁడు నిన్నుఁ
గందు రిఁక మర్త్యుల్ గొల్వరేమోనిను, న్విన్నం
బోవక ప్రోవకుండు నెడలన్ శ్రీ... 89

శా. వన్నే యేనుఁగుతోలు దుప్పటము బువ్వా కాల
కూటంబు చే, గిన్నే బ్రహ్మకపాల ముగ్ర మగు
భోగే కంఠహారంబు మే, ల్నిన్నీలాగున నుంట
యుం దెలిసియు న్నీపాదపద్మంబు చే, ర్చెన్నా
రాయణుఁ డెట్లు మానసముఁ దా శ్రీ... 90

శా. ద్వారద్వారములందుఁ గంచుకిజనవ్రాతంబు దం
డంబులన్, దోరంతస్థ్సలి బగ్గనం బొడుచుచున్
దుర్భాషలాడ న్మతిన్, వారిం బ్రార్థనచేసి రాజు
లకు సేవ ల్సేయఁగాఁ బోరు ల, క్ష్మీరాజ్యంబు
ను గోరి నీపరిజనుల్ శ్రీ... 91

శా. ఊరూరం జనులెల్ల భిక్ష మిడరో యుండం గు
హ ల్గల్గవో, చీరానీకము వీథులం దొరకదో
శీతామృతస్వచ్ఛవాః, పూరం బేరులఁ బాఱదో
తపసులం బ్రోవంగ నీవోపవో, చేరం బోవుదు
రేల రాజుల జనుల్ శ్రీ... 92

మ. దయ సేయుం డని గొంద ఱాడుదురు నిత్యంబు
న్నినుం గొల్చుచున్, నియమం బెంతో ఫలంబు

నంతిరొుగదా నీవీయపిండెంతో యం, తియకా
రొుప్పటికిం దళం బళనబుద్ధిం జూడనే లబ్బు స,
త్క్రియల న్నిన్ను భజింప కిష్టసుఖముల్ శ్రీ...

శా. ఆరావం బుదయించెఁ దారకముగా నాత్మాభ్ర
వీథి న్మహా, కారోకారమకారయుక్త మగునోం
కారాభిధానంబు చె, న్నారు న్విశ్వ మనంగఁ ద
న్మహిమచే నానాదబిందు ల్సుఖ,శ్రీ రంజిల్లఁ గ
డంగు నీ వదె సుమీ శ్రీ... 94

శా. నీభక్తు ల్పదివేలభంగుల నిను న్సేవింపుచుఁ
వేడఁగా, లోభం బేఁటికి వారికోర్కులు కృపా
ళుత్వంబునం దీర్పరా, దా భవ్యంబుఁ దలంచి
చూడు పరమార్థం బిచ్చిపొమ్మన్న నీ, శ్రీభాం
డారములోఁ గొఱంతపడునా శ్రీ... 95

మ. మొదల న్భక్తుల కిచ్చినాఁడవుగదా మోక్షంబు
నేఁడేమయా, ముదియంగా ముదియంగఁ బుట్టె
ఘనమౌ మోహంబు లోభంబు న, న్నదిసత్యంబు
కృపం దలంప వొకపుణ్యాత్ముండు ని న్నాత్మగొ,
ల్చి దినంబు న్మొఱవెట్టఁగాఁ గటకటా శ్రీ... 96

శా. కాలద్వారకవాటబంధనము దుష్కాలప్రమాణ
క్రియా, లీలాజాలకచిత్రగుప్తముఖవల్మీకోగ్రజి
హ్వాద్భుత, వ్యాళవ్యాళవిరోధి మృత్యుముఖ

దంష్ట్రాహార్యవజ్రంబు ది, క్ఛేలాలంకృత నీదునా
మ మరయన్ శ్రీ... 97

మ. పదివేలైనను లోకకంటకులచేఁ బ్రాపించు సౌ
ఖ్యంబు నా, మదికిం బథ్యముగాదు సర్వమున
కున్ మధ్యస్థుఁడై సత్యదా, నదయాను ల్గలరా
జు నాకొసఁగు మెన్న న్వాని నీయట్ల చూ, చి
దినంబు న్ముద మొందుదుం గడపటన్ శ్రీ... 98

శా. తాతల్ తల్లియుఁ దండ్రియున్ మఱియుఁ బెద్ద
ల్పోవఁగాఁ జూడరో, భీతిం బొందఁగనేల చావు
నకుఁగాఁ బెండ్లాము బిడ్డ ల్హిత, వ్రాతంబు న్బల
వింప జంతువులకు న్వాలాయ మైయుండఁగాఁ,
జేతోవీథి నరుండు ని న్గొలువఁడో శ్రీ... 99

శా. జాతు ల్సెప్పుట సేవ సేయుట మృషల్ సంధించు
టన్యాయవి, ఖ్యాతింబొందుట కొండెకాఁడవుట
హింసారంభకుండౌట మి, థ్యాతాత్పర్యము
లాడుటన్నియుఁ బరద్రవ్యంబు నాశించి యీ,
శ్రీ, తా నెన్నియుగంబు లుండఁగలదో శ్రీ...

మ. చెడుగుల్ కొందఱు కూడి చేయఁగఁ బనుల్
చీఁకట్లు దూఱంగఁ బా, ల్పడితిం గాని చరింప
గాని నిను నొల్లం జాలుఁ బొమ్మంచు ని, ల్వెడలం
ద్రోచినఁ జూరుపట్టుకొని నే వ్రేలాడుదుం గోర్కిఁ
గో, రెడియర్థంబులు నాకు వే గలుగవో శ్రీ...

మ. భసితోద్ధూళనధూసరాంగులు జటాభారోత్త
మాంగుల్ తపో, వ్యసనుల్ సాధితపంచవర్ణరస
నుల్ వైరాగ్యవంతుల్ నితాం,తసుఖస్వాంతులు
సత్యభాషణసముద్యద్రత్నరుద్రాక్షరా, జిసమే
తుల్ తుద నెవ్వరైనఁ గొలుతున్ శ్రీ... 102

మ. జలజశ్రీ గల మంచినీళ్లు గలవా చట్రాతిలోఁ
బాపురే, వెలివాడ న్మఱి బాఁపనిల్లు గలదా వే
సాలుగా నక్కటా, నలినా రెండుగుణంబు లెంచి
మదిలో నన్నేమిరోయంగ నీ, చెలువంబైన గు
ణంబు లెంచుకొనవే శ్రీ... 103

మ. గడియల్ రెంటికొ మూఁటికో గడియకో కాదేని
నేఁ డెల్లియో, కడ నేఁడాదికొ యెన్నఁడో యె
ఱుఁగ మీకాయంబు లీభూమిపైఁ, బడఁగా
నున్నవి ధర్మమార్గ మొకటిం బాటింప రీమాన
వుల్, చెడుగుల్ నీపదభక్తియుం దెలియరో శ్రీ

మ. క్షితిలో దొడ్డ తురంగసామజము లేచిత్రమ్ము
లాందోళికా, తతు లే లెక్క విలాసినీజనసువస్త్ర
వ్రాతభూషాకలా, పతనూజాదిక మేమిదుర్లభము
నీపాదమ్ము లర్చించుచోఁ, జితపంకేరుహపాదపద్మ
యుగళా శ్రీ... 105

మ. సలిలమ్ము ల్చులుకప్రమాణ మొకపుష్పమ్ము న్భవ
న్మౌళి ని, శ్చలభక్తిప్రతిపత్తిచే నరుఁడు పూజ

ల్సేయఁగా ధన్యుఁడా, నిల గంగానదిఁ జంద్రఖం
డమును ధా నిందుం దుదిం గాంచునీ, చెలువం
బంతయు నీమహాత్త్వ మిదిగా శ్రీ... 106

మ. తమనేత్రద్యుతిఁ దామె చూడ సుఖమై తాదా
త్మ్యము స్ఫూర్తిఁగా, విమలమ్ము ల్కమలాభము
ల్జితలసద్విద్యుల్ల తాలాస్యముల్, సుమనోబాణ
జయప్రదమ్ము లనుచు న్జూచుఁ జనం బూని హా,
రిమృగాక్షీనివహమ్ముకన్నుఁగవలఁ శ్రీ...

మ. పటవద్రజ్జుభుజంగవద్రజతవిభ్రాంతిస్ఫురచ్ఛు
క్తివ, ద్ఘటవ చ్చంద్రశిలాజపాకుసుమరుక్సాంగ
త్యవ త్తంచు వా,క్పటిమ న్నేర్తురు చిత్సుఖం
బనుభవింపఁ లేక దుర్మేధసుల్, చిటు కన్నం
దలపోయఁజూతు రధముల్ శ్రీ... 108

మ. నినునిందించినదక్షుపైఁ దెగవా వాణీనాథు శాసిం
పవో, చనునా నీపదపద్మసేవకులఁ దుచ్ఛం బాడు
దుర్మార్గునిం, బెనుప న్నీకును నీదుభక్తతతికిన్
భేదంబు గానంగవ, చ్చెనొ లేకుండిన నూఱకుం
డఁగలవా శ్రీ... 109

మ. కరిదైత్యు న్బొరిగొన్న శూలము కరగ్రస్తంబు
గాదో రతీ, శ్వరుని న్గాల్చినఫాలలోచనశిఖావ
ర్గంబు చల్లాఱెనో, పరనిందాపరుల న్వధింప విధి

యుఁ భావ్యంబె వా రేమిచ్చే, సిరి నీకు న్వర
మోపకార మరయన్ శ్రీ... 110

మ. దురము న్దుర్గము రాయబారము మఱిన్ దొంగ
ర్కము న్వైద్యమున్, నరనాథాశ్రమ మోడ
బేరమును బెన్మంత్రంబు సిద్ధించినన్, అరయన్
దొడ్డఫలంబు గల్గు నదిగా కాకార్య మేతప్పినన్,
సిరియుంబోవును బ్రాణహానియునగున్ శ్రీ...

మ. తనయుం గాంచి ధనంబుఁ బ్రాతి దివిజస్థానంబు
గట్టించి వి,ప్రున కుద్వాహము జేసి సత్కృతికిఁ
బాత్రుండై తటాకంబు నే,ర్పునఁ ద్రవ్వించి వనం
బు వెట్టి మనసీ పోలేఁడు నీసేవజే, సినపుణ్యా
త్ముఁడు పోవులోకమునకున్ శ్రీ... 112

మ. క్షితినాథోత్తమ సత్కవీశ్వరుఁడు వచ్చెన్ మిమ్ము
లంజూడఁగా,నతఁ డేమేటి కవిత్వవైఖరిని సద్యఃక
కావ్యనిర్మాత త, త్ప్రతిభ ల్మంచివి తిట్టుపద్యము
లు చెప్పం డాతఁ డైనన్ మముం, గ్రితమేచూ
చెను బొమ్మటందు రధముల్ శ్రీ... 113

శా. నీకుంగాని కవిత్వ మెవ్వరికి నే నీనంచు మీఁ
దె త్తితిన్, జేకొంటిన్ బిరుదంబు కంకణము ముం
జేఁగట్టితిం బట్టితిన్, లోకుల్ మెచ్చ వ్రతంబు
నాతనువుకీలున్ నేర్పులుంగావు చీ, చీ కాలంబు
లరీతి దప్పెడుఁ జుమీ శ్రీ... 114

శా. నిచ్చల్ నిన్ను భజించి చిన్మయమహానిర్వాణ
పీఠంబుపై, రచ్చల్సేయక యార్జవంబు కుజనవ్రా
తంబుచేఁ గ్రాఁగి భూ, భృచ్చండాలురఁ గొల్చి
వారు దనుఁ గోపింపఁ బుధుం డార్తుఁడై, చి
చ్చాలిం జము రెల్లఁ జల్లుకొనునో శ్రీ... 115

శా. దంతంబు ల్పడనప్పుడే తనువునం దారూఢి యు
న్నప్పుడే, కాంతాసంఘము రోయనప్పుడె జరా
క్రాంతంబు గానప్పుడే, వింత ల్మేన జరించునప్పుడె
కురు ల్వెల్లెల్ల గానప్పుడే, చింతింప న్వలె నీప
దాంబుజముల౯ శ్రీకాళహస్తీశ్వరా.

శ్రీ కాళహస్తీశ్వరశతకము

సంపూర్ణము.

# పీఠిక.

ఈశతకము రచించినకవి గంగాధరుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. కవినిగూర్చిన చరిత్రాంశ మింతవఱకె శతకమందలి 2౬౪-వ పద్యమువలనఁ దెలియుచున్నది. శతకకవులచరిత్రములో నింకొకగంగాధరుఁడు కలఁడు. ఆతఁడు వీరశైవుఁడుగాన నీకవికి నాతని కెట్టిసంబంధము లేదు. కీరవాణిశతకము రచించినగంగాధరకవి యొకఁడు కలఁడు. అతఁడు పట్టాభిరామామాత్యునకు రాజమ్మకుఁగుమారుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కవితాధోరణిలో నిరువురికిఁ బోలికలు గలవు. ఈ రెండుశతకములును పిఠాపురసంస్థానమునందె లభించినవి. రెంటియందును సమానముగా భాషాలోపములు కలవు గానకీరవాణిశతకము, శ్రీరమణీమనోహరశతకము రచించినగంగాధరు లొకఁడె యని తలంపవచ్చును. కీరవాణిశతకము శృంగారసీసపద్యములు ౧౦౧ కలది. అందు వ్యాకరణలోపములున్నను భావలోపములు లేవ

నియే చెప్పవచ్చును. శృంగారశతకసంపుటములో నది ముద్రణము కానున్నది. శ్రీరమణీమనోహరశతకము కవి కాలము తీరినపిమ్మట రచించెను. ఈశతకము రచించునాఁటికిఁ గవిభార్య గతించెను. గృహము ఋణములపాలయ్యెను. జ్ఞాతులు క్షేత్రముల హరించిరి దరిద్రావస్థ తరింపఁజాలక సంపదల నిమ్మని మోక్షమిమ్మని విష్ణుమూర్తిని బ్రార్థించుచు నెంతకుఁ దనివి చెందక తనసొదనంతయు మూఁడువందలపద్యములలోఁ జెప్పుకొనెను. కొన్నిపద్యములలోఁ గేవల భగవద్గుణాభివర్ణనముమాత్రమె గావించెను. పద్యములందు భక్తిరసము స్ఫుటముగాఁ గలదుగాని భాషాదోషములు మిక్కుటముగాఁ గలవు. శబ్దలోపములు సంధిలోపములు యతిప్రాసలోపములు గూడఁ గలవు. కాలముతీఱిన ముదుసలితనమునందుఁ గూడ నీకవి కవితావిషయమున నేర్పు సంపాదింపఁ జాలకపోయెను.

కవికాలము గ్రహించుటకుఁ దగునాధారము లీశతకమున లేవు. కవిస్తుతిలో దిమ్మకవిని జెప్పెను. పుసులూరి సోమరాజు రచించిన నందనందనశతకము

లోని "నీచక్కదనంబుఁ జూప మనసైనదిచూపుము" అనుమకుటమును శ్రీరమణీమనోహరశతకమునందుఁ బలుతావులఁ జేర్చికొనెను. దీనిబట్టిచూడ నీశతకము ఒకశతాబ్దమునకంటెఁ బూర్వము రచింపఁబడినది కాదని నిశ్చయింపవచ్చును. కవినివాసము సరియగు జీవితకాలము సహేతుకముగ నెవ్వరేని యొఱింగింతురేని ముందు ముద్రణమునందుఁ జేర్చి కృతజ్ఞుల మగుదుము. శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి శ్రీపిఠాపురము సంస్థానాధీశ్వరు లొసంగిన వ్రాఁత ప్రతి నాధారముఁజేసికొని కవిభావానుకూలము లగు స్వల్పలోపములుమాత్రము సవరించి ముద్రణమునకుఁ బ్రత్యంతరము సిద్ధపఱచితిమి. కవి భాషాపరిజ్ఞానము లేనివాఁడగుటచే నుపయోగించినలోపములు సవరింపరానివగుటచే నటులె యుంచితిమి. భక్తిరసోద్బోధకమగు నీశతక మాంధ్రమహాజనుల యాదరణపాత్రము కాఁగలదని విశ్వసింతుము.

ఇట్లు భాషాసేవకులు,

నందిగామ.
1 - 6 - 26.

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శుభమస్తు.

# శ్రీరమణీమనోహరశతకము.

---

ఉ. శ్రీరమణీయహృజ్జలజసేవితము న్నిగమార్థపూర
ము, స్ఫూరితరంగ మంగళనభోధునికెల్లను నాల
వాలముఁ, సారమరందవిస్ఫురితసారసమౌ భవ
దంఘ్రియుగ్మముఁ, గోరి భజింతు నెమ్మదిని గూరి
మి శ్రీరమణీమనోహరా. 1

చ. పరమతపఃప్రపూర్ణుల కపారధనంబగు నిత్యమం
గళ, స్ఫురదరవింద సుందర విశుద్ధచరిత్రవిలాస
పూరముఁ, వరకమలామనోబ్జశుభవర్ధనము న్భవ
దంఘ్రియుగ్మముఁ, గురుతుగ నెమ్మదిం దలఁతుఁ
గూరిమి శ్రీ... 2

ఉ. ఘోరతరాఘమత్తగజకోటి హరింప హరిద్వ
యంబు సం, సారమహాంధకారఘనసార మడంప
దివాకరప్రభల్, భూరియజాండకోటులను బ్రోవఁ
గ దిక్కగు నీపదంబు లేఁ, గోరి భజింతు నెమ్మ
దిని గూరిమి శ్రీ... 3

ఉ. నీమహనీయమూర్తిరుచి నేఁ గనఁ గోరి మహాను
రాగినై, శ్యామలకోమలాంగ మది సన్నుతిఁజే
సిన గావదేమి నా, నోముఫలంబు లెవ్విధము
నుండెనొ నేమిఁక సేయువాఁడనో, కామునిగ
న్నతండ్రి నను గావర శ్రీ... 4

ఉ. నీకును నర్పితంబుగను నేఁ గృతి సేయఁదలంచి
పద్యముల్, జేకొని వ్రాయఁబూని నను జిత్తము
లో బెగడందుశబ్దముల్, రాకడ లక్షణాదికవి
లక్షణముల్ గడు లేమి నింక నే, నేకొలఁదిఁ
రచింతు దయ నేలుము శ్రీ... 5

చ. నిను నుతియింప నాతరమె నీరజనాభ సనందనా
దిస, న్మనులకు లేదు నేర్పు నిరుమాటిని గెల్వఁ
గలేని నేను నే, మని నుతియింతు నీచరితమం
తయు నేఁ గనలేదు విద్యచే, నను నెటు బ్రోచె
దీవు రఘునాయక శ్రీ... 6

చ. చదువఁగలేదు శాస్త్రములు చాలదు విద్య కవి
త్వరీతికిఁ, బదపడి యొప్పులే నెఱుఁగఁ బ్రార్థనఁ
జేసితి నిన్ను వేడుకఁ, సదమలనామతప్పు లప
శబ్దము లెంచక గైకొనందగుఁ, ముదము దలి
ర్పఁగాఁ గృతి సమున్నతి శ్రీ... 7

చ. శతకము నూరుపద్యములసంఖ్యను జెప్పిరి సత్క
వీంద్రు లో, వితతగుణాఢ్య నామదికి వేడుక

బుట్టి శతత్రయంబు బెం, పతులితభక్తిఁజేసి
ప్రమదాతిశయంబున నీకు నిత్తు నా, వెత లతి
వేగఁ ద్రుంచుటకు వేడుక శ్రీ... 8

శా. మత్తేభంబులు చంపకంబులు మహామాధుర్యశా
ర్దూలముల్, బోత్తుల్ గూర్చినవృత్తముల్ వదు
స మేలొప్పందంగఁ బద్యంబు లే,నిత్తున్భక్తిని జిత్త
జారి చెలికి న్నింపొందఁ బూదండగాఁ, గ్రొత్త
ల్లిత్తమునందు వెల్లివిరియ న్గోవర్ధనోద్ధారకా. 9

ఉ. రక్షణసేయు భక్తజనరక్షక నన్ను దయార్ద్రదృ
ష్టిచేఁ, గుక్షి నజాండకోటులను గోరిక బెంచెదు
వట్టినీకు నా, రక్షణ యెంత! మున్నుఁ గడురక్ష
యొనర్పవె దీనకోటుల, న్నక్షయతారకా రఘు
కులాగ్రణి శ్రీ... 10

ఉ. రామ సమస్తలోకనృపరాజిలలామ సురారిభం
డనో, ద్దామ ఘనాఘపర్వతవితానవిరామ వికుం
ఠధామ స, న్నామ సుభక్తకామ నిను నామది
జేర్చి భజింతుఁ గావు మో, శ్యామలకోమలాంగ
రఘుసత్తమ శ్రీ... 11

ఉ. రాజకులప్రదీప రతిరాజునుగన్న విశుద్ధరూప
ఘో, రాజి దశాననప్రముఖులం దునుమాడు
మహాత్మరూప వి,భ్రాజితదివ్యచాప సురపాలిత

కీర్తికలాప నిన్ను నే, పూజ యొనర్తుఁ బ్రోవు
రఘుపుంగవ శ్రీ... 12

చ. వరగుణభక్తలోల సురవందితపుణ్యలతాలవాల
శ్రీ, కరకమలావిలాసపరికల్పితపద్మభవాండజాల
భీ, కరకరవాలచక్రగదకార్ముకహస్తసుశీల నా
మదిఁ, గురుతుగ నిన్భజింతు నృపకుంజర శ్రీ
రమణీమనోహరా 13

ఉ. పాలితగోపబాల పరిపంథినృపాలహతానుకూల
శ్రీ, లోల దయాలవాల మునిలోకమనోరథసిద్ధి
లీల భూ, పాల యశోవిశాల యదుపాలనశీల
సుగానలోల న, న్నేలుము కీర్తిజాల కరినేలితి
శ్రీ... 14

ఉ. ఓరఘువీరధీర సుగుణోజ్జ్వల పర్వతధార శూర
ఘో, రారివిభంగ మంగళఖగాధిపవాహపదాబ్జ
గంగ భూ, భారవిలాసహాస ఘనపండిత శ్రీరమ
ణీసుహాస నే, నేర నుతింప నిన్నుఁ గృపనేలర శ్రీ.

చ. పరుఁడనుగాను భక్తజనపాలక పాలితగోపబాల
కా, నరసఖ పద్మనాభ కరుణారసపూరితహృత్స
రోజ నీ, కరుణదలిర్ప నన్ను సముఖంబుగ బ్రోచి
వరం బొసంగు నీ, కరమర లేల నయ్యా వరదా
యిఁక శ్రీ... 16

ఉ. డాయఁగరార భక్తవరదాయక వేగమె లోక
నాయకా, బాయఁగఁజాల నిన్ను భవబంధవిమో
చన పద్మలోచనా, నాయెడఁ గిల్బిషంబు దగునా
తగనా నిను వేఁడఁ బాడ శ్రీ, నాయక బ్రోవు
బ్రోవు కడునమ్మితి శ్రీ... 17

ఉ. కాటుకపర్వతంబు లనఁగాఁ బెనుపొందు మదీ
యపాపముల్, సూటి దొలంగి భస్మమయి చో
ప్పు గనంబడకుండఁ బ్రోవవే, తేటగు నీదుతార
కము తేనియల స్థడుభక్తియుక్తి నా, నోటను
గ్రోలునంతకును నొప్పగు శ్రీ... 18

ఉ. పామరుఁ డంచు నన్నుఁ గడు బాములఁబెట్టఁ ద
లంచితేని నే, నేమియుఁ జేయువాఁడ మును నె
న్నినపాపులఁ బ్రోవలేదె నీ, నామసుధారసంబు
మదినాట దినంబు భజింప నింతనా, నోముఫలం
బు లివ్విధము లొప్పుట శ్రీ... 19

ఉ. అండజవాహ ఘోరదురితాటవిదాహ ఘనాభ
దేహ మూ, ర్తాండకులోద్భవా ధరణిధర్మనిరూ
పణకృష్ణకేశవా, దండినిశాచరేంద్రకరతండవిఖం
డనకీర్తిమండనా, నిండగువేడ్క బ్రోవు దయ
నెమ్మిని శ్రీ... 20

చ. అగునగునయ్య దాసవరు లందఱిలో నను వేఱు
సేయ నీ, పగతుఁడ నంచుఁ గర్ణముల భాసిల

గంటలుగట్టు దానవున్, విగతవిరోధివై పరము
వే యొసఁగం దగెనంత కొంతకుం,దగనటవయ్య
నీకృపకు ధన్యుఁడ శ్రీ... 21

చ. పిలచినఁ బల్కవింతమఱవేల చలం బది యేల
నీకె కా, వలచితి మ్రొక్కు లిచ్చితి సువాక్య
ములం దగఁ బ్రస్తుతించితిన్, దలఁపవు జానకీర
మణ ధర్మనిరూపణ కార్యకారణా, వలదు పరా
కు నాయెడ కృపావర శ్రీ... 22

ఉ. దారుణకష్టభూతచయదర్పవిదారణము న్వికుంఠ
ముం, ద్వారకవాటసంహరణదాయకము న్భవరో
గహారమున్, సారసనేత్ర నీభజన సారసమిత్రుని
కాంతిసారమున్,గోరెద హృత్సరోజమునఁ గూ
రిమి శ్రీ... 23

ఉ. కాంచనవస్త్రసంకలితకాయము కౌస్తుభరత్నశోభ
లే, లాంఛనముల్ యురంబునను లక్ష్మి పదంబు
ల గంగ సర్పమే, యొంచినపాన్పు నాకసమె యొ
క్కువఛత్రము నిన్నిగల్గు ని, న్నెంచదరంబె
యీభువిని నేరికి శ్రీ... 24

చ. సుతుఁడు విధాత మన్మథుఁడు సూనుఁడు గంగ
కుమారి ధాత్రి స, న్నుతిగల రత్నపీఠము వినో
దము సర్వజగంబులు న్మహో,న్నతినిగమార్థజాల

ము జనార్దన యేమికో యంత నీకు నా, వెత లడఁ
గించి బ్రోచుటకు వేడుక శ్రీ... 25

చ. తలఁతును వ్యాసవాల్మికిసుదండుల మాఘుని గా
ళిదాసుని, న్వలనుగ భాను భాస్కరుల వాసిగఁ
దిక్కన పోతరాజులఁ, బిలహాణు రామలింగ
మును బేర్మిని నన్నయ తిమ్మ పెద్దనఁ, గొలుతు
సమస్తసత్కవుల గొప్పగ శ్రీ... 26

చ. జలజదళాక్ష నాయొడలఁ జాలు పరాకు; భవత్క
టాక్షమే, వలచితి వీడఁబోకు తగవా నగుబాటు
దలిర్ప నీకు నీ, సలలితరామనామబలసత్వముఁ
బెంపుఁ దోలంగ నీకుఁ గా,వలసినవాఁడ రక్షణ
యవశ్యము శ్రీ... 27

ఉ. రార దయాపయోధి దినరాజకులాగ్రణి రామ
చంద్ర రా, రార పరాత్పరా జగతి రాజకులం
బులు గొల్చుచుండఁగాఁ, గారణజన్మమెత్తి ఘన
కార్ముకదక్షుఁడవై నిశాటులం, జీరి వధించు
మానిజనజీవిత శ్రీ... 28

శా. రాకాచంద్రుని ధిక్కరించురఘువర్యా నీముఖాం
భోజమం, దాకాంక్షించి మునీంద్రసంఘము
త్వదీయాజ్ఞ న్భవద్ద్వారమై, యేకాంతంబున
నిన్నుఁగూడిన ముదం బేపారఁ జిత్రక్రియ, న్నే
కారుణ్యమతిఁ రమించితివి నీవే కావె శ్రీవల్లభా.

ఉ. ఎక్కడ నుంటివయ్య యింక నేగతి నీవిట రాఁగ
దయ్య నా, దిక్కటు జూడవయ్య కడుదీనుఁడనై
భవబంధనంబు చేఁ, జిక్కితి దీనిమాన్పఁగల
చేవయుఁ గల్గిన ధన్యు లెవ్వరుం, దక్కినవారు
లేరు నిను దక్కను శ్రీ... 30

ఉ. చక్కనివాఁడ వంచు నెఱజాణ వటంచు జగం
బులోనఁ బెం, పెక్కినవాఁడ వంచుఁ గరి నేలితి
వంచు దయాబ్ధి వంచుఁ బె, న్మక్కువఁ జిక్కె
నామదికి మాధవ శ్రీధర శ్రీనివాస నీ, చక్కద
నంబుఁ జూపు మనసారఁగ శ్రీ... 31

ఉ. చిక్కితిమంచు గోపికలు జేరి భజింప ముదంబు
తోడ నా,చక్కెరబొమ్మల న్గనుమసాయకసంగర
మందు వేక్కఁ బెం, పెక్కఁగఁ గ్రీడసల్పి దయ
నేలిన గోపకుమార నాకు నీ, చక్కదనంబుఁ
జూపు మనసారఁగ శ్రీ... 32

ఉ. అక్కరవచ్చె నాకు వినుమా కుసుమాయుధుఁ
గన్నతండ్రి మా, రెక్కడలేని దేవర రమేశ
యదూద్వహ రాధికాపతీ, నిక్కము నీలమేఘ
రుచి నీను చు శ్రీకరమై జెలంగునీ, చక్కదనంబుఁ
జూపు మనసారఁగ శ్రీ... 33

ఉ. మ్రొక్కిన గోపసుందరుల మోహరసాంబుధి
నోలలార్చి పె, న్మక్కువ వారిమానధనమంత

హారించి ఘనంబు మించి యిం, కెక్కడ నీడులేని
వెలుఁ గెక్కిన నిక్కపు టొక్కసామి నీచక్క
దనంబుఁ జూపు మనసాయెను శ్రీ... 34

ఉ. ముక్కున ముత్యము న్నుదుట మొక్కపుఁగస్తురి
చుక్కబొట్టును, న్నెక్కువరైనవక్షమున నేర్ప
డు కౌస్తుభరత్నముం గరం, బక్కజమారఁ గంక
ణము భాసిలఁ బిల్లనగ్రోవితోడ నా, మక్కువ
దీరఁ గన్పడర మాధవ శ్రీ... 35

ఉ. మక్కువ నిన్నుఁ జూడ మది మాటికి మాటికిఁ
గోరుచుండె నే, దిక్కుననుండి వత్తువని త్రిప్పని
చూడ్కుల నిక్కినిక్కి న, ల్దిక్కులుఁ జూచి వేస
రితి దీనతచే మదిగుందుచున్న నా, కెక్కడిదిక్కు
కావఁగదవే తగ శ్రీ... 36

ఉ. అక్కరదీర్తువో యనుచు నాసను నీపదపంకజా
తము, న్మిక్కిలి నమ్మి నెమ్మదిని మేలుఘటింప భజిం
పుచుండ నా, కెక్కడఁ గానరావె యిది యేమి
ర యోరఘువీర తెల్పి నీచక్కదనంబుఁ జూపు
మనసాయెను శ్రీ... 37

శా. వేదాభ్యాసము చేసి శాస్త్రములు తా వెయ్యేనను
న్నేర్చిన, న్గోదావర్యను గృష్ణ గంగ యమునా
గొప్పై ఎనకా వేరయుండ, బాదాబ్జంబులు నొవ్వఁ

బోయినఫలంబా ? యూరకే నిన్ను స, మ్మోదా
ప్వాంతక నిర్మలాత్మ గనకే మోహాంధుఁడై తేహరీ.

ఉ. రామ యిదేమిరా నిరపరాధిని నన్నిటువీడితేని
నే, నేమియుఁ జేయువాఁడ దయయెయ్యెడ
కేఁగెఁ గరి న్విభీషణు, న్గోమలి యైనద్రౌపదిని
గూరిమి బ్రోవఁగ నేఁగి యయ్యెడ, న్నేఁ బ్రియము
నుంజెనో మలపవేమిర శ్రీ... 39

ఉ. అన్నను బాసివచ్చి శరణన్నను నాదనుజేశుత
మ్ముని, న్నన్నఁ జేసి రమ్మనుచు మానుగ దానవ
రాజ్యలక్ష్మికిన్, జెన్నుదలిర్ప రాజుగను జేసియు
వైరము లెన్న కెంతయున్, దిన్నగఁ బ్రోచితీవు
దయదెల్పుచు శ్రీ... 40

మ. వసుదేవాత్మజ వారిజాక్ష విను నావార్తల్ మ
హావాంఛతో, వసుధామండలిలో నవారిత
ములై వాక్రుచ్చఁగారాని బల్లోసఁగుల్ చేసి
తి నంచు పీడకుము జేదోయొగ్గి ని న్వేఁడితిన్,
వసుధాపుత్రికళత్ర బ్రోవు నను నిష్పాపున్
రమానాయకా. 41

చ. ఇనకులనాథ నామనవి యేర్పడ నీకును విన్నవిం
చెదన్, జననము నొందు టే మొదలు సల్పితి
నెంచఁగరానిదోసముల్, వనజభవాండమందుఁ

గలవారలలో ననుఁబోలుదీనుఁ డే, మనుజుఁడు
లేఁడు ట్రోవు నృపమండన శ్రీ... 42.

శా. రారా! రాజకులప్రదీప రఘువర్యా వేగ రక్షింప
పరా, ఘోరంబైనభవాబ్ధిమధ్యమున మున్కల్
సల్పి భీతి న్మహా, దారంబౌ భవదంఘ్రినావికుని
చెంతంజేరితిఁ శ్రీహరీ, నేరం బెన్నక బ్రోవఁగాఁ
దగు జగన్నేతా రమానాయకా శ్రీ 43.

ఉ. ఘోరపరేతరాజభటకోటులశిక్షలు విన్నభీతిచే,
సారసనేత్ర నీచరణసారసయుగ్మము చెంతఁజే
రితిఁ, సారవిహీనసంసృతివిషాదతరంగములందు
నన్ను నే, భారము జెంద నీకు కృప భాసిల శ్రీ
రమణీమనోహరా 44.

ఉ. అంచితమైన నీసొబఁగు లాదరణాధికమైన క్రీడ
లా, పంచశరార్తలైన వ్రజపల్లవపాణు లెటింగి
యహా భళీ, యంచు నుతించి యొంచిన నుదం
చితపంచమగీతి వారల, న్వంచనజేసితీవు శ్రుతి
పారగ శ్రీ... 45

ఉ. ఆదరహాస మామృదువు లావగ లానగుబాటు
మాట లా, హ్లాదముతోడ గోపికలఁ బాయఁగఁ
జాల నటంచు బల్కు ల, త్యాదరత న్మనోజశర
తాపము నోర్వఁగలే నటంచు బ, ల్వాదులు బ
ల్కెల్ల మదివాంఛలె శ్రీ... 46

మ. కరమొప్ప న్వ్రజకామినీమణులు నిష్కాటిల్య
సంపన్నలై, వరసౌందర్యవిశేషవాంఛితలు నై
వర్ణించి యయ్యా నంచు నా, యరవిందాక్షులు నిన్ను
బాయకయె మోహాబ్ధి న్నిమగ్నాంగల, య్యు
రమేశా భవదంఘ్రినావికుఁ గనుంగో రే రమా
నాయకా. 47

ఉ. ఎన్నఁగ నీకు నాశబరి యెక్కడిచుట్టము కుబ్జయు
స్నేహము, వెన్నటిబంధువు ల్దయను నేలితి వార
ల నన్నుఁగావ నీ, కెన్నఁడు రాదుగా మనసు
యేను దురాత్ముఁడ నంచు నీగతి, న్విన్నప మా
లకించకను వీడెదె శ్రీ... 48

ఉ. మండితరత్నహాటక సమంచితకుండల గండభాగ
కో,దండకళాప్రచండ భుజతాండవఖండన దండి
దానవా, పండితమానిహృత్కమలపంజరరంజన
మేలు చిల్క యా, ఖండలసన్నుతా దురితఖం
డన శ్రీ... 49

ఉ. శ్రీరమణీయవక్ష యదుశేఖర పాండవపక్ష ఘో
రసం, సారవిపక్ష భూరిబలసత్వనిశాచరకోటిశిక్ష
భూ, భారసురక్ష నిత్యశుభవర్ధన శ్రీహరి సార
సాక్ష నా, నేరము సైఁపుమయ్య రిపునిగ్రహ
శ్రీ... 50

ఉ. సారములేని సంసరణసాగరమందు మునుంగు
చున్న మహా, దారదురాఘుమత్తగజతండమహోప
దలన్ గృశింపుచున్, నేరరు నీదునామసుధ
నేర్పుగఁ బానముసేయ లోకులు, న్వారలెఱుం
గ రీమహిమ వజ్రము శ్రీ... 51

ఉ. రంగ సమస్తపత్రీకుల రాజతురంగ రమామనోబ్జ
షా, రంగ పురారికార్ముకవిరాజితభంగ ఘనాఘ
నాంగ నిస్సంగ దయాంతరంగ బలసత్వపరాక్ర
మపాదగంగ నీ, మంగళమూర్తిఁ జూపు నృపు
మండన శ్రీ... 52

ఉ. సారము నీపదాబ్జఘనసారససంజనితామృతంబు
నిస్సారము శర్కరాదిఘృతసర్వఫలంబుల మేలు
దాని వే, సారక సంతతంబు మది సన్నుతిఁజేయు
చు జొబ్బజొబ్బిరున్, సార మెఱింగి గ్రోలెదను జ
క్కన శ్రీ... 53

చ. కమలదళాక్ష నీమహిమ గానరుగా భువి మూ
ఢమానవుల్, అమితభవాది రోగవిలయాపద
లొందెడువేళ శ్రీహరీ, సుమశరుగన్నతండ్రి ద
యఁ జూడుమటంచు భజించునంత నే, శ్రమ
లు హరింప లక్ష్మణుని సయ్యనగూడుకవచ్చి బ్రో
వవే, సమదయ భక్తకోటులను జక్కన శ్రీ...54

చ. అతిమధురంబు పాలును గుడాదులు ఖర్జుర
పంచదారలున్, హితవులటంచు మూఢజన మె
చ్చుగనందురు నంతెకాని వే,చతురత మాధురీమ
హిమ సంవృతతారకనామస్వాదుకే, జత నిలఁ
జెప్ప నేది ఘనసారము శ్రీ... 55

ఉ. దానము లెన్నిరైన వరదాయక నన్నము దాన
మియ్యఁగా, దానికిఁ దుల్య మేది విను తద్విధిఁ
గాననిమాడ్కి దేవ నీ, మానితనామసంస్మరణ
మందు శతాంశము బోల వెవ్వియున్, గాన రిఁ
కేమనందు ధర కష్టులు శ్రీ... 56

ఉ. సారము మే లుస్నధామధురసాగరపూరము భక్త
లోకమం, దారము ఘోరపాతకవితానవిదూ
రము సర్వలోకవి, స్తారము పుణ్యసారము విషా
దపిశాచమదాపహారము, న్వారక విష్ణునామపద
వర్గము శ్రీ... 57

ఉ. చేరితి నీపదాబ్జములు శ్రీరమణీహృదయాబ్జపంజ
రా, దూరితి నిన్ను ప్రేమఖరదూషణకాననదాన
వాంతకా, మీఱితి నీదునామసుధ మేలు భుజిం
చి పరేతరాజును, న్నేరిర నీకు సాటి జగ మే
లెడు శ్రీ... 58

ఉ. పాపము ద్రుంచవేల నతిపామరుఁ డంచుఁ దలం
చ నేల నీ, కోప మడంచ వేల మదిఁ గోరినకో

రెక్క లాసంగ వేల నీ, రూపము జూపవేల కడు
రూఢిగ నమ్మితి నిన్ను నింక నా, పాపము లెంచ
నేమిపని భవ్యుఁడ శ్రీ... 59

చ. తగెనట కాళియాహి రిపుతమ్ముఁడు వారిధి కుబ్జ
కృష్ణయు, న్మృగువ లనేకులుం దనుజమర్దన నేతగ
నాయనుగ్రహిం, పఁగ ఖగరాజవాహ ముసు
పాపులకంటెను ద్రోహినయ్య నీ, కగు నగు
నన్నుఁ బ్రోవ విడనాడక శ్రీ... 60

చ. శబరి భుజించి పండు లిడ నయ్యన గ్రోలి మహా
ముదంబుతోఁ, బ్రబలసుఖోన్నతుల్ జెలఁగి ప్రా
భవము న్గల నీపురంబులో, నబలలతోడుత న్గలసి
యాడఁగఁ జేసితి వంతదానినీ, సొబఁగుకు నాకు
నేమొసఁగఁ జొప్పడు దెల్పు దయాపయోనిధీ,
సబబిది రామనామగుణసత్తమ శ్రీ... 61

చ. వనచరుఁ డేఁగి లంకఁగలవారలఁ గొట్టి పురంబు
గాల్వఁగా, దనరుట వింత నీదయ సుధారసవృష్టి
బలంబొ జానకీ, వనిత తపోఘనంబొ యది పా
ల్పడెఁగా యిఁకఁ గ్రొఁతియొంత యే, మనియెదొ
దీనికి న్విధము మాధవ శ్రీ... 62

చ. నిను నుతియింప నేర్పుగననేరనివిద్య ధరామరా
ళినిం, దనుపఁగలేనిసంపదలు తల్లిని దండ్రిని వీడు
పుత్త్రుఁడు, న్నెనయఁగ మాను వారినిధినీరము

రోగములంచు నెన్నెదన్, వనజదళాక్ష నామ
దిని వాసిగ శ్రీ... 63

చ. కలిగినభాగ్యము న్గుడువఁ గాననివాఁడు సమస్త
ధర్మముల్, దెలిసి పరోపకారములఁ దెల్పనివాఁ
డు దినంబునర్థికిన్, గలిగినకొద్ది నివ్వకయె కారు
లుపల్కెడువాఁడు నిన్నుఁ దాఁ, బలుకనివాఁడు
ధాత్రిఁ బలుపాపుఁడు వ్యాధికరుండటంచు నేఁ,
దలఁచెద నాపయిం దలఁపుఁ దప్పకు శ్రీ... 64

ఉ. కుండలిరాజుపైనను బరుండెడు భండనభీమ సం
తతా, ఖండలసన్నుతాంఘ్రిపదకంజలి శేష వికుం
ఠధామ బ్ర, హ్మాండకటాహరక్షణ ధురంధర పం
డితరాజకంధరా, దండిగ బ్రోవునన్ను దయ
దప్పకు శ్రీ... 65

ఉ. అంకిలిరైన ఘోరదురితాటవినిం జనియించు
బాములన్, శృంఖల సంకటంబులును జిందరవం
దరఁజేయ భీతిచే, శంకరమిత్ర నాదురితసంకట
ముల్ దెగద్రుంచుమంచు నీ, కింకఁ గరంబులో
గ్గితిని యేలుము శ్రీ... 66

ఉ. భూరిగుణాఢ్య రాజకులపుంగవ సంగరరంగభీమ
ఘో, రారివిరామ భక్తజనరాజి సుసన్నుత దివ్య
నామ నా, భారము నీవె కావఁగదె పాపుఁడనైన

ననాథనైన సం, సారమదాంధినైన మునిసన్నుత
శ్రీ... 67

ఉ. పాయఁగదా మహాత్మతనుప్రాయము నాయెడ
నీకు నింక లే, దాయెఁగదా కృపారసము దారు
ణకష్టజలార్ణవంబుపా, లాయెఁగదా ఘటంబు నిర
పాయసుఖంబు లోసంగ వేగ నా, నాయన రార
నన్ను విడనాడకు శ్రీ... 68

ఉ. బాలుఁడవై యశోద పరిపాలనసేయఁగ నాలగా
చి నీ, లాలకలన్ రతీపతివిలాసజలార్ణవమందుఁ
దేల్చు నీ, లీలలు చాతురీమహిమ లెల్ల నుతింపఁ
జతుర్ముఖుండునుం, జాలునె మోక్షదాయి ఫణి
శాయివి శ్రీ... 69

ఉ. ఆఱుగుణంబులంచనెడు నాఘనచోరులు జ్ఞానర
త్నముల్, వారక దొంగిలింపఁ గడువాసిగ గా
చిరి నాఘటంబులో, వారలఁ బట్టనేర ననివారి
తమోహాలతానుబద్ధసం, సారములోనఁ జిక్కితి
నశక్తిని శ్రీ... 70

చ. చిఱుతుకవాలము న్మిసిమిజెందినమేను సరోరు
హాక్షులన్, గరమరుదార మీనమయి గాపురు
షు న్నిగమాపహారుని, న్నురముగఁజేసి ప్రాఁజ
దువు లొప్పుగఁ దెచ్చి విధాతకియ్యవే, పరమ
కృపారసంబు కడుభాసిల శ్రీ... 71

చ. సురలు సురారులు న్మహిమజొప్పడ క్షీరపయోధిఁ
ద్రచ్చుచో, భరమున మందరాద్రి కడువాసిదొ
లంగి మునుంగఁ గూర్మమై, సరగున నగ్గిరీంద్ర
మును జక్కఁగనెత్తి సురాసురాదుల, న్గరుతుగఁ
బ్రోచితీవు కడుఁగూరిమి శ్రీ... 72

ఉ. దారుణబాహుగర్వబలదర్పితుఁ డాకనకాక్షుఁ
డంతఁ బో, ధారుణి చాఁపఁజుట్టి సతిదారుణచం
చుఁ దలంచి వేడ్కఁ భూ, దారపువేషివై యతని
దర్ప మడంచి ధరిత్రిఁ బ్రోవవే, భారము జెంద
కుండ నిరపాయత శ్రీ... 73

చ. బలుఁడగురక్కసుండు తనబాలుని జాలదురంత
వేదనల్, అలసటఁ బెట్టి నాకును జనార్దనుజూపు
మటన్న ముద్దులుఁ, గులికెడురత్నకంబమున
ఘోరభయంకరతీవ్రకోపివై, జలజభవాండము
ల్బ్రొగడఁ జక్కఁగను న్నరసింహమూర్తివై,
వలనుగఁ జింపవే యతనివక్షము శ్రీ... 74

చ. బలిని బదత్రయంబు భువి బొగుగ దానము వేఁ
డి మాయచేఁ, జెలఁగి వటుండవై యతనిఁజేరి
పదత్రయ మర్థిఁగోరి భూ,వలయము నంతరిక్షము
ను వాసిగ రెండడుగుల్ ఘటించి యా, వల బలి
నంటఁగట్టియు శుభావహా త్రొక్కవె భూమిక్రిం

దకుఁ, దలకొని యింద్రుఁ బ్రోచుటకుఁ దల్చియు
శ్రీ... 75

చ. ధరణినృపాలకోటి విదితంబుగఁ ద్రుంచి శిరఃకదం
బముఁ, సురపురికేఁగుమార్గమునఁ జొప్పడుమె
ట్లొనరించి రక్తముఁ, బరువడిఁ బైతృదర్పణము
భాసిలఁజేసిన రామమూర్తి నా, తరమె నుతింప
నిన్ను వరదాయక శ్రీ... 76

చ. కదనములోనఁ గ్రూరదశకంధరుకంఠవిలుంఠనం
బుకై, మదవతి గోలుపోయి నిజమూరఁగ దానవ
కోట్లద్రుంచి నీ, వదనునెఱింగి రావణుని నాజిని
గూల్చి ధరాతనూజనుఁ, బదపడి తెచ్చినట్టి రఘు
వల్లభ శ్రీ... 77

ఉ. మక్కువతోడ గోపికల మానధనంబు హరించి
నట్టి యా, చక్కనికృష్ణమూర్తి బలసత్వుఁడు
నీకనుజుండటంచు బెం, పెక్కినరేవతీరమణుఁ
డీతఁడన న్బలరామమూర్తివై, నిక్కము భక్తుల
న్గరుణ నేలితి శ్రీ... 78

ఉ. నీలగిరీంద్రశృంగము వినిర్మలగేహముగాఁగ సా
ధులఁ, బాలనజేసి మూఢులను భండనవీథివధింప
నంతకు, న్గాలముగాక మీఁదనగు కాలము జూ
చుచునుండి యిప్పుడీ, కాలమునందు బౌద్ధమనః

గా విలసిల్లెడు నీవినోదపుఙ్, లీలలునెంచ నెవ్వ
రిలనేర్తురు శ్రీ... 79

ఉ. ఘోరకలిప్రపూర్ణమగు కుంభినిలో ఖలుల న్వ
ధించి భూ. భార మడంపఁగా హయముపై విల
సిల్లుచు మేలుకత్తినా, ఘోర మడంచి సజ్జనుల
కుం బ్రియమిచ్చెడు కల్కివేషివై, మీరెడు వే
ల్పువివేకద మేలగు శ్రీ... 80

ఉ. నీపదభక్తికిం బ్రియము నేర్పగనందగువాఁడు
నింద్రియ, వ్యాపకముల్ జయించు గుణవర్ధనుఁ
డార్యుఁడు నింద్రియంబులఙ్, బాపక నిల్వనూ
దియు విపద్దశలు న్గనువాఁడు ధాత్రి నీ, ప్రాపుకుఁ
బాత్రుఁడౌనె ఘనపాపుఁడు గిల్బిషుఁడు న్దురాత్ముఁ
డుఙ్, శ్రీపతి నన్ను నీకృపకుఁ జేర్పర శ్రీ... 81

చ. వరద దయానిధే దివిజవల్లభసన్నుతపాదపద్మ శ్రీ,
కర ఖగరాట్తురంగ భవకార్ముకభంగ దయాంత
రంగ నీ, సురుచిరనామసంజనితశోభనసారము
గ్రోలుదాసులఙ్, బరగ భజింతు వారిపదపంకజ
రేణుకదంబధారినై, నిరతము నన్ను నీదయను
నేలర శ్రీ... 82

ఉ.చచ్చెడువారిఁజూచి మది జాలిని నేడ్చుచుఁ దాము
జచ్చుటల్, మచ్చికఁ గానలేక తమమానిసులఙ్

సకలార్థసంపదల్, హెచ్చు నిజంబటంచు నిను నె
న్నఁడు వాక్కులమానసంబులన్, బొచ్చములేని
భక్తిఁ బెనుపొంద భజింపనివారి కేగతో, చెచ్చెర
నన్ను నీకృపకుఁ జేర్పర శ్రీ... ౮౩

ఉ. ఆలియుఁ గంఠపాశము సుతాదిసుహృజ్జను లం
తఁ జూడ నా, భీలభవాటవిం దిరుగు బెంపు మృగా
వళి దీనికింతగాఁ, బాలుపడంగ నేల యని పల్క
దు నామది యేమిసేయుదున్, కాలము చేరు
వయ్యె ననుఁ గావవె శ్రీ... ౮౪

ఉ. పాపుఁడు వీని గాతునని భావములోఁ దలపోసి
నన్ను నే, పాపము జెందకుండ దయఁ బాలనజేసి
కృతార్థుఁ జేయు నీ, ప్రాపెదఁ గోరినాఁడ నిరపాయ
దయానిధి నీకు మిక్కిలిన్, బ్రాపెవరయ్య రక్ష
ణకు వాసిగ శ్రీ... ౮౫

ఉ. వేడుకలుప్పతిల్ల నడువీథిని నే గడఁ గట్టి దానిపై,
నాడుదు ముజ్జగంబుల జనార్దనుతో సరిరారు దై
వముల్, చూడుఁడటంచు మేళ్లనులు జోడులు
గూడి చెలంగ నంతపూఁబోఁడులు నాట్యమాడ
గుణపూర్ణుఁడ శ్రీ... ౮౬

ఉ. పాపపిశాచసంఘములు పాల్పడు వేళ దురంతవే
దనల్, దాపురమైన వేళ భవదంఘ్రియుగంబు మదిం
దలంచినన్, రూపరియంగఁ బోవె యవి రూఢిగ

నీమహిమేమనందు నో, భూపకులప్రదీప రఘు
పుంగవ శ్రీ... 87

ఉ. దానముసేయలేదు పరదారల వారిధనంబులం
దును, స్నానఁగలేదు వాంఛ ధనమార్జనసేయఁగ
నేర్పులేదు డెం, దాన ముదంబులేదు వరధర్మ
కథల్ వినలేదు మూఢులం, దే ననుఁజేర్చెదో
కృపను దెల్పవె శ్రీ... 88

శా. జారుండైన ధరామరావరుఁడు దుశ్చారిణీ శు
భాకారి ని, న్నారిణీ బంచమరాలినిం దగులుకొ
న్న ట్టాయజామిాఘుని, న్నేరం బెన్నక బ్రోచితీవు
యముని న్నిందించి పుణ్యాత్మగా, నేరీ నీసరిదాత
లెన్న భువిలో నెవ్వారు శ్రీవల్లభా. 89

శా. మాయాజాలపుమోహవారినిధిలో మాబోటుల
స్సుంచియుం, ద్రోయన్నాని మహాపదల్ గుడువ
దోడ్తో కాల మెక్కించి యే, చాయంజూచిన
గానరాక భయసంజాతార్తి పాల్జేసితే, మాయం
జాలను గష్టముల్ రఘుపతీ మూఢాత్ముని బ్రో
వవే. 90

ఉ. రాఁగదవయ్య దీనుఁడను రక్షణసేయఁగదయ్య
యింక నా, కేగతి తల్లిదండ్రియును నిష్టుఁడవుం
జెలివి న్నిబ్రియుండవు, భోగిపయి న్నినోదపరి

పూర్ణుఁడవై నిదురించువేళ భూ, నాగవియత్త
లంబులు జనార్దన కుక్షినినుంచి బ్రోవవే, భోగ
శరీరపుణ్య నను బ్రోవర శ్రీ... 91

ఉ. పాండవమధ్యము స్థరుణ భాసిలఁ బ్రోచెడు వేడ్క
చక్రముఁ, దండిగ బట్టి యాదివిజతండముఁజూడ
వియన్నదీసుతుఁ, భండనవీథి ద్రుంపఁ బెనుపా
రెడు కోపముతోడ నేఁగ నా, ఖండలసూతి
నన్నుఁ గృపఁ గావుమటంచును వేఁడఁ బ్రోవవే,
దండిగ నీకృపారసము దప్పక శ్రీ... 92

చ. పరధనదారల న్ప్రియము భాసిలఁ గోరెడునామ
నంబనే, తరుచరుఁ డన్నచోరుని సదాభవదం
ఘ్రుల జ్ఞానరజ్జుల,న్బరువడి గట్టిపెట్టి యిది భావ్య
ముగాదని కొట్టు తిట్టు నీ, కరమరలేల పుత్రుఁడ
నిహంబు పరంబు లోసంగు వేడుకఁ, వరగుణ
నీలమేఘ రుచివైభవ శ్రీ... 93

శా. నీవే సర్వజగంబులెన్న తృణము న్నీకన్న వేఱు
న్నదే, రావే కావఁగదే వరంబడిగితిఁ రక్షింప
వే బెంపవే, సోమార్కాక్షిసరోజ భక్తవరదా
సుత్రామశత్రుక్షయా,భావాతీత నుతింపనేరను
మహాపాపి న్ననుంబ్రోవవే. 94

ఉ. పూనితి నీదుచిత్రములఁ బొల్పునుతింప మహా

వినోదివే, గాని నిజస్వరూపమునఁ గానఁగరావు
వరంబులీవు నే, మాన సమస్తమైనఁ గడుమాయ
లఁజుట్టిన కష్టపెట్టినం, దానవగర్వనిర్దళన తత్పర
శ్రీ... 95

ఉ. కంటి వికుంఠమందిరునిఁ గంటి ధరాత్మజఁ గంటి
లక్ష్మణుఁ, గంటి దినేశ్వరాత్మజునిఁ గంటి మహా
బలశాలివాయుజుఁ,గంటి సురేంద్రపౌత్రు వెసఁ
గంటి కలఁ హరిసేనవారలఁ, మింటికిముట్టె
నాసుకృత మేమని చెప్పుదు శ్రీనివాస నీ, బంట
ను నేలుకొమ్ము కృప భాసిల శ్రీ... 96

ఉ. పారనుముట్ట నిన్నెపుడుఁ బల్కఁగ నాఫణి రాజు
శక్యమా, నేరిచి పల్క నేననఁగ నీమహానీయవి
లాససంపదల్, ఆరయ నెంతవాఁడ ఘన కార్యము
గాదు గదయ్య నిన్ను నే, గోరె దభీష్టసిద్ధికిని
గూరిమి శ్రీ... 97

చ. అగణితపూర్వజన్మ దురితాంబుధిసంభవవీచులం
దుఁ ద్రో, వగపడ నీఁధ లేక భవదంఘ్రియుగంబను
నోడ జేరితిఁ, దగవగునే ననున్విడువ దాతవు
భ్రాతవు లోకనేతవుఁ, నగునగునయ్య భక్త
వరులందఱు మున్నెటు బ్రోచితీవా నీ, తెగువ
యొఱుంగనయ్య జగతీధవ శ్రీ... 98

ఉ. చక్కనిరామనామజపసార మెఱుంగ సదాశివుం
డనా?, నిక్కపు నీదయారసము నేవళము న్గన
నాగరాజునా?, యిక్కడనుండెనంచుఁ బలుకేర్ప
డఁబల్క సురారిపట్టినా?, నిక్కపుమానుషాధ
ముఁడ నీచుఁడ నన్నెటుబ్రోచెదో ఘనం, బక్క
జమారభాస్కర కులాగ్రణి శ్రీ... 99

చ. అటుకులు గుప్పెడిచ్చి ధనమార్జనసేయు కుచేలుఁ
డు న్మహా, ఘుటికుఁడు నీమహామహిమ గానరు
నీవును లంచగాఁడవు, న్నెటువలె నేను నీకరుణ
యీఁగుదు లంచము బెట్టఁజాల న, న్నెటుకరు
ణింతువో నృపకులేశ్వర శ్రీ... 100

మ. వసుదేవాత్మజ వారిజాక్ష విను నావార్త ల్మహా
వాంఛతో, వసుధామండలిలో నవారితములై
వాక్రుచ్చఁగారాని బ, ల్గొనఁగుల్ జేసితినంచు
వీడకుము జేదోయొగ్గి నిన్వేఁడితిన్, వసుధాపు
త్రికళత్ర బ్రోవుము నిష్పాపున్ రమానా
యకా. 101

ఉ. రాయనఁ బాపసంఘములు రాలును గుత్తిని ని
ల్వఁజాలకన్, మాయన మాయయునంత ముఖ
మందుః జెలంగెను వక్త్రమెల్ల నో, తోయజనా
భ మేల్మమహిత్తో విలసిల్లెడు నీదునామమున్

బాయక నిన్భజింప నిరపాయసుఖంబు లొసంగ
మోక్షసం, ధాయినిగాదె తారకనిధానము శ్రీ.

ఉ. రక్కసిచన్నుపా ల్గుడువరాదనక న్విషమంచు
నెంచక, న్నిక్కము దానిపాపములు నీరుగఁ
బాలటుగ్రుక్కగ్రుక్కకును, జక్కఁగఁ గ్రోలి మా
తగతి జాలెడు మోక్షమొసంగి బ్రోచు నీ, యొ
క్కువ లెన్న నేర్పుగలదేరికి శ్రీ... 103

చ. దయ విడనాడ నీకు నిజధర్మమ నాదగుపూర్వ
కర్మమా, మయుని సుపుత్రి ప్రాణవిభు మర్మము
జించి హరించి వానికి, న్నయముగ మోక్షమిచ్చి
నినునమ్మినదానవుఁ డావిభీషణుకు, భయముదో
లంగ నేలినది పాటియు సాటియుఁ గాదె నాకు నీ,
దయకును బాత్రుఁడ న్విడువ ధర్మమె శ్రీ...104

ఉ. తాతకుఁ దండ్రివయ్యు వినతాసుతునేలెడు రాజ
వయ్యు వి,ఖ్యాతిగ యోగిబృందముల కందఁబడు
న్పరతత్వమయ్యు భూ, జాతకు నేలికయ్యు దివి
జారులనెల్ల హరింపనయ్యు నీ, ఖ్యాతి నుతింతు
నయ్య నరకాంతక బ్రోవఁగదయ్య నమ్మితిన్,
దాతయు దైవము న్భువిని ధన్యుఁడ శ్రీ...105

ఉ. వాసిగ జానకీహృదయవారిజగంధరసంబు గ్రోలు
మే, ల్భాసురభృంగ మా! పరమభక్తుల ముక్తి

నిధానమా దయన్, వాసిగనేలు నన్ను రఘు
వంశజలార్ణవసోమ రామ నీ, దాసుఁడ రాఁగ
దే దయను దప్పక శ్రీ... 106

ఉ. రాతిని నాతిఁజేసి కరిరాజును నీపురిఁ జేరఁజేసి
భూ, జాతకు ఘాతఁజేసి కపిజాతి మహత్త్వము
నొందఁజేసి దు, ర్జాతి హరింపఁజేసి సురసన్నుతి
నొందిన రామనామ నా, పాతకముల్ హరించు
నిజభక్తుఁడ శ్రీ... 107

ఉ. రాఁగదె జానకీరమణ రాఁగదె వేగమె రాజరత్న
మా, రాఁగదె భోగిరాట్ఛయన రాఁగదె భా
స్కరవంశవర్ధనా, రాఁగదె నన్ను బ్రోవ యతి
రాజశిఖామణి పద్మలోచనా, భోగశరీర నన్గరు
ణఁ బ్రోవఁగ శ్రీ... 108

ఉ. పామరసంవృతుండనని బాములఁ బెట్టదలంచితేని
నీ, కేమియు రామి లేదు యశమెక్కువరాదు
ధనంబు బోవదిం, తేమిపనంచుఁ బూనితివె యెక్కు
వదాతవు నీకుఁ బుత్రుఁడన్, రామ వికుంఠధామ
నృపరాజలలామ పవిత్రనామ నా, కామితమిచ్చి
బ్రోవు ఫలకారణ శ్రీ... 109

చ. గజతురగాదిసంపదలు గామినులున్ సుతబంధు
మిత్రులున్, నిజముగఁగల్గి యిద్ధరణి నిత్యతకెక్క

నవారు మున్ను నీ, భజనయొనర్చి పూర్వభవబం
ధలత ద్రెగద్రుంచి మించియుఁ, సుజనులనంగ
నొప్పెదరు సువ్రత శ్రీ... 110

ఉ. ఎంతరుచో గణింప ధర నేరికి శక్యము రామనామ
ముఁ, సంతతము స్మరించుమునిసత్తముని న్గిరి
రాజ పుత్రి శ్రీ, కాంత యొఱుంగుఁగాక రుచి
గాఢతరంబు మదిందలంప నే, కాంతముగా దె
యామహిమగన్గొని శ్రీ... 111

చ. పరమరహస్యమై నిజముపొల్పడక స్వహరూప
మానస్యమై, యరయఁగ శుద్ధసత్వమహిమాతిశ
యోజ్జ్వలమై వినోదమై, బరగెడు రామనామ
సుధ బ్రీతిగజుర్రెడువారికెల్ల తత్పర మరచేతిదై
ముదము పొల్పడు శ్రీ... 112

ఉ. కాకము కావు కావుమనఁగా నెపమెంచక బ్రోచి
తీవు నఁ, జేకొనవేల పక్షికులశేఖరవాహన
దానికన్న నా, లోకువయేమి నిన్ను మదిలోఁ
దలపోయుటదప్ప వేఱె నా, లోకువయెంచ నేది
ధరలోపల శ్రీ... 113

చ. కరిపతి కావు కావుమనఁగా విని తత్తఱపాటుతో
డ శ్రీ,తరుణికుచద్వయంబుపయిఁ దాల్చినపైఁట
చెఱంగు వీడక,స్వగువులు వారవే తనువు భారమె

ఱుంగక యట్టినీవు నా, మొఱవినవేమి నిర్దయమన
మున్న తెఁ ద్రుంపవదేమి చెప్పుమా,ఖరకరవంశజా
దురితఖండన శ్రీ... 114

చ. జలజమరందసారమును జక్కఁగ గ్రోలెడుభృంగ
రాజముల్, వలచునె కేతకీకుసుమవాసనకై భ్ర
మజెంది నెమ్మదిన్, జలజదళాక్ష నీచరణసారససా
రము గ్రోలునామనం, బిలఁగల వారివేఁడుటకు
నెట్లుసహించు దరిద్రమబ్బినన్, దలఁపవు నన్ను
బ్రోచుటకు ధన్యుఁడ శ్రీ... 115

శా. నీవే దిక్కని నీవే యొక్కవనుచు న్నీకన్న లేరంచును, న్నే వేళ న్భవదంఘ్రియుగ్మములు నేనెంచన్
దయాశాలినై, రావేమే యినవంశవారినిధి
చంద్రా శ్రీధరా మాధవా, బ్రోవంజాలవొ
మూల్యహీనమొ మహాపుణ్యాత్మ దెల్పందగున్.

మ. కలదా యీవిధమెక్కఁడైనఁ బలుకంగారాద
నే వేఁడితే జలజాతాసనవాసవాదిసురలున్,జర్చిం
పరానట్టి ని, బలవిభ్రాజితచాతురీమహిమలున్
భాషింప నాశక్యమా, దలఁతు న్నామది నిన్ను నే
మరక నోధాత్రీశ శ్రీవల్లభా. 117

ఉ. దీనుల బ్రోవ భక్తులను దేజముగాఁ గడురక్షనే
యఁ బె, న్గానల నాకలంబులును గాయలు దుం

పలు నిర్మలాంబువుల్, బానముసేయు మానవు
లను భక్తిని యుక్తిని నేలనీకెకా, మానదు
నన్నుఁ బ్రోచు టదిమానదు శ్రీ... 118

ఉ. ఎంతనివేఁడుకొందు నిఁక నేగతి నీదుచరిత్రమెం
తు శ్రీ, కాంతమనోబ్జపంజరశుకా కమనీయవి
లాసచంద్రికా, దంతి దురంతచింతలు విదల్చిన
శ్రీకర లోకనాయకా, పంతముకెంతవాఁడఁ
దగవా ననుబ్రోవకయున్న నీకు వే, దాంతమహా
టవిం దిరుగుధన్యుఁడ శ్రీ... 119

చ. పలుకవె యెంతనేబిలుతు పాపముగాదె మహా
దరిద్రుఁడ, న్నలసితిఁ గష్టమొందితి మహాదయ
శాలివి నిన్నుఁజూడఁగా, వలచితి నేర్చినట్లు గ
డు వర్ణనజేసితి మ్రొక్కులిడితిఁ, దలఁపవికేమి
సేతు వరదాయక శ్రీ... 120

ఉ. భాసురమైన నీదయకుఁ బాత్రుఁడఁగాన భజిం
ప మాన నీ, దాసులకెల్లదాసుఁడ విధాతపితా
శ్రితపారిజాత నీ, కేసరినీవె నీకు సరినెంచ జగం
బులలేరు వేతె నా, యాసలొసంగు నెమ్మనము
హాయన శ్రీ... 121

ఉ. కానరు నీమహామహిమ గానరు భక్తులఁ బూజ
సేయఁగాఁ, గానరు దుర్విచారమను గాఢపిశాచ

విదారణంబు లీ, మానవకోటు లేమనెద మాట
లమూఢులు వారినొల్ల స, న్మానచరిత్ర నన్నుఁ
గృప మానకు శ్రీ... 122

ఉ. చాలదు భూములిచ్చినను జాలదు కన్యల నెందఱి
చ్చినన్, జాలద యన్నదానమును జాలదు
మూల్యము లెన్నియిచ్చినన్, బోలునె బాలకృ
ష్ణ యదుపుంగవ ధీనిధి రాధికాపతీ, నీలనిభాంగ
నీదయకు నీటుగ శ్రీ... 123

ఉ. జాలమిఁకేల నాయెడ విశాలదయాపర భక్తవ
త్సలా, లాళితగానలోల గుణలాలిత సర్వజనా
నుకూల నా, పాలిటిదైవరాయ యెడబాయను
బ్రోవర మానిగేయ నీ, కేలచలంబు దాసుఁడ
ను నేలుము శ్రీ... 124

ఉ. వాసవభోగమబ్ధి సుఖవార్ధిని దేలి జగంబులేలి
న, న్నాసకు మేరలేదు ఘనమా ధనమెప్పుడు వెం
టరాదు నీ, దాసుల కివ్వఁబోదు ఫలదాయక వ
చ్చినఁబోదు వాదులే, దోసము లేదు నాకు ఖర
దూషణకాననవీతిహోత్ర నీ, దాసుఁడ నన్ను
నేలు కృపదప్పకు శ్రీ... 125

ఉ. ఎంచితి నీచరిత్రఘనమెల్ల ఘనంబుగ భక్తకోటి
లో, మించితి నాదుపాపముల మేలు హరించి

పురాకృతంబు వే, ద్రుంచితి జానకీహృదయతో
యజతోయజమిత్ర యింక నా, కెంచ భయంబిం
కేల జగదీశ్వర శ్రీ... 126

ఉ. అక్కఱదీర్తువో యనుచు నాసను నీపదపంకజా
తము, న్మిక్కిలి నమ్మి నెమ్మదిని మేలుఘటింప భజిం
పుచుండ నా, కెక్కడఁగానరావో యిదియేమిర
ఘోరఘువీర! దెల్పు నీ, చక్కదనంబుఁ జూపు
మనసారెను శ్రీ... 127

ఉ. మిక్కిలికానలోఁ బసులమేపుచుఁ బిల్లనగ్రోవి
యూఁదుచు, న్మక్కువ పిక్కటిల్ల వ్రజమానిను
ల న్గసుమాస్త్రబారికిం, జక్కఁగఁద్రోచి నీమహి
మ సారెకుఁ జూపుచునుండునట్టి నీ, చక్కదనం
బుఁ జూపు మనసారెను శ్రీ... 128

ఉ. అక్కడ గోపపల్లెకడ నాడెడువేళ మహావినోది
వై, మిక్కిలి పాలువెన్నలును మెక్కుచు గోపి
కలిండ్లఁ జిక్కుచు,న్నెక్కడఁజూడ నీవెయయి నిం
దునిభాస్యలఁ గూడి యాడు నీ, చక్కదనంబుఁ
జూడ మనసారెను శ్రీ... 129

ఉ. మక్కువ యాయశోద సుకుమారతను న్నిను బే
ర్మిమీఱఁ దా, నక్కునఁజేర్చి చన్గవల నప్పుడు పా
లటుచేపనిచ్చుచుఁ, ముక్కున ముత్యముంచి

కడుమొక్కపుఁగస్తురిబొట్టుదిద్ది మా, రెక్కడ
లేని నిన్నుఁ దనయొక్కువప్రేమను ముద్దులాడు
నీ, చక్కదనంబుఁజూపు మనసారయెను శ్రీ...

ఉ. చిక్కులఁ బెట్టనేల గడుఁజిక్కినన న్నలయించ
నేల నీ, యొక్కువ వీడనేల జగదీశ్వర సర్వజగం
బులందుఁ బెం, పెక్కి వ్రజాంగనామణులనెల్ల
ముదంబునఁ గ్రీడ దేల్చు నీ, చక్కదనంబుఁజూపు
మనసారయెను శ్రీ... 131

ఉ. రిక్కలఱేడు కాంతిప్రసరించుముఖంబున రావి
రేక మే, లక్కజమై దివాకరనిభాంకురమై వెలుఁ
గొందఁ గన్నులన్, జక్కఁగదిద్దు కాటుకల సార
ము న్నలఘునాభలొప్పఁ బెం, పక్కజమై కురుల్బ
జమునందు వినోదముచే నటించు నీ, చక్కదనం
బుఁజూడ మనసారయెను శ్రీ... 132

ఉ. చిక్కనిపాలుద్రావి వ్రజచేడియలిండ్ల నటించి వా
రలన్, జిక్కులఁబెట్టి భావజునిజెన్నగుఁగ్రీడల కె
ల్లఁదార్చినీ,మక్కువపిక్కటిల్ల సుకుమారులజారు
లఁజేసినట్టినీ,చక్కదనంబుఁజూపుమనసారయెనుశ్రీ.

ఉ. ఆలనుగాచి గోపకులయాపద లెల్ల హరించి రుక్మి
ణీ, బాలికఁ బెండ్లియాడి కడుభద్రముగాఁ బది
యారువేల నీ, లాలకలన్వరించి పటులాలసల న్మ
రు కేళిఁదేల్చునీ, లీలల నెంచఁజాలుటకు లేరర శ్రీ.

ఉ. పాండవపక్షమై ప్రబలభండనవీథి మహోగ్రకా
ర్ముకో, ద్దండకళా ప్రచండభుజతాండవుఁ డాసుర
రాజపుత్రునిన్, దండిగనేలి భానుసుతు దర్పము
డంచి కురుక్షితీశ్వరున్, దండితుఁజేసి ధర్మజుని
దర్పమెలర్పఁగ రాజుఁజేసి పూ, దండమొసంగినట్టి
ఘనదైవము శ్రీ... 135

శా. రావా మోమిటుజూపవా ననుదయన్ రక్షింప
వా బెంపవా, భావాతీత గుణాశ్రయా భవహ
రా భాగ్యోదయా మాధవా, కావా నాకును ద
ల్లిదండ్రి విలపైఁ గారుణ్యరత్నాకరా, నీవే
దిక్కుర నన్నుఁ బ్రోచుటకు నున్నీ రేజపత్రేక్షణా.

శా. ఏవేళ న్గమనీయసుందరములై యింపొందు నీ
యంఘ్రులున్, భావంబందుననిల్పి ప్రేమలతలన్బం
ధించి పూజించి యో, దేవా కావుమటన్న స
త్కరుణ వే దీపింపఁగా వచ్చి నా, భావం బుల్ల
సిలంగఁ బ్రోవఁదగదా భాగ్యోదయా! శ్రీవరా.

ఉ. ఎక్కడికేఁగితీవో సుత యేమిర గోపమదేభగా
మినుల్, మక్కువ వారిమానధనమంతయు నీకు
నొసంగియున్నవా, రక్కట వారిప్రాణవిభు లం
తయెఱింగిన మేలుకత్తిపై, నెక్కడుసాముగాదె
యిదియేటికిఁ బోకుమటంచుఁ బల్కు నీ, మ
క్కువ తల్లియొద్ద నయమాడెదు శ్రీ... 138

ఉ. రాధ మనోరథంబు గడురంజిలఁ బుష్పశరాసనా
స్త్ర పె, న్వేధ లడంచి కూరిమిని వేడుకనించి గు
ణంబులెంచి యే, బాధలు జెందకుండ నిజభార్య
గనేలిన నీవిలాసలీ, లాధికమెన్న నాకు దరమా
నటె శ్రీ... 139

ఉ. రాజితకీర్తి బెంపెసఁగ రామునితమ్ముఁడవై జె
లంగి సా, త్రాజితిఁ బెండ్లియాడి కడుదారుణకర్ము
ల రాక్షసావళి, న్నాజిని గూల్చి క్రూరనరకాసురుఁ
జంపి మహావినోదవి, భ్రాజితకీర్తినొందిన శు
భావహా శ్రీ... 140

మ. కురుసేనార్ణవమధ్యమందు నృపుల స్థూల్వంగ భీ
భత్సునిన్, శరసంతానమహానుభావము వడిన్
సంధించి సారథ్యపున్, భరముందాల్చి విరోధవ
ర్గములను న్ఖండించి ధర్మాత్మజున్,గరుణం బ్రోచితి
వీవె కావె ధరణి న్గంసారి శ్రీవల్లభా. 141

ఉ. గౌతమపత్ని శాపమునఁ గారడవి న్బెనుఱాయి
యైన నా, నాతిని బ్రోచె నీదుచరణాంబుజరేణుక
దంబమెల్ల నీ, ఖ్యాతి నుతింపగాదు దయఁ గావు
రఘూధిప నన్ను వేగ యే, పాతకమొంచక న్బతిత
పావన శ్రీ... 142

చ. పతితులఁ బ్రోచు నీబిరుదు పాలనసేయు జగత్కు
టుంబివై, చతురతఁ జూపుచున్న గుణశాలివి

సాగరజామనోహరా, కౌతుకంగ నేల నాకిడ వి
కుంఠ కుచేలునికిచ్చి బ్రోవవే, యతులితమైన సం
పదలు నన్నియు శ్రీ... 143

ఉ. ఖాండవ మేర్చునాఁడు తనకార్ముక మెక్కుడి ఫల్గు
నుండు నా, ఖండలుఁ డంపు మేఘము లఖండము
హానినదంబులొప్ప వే, దండకళా ప్రచండజలధా
రలునింపఁగ ద్రుంప బాణముల్, దండిగఁ బంజరం
బిడిన దానిఘనంబుగఁజేసి బ్రోవవే, కుండలిరాజు
పాన్పుగల కోవిద శ్రీ... 144

ఉ. అండజవాహనా ప్రభులలామ జనార్దన రాజమం
డనా, పండితరక్షకా దురితపంకిలసంకట సంహారా
హారీ, దండిదోరా దశాస్యభుజతండవిఖండన మే
లుభండనా, నిండగు వేడ్క బ్రోవు దయనెమ్మిని
శ్రీ... 145

ఉ. మోదము కెల్లపాదు ధనమోహమదాంధులఁ జే
రఁబోదు నీ, పాదసరోజయుగ్మముల పంకమహా
త్త్వము నెంచరా దికే, వాదుకు మేలురాదు య
మబాధలకీడు సహింపరాదు నీ, యాదర మొక్క
టే ఘనతలో మది శ్రీ... 146

శా. కారే భూపతు లెన్నసంపదలతో గర్వించి భోగిం
చిరే, వారే శాశ్వతులయ్యిరే ధనము లే వా
ర్వెంటఁ బోసాగెనే, యేరీ మాతమఃటన్న ధారు

ణిపయి న్నింపొందిరే గావునఁ, మారాకారుని
నిన్నుఁజేరవలెఁగా మార్తాండవంశాగ్రణీ. 147

ఉ. తల్లికి లేనియట్టిదయ దాదికిఁగల్గునె లోకమందు
నా,తల్లివి దండ్రివి న్గురువు దాతవు దైవము నీవె
కావె యు, త్ఫుల్లసరోజనేత్ర రఘుపుంగవ నాప
యి వేగజల్లు నీ, చల్లనిసత్కృపారససుసారము
శ్రీ... 148

ఉ. ఆఁకొని నిన్ను నేఁ బిలువ హారఘునాయక పల్క
వేమి నీ, కేకడు మ్రొక్కి మ్రొక్కి దయకే వలప
గ్గల మెక్కి యెక్కి చీ, కాకును జెందిజెంది నను
గావుమటంచును వేఁడివేఁడితే, రాక వరంబులీక
యిటు రాయిడిబెట్టుట నీకు న్యాయమా, ప్రాకట
శోభనాంగ సురపాలక శ్రీ... 149

ఉ. వాకొనఁగారుప్పనాకు నినువర్ణనజేయుటకై త్రివి
క్రమా, శాకొమరా దినేశకులరాజశిఖామణి
రంగనాథ నీ, రాకకుఁ గోరినాఁడను నిరాకరణం
బొనరింప నింక నే, లోకువనైతినా ధరణిలోప
ల శ్రీ... 150

ఉ. నీలఘునాభమూర్తి దయ నేలుమటంచు భజింప
నింక నీ, జాలము లేలనయ్య దయశాలివి నీవు గద
య్య శ్రీసతీ, లోలుఁడవయ్య నాదుమదిలోపల

నిన్నెడఁ బాయనయ్యరయ్యే, మూలనునుంటివయ్యా
ధనమూలముగాదె జగమ్ము గావునన్, జాలధ
నంబు లియ్యవలెఁ జక్కనిశ్రీ... 151

ఉ. నాకము జారఁగొన్న సురనాయకుపీఠము నెక్కి
యున్న భూ, లోకము నేలుకొన్న ఫణిలోకము
పాలనసేయుచున్న నీ, లోకముసాటియౌనె ము
నిలోకము దీనినెఱింగికాదె యీ ,లోకములెల్ల
వీడి నిను లోఁ దలపోయుచు మేటిరైననీ, లోక
మె జేరఁగోరెదరు లోలత శ్రీ... 152

ఉ. ఏమిర మాయ యీజగము లేమిర నీదువిలాస
మేమిరా, పామరమెంతరా తనువుబాసియుఁ
బ్రాణముబోవుటెంతరా, యేమియు రాదురా
యితరులెవ్వరు నింతఘటింపనేర్తురా, యోమహా
నీయమూర్తి తగవో నగవో యిదిదెల్పు నాకుఁ
బె, న్నామములకోర్వఁజాల కులపావన శ్రీ...153

ఉ. కల్లరిమానవాధముల గ్రాసముకై కడువేఁడలేక
బె, న్నల్లడినొంది నామదిని మాధవ నీపదపంకజా
తముల్, జల్లగఁజేరి కావుమన సాగరజాహృద
యేశ యింక నీ, కల్లలు మాని బ్రోవ నిదె
కాలము శ్రీ... 154

మ. వయసెల్లం దిగనాడి వచ్చె ముదిమి న్వద్ధించు గో

పెట్టినఁ, దయలేదాయెఁగదే విధాతృజనకా
దారిద్ర్యపుంభూతమే, భయముం జేయుచునుం
డె నింక నెవరే భారంబు వే బాపవే, జయసంధా
నకరా ధరాసుతవరా శంభుప్రియా మాధవా.

ఉ. ఓపరమాత్మ నీకు శరణో శరదిందునిభాస్య సద్య
శో, దీపిత నీరజాప్తకులదీపక దీనజనాళిప్రాపకా,
తాపనముఖ్యహృత్కమలధామ జగన్నుతనామ
నీకు నీ, ప్రాపెధనంబు బ్రోవు నిరపాయత శ్రీ.

ఉ. శ్రీకరమై రమామణివశీకరమై నిగమార్థసారమై,
ప్రాకటరక్తపద్మనిభ భాసురమై మృదుసారపూర
మై, లోకము లెల్లనిండి మునిలోకమనోహరమైన
నీదుసు, శ్రీకరపాదపద్మములు జేరితి శ్రీ...157

చ. అగునని చేసితీవా జగమంతయు నీమహానీయమా
యచేఁ, బగలును రేయటంచు నొకభానుఁడె
యొక్కఁడె చంద్రుఁడంచు నో, యగమె ఘనంబ
టంచుఁ బలునంచలు లో వెలుగొందునంచు నీ,
సొగసు నిదేయటంచు బహుచోద్యమెనీకుధనం
బటంచు నీ, పగిదియునీకెనీకెతగుభవ్యుఁడ. శ్రీ.

ఉ. నాయెడ మాయమాను కడునమ్మితి నీపదపంకజా
తముఁ, బాయను మాయఁజేసినను భాగ్యమొ
సంగిన వేలుజేసినఁ,దోయజసంభవాది సురతో
షితతోయజనాభ ద్రోయవే, త్రోయఁగరాని

నాదురితతోయధివీచుల తోఁపు లెల్ల నో, నాయన
నీకుమారుఁడ జనార్దన శ్రీ... 159

శా. ఓహో రాఘవ యోమహావిభవ యోహోహో
రమానాయకా, యోహో దీనదయాపరా నను
గృప న్నొప్పారఁగాఁ బ్రోచి యీ, గ్రాహంబు
న్బరిమార్చునన్న కరినిం గారుణ్య మేపార నా,
దాహంబార్చను వేగ నా మకరినిం దండింపవే
వేడుక, న్నా హా నీమహిమెన్న నెన్నఁడగుదివ్యా
బ్రోవవే నన్గృపన్. 160

చ. రవికులవార్ధి కెల్ల నుడు రాజు జగంబులు పావనం
బుగా, సవినయ మొప్పఁజేయ వికచాంబుజనేత్రుఁ
డు దానసత్కళా, ప్రవిమలకీర్తికాంతకును బ్రాణ
విభుండు ఘనుండు రాముఁడీ, భువినని నమ్మి
కొల్చు మదిపుణ్యుఁడు శ్రీ... 161

ఉ. కావుమటంచు నీచరణకంజము కంజలిఁజేసి వేఁడి
తే, దేవ మదీయవాంఛితముఁ దీర్చి ముదంబునఁ
జేర్చి నిత్యసం, భావితబుద్ధినిచ్చి ధనభారములిచ్చి
వరంబులిచ్చి నీ, సేవయొసంగి బ్రోవు నృపశేఖర
శ్రీ... 162

ఉ. రేపును మాపు నీచరణరేణుకదంబము నాశిరం
బుపై, స్థాపనఁజేసి నాదురితతాపదవానలకీలలా

ర్చి నీ, రూపము నాకల న్గని నిరూఢిగ నిన్ను భజిం
పుచుంటి నో, పాపలతాలవిత్ర ఘనపండిత శ్రీ.

ఉ. ఆసలుగోసి జ్ఞానమణిహారము నేసి భవాబ్ధినీదుసా
భ్యాసముబాసి నీదుపదభక్తుల పాదసరోజయు
గ్మమున్, డాసి సుబుద్ధిఁజేసి కడుడస్సినమేనున
భూతిబూసి నీ, కోసముకోర్కెఁజేసిన వికుంఠపు
రంబు లభింపకుండునే, భాసురకీర్తిహార రఘువ
ల్లభ శ్రీ... 164

ఉ. వాసనగల్గుపువ్వు గడుభక్తిమెలంగెడుభార్య ని
త్య మ, భ్యాసముతోడివిద్య హరివర్ణనఁజేయుది
నంబు సత్యమున్, భాసిలుపల్కు దానగుణభా
సురుఁడైననరుండు కీర్తిచే, భాసిలుగాని తక్కినవి
భాసిలనేరవుగాదె చూడ నీ, వాసులలోన నే
నొకఁడ ధన్యుఁడ శ్రీ... 165

ఉ ఆపదకైనబంధువుఁడు నాజ్ఞకుమీరనియట్టిపుత్రుఁ
డున్, గోపములేనితాపసియుఁ గోర్కెలొసంగి
న రాజవర్యుఁడున్, రూపముగల్గుకాంత తనలో
పలిదైవముకాంచు భక్తుఁడు, స్నేపగుగాని భ
క్తిగుణహీనున కెట్లులభించు నన్నియున్, బాప
ము లబ్బు కష్టములు పాల్పడు శ్రీ... 166

ఉ. యాతనలేనిజీవనము నార్యులుమెచ్చని యట్టిప

ల్కులున్, భూతదయాపరత్వమును బోధలెఱిం
గినమానసంబు వి, ఖ్యాతినిఁ గొన్న సూనుఁడు
ప్రకాశమునొంది వెలుంగువిద్య నీ, చేతను మె
చ్చుభక్తి నినుఁ జెందెడిదే మహనీయధ్యానముల్,
భూతలనాథ శౌరి సురపూజిత శ్రీ... 167

ఉ. అంగనలేనియిల్లు కుసుమాయుధుక్రీడలులేనిప్రా
యమున్, సంగరరంగమందుఁ గడుసత్వము జా
లనియట్టి శౌర్యమున్, రంగు లెఱుంగనట్టి సతి
రాజ్యవిహీనతనొందురాజు నీ, మంగళమూర్తి
గన్గొనని మానవుఁడున్ వృథఁ జెందు నింతెయా,
యంగజుఁ గన్నతండ్రి వినుమా యిది శ్రీ...168

ఉ. దానము లేనికంకణము ధర్మ మెఱుంగనియట్టితీర్పు
సం, ధానము లేని నేర్పు తనదాయల నర్థుల దల్లిదం
డ్రులన్, దీనతసేయుకల్మి కడుధీరత లేనిరణంబు లి
ట్టివే, పూనినవాఁడు కీర్తిసతిభోగము బాగుగఁ
గాననేర్చునే, దీనతనొందుఁగాని జగదీశ్వర శ్రీ.

ఉ. కాననివాఁడు భోగములు గాననిభంగి సమస్తక
ర్మముల్, బూనినఁ బూనకున్న నినుబుద్ధినెఱుం
గనివాఁడు నంధుఁడే, గాని సుపుణ్యుఁడౌనె యిది
గాదనఁగా నెపమేమిగల్గు డెం, దానను నిశ్చయిం
చు వరదాయక శ్రీ... 170

చ. నుతి నినుఁజేయువారలను నొప్పుగ నేలెదొ సే
యనేరకన్, బ్రతికినవారిబాములకుఁ బాల్పడఁజే
తువొ యిట్టిదానికే, పతితులఁ బ్రోచునీబిరుదు
పాటి నటింపదు రాత్రి గావునన్, జతురముగాదు
యివ్విధముసల్పుట శ్రీ... 171

చ. అడవులఁ గొండలంబడిననాకలమున్ దినుజంతుజా
లమున్, బడిబడి నిన్ను నేనుతులు భాసిలఁజేసెను
వానిబ్రోవవా, బుడబుడమాటలేమిటికి భూరిగు
ణాఢ్య సనాథజీవులన్, దడయక బ్రోచుటే బిరు
దుఁ దాల్చుట శ్రీ... 172

చ. మునులును వృక్షమూలములమఃక్కలుమూసుక
సంతతంబు హ్రాం, ద్వనజములందు నీమహిమ వర్ణ
నఁజేసి జపించువారలన్, ఘనముగ బ్రోచితీవొ
జపకర్మ మెఱుంగనివారి బ్రోవవో,మనుజవరేణ్య!
నీకును సమంబు సమస్తము నెంచిచూచితే, ఘన
మును గొద్దియుం గలదె గానరు శ్రీ... 173

మ. మునిపత్నుల్ దగ నీకు నన్నమిడిన న్మోదించి మో
మాటివై, ఘనవైకుంఠపదం బొసంగితి వనంగా
విందు శాస్త్రార్థముల్, ఘనమా లంచము గోలి
బ్రోచుటలు నోకంజాక్ష నాకెంతయున్,ధనమున్
లేదు నొసంగ నేమిగతి రాధానాథ శ్రీవల్లభా.

శా. ఏమోకాని మొఱాలకించవిదియున్నే మోయిరా
ధాపతీ, భామారత్నము పాండవాంగన మహా
భారంబుతో నార్వ నీ, ప్రేమనోబ్రోచుటకల్లలా! కు
రుసభన్ బెక్కండ్రులేరా యశో, ధామా శౌరి
గుణాభిరామ దయరాదా శ్రీమనోవల్లభా. 175

మ. పులిగోరు న్బతకంబు మధ్యమున మేల్పొల్పొం
దు హేమోజ్జ్వల, త్కలితంబౌ ఘనమేఖలావల
యముల్ గాళ్లందెలు మ్మువ్వలున్, ఘలుఘల్లని
మ్రోయఁ దల్లినెదుటం గారాముశోభిల్లఁగాఁ,
జెలువుంజూపెడునీచరిత్రము మహాచిత్రంబు శ్రీ.

ఉ ఆలనుగాచి కారడవులందు విహారముసల్పువేళ
గో, పాలురు నిన్నుఁ గూడి బహుభంగుల నెచ్చెలి
వంచునాడ నా, బాలురు నేతపంబులును భాసిలఁ
జేసిరో తొల్లియెట్లు నీ, పాలవసించు సంపదలు
భాసిల శ్రీ... 177

ఉ. అక్కునఁజక్కఁజేర్చి ముదమారఁగఁ జన్గవనొక్కి
నొక్కి నీ, ప్రక్కనుబవ్వళించి రసపాటికి మేటగు
మోవిగ్రోలి బెం, పెక్కనప్రేమ సూనశరు నె
క్కువ సంగరమందుఁ దేల నే, మెక్కువనోఁచె
రాధ కృపనేలను శ్రీ... 178

ఉ. అందెలు మువ్వలు న్బటురవంబులఁ బాదముల

న్నటింప మా, కందసుకందసూనములఁ గల్పిత
మాల లురంబుఁ గప్ప రా, కేందుకళాకదంబము
ముఖేందుసుబింబమునందు నందమై, విందులునే
యు నందసతి వేడుక గాఢముగాఁగ నాడు నీ,
సుందరమందహాసమును జూపర శ్రీ... 179

శా. మందారంబులు మంచిగంధతరులు న్మాకందము
ల్గల్గు కా, ళిందీప్రాంతవనంబులో నపుడు కేళీ
గానమున్ సేయ నా, చందంబంతయు నాలకించి
మరుశస్త్రాగ్ని న్నిమగ్నాంగలై, పొందంజాలిరి ని
న్ను గోపికలు నింపొందన్ రమానాయకా.

ఉ. అంబుజనేత్ర నీదు కరుణామృతమార్జన సేయువాఁ
డు మే, లంబరహేమభూషణగజాశ్వసుకాం
తులవింతలొందియున్, పంబినవేడ్క కీర్తిసతిపా
నుపుపై వెలుగొందునయ్య నీ, లాంబుజసన్నిభా
తెలియ నౌనిది శ్రీ... 181

ఉ. కాననసీమ గోవులను గాచెడువేళ దవాగ్నికీల
లున్, భూనభము న్మహాభయము బొంది వెలుం
గుటఁ జూచి గోపకుల్, దీనతనొంద నీవపుడు
దెప్పరమైన మహాగ్ని మ్రింగియా, దీనులఁ బ్రోవ
వే కరుణఁ దెల్పుచు శ్రీ... 182

ఉ. తల్లియు రోటఁ గట్టఁ గడుతల్లడమందినరీతిఁ జూపి

నీ, కల్లలు దెల్లమై జెలఁగఁ గాలమెఱింగియు
మద్దివృక్షముల్, బెల్లుగఁ గూలఁ గుంకుటుల్బెకలి పృథ్వి
నిహాలఁగ రోలునీడ్వవే, నల్లనిబాలకృష్ణ నిను
నమ్మితి శ్రీ... 183

ఉ. ఘోరపుపాము మ్రింగుటకుఁ గోఱలుసాచియు
నొళ్లఁగిట నా, భారము కోర్వలేక వ్రజబాలలు
శ్రీహరి నందనందనా,సారసనేత్ర శౌరి సురసన్ను
త కావుమటంచు వేఁడ నా, భారమడంపవే దను
జభండన దానివిదల్చి గోపకుల్, గోరినకోర్కె
దీర నృపకుంజర శ్రీ... 184

ఉ. అందము నబ్బురంబు ఫలమందుట కెల్లను నిబ్బ
రంబు గో, విందునియంఘ్రియుగ్మ మరవిందమరం
దము డెందమందు నా, నందము సందడింప రు
చి నానుచు జిహ్వకుఁ దృప్తినింప మేల్, జెందఁగఁ
గ్రోల గోరికలు చెందవె శ్రీ... 185

ఉ. లేదని భక్తు లెంతకడు లేమిని వేఁడిన వారికియ్యఁ
గా, రాదను దుర్ణయప్రజలరాయిడిబాపి ధనం
బులిత్తు నీ, దేదయ యింతె కాని మఱియెందుకు
మాయలు యెంతవేఁడిన, నొప్పదు పురాకృతం
బు ఘనపుణ్యుఁడ శ్రీ... 186

ఉ. స్నానము సేయలేను కడుసంధ్యజపంబులు బూన
లేను నీ, మానితరామనామఘనమంత్రములన్ని

వచింపలేను బ, ల్దీనుఁడ మూఢుఁడన్, జడుఁడ
దేవర నన్నెటుగాచెదో మహా, దానఘనా ద
యారసము దప్పకు శ్రీ... 187

ఉ. తప్పులెఱుంగనయ్య దురితంబులు బాపఁగదయ్య
నాకు నీ, వప్పవు కావుమయ్య యిఁక నన్యులవేఁ
డఁగఁజాలనయ్య నన్, దిప్పలఁబెట్టకయ్య ఘన
దేవర నే శరణంటినయ్య యీ, చొప్పున వేఁడ
నాపయిని జొప్పవు నీదయ యేమిసేతునో, యొ
ప్పులకుప్ప యేలఁగదె యొప్పుగ శ్రీ... 188

ఉ. కప్పురగంధులైన వ్రజకాంతలు మోహలతానిబ
ద్ధలై, తప్పక మాధవీవకుళ తాలతమాలవనాం
తరంబుల, న్నొప్పుగ నిన్నును న్వెదకి యొక్క
డఁగాంచిరె నీదుమాయ నేఁ, జెప్పఁగఁజాలు
వాఁడనె విచిత్రము శ్రీ... 189

శా. బృందారణ్యమునందు వేణువు మహాప్రీతి న్వి
నోదింప నా, నందాంభోనిధి నోలలాడి నినుగాన
న్గోపకాంతామణు, ల్మందారక్రము కాది భూరు
హాముల న్నానాథుఁడేడంచు వా, రందందందటిన
న్గుచుం దిరుగ బ్రోవంజాలితో మాధవా.

ఉ. నమ్మఁగరాదు యెంతకఠినంబు హృదంబుజము న్ము
దంబు నీ, కమ్మి సమస్తవాంఛల విలాసములు న్వి

డజిమ్మి మాధవా, యిమ్ముగ నేలువన్న వ్రజ
యింతులఁ గంతునిబారిఁ ద్రోచి నీ, నమ్మకముల్
దొలంగ యదునాయక వారలఁ బాసిపోవె నీ,
ముమ్మరమైనమాయలను ముంచియు శ్రీ...191

ఉ. రాదుర నీకు సత్కృప విరాజితకీర్తికళాకదంబ
బె, న్నాదుర భక్తకోటులను వాసిగఁ బ్రోవక
యున్న దోసముల్, బోదుర మేలు రాదుర సు
బుద్ధినిఁ జూడర దీనియర్థము, న్నాదర మొప్ప న
న్నువిడనాడక శ్రీ... 192

చ. కఠినపుఱాయి నీహృదయకంజము కంజదళేక్ష
ణా హరే, కుటిలపుమానసంబు దగఁ గూరిచి
యొంతయు లేదు నీకు నొకట్టియకదా నతుల్
దురితకర్మలు చెప్పెడిదేమి యింక నిం, తటికి
ని గర్మమూలము ప్రధానము శ్రీ... 193

శా. ఆలంచుల్ సుతులంచుఁ జుట్టములటం చాయా
సముం జెందియుల్, బోలంగా భవబంధనంబనె
డు సంభోరాశిమధ్యంబునన్, గేలిన్నల్పియు వాం
ఛదీర్చుకొనంగా గెల్వొందలేనంచు బ, ల్జాలిం
బొందిన నన్నుఁ బ్రోచుటకునుం జాగేల శ్రీవల్లభా

ఉ. పుట్టఁగనేల యీపుటుక పుట్టినఁ బొట్టకుఁబట్టెఁడ
న్నముల్, నెట్టనగల్గకున్న నినునెవ్వఁడు దిట్టఁడు

యింతనాతలన్, బుట్టినె ధాత్రిలోన మఱేఁబుట్టి
నవారికినెల్ల నిట్టిదే, బుట్టదె నిన్నుదిట్టితినె భూతి
కి శ్రీ... 195

ఉ. వెన్నునుబోలు నీమనసు వేమరు తాయివలెం జ
లింపకే, యున్నది మున్ను నీగతిని యున్నను భక్తు
లకెల్లసద్గతుల్, జెన్నుగఁగల్గుటెట్లు నిదిచెప్పుము
నాజననంబ దెట్టిదో, యిన్నిఁటికేమి నాసుకృత
మిట్టిది శ్రీ... 196

ఉ. ఖండితపాపసంఘదశకంఠవిలుంఠనచండకాండవే,
దండపతిప్రచండరిపుదర్పవిఖండన దైవరాయ
మా, ర్తాండకులప్రదీప యతిరాజశిఖామణి సత్య
రూప నీ, దండను జేరినాఁడ దయఁదప్పకు శ్రీ...

ఉ. ఖండితమూలమై పడినకారడివి న్వోసఁగాల్చు వీతి
హో, త్రుండన ఘోరపాతకవితూలమహాద్రులు
గాల్చు నీమహో, ద్దండసునామసారము విధాత
కునైన నుతింపవచ్చునా, పండితరక్షకా దనుజభం
డన శ్రీ... 198

చ. త్రిగుణములందు సత్యమయతేజము నీమహానీయ
రూపమున్, బగలును రేయి యొక్కగతి బ్రహ్మా
మహోజ్జ్వలమై వెలుంగు నీ, తొగలహితుండు
భాస్కరుఁడు తోయధులేడు కులాద్రులేడును,న్ని

గమములాది సర్వమును నీవెఘనంబును లేమినీ
వెనీ, సుగుణము లెన్న నాతరమె సువ్రత శ్రీ...

ఉ. పూసల దారమున్న లెను భోగిశయాన సమస్త
లోకముల్, వాసిగఁ గర్మసూత్రమున వ్రాలగఁ
గట్టియుఁ గర్మసాక్షివై, భాసురమాయచే నటుని
భంగి విలాసముఁజూపునీకు నే, దాసుఁడ నేలు
కో దయను దప్పక శ్రీ... 200

ఉ. వేయననేల నీకుఁదగ వేభవతోయధినీదలేకయో,
నాయన నాయనా కడు ననాథను రక్షణ సేయుమ
న్న నీ,మాయలె కానిప్రేమను సమర్మకమానసమొ
ప్పఁబ్రోవవే, మోయి ఘనంబటోయి ధనమూల
ము నీజగమోయి వేగరా, వోయి వరంబులియ్య
దగవోయిఁక శ్రీ... 201

ఉ. ఎక్కువఁజెప్పవోయి ధనమెక్కువానీఘనమెక్కు
వో ధర, న్నిక్కము తానదై ధనమనేకవిధంబు
ల మాయలీగుచు, న్నెక్కడఁజూచినం దనదునె
క్కువలేర్పడి భూతలంబున, న్గ్రిక్కనఁగ్రీడసల్పు
నివు గానఁగరావు ఫలంబులీవు నీ, యెక్కువఁ
జెప్ప నేది ధనమేలని శ్రీ... 202

చ. ధనముఘనంబొసంగు కడుదారుణకర్మలుమాయఁ
జేయు మా, నినుల భ్రమించు నేలికలనీతులు వే

హరియించు మహానులన్, బనిగొను యాగముల్ఫ
లము భాసిలఁజేయును గర్త తానయై, వనజదళా
క్ష నీవు గనవత్తువా కోరినకోర్కెలిత్తువో, నిను
నిటులాడ నాకేతగు నెన్నఁగ శ్రీ... 203

ఉ. పాపములన్ హరించు నిరపాయసుఖంబు లొసం
గు ముక్తికే, ప్రాపగు సర్వజంతువులఁ బ్రాణము
గాచు సుభోగసంపదల్, యేపానగూర్చు సుంద
రముకే తనుమూలము గానిపించు నీ, వేపగిదిన్
ఘటింతు వవిరొయించఁగ శ్రీ... 204

ఉ. అర్థము నిన్ను వేఁడుమని యాడెడుభక్తులపల్కు
లన్నియున్, వ్యర్థముగాఁగనంబడు నవశ్యము నర్థ
ము లోకమందు వేఁ, డర్థులకిచ్చిన న్ఘనతనార్యుల
కిచ్చినమేలు నివ్విధిన్, సార్థకమైనదాని ఘనసత్య
మెఱుంగక వేఁడుమన్న నే, యర్థమొసంగి బ్రోచెద
వో యందఱ శ్రీ... 205

ఉ. కూటికి నేదికర్త సమకూర్చను లోకమురక్షనేయ
నా,మాటకుమాటజెప్పు నిజమా గడుదబ్బర
నాడువాక్యముల్, కోటిధనంబుగల్గునరు గొప్పఁ
గఁ జూతురు సర్వదేవతల్, మాటలకేల నీవె
యని మానుగ శ్రీ... 206

ఉ. కాంచనరూపమై ధరణిఁ గానఁగవత్తువు నన్ని నిత్తు
వుర్, యెంచఁగ నేల నీమహిమ లెక్కువ వేఱొక
టున్న దే ధరర్, వంచనలేల నింకఁ గడువాసిగ
నాకు ధనంబొసంగు మే, లంచితమొప్పఁ జేయు
పరమార్థము శ్రీ... 207

ఉ. ఆడితి నేననేకములు నంబుజనాభ దయాబ్ధివంచు
నే, వేఁడితి బాడబానలము వేఁడిమితో సరిబోలు
కాలునిర్, జూడఁగనోడి నిన్ను వడిఁ జూప జగ
న్నుత యాశ్రయించితి, న్గూడఁగవచ్చి నాభయ
ము గూల్పర శ్రీ... 208

శా. నాఁడేనమ్మితి నిన్ను నింతదడవా నన్బ్రోవ సీతా
పతీ,కూడా రావదియేమి భూరిగుణ నీకు న్ధర్మమా
పీడ నా, కేడంజూచినలేఁడుబ్రోవనొకఁడు న్నిండీ
వరాతో పరుల్, జోడా నీకు సమస్తలోకముల
లో జూడంగ నీవే హరి. 209

ఉ. లోకములోనఁ గొందఱబలుల్ నినుగానఁగ నేరక
న్మహా, వ్యాకులవీచుల న్గల భవార్ణవమందు ము
నుంగుచు న్వెసర్, ప్రాకృతకర్మబంధములపాల్ప
డి చచ్చుచుఁ బుట్టుచుంటయే, గాక వికుంఠమం
దిరము గల్గునె నీపదభక్తిలేని చీ, కాకుల కా
యమాలయము గల్గక శ్రీ... 210

ఉ. వందనమయ్య్య రామ ఖగవాహన దైవలలామ
భక్తహృ, న్మందిరపూర్ణకామ సుకుమార దినే
శకులాబ్ధిసోమ యా, నందవిలాసధామ నృపనం
దన పండితసార్వభౌమ నా, డెందమునందు
గోర్కి వడిఁ దీర్పర శ్రీ... 211

ఉ. దాకొని రావణాసురుని దారుణపాతకదుర్విలా
సునిన్, నాకనివాసులందఱకు నాజి నశక్యుని
దుష్టముఖ్యునిన్, దేఁకువమీఱఁ ద్రుంచి రణ
ధీరతమించను నీకెగాక యీ, లోకములోన దేవ
పతిలోకములోఁ గలరే రఘూత్తమా, నీకొక
సాటి గూర్చుటకు నిత్యుఁడ శ్రీ... 212

చ. పరువడి తర్కవాదమను పారకొన స్వరతత్వ
ధారుణిన్,సరళిగఁద్రవ్వి కన్గొనఁగఁజాలని రామ
నిధాన మిప్పుడున్, గురుతగు భక్తినబ్బె భళి
గూడెను ముక్తిలలామపొందు నా, కరమరలేల
యింక వరదాయక శ్రీ... 213

ఉ. ఏమితపంబుఁ జేసెనొకొ యెట్టిసుకర్మము లాచ
రించెనో, కోమలయైనకుబ్జ నవకోమలరూపవిలా
సమబ్బ నీ, ప్రేమకుఁజాలి లోకములఁ బేరుగనన్
రవివంశవర్ధనా, సామజసన్నుతా తెలియఁజాలను
శ్రీ... 214

చ. సురుచిరమైన నీచరణశోభన శంఖహలాదిరేఖ
లుఁ, బరువడి చిహ్నలై పరగు భాగ్యము
మస్తకరాజినొప్పి వెం, పరుదు ఘటించు కాళియ
ఫణావళి పుణ్యము లేమిజేసెనో, తరమె గణింప
నాఫలము ధాతకు శ్రీ... 215

ఉ. దారుణకంటకవ్రజము దట్టపుమెట్టలు చిట్టిరా
లునుఁ, గ్రూరములైనజంతువులు కేళియొనర్చె
డుకానలోన నీ, చారుతరాంఘ్రి యుగ్మములు
జక్కఁగను న్నటియించుభాగ్యముఁ, భూరిగు
ణాఢ్య యెంచగను బోలునె శ్రీ... 216

ఉ. కేలను బర్వతంబుగొని కేళియొనర్చుచు ఱాల
వృష్టి వెం, జాలము మారుతప్రభ విశాలము
లీలయుఁ దాఁకకుండ గో, పాలుర గోపికామణుల
బాలుర గోవుల గోపవృద్ధుల, న్నేలి శచీపతిఁ
జగము నిందయొనర్పఁగఁ జేసినట్టి నీ, లీలలనెంచ
నాతరమె లేశము శ్రీ... 217

ఉ. పాలును వెన్న లెల్లఁ గడుపారఁగఁ గ్రోలి వ్రజాం
గనామణీ, జాలముతో రతీరమణసంగరమందు
మహావినోదలీ, లాలసదృగ్విలాసఘనలాలితలో
లుఁడవై చెలంగు గో, పాల భజింపఁజాల నిను
భవ్యుఁడ శ్రీ... 218

ఉ. నాఁడు యశోదయొద్ద వ్రజనారులు నీసుతుఁడె
ల్లదొంగ పూ, బోఁడి మరల్ప వేమియని బోటులు
సూటిగఁ బల్క నప్పుడా, జాడ రొఱింగి తల్లి
చెయిఁజూచి నిను దనుబట్టికొట్టఁబోఁ, జూడఁగ
భీతినొంది క్రియఁ జూచుచుఁ గొట్టకుమంచు నన్ను
నీ, జాడయుఁగాన రే సతులు జాణలు శ్రీ...219

చ. చెలివని పాండవేయులు నిజేశుఁడవంచును గోపి
కామణుల్, బలియుఁడవంచుఁ గౌరవులు బాలుఁ
డవంచును నందభార్యలుఁ, వలచితిమంచు గోపి
కలు వల్లభుఁడంచును రాధికాదులుఁ, దలఁచిరి
గాని యిందిరకు దాచినచుట్టమవై జగంబులుఁ,
గలుగఁగఁజేయుదైవమని గాంచిరె శ్రీ... 220

చ. అతిబలవంతుఁడైన వినతాత్మజునెక్కి సమస్తలో
కముల్, చతురతచే మహామహిమ జాలముచేఁ
బెనుమాయబెంపుచే, నితరములేక యేలునిను
నేర్తురె సన్నుతిసేయ శ్రీసతీ, పతి పరమాత్మ
భవ్యగుణభాసుర శ్రీ... 221

చ. సిరికిఁ దొలంగి కారడవి సీతనుగూడి చరించుటెల్ల
నీ, ధరణి విలాసమొప్పనెకదా సరసీరుహానాభ
నీమహోత్కరకమనీయశక్తి బలుకం దరమా

ఫణిరాజుపైన మా,వర ననుఁగావరా ధరకృపా
వర శ్రీ... 222

చ. నలినదళాక్షులంత యమునానదిలో జలకంబులాడనై, వలువల నొడ్డుపైనిడిన వానిని జోరతఁగొంచు నేఁగుట, ల్లలనలయందు సత్కృపవిలాసము వెల్లడిసేయ ధాత్రి నీ, చెలిమి నుతింప నెవ్వరికిఁ జెల్లును శ్రీ... 223

మ. కలరా దాతలు నీకు సాటిబలుకం గంజాక్షీ పాంచాలికి, న్వలువల్విప్పఁదొడంగ భీతిపడి రావయ్యా జగన్నాథ యీ, పలుగాకుల్ యిటుచేసి రంచుఁ బలుక న్బాటించి రక్షించవే, వలువల్ జాలయొసంగి ప్రేమఘనముల్ వర్ధిల్ల శ్రీవల్లభా.

శా. రారా నీలఘనాఘనాంగరుచిరా రారా కృపాసాగరా, రారా క్షీరపయోధిశేషశయనా రారా రమావల్లభా, రారా నాకు వరంబులీయ వదియేరా యంచు నే వేఁడితే, భారంబా యిదినీకు నెంతపని నాభాగ్యంబు శ్రీవల్లభా. 225

చ. కడువడి సైకతంబున నికాసమెలర్పఁగ దొర్లి దొర్లితా, నుడుతయు వార్ధికట్టపయి నొప్పుగఁ జల్లినదానివల్ల నే, పడరినవార్ధి కట్టువడె నాపని మెచ్చుటలెల్ల నీకు నీ, పుడమిని భక్తవత్సలతఁ

బోల్పు జెలంగనుగాదె గావునన్, దడయక నన్ను
బ్రోచుటలు దల్చర శ్రీ... 226

శా. సీతావల్లభ రామదాశరథి యక్షీణప్రభావోద
యా, భూతాత్మా కమలాలయాప్రియ మహా
పుణ్యాత్మ విద్వన్నుతా, దాతా రాఁగదవే విధా
తృజనకా దామోదరా మాధవా, చేతోమో
దమెసంగ నన్ను కరుణం జేపట్ట నోమావరా. 227

ఉ. మానితమైన నీదుసుకుమారము మాయలతా
వితానముం, గానఁగఁజాలినట్టి మునిగాని భవా
బ్జభవాదు లైననుం, గానినభంగి నిన్నుఁ బొడఁ
గానఁగ వేఱొకమార్గమున్న దే, యీ నను నేలఁ
గాదనకు మీశ్వర శ్రీ... 228

ఉ. అంచను నెక్కియాడుకమలాననుఁ డాత్మభవద్వి
లాసమున్, నెంచఁగనేరక న్భ్రమసి యేదిఁక నే
దో యెఱుంగలేక రా, యంచపయి న్నభంబున
విహారముజేసెనుగాని మాయచే, మించిన నీమ
హామహిమ మేలుగనంగను జాలెనయ్య నే, నెం
చఁగ నెంతవాఁడ దయనేలర శ్రీ... 229

చ. నిరతము షడ్వికారములు నిర్మలమామకమాన
సంబనే, తరువున నాశ్రయించి నిజధర్మముచేఁ
బెనుపొందనీక తా, మురువడి దానిఁబట్టుకొని

యూపుచు నేపుచునుండు నిత్యముఁ, గురుతుం
తెలుంగనీవు నినుగోరి భజింపఁగనీయ వింకనే,
వరవున వానిగెల్తు మునివందిత శ్రీ... 230

చ. వరద జగత్త్రయంబులును వర్ణనసేయఁగఁదెచ్చె
నీశరం, బరుదగు వీచికానిచయ మభ్రపదంబున
నంటి నాదవి, స్ఫురితమహోగ్రతీవ్రము నభో
మణిమండల మాక్రమించు భా, సురజలరాశి
నెల్లఁ గడుచోద్యపురూపునిఁజేసి దానిభీ, కరము
నుతింప నేరికిని గాదుర శ్రీ... 231

ఉ. వారిధి గట్టుఁ గట్టఁ గపివల్లభుసేనలు లంకముట్టె
దు, ర్వారపరాక్రమస్ఫురణరంజిల దాని నతిక్ర
మింపరే, వారి సబాంధవంబుగను బట్టి శిరం
బులుగొట్టె కీర్తిచెం, పార ధరిత్రినించుటకు నా
రయ నీకగుఁగాక నెవ్వరీ, ధారుణి శక్తులై దనరు
ధన్యులు శ్రీ... 232

చ. అరయఁగ నీవు విక్రమకళానిధివై ఖరదూషణా
దులఁ, దురమునఁ దాటకం దునుమ ధూర్జటివి
ల్లెగఁద్రుంప జానకిఁ, బరిణయమొంద లోక
ములు పావనమందఁగఁజేయనేకదా, వరద వికుం
ఠముఁ విడిచి వచ్చుట శ్రీ... 233

ఉ. వాసిగ నీకు భద్రగిరివాసము భూసుత భార్య
తమ్ముఁడే, దాసుఁడు గౌతమీనది నిధానము
నిత్యము భక్తవర్యులుఁ, దాసినచుట్టముల్ గలిగి
దానగుణంబులఁ బెంపునొందు నీ, భాసురనామ
కీర్తనలు భాగ్యముగా దె వచించువారికిఁ, నీసరి
నీకు సాటిగను నెన్నఁగ శ్రీ... 234

శా. నన్నా కన్నడనేయ రాజసముకుఁ నానాయనా
మేలు నీ, కున్న న్భక్తులలోన నేనొకఁడనా యు
ర్విఁ దురాత్ముండనా, పన్నా నేకశరణ్య నీకుఁదగ
వా ప్రారబ్ధమా వోయినా, యన్నా దీనతమాన్ని
బ్రోవదగవే హో దేవరా మావరా. 235

ఉ. కాదుర యింతనిర్దయకుఁ గాలము భక్తులకెల్ల
నియ్యఁగా, రాదుర నీగృహంబున విరాజితమై
పెనుపొందు శ్రీసతీ, లేదుర నిన్ను బాయకనె
రేబగలుఁ విహరించుఁగాని తాఁ, బోదుర దూర
దేశమును బ్రోవర శ్రీ... 236

ఉ. ఈతఁడు పాపుడంచు జను లెన్నఁగ నారడిగొంచు
నీమహా, ఖ్యాతిఁ దలంచి నీచరణకంజము కంజలి
యొగ్గి నామహా, పాతకముల్ హరించుమని ప్రార్థ
నఁజేసితి నీజగంబులో, దాతవు నన్ను నేలఁ దగ
దాయెనె శ్రీ... 237

చ. కలవు మహాద్భుతంబు లవి కాంచనచేల భవద్వి
లాసముల్, జలరుహాగర్భుఁడైన నుతిసల్పఁగఁజా
లునె మానవాధముల్, తెలియఁగనేర్తురే మహి
మ దివ్యమునీంద్రులు కొంతకొంతయుం, బలు
కుదురయ్యె భక్తి బెనుపై మది శ్రీ... 238

ఉ. కర్మఫలంబులబ్బుతుద గాచుట లేమిఘనంబు ధా
త్రిలో, నిర్మలుఁడైనభాస్కరుఁడు నిత్యముగ్రుం
కెడు మేరదప్పకన్, కర్మము ద్రుంచి మేలిడినఁ
గాదె ఘనంబు ధనంబు గీర్తియున్, ధర్మమునీకు
నీవిధము దప్పకు శ్రీ... 239

ఉ. నాతిని రావణాసురుఁ డనాథను జేసియుఁ గొం
చుఁబోవ నీ, చేతను గాకపోయెఁగద చేసినకర్మ
ము లెల్లఁద్రుంచు నా, సీతపతివ్రతామహిమ చేఁ
గడుభంగములేకవచ్చె నీ, ఖ్యాతికి నేమి కారణ
ము కర్మముమూలము నీకు మిక్కిలా, నేతగ
నిన్ను వేఁడ ఘనమేమిర శ్రీ... 240

ఉ. కర్మము మేలుకీళ్లకును గారణమై జెలువందునీకు
నే, కర్మములేదు లోకములఁ గాల్చ నృసింహ
హారించు శంభుఁడున్, నిర్మలమైనసంపదలు నీసతి
యిచ్చును బల్కువాణి ని, మ్మర్మఁడ వేమియిచ్చె
దవు గల్గఁగ శ్రీ... 241

ఉ. హారము లేదు యెన్నఁడు విహారము లేదని చెప్ప నే
ల యా, కారమె లేదు సంజనన కారణకర్మ మెఱుంగ
వెన్నఁడున్, శూరత లేదు సుస్థిరతచొప్పు గనం
బడ లేదు యింక నే, భారము లేక వెల్గెదవు భాసు
రతేజ మహాబ్ధిలోపలన్, భూరివిలాససంపదలఁ
బొల్పుగ శ్రీ... 242

ఉ. బంగరుచేలగట్టి వ్రజభామలచెట్టలువట్టి వేడ్క
మీరా, అంగఁ గురంగభృంగమణిరంగతరంగసరో
వరాళిమా, తంగవిహంగసంవృతము దావహా
పుష్పవనంబులందు నీ, రంగుజెలంగఁ గ్రీడలను
రంజిలు యాదవరాజసింహ శ్రీరంగపురీశ నన్నుఁ
గన రాఁగదె శ్రీ... 243

ఉ. రాఁగదె భక్తపెన్నిధి నిరాదరణంబిఁక యేల నా
కును, న్నీఁగదె భోగిరాట్ఛయన యొక్కువయైన
భవత్కటాక్షమున్, సాగినమస్కరింతు మదిసన్ను
తులెల్ల ఘటింతు నెంతు నీ, యోగము భోగరా
గముల యొప్పును శ్రీ... 244

ఉ. తప్పకు సత్యవాక్యము విఘాతనుగన్న ఘనాఘు
నాంగ నీ, కొప్పునె తప్పుబల్కుటలు నుర్విని పా
పులఁ బ్రోతునంచు ము, న్నొప్పినకీర్తిఁ బోవిడువ

నొప్పునె యెప్పటికైనఁ జెప్పు నా, తప్పుల నెన్నఁ
గాఁదగునె దాతవు శ్రీ... 245

ఉ. కారులు బల్కినాఁడ నని కాదుర కోపము నీకు
నెయ్యెడన్, గారులుగావు నీకరుణగన్న కుమా
రుఁడ యొట్లు బల్కిన, న్నేరము లేదు భక్తజన
నీరధి దాశరథీ కృపానిధీ, వేఁడుగఁ జేయబోకు
కడు వెట్టిని శ్రీ... 246

చ. పలుకవు యేమి పాపమిది పంతము సేయుట కెంత
వాఁడ నీ, పలుకువినంగ భ్రాంతివలపక్షము భక్తు
లలోనఁ గాఁడునా, పలుకవు తొల్లి ద్రౌపదికి
వారణరాజముకు న్గుచేలుకు, న్బలుకలిఁ కేల వేగ
పలుకాడర శ్రీ... 247

ఉ. పాపముగాదె నన్ను వలపక్షము సేయుట భక్తకో
టిలో, యోపరమాత్మ నీకు శరణో యని వేఁడినఁ
జూడవేమి యీ, కోపము కేమి కారణము కూటి
కైకా నిను నింత వేఁడ నా, లోపము లెన్నఁబోకు
మదిలోపల శ్రీ... 248

ఉ. పుట్టినవారలందఱును బొట్టకెకా నినువేఁడ
ధాత్రిలోఁ, బుట్టఁగనేల పుట్టి మఱి బూడిదెపా
లుగఁగాఁగనేల యే, పట్టునబుట్ట లేననుచుఁ బట్టితి
నీపదపంకజాతముల్, బొట్టకుఁ బెట్టి యీపయిని

పుట్టుకమానిపి నన్నుఁజేర్చు నీ, పట్టిని నన్ను నే
మరక పట్టర శ్రీ... 249

ఉ. చాలుర జాలమింక వికచాబ్జదళాక్ష సుభక్తరక్ష
నీ, పాలనుబడ్డనన్ను బరిపాలనసేయు మహావి
నోద లీ,లాలసదృగ్విలాస ఘనలాలితభాస రమా
విలాస గో, పాల సునందబాల ఘనపండిత శ్రీ...

శా. శౌరి న్దల్చెద నామది న్ముదముతో సత్కార్యయుక్తుం
డనై, గౌరీసన్నుత పాదపద్మయుగళు న్నాళీయద
ర్పఘ్నునిన్, సాచారుని నీరదాభుని జగత్సం
సేవ్యమానున్ రమా, నారీ హారిగుణాకరున్
శుభకరు న్నారాయణున్ శ్రీవరున్. 251

మ. తలఁతు న్గోపకుమారు పాదజలజాతంబు న్మహాభ
క్తిస,మ్మిళితానందమనోవిలాసరతిచే మేలందగాఁ
గోరుచున్, వలపుల్ రెట్టిగొనంగ వాంఛలు
మహావర్గంబులై యొప్ప ము, ద్దోలుకన్ సర్వసు
ఖంబు లబ్బుననుచు న్నాప్పొప్ప శ్రీవల్లభా. 252

ఉ. ఓరిరమేశ యోవరద యోరిజనార్దన యోము
కుంద యో, హారి మురారి చక్రధర యోఖ
గవాహన యోపరాత్పరా, యోరి మహాత్మ
యోశుభగ యోరి నను న్గ్రపజూచి యేలుమీ,
కారుణికాత్మ మేల్దయవికాసను శ్రీ... 253

ఉ. ఆలను గాచి గోపకులయార్తి హరింప ననేకరూ
పులై, కీలలనొప్పువహ్నియును గీల్గొన గీటెడు
పామునుఁ దయా, శాలివి గాచితీవనుచు శాస్త్ర
ములుం దగఁబల్కుచుండె నీ, పాలుర గోపబాల
నను వాసిగనేలర గానలోల నేఁజాలర నిన్ను
వేఁడ పస జాలదు శ్రీ... 254

ఉ. కారణకర్తవై నిజము గానఁగనీక వికారదూర
సం, చారవిలాసమాయఘనసారముచే జగమెల్ల
గప్పుచుఁ, పారము ముట్టనీక యతిపామరవ
ల్లులఁ జుట్టనేల నా,కోరికలియ్యఁగాఁదగు వికుం
ఠుఁడ శ్రీ... 255

ఉ. కామినిలేనిసంపదలుకంఠవిహీనసుగానవిద్యలుఁ,
దామరలేనిమేల్కొలను దాతలులేని పురంబు
నీపయిఁ, బ్రేమయులేనిపూజలును బెంపిలకె
క్కవు వానలేనియా, భూమిని వల్లులన్బలె నభో
మణివంశజ శ్రీ... 256

ఉ. అందములొప్పు నీపదములందు జనించినగంగ
యీజగ,ద్వందితయయ్యె నాభిఘనవారిజసంభవుఁ
డీజగంబులఁ, బొందుగఁజేయనేర్చె నినుబోలె
డు దైవములేఁడు చూడ నా, యందుఁ బరాకు
నీకగునె యారయ శ్రీ... 257

చ. వనితను బొందుయౌవనము వానలుగల్గిన సస్య
సంతతుల్, నినుఁగొనియాడుకావ్యములు నిర్మ
లభక్తిని నిచ్చుదానముల్, ఘనములుగానియా
విధము గానివి యేలగు మెచ్చుపద్మలో,చన విను
నీదయారసముసాటికి నెవ్వియు దూఁగు ధాత్రి
లో, ఘనగుణ నీమహోదయను గావర శ్రీ...

ఉ. కాలముచేర నంతట వికారములుం గడుబాధ
సల్పఁ బెం, జాలినిధాటినిం గడువఁజాలక యే
డ్చుచుఁ బ్రాణభీతిచే, లాలిత నిన్నునుం దలఁప
లక్ష్యముజాలునో జాలదో మదిం, బోలఁగ
నాఁటివంతుకిదె బొల్పుగ నిన్భజియింతుఁ గావవే,
పాలసుఁడ న్గృపారసము భాసిల శ్రీ... 259

ఉ. తప్పదు నీప్రతిజ్ఞ కడుదారుణపాపలతావితాన
ముల్, గప్పకు గొప్పగాదు ననుఁ గాచుటకంటె
సమస్తధర్మముల్, తప్పక నీపదాంబుజసుధారస
ధారలు గ్రోలునన్నునుం, దిప్పలఁ బెట్టనేల జగ
దీశ్వర శ్రీ... 260

ఉ. భారమె శ్రీసతీహృదయపంకజపంజరరామచిల్క
నే, గోరిన విచ్చి బ్రోచుట వికుంఠపురంబునకేఁ
గుత్రోవయుం, దూరమె నీపదాబ్జమును దోసిలి

యొగ్గి భజించువారి కా, ధారమె యాపురంబు
వరదాయక శ్రీ... 261

ఉ. కాయ మపాయమయ్యె నినుఁ గన్గొన నేరుపుజాల
దయ్యె యో, నాయన రాఁగదయ్యె రఘునందన
దాసుఁడ గానటయ్యె నీ, మాయలు నాయెడం
దగదు మానఁగదయ్యె ననాథనయ్యె నన్, బాయ
కుమయ్యె భక్తజనపాలక శ్రీ... 262

ఉ. మోహినివై జగంబులను మోహమునొందఁగఁ
జేయు నాడునీ, దేహవిలాసము న్గనియు ధీరుఁ
డు మేశుఁడు మోహితుఁడై మహా, సాహస మొప్పఁ
గ్రీడలను సల్పఁగఁ గోరిన వానిగూడు నీ, మో
హము కేమనందు నతిమూఢుఁడ శ్రీ... 263

ఉ. మానినివై ననాఁడు నిను మానుగఁ గన్గొని
మోహబద్ధులై, దానవులందఱు న్నమృతధారలు
వీడి వివేకశూన్యులై, దీనత లేర్పడ న్మదిని ధీర
తలు న్వీడిరింతెకాని నీ, మానితమాయఁ గన్గొన
సమర్థులె శ్రీ... 264

ఉ. పట్టితి నీపదాబ్జములు భానుకులేశ్వర నీదునామ
ముఁ, గట్టితి నోట భానుజుని గాఢపరాక్రమ
నాగవైరి ని, న్గట్టితి మోక్షకాంత మెడమానుగ

గట్టితి తాళిబొట్టు నా, పుట్టువు సార్థకంబొదవె
పుణ్యుఁడ శ్రీ... 265

ఉ. ఎట్టిది నీమహామహిమ లెవ్వరు గానఁగ నేర్చు
వారు నీ,పుట్టువు మట్టుపట్టు కడుపోకలు రాకలు
చిద్విలాసముల్, యిట్టివియంచునన్బలుక నీశుఁ
డు కంజభవుండు శేషుఁడు, న్నెట్టనఁ జాలువారె
కడునేర్పుగ శ్రీ... 266

చ. రజతగిరీశుఁడు న్నుతులు రంజిలఁజేసె విరించి
చేసెనీ, నిజసతిచేసె భారతియు నింద్రుఁడు మేనక
గూర్మిపుత్రియున్, సుజనులు వేదముల్ నదులు
సూర్యుఁడు చంద్రుఁడు లోనుగా మునివ్రజ
ములుజేసి రెవ్వరును వాసిగఁ గాంచిరె నీమ
హత్త్వవా, రిజదళనేత్ర నేను గనురీతిరొ శ్రీ...

ఉ. పాలసుఁడ న్మహాజడుఁడ పామరుఁడ న్నిగమార్థ
దూరుఁడన్, లాలితమైననీమహిమ లక్ష్యము నా
కెటులబ్బు నీమదిన్, జాలిని పుత్రుడంచు దయఁ
జాలఁగ బ్రోచుటకంటె వేఱె నే, జాలఁగ నిన్ను
బూజలిడఁజాలర శ్రీ... 268

చ. కరిపయి నెక్కువాఁడు పురి క్రంతలఁజొచ్చినరీతి
గాదె నీ, చరణసరోజయుగ్మములు సన్నుతిఁజేసిన
వారు కూటికై, నరులను వేఁడఁబోవుట దినా

ధిపవంశజ నీకు మెచ్చులా, మఱువక బ్రోవు నన్ను
గృపమానక శ్రీ.. 269

చ. తురగము నెక్కి కారడవి దూరఁగవచ్చు గుహాం
తరంబులన్, ఉరుగఁగవచ్చు వారినిధి దీటుగ
దాఁటఁగవచ్చుగాని నీ, పరమరహస్యమే వెలుఁగు
ప్రాభవము న్గన నెవ్వఁడోపు శ్రీ, కర కమలావు
నోహరజగన్నుత శ్రీ... 270

ఉ. ధాత లిఖించినట్టిలిపి తప్పక గొప్పగ నొప్పఁజేయ
నీ, చేతనుగాదొ విశ్వమయ సేవకుఁ బ్రోవకయుం
ట నీకు వి, ఖ్యాతియొ మాయొ నేర్పొ యిదిగా
నను దెల్పర నాగతల్ప నీ, కాతఁడు గూర్మిపుత్త్రుఁ
డెకదా యది దృప్పర శ్రీ... 271

ఉ. కాశి గయా ప్రయాగములు గానఁగవచ్చు సమ
స్తవిద్యల, భ్యాసము జేసి మూల్యము లపారము
గా గణియింపవచ్చు నీ, కోసము భక్తిజేసి మదిఁ
గోరికదీరఁగ నిన్నుఁ గానఁగా, వాసియు లేదు
దీనజనవత్సల శ్రీ... 272

శా. ఏమోకాని మొఱాలకించ విదియు న్నేమోయి
శ్రీనాయకా, కామారిస్తవపాదపద్మయుగళా
కంసారి భక్తప్రియా, నామాటల్ చెవిసోఁకవా

రయెను గదా నా నేరముల్ యేమొకో,సామీ దె
ల్పియు బ్రోవఁగాఁ దగు జగత్సంసేవ్యపానో
దయా. 273

మ. కలలోఁ దోఁచినయర్థముల్ నిజములే కాయంబ
నాపాయమే, తెలియంజాలనిమానవుల్ తమకుఁ
బుత్రు ల్గామిను ల్బంధువుల్, కలుముల్ నిత్య
మటంచుఁ బొంగెదరు నీకల్యాణచారిత్రముల్,
బలుకన్నేరనివారి కేమిగతి సర్వాత్మా! దయం
దెల్పరా. 274

ఉ. పుత్రులు లేనివారలకుఁ బుణ్యగతు ల్పడయం
గలేదన, న్పుత్రులులేని శ్రీశుకులు పుణ్యగతు
ల్బడయంగఁ జాలఁడా, చిత్రము నీచరిత్రములు
చెప్పఁగ నెవ్వఁడు నేర్చు నీదయే,పుత్రులు పౌత్రు
లుఁ ధనము పుణ్యము శ్రీ... 275

చ. వ్రతములు చేతుమంచు నుపవాసము లుండెద
రింతెకాని మేల్, వ్రతములలోన సువ్రతము
వాసిగ నీపదపంకజాతముఁ,జతురతఁ బూజసల్పి
నను సాటియె దానికి నే వ్రతంబులుఁ, మతిఁ
దలపోయ రీమనుజమండలి శ్రీ... 276

చ. సనకసనందనాదిమునిసత్తములెల్ల మహాత్మునొం
దదుటల్, దనరఁగ నీపదాంబుజసుధారసధారల

మేలు గ్రోలెకా, జననము సార్థకంబొదువ జక్కఁ
గఁజేయుట పాతిగాదె యీ, జనులకుఁ దెల్పితే
మిఁ నిను సయ్యనఁజేరను భక్తికంటె వే, ఉనునో
కటున్నదే దెలుపవే యిఁక శ్రీ... 277

ఉ. వేదములందు శాస్త్రముల విప్రులహృత్సరసీరు
హంబులఁ, నాదముల స్వరయోనిధుల నద్రుల
స్థావరజంగమంబుల, న్వాదుకయుండి లోకము
లు పాలనఁజేసెడునిన్నుఁగాన దా, మోదర యొ
క్కచోట కడుమోదముతో వెదుకంగనేల నీ,
పాదముల న్భజింతు వడిఁ బల్కర శ్రీ... 278

మ. కడుఁబెంపారఁ గురుక్షితీశ్వరుసభ న్గంగాసుతుం
డాదివా, రెడలేక న్గనుచుండ విశ్వమయమై యిం
పొందురూపంబుతోఁ, బొడవుంజూపవె కోపవే
గమున నీభూరిప్రతాపంబు నే, నుడువంజాలు
దు నే మహాపురుషదీను న్నన్నురక్షింపవే...279

ఉ. భద్రము నీకటంచు దయ భాసిల మారుతసూతి
చేతికిఁ, ముద్రిక నిచ్చునంతట సముద్రము దాఁ
టఁగ నేమివింత సౌ, భద్రుఁడు ఘోరసంగరవిప
ద్దశనొందియు నీల్గ వింతకే, యద్రిజసన్నుతా క
రుణ హానియొనర్చినవానిపట్ల నీ, ముద్రికకర్త
రెంటికిని ముఖ్యుఁడ శ్రీ... 280

చ. ఒకఁడు దరిద్రుఁడు న్మతియు నొక్కఁడు భాగ్య
మహోదయుండు న, న్నికగలఁడేధరిత్రి పరమే
శ్వరనీకరుణాకటాక్షముఁ, నొకఁడొలఁద్రైన నవ్వి
ధము లొప్పును ద్రిప్పును మాయగప్పునుఁ,
సకలము నీవిలాసము లెసల్పును శ్రీ... 281

శా. ఆపస్తంబుఁడ మంత్రిశేఖరుఁడ గంగానాథునా
మంబుచే, భూపాలుం డననొప్పి యీశతకము
న్బెంపొందగాఁజేసి నా, ప్రాపైనట్టి ధరాసుతా
పతికి నింపారంగ నర్పించి నా, పాపంబుల్ హరి
యించి బ్రోచుటకుగోపాలారమానాయకా.282

శా. నిత్యానంద నిరామయా నిరుపమా నీరేజపత్రే
క్షణా, సత్యప్రాభవ దేవకీతనయ సంసారాంధ
కంజాప్త నీ, ప్రత్యుల్లాసవిలాసభాసురముఖాబ్జం
బెప్పుడు న్గాంతునో,యత్యాసక్తిజెలంగఁ జూపు
రవివంశాధీశ శ్రీవల్లభా. 283

ఉ. రాధిక నూనలోన దధిరజ్జునకవ్వమమర్చి త్రచ్చు
చో, మాధవ నీవు గ్రేపునిడి మానినిచన్గవఁ
జూచి భ్రాంతిచే, బోధనువీడి గోపపతి బొల్పుగ
బంధమమర్చి క్షీరముల్, సాధనమొప్పఁగాఁ
బితుకు జక్కనినీనిజమూర్తిఁజూచి యా, రాధ
యు రిత్తభాండమున రాల్పదె కవ్వము చాల
మోహియై శ్రీ... 284

ఉ. నీయధరామృతంబు కడునేర్పునగ్రోలెడు వేణు
వెంత తా, నేరొడజేసెనో తపము లెవ్వరురొం
తురు దానిమేలు నా, కాయము వ్యర్థమాయె
దగకట్టఘునంబునఁ బోలదాయెనో, నాయన యేల
వయ్య విడనాడకు శ్రీ... 285

ఉ. అప్పుడు సత్యభామ విరహానల మోర్వఁగలేక
క్రోధయై, నిప్పులురాలుకోపమున నీమహిమల్
గననేరక స్మదిన్, దప్పులెఱుంగకన్ శిరముదన్ని
నఁ బట్టవె దానిపాదము, న్నొప్పులనుప్ప నీచరిత
ము ల్వీని యెన్నదరంబె యేరికో, యప్ప గుణా
లనుప్ప దయ నారయ శ్రీ... 286

మ. జలజాతప్రభవాదులైన మదిలో జర్చింపఁగారా
ని నీ, బలవిభ్రాజితరూపశోభనకళల్ భావింప
నేనెంత నా, పలుకుల్ దబ్బరగాఁదలంపక దయన్
భావించి రక్షించు శ్రీ, లలనానాథ సనాథ మా
ధవ మహారాజా రమావల్లభా. 287

ఉ. మారునిఁ గన్నయట్టిసుకుమార మహారణశూర
ధీర నీ, పేరుదలంచుమాత్ర భవపీడలు బాఱవె
మేఘరాజి బె, న్మారుతవిక్రమంబున సమాగమ
మై వడి బాఱుకైవడిన్, దూరమునున్న వేఁడి
భుజదోర్బల శ్రీ... 288

ఉ. దండము నీకు భక్తఫలదాయక బాయకు లోక
నాయకా, ఖండితపాపసంఘ రిపుఖండనభండన
చండకాండకో, దండకళాప్రవీణ భుజతాండవ
భాస్కరవంశమండనా, దండిగ బ్రోవు నీకరుణఁ
దప్పకు శ్రీ... 289

మ. కరుణాసింధుఁడ కంసమర్దనుఁడ రంగత్తుంగవీచీ
పరం, పరసౌభాగ్యనభోధునీజనితసంపత్పాదకం
జాతుఁడా, నరకంఠీరవగాత్రుఁడా వరదుఁడా
నవ్యాంబుజాతేక్షుఁడా, శరణయ్యా ధరణీసు
తాపతి మహీశా రామచంద్రప్రభో. 290

శా. మాతా రాఘవ మత్పితా రఘుపతీ మద్భ్రాత
సీతాపతీ, నాతోఁ బల్కవదేమి యిట్లుదగునా నా
మీఁద నేకోపమా, ప్రాతఃకాలదివాకరప్రభలచే
భాసిల్లునీయంఘ్రికం, జాతంబుఁ భజియింపుచుంటి
దశవేషా బ్రోవుమా గ్రక్కునన్. 291

ఉ. కావ విదేమిరా పరమకారుణికోత్తమ దేవదేవ
నా, భావము నీపదాంబుజసుపంజరమందునఁజిక్కి
భక్తిసం, భావసమీరు నీభజనఁ బల్కుచునుండె
నిరంతరంబు న, న్నావుమటంచు మేలుపనిగాఁ
దగ శ్రీ... 292

ఉ. తానకథావ్యసనము స్మరుతుదప్పకఁ జేతు నిరంతరం
బు దే, వావలిసన్నుతాంఘ్రిఘనవారిజ వారిచ
రావతార రా, వా వరమియ్య దేవుఁడ వవారిత
సత్కృప భక్తకోటికిఁ, గావున నన్ను నిత్తఱిని
గావర శ్రీ... 293

ఉ. వారకనీదునామములు వర్ణనఁ జేసితి దీనికేమియ్యు,
న్నేరమ నీకు భారమ వినిర్మలచుట్టరికంబు కెల్ల
నుఁ, దూరమ పుత్రుఁడుఁ గరుణతోఁ గనుపించు
ముదంబుబెంచి నా, భారము నీకునుంచి నిరపా
యసుఖంబు లొసంగి బ్రోవు మో, తారకనామ
యివ్విధము దప్పకు శ్రీ... 294

ఉ. ఆరడి బెట్టనేల మునుపాడినమాట లబద్ధమేల
నా, భారము వీడనేల మును భక్తుల బ్రోచినరీ
క్కు వేది నా, నోరను నిన్నుఁ బిల్వఁ గడునొప్పు
గఁ బల్కకయున్న నీకునుం, జేరునె కీర్తి భూస్థ
లిని జిన్మయ శ్రీ... 295

ఉ. ఎంతని వేఁడుకొందు పరమేశ్వర నీముఖమైనఁ జూ
పక, న్నంతముగట్టిన ట్లునికి భావ్యమె భానుకుల
ప్రదీప నే, నెంతచలంబు కెంతపగ కెంతఘనంబు
న కెంతగాని నీ, చెంతను జేర్చి బ్రోవు నృపశేఖ
ర శ్రీ... 296

మ తరమా నాకు సురేంద్రవందిత భవత్సంకల్ప మే
రీతిదో, యరయ న్నాకనసేల బ్రహ్మావశమా యా
త్మార్థమా రూపమా, వరదా యెవ్వారెఱుంగ
నేర్పరులు సర్వాత్మా మహామాయచే, బరగు
న్నీమహనీయశక్తి మహిమ ల్భావింప శ్రీవల్లభా.

ఉ. పంకజనాభ సర్వసురపాలక శంకరసన్నుతాంఘ్రి
మిా, నాంకసహస్రసుందర శుభావహ భక్తజ
నానుకూల నీ, కింకరులందుఁగింకరుఁడఁ గీర్తికళా
కమనీయమూర్తి నా, వంకకు రాఁగదే శుభము
వర్థిల శ్రీ... 298

ఉ. కంజదళాక్ష ఘోరనరకాసురదాహ ఖగేంద్రవా
హ నీ, మంజులవాక్సుధారసము మామకకర్ణ
ములందుఁ జొన్పు నీ, రంజన బెంపు నాహృదయ
రాజితపంకజమందు నిల్పు నే, నంజలిఁ జేతు నీ
పదము లద్భుతవిక్రమశౌర్యశాలి నీ, రాంజన
మిత్తు నీకుఁ గడురంజన శ్రీ... 299

ఉ. దార నశించె నెన్కఁ దగ దాయలువృత్తిహరించి
రంత నా, గారము నొక్కవిప్రునదిగాఁ దెగనమ్మితి
మున్నె నావయ, స్సారముతగ్గెఁ జేరినది సారవిహీ
నపుచోటు నింక నా, కేరిమహాత్మ నీపయిని నెన్నఁ
గ శ్రీ... 300

ఉ. మంగళ మిందిరాహృదయ మంజులకంజమరంద
పానసా, రంగ ఘనాఘనోజ్జ్వలవిలాసశుభావహ
పూర్ణిమాంగ యు, త్తుంగ దయాంతరంగ సుర
తోషితపాదసరోజగంగ స, న్మంగళహారతుల్గొని
సమంచితసత్కృపం బ్రోవు వేగ శ్రీ, రంగపురీశ
భక్తజనరక్షక శ్రీరమణీమనోహరా. 301

# పీఠిక.

వేదాంత ప్రతిపాదితమగు నీభద్రాద్రి రామశతక ముసు పరశురామనృసింహదాసు రచించెను. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు. కోటీశ్వరసుబ్బమాంబలకుమారుఁడు. కవికాలము స్థలము నెఱుంగ శతకమునం దాధారములు లేవు. కవి కంభలూరి యప్పగురుని శిష్యుఁడు. ఈయనను గూర్చిన వివరములు తెలియవు గాన నించుమించుగ కవిజీవితము తెలియదనియె చెప్పవచ్చును.

శతకకవులచరిత్రమునం దీకవి భద్రాద్రిరామ శతకమునందు 101 పద్యములు వ్రాసెనని వ్రాయఁబడెను. పూర్వముద్రణమునందు 101 పద్యములు మాత్రముంటఁ జూచిశతకకవులచరిత్రకారు లటుల వ్రాసియుందురుగాని ప్రత్యంతరములను బరిశీలింప 108 పద్యములు లభించినవి. ప్రథమమున నీశతకము తప్పుల తడకగా అఱువదిసంవత్సరముల క్రిందట ముద్రితమయ్యెను. అందలిపాఠములు చాలవఱకు దుష్టముగా నుంటవలనఁ బ్రత్యంతరములతోఁ బోల్చి శుద్ధపాఠములు లుప్తపద్యములు చేర్చి శుద్ధ ప్రతిమిగుల శ్రమమీఁద సిద్ధపఱచితిమి. కవి కేవల వేదాంతవిషయమునకుఁ బ్రముఖత నొసంగెను. భాష వ్యాకరణనియమములు నంతగాఁ బాటింపలేదు.

సీతారామాంజనేయమునందుఁ బ్రదిపాదితమైన

యంశములనె యీకవి యట్టిశైలినే యనుకరించి చెప్పెను. ఛందోవ్యాకరణప్రతిబంధకములవలనను నూటయెనిమిదిపద్యములలో విషయమునంతయు నిముడ్పవలసివచ్చుటవలనను భావములుపద్యముల లోఁ గొన్నిచోటుల నంత విస్పష్టముగా లేవు. కొన్ని పద్యములలోనను ప్రాసముంటవలన విషయశూన్యముగా నున్నను జదువుటకు సరసముగా నున్నవి.

ప్రపంచోత్పత్తిమొదలుకొని నరప్రమాణము ధాతువులు చక్రములు పంచీకరణము నాడులలక్షణము ఉపదేశక్రమము యోగాదికములు లోనగు నంశములను దీసికొని కవి సుబోధకముగ సరసముగాఁ గొన్నిపద్యములను వ్రాసియున్నాఁడు. కొన్ని పద్యములయందు శ్రుతిప్రతిపాదితము లగువాక్యములు సవిమర్శవ్యాఖ్యారూపముగాఁ జర్చింపఁబడియున్నవి గాన నీశతకము వేదాంతవిషయజిజ్ఞాసువుల కవశ్యపఠనీయము.

కవి నూఱుసంవత్సరముల క్రిందట నుండియుండును. సీతారామాంజనేయము నూఱుసంవత్సరముల కావలిది గావునను శతకము అఱువదేండ్ల క్రిందఁ బ్రథమముద్రణ మగుటవలనను ఈనిర్ణయము సరియైనదనియె మాతలంపు.

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

నందిగామ.
1-6-26.

శ్రీ ర స్తు.

# శ్రీభద్రాద్రిరామశతకము.

→(౦)←

సీ. శ్రీగణాధీశుని సేవించి వినుతించి
భారతీనాథుని బ్రస్తుతించి
శ్రీపతిపాదముల్ చిత్తంబులోనుంచి
సాంబమూర్తిని సదా సంస్మరించి
వాసవాద్యఖిలదేవతలను బ్రార్థించి
సనకాదిమహానుల సన్నుతించి
గురుపదాంభోజముల్ గొనియాడి పూజించి
వేదాంతవేద్యుల విన్నవించి

తే. ఆంధ్రగీర్వాణకవుల నే నాశ్రయించి
చేయఁబూనితి శతకంబు చిత్తగించు
రమ్యగుణధామ భద్రాదిరామ సత్య
కామ కరుణాలలామ లోకాభిరామ. 1

సీ. శ్రీజానకీరామ సేవకసుత్రామ
రఘుకులాంబుధిసోమ యఘవిరామ

పతితపావననామ భవ్యపరంధామ
కరుణాలలామ సంగ్రామభీమ
వారివాహశ్యామ వరతులసీదామ
యమితవిక్రమ త్రిలోకాభిరామ
విజితభార్గవరామ వినతమానిస్తోమ
సంపూర్ణకామ సత్సార్వభౌమ
తే. భక్తమందార నగధీర భయవిదూర
దనుజసంహార విమలవేదాంతసార, ర...

సీ. వేదము ల్వివరించి విన నేర్చుకొనలేదు
శాస్త్రపురాణము ల్చదువలేదు
యాంధ్రగీర్వాణంబు లభ్యసింపఁగలేదు
వేదాంతమార్గము ల్వెదకలేదు
చూచి ఛందంబులు శోధింపఁగాలేదు
సాధుజనులపొందు సలుపలేదు
విలసదలంకారవిధము చూడఁగలేదు
కావ్యనాటకములు గానలేదు
తే. మీకటాక్షంబు నాయందు మిగులఁ గలుగఁ
జేయఁబూనితి నే నొకసీసశతము
తప్పులేకుండ దయఁజేసి ధరణియందు
గవిజనంబులు మెచ్చ విఖ్యాతిసేయు, ర...

సీ. నీలమేఘముతీరు నీశరీరంబును
బద్మరాగచ్ఛాయ పదయుగమ్ము
పన్నగేంద్రసమానబాహుదండంబులు
సింహమధ్యమును హసించునడుము
తిలపుష్పమునుబోలు తీరైన నాసిక
శ్రేష్ఠవిద్రుమసదృశోష్ఠములును
గమలంబులను మించు విమలనేత్రంబులు
పున్నమచంద్రునిబోలుమోము.
తే. మదనశతకోటి సుందరమైన చక్క
దనము వర్ణింప బ్రహ్మకుఁ దరముగాదు రమ్య... 4

సీ. కేశవ గోవింద కృష్ణ దామోదర
నారాయణాచ్యుతనారసింహ
మధుసూదన త్రివిక్రమజనార్దనముకుంద
వైకుంఠవామనవాసుదేవ
పుండరీకదళాక్ష పురుషోత్తమోపేంద్ర
పరమాత్మ పరమేశ పద్మనాభ
మాధవాధోక్షజ మధువైరి శ్రీహరి
విష్ణు విశ్వంభర విశ్వనాథ
తే. శ్రీధరానంతచిద్రూప శ్రీనివాస
పుణ్యచారిత్ర సురనుత పుణ్యపురుష ర, ... 5

సీ. నిత్యనిరాకార నిరుపద్రవాఖండ
నిర్మల నిర్గుణ నిష్కళంక
నిష్కర్మ నిష్క్రియా నిస్సంగ నిర్వంద్య
నిరుపమనీరంధ్ర నిర్వికల్ప
నిష్ప్రపంచావ్యయ నిర్ద్వంద్వ నిశ్శబ్ద
నిర్వచనానంద నిర్వికార
నిర్విశేషాచింత్య నిరతిశయానంద
స్వస్వరూపంబు నిస్సంశయముగ
తే. వారిజాసనకైలాసవాసవాస
వాదులకు నైన వర్ణింప నలవి యగునె ర, ...6

ప్రపంచోత్పత్తిలక్షణము.

సీ. ఆత్మయందు ననేకమాకాశ ముదయించె
నాకాశమున వాయు వపుడు పుట్టె
ననిలంబువలనను నగ్నిహోత్రము పుట్టె
నగ్నిహోత్రమువల్ల నప్పు పుట్టె
నప్పులవలన మహీవనీస్థలి పుట్టె
నవనియం దోషధు లమరఁ బుట్టె
నోషధులందున నొనర నన్నము పుట్టె
నన్నమందును నరు లాదిసకల
తే. జంతుజాలంబు లారయ నీజగతియుగము
లారయ నీరీతిఁ బరమాత్మ మాయవలన, ర...7

నరప్రమాణసూత్రము.

సీ. నరుఁడు తొంబదియాఱు నంగుళా లెనిమిది
జేనలపొడవునా జ్జేనవెళుపు
నిట్లు ముప్పదిమూఁడుకోట్లరోమంబులు
వెలయు డెబ్బదిరెండువేలనాళ్లు
నెముక లఱువదియాఱు నమరు తొంబదిరెండు
కీళ్లు ముప్పదిమూఁడు మూళ్లప్రేగు
నేరుగుండెలు నర్ధసేరును రుధిరంబు
మణువు నాలుగుసేర్లు మాంస ముండు
తే. సోలపైత్యంబు శ్లేష్మ మరసోలె డుండు
నీప్రకారంబు దేహంబు లెంచిచూడ, ర... 8

తొంబదియాఱుతత్త్వములు.

సీ. జ్ఞానేంద్రియము లైదు కర్మేంద్రియము లైదు
శబ్దాదు లైదు కోశంబు లైదు
కరణము ల్నాల్గు రాగాదు లెన్మిది పది
నాళ్లు వాయువులు పద్మాల్గు నేడు
ధాతువు లైదు భూతము లాఱు చక్రాలు
మలముల మూఁడవస్థలును నైదు
మూఁడుమండలములు మూఁడీషణంబులు
మూఁడువ్యాధులు గుణా ల్మూఁడు రెండు
తే. తనువులనుగూడి షణ్ణవీత్యాదితత్త్వ
సాక్షిరూపుఁడవై నావు సత్యముగను, ర... 9

### పంచభూతలక్షణము.

సీ. వసుధాజలం బగ్ని వాయు వాకాశంబు
లివి పంచభూతము ల్వీనియందు
రక్తశుభ్రాసితయుక్తధూమ్రసునీల
ములు గంధరసరూపములను స్పర్శ
శబ్దంబులును గ్రియాశక్తి జ్ఞానేచ్ఛాది
శక్తులు పరపరాశక్తు లమర
నాయజవిష్ణువు త్ర్యంబకేశ్వరసదా
శివులు నొండొంటికి స్థిరముగాను
తే. వర్ణగుణశక్తి బీజదేవతలు నుండు
నీకు నేగుణములు లేవు నిర్మలుఁడవు, ర...

### పంచభూతగుణములు.

సీ. రూఢిశబ్దస్పర్శరూపముల్ రసగంధ
ములు నైదు పృథివియం దమరియుండు
స్పర్శరసమురూపశబ్దము ల్నాల్గును
జనితమై జలమూరు చెలఁగియుండు
నగ్నిహోత్రమునందు నమరి రూపస్పర్శ
శబ్దము ల్మూఁడు నిశ్చయముగాను
వాయు వందస్పర్శవరశబ్దములు రెండు
నంబరం బందు శబ్దంబు నొకటి
తే. యొక్కటియు లేక దిక్కులు పిక్కటిలఁగ
వెలుఁగుచున్నావు లోపల వెలప లనక ర,

## పంచీకరణలక్షణము.

సీ. ఆకాశపంచక మంతరింద్రియములు
ప్రాణాదులును వాయుపంచకంబు
జ్ఞానేంద్రియములు వైశ్వానరపంచక
మప్పు పంచకము శబ్దాదు లైదు
కర్మేంద్రియము లైదు కడుభూమిపంచక
మిటు లిరువదియయిదింద్రియములు
యివి యాత్మ గాదని యిన్నిటి నెఱిఁగెడి
యొఱుకయే పరమాత్మ యని యెఱింగి
తే. సాంఖ్యయోగంబు సాధించి సజ్జనుండు
ముక్తిజెందును మీపాదభక్తితోను ర, ...12

## పంచభూతాంశము.

సీ. జ్ఞానసమానము ల్వీనులు శబ్దంబు
పానోవ్యమయంశము ల్వరుసనాయ
మనసువ్యానము చర్మమును స్పర్శకరములు
వాయుయంశంబులు వరుస నాయ
రూఢిబుద్ధియు దాన రూపాక్షిపాదము
ల్వహ్నియంశంబులు వరుస నాయ
చిత్తంబు ప్రాణంబు చిహ్వశిశ్నిరసంబు
వారియంశంబులు వరుస నాయ
తే. గంధహంకారము లపానఘ్రాణగుదము
లాయ భూయంశ లిట్లు నీమాయవలన ర, ...

## పంచభూతాంశగుణములు.

సీ. నరము లస్థులు చర్మనఖరోమమాంసము
లూర్వీగుణంబులు స్వేదమూత్రరక్త
ములు శుక్లశోణితంబులు వారిగుణములు
క్షుత్పిపాసాలస్యసుప్తిసంగ
ములు వహ్నిగుణములు చలనధావనకంప
నాకుంచనప్రసార్యాదికములు
పవమానగుణములు భయవికారంబులు
క్రోధలజ్జయు నభోగుణము లవియుఁ
తే. బంచభూతాంశగుణములఁ బాఱఁదోలి
నీస్వరూపంబు గనువాఁడు నిర్మలుండు ర,

## పంచకోశముల నిర్ణయము.

సీ. అన్నరసంబుతోనైన శోణితశుక్ల
మయమైన యాదేహ మన్నమయము
పంచప్రాణంబులు ప్రబలికర్మేంద్రియ
పంచకంబును గూడి ప్రాణమయము
జ్ఞానేంద్రియములై.దు మానసం బొక్కటి
కూడి రైనవిమనోకోశమయము
చెలఁగి జ్ఞానేంద్రియములు బుద్ధియునుగూడి
విజ్ఞానమయమున విద్యయందు
తే. మనసు కలసిన యానందమయము నిట్లు
పంచకోశంబులకు సాక్షిపరుఁడ వీవ ర,...

### పంచప్రాణములస్థాననిర్ణయము.

సీ. ప్రాణుండు హృదయాబ్జమందు నావాసమై
నాణిమస్వాసము ల్నడుపుచుండు
పాయుపస్థలయం దపానుండు మలమూత్ర
ముల విసర్జనఁ జేసి మెలగియుండు
నాభియందున సమానమునుండి సమముగా
నాళ్ల నన్నింటిని నడపుచుండు
ఘనుఁ డుదానుండును కంఠమందుననుండి
వైఖరిపలుకులు పలుకఁజేయు
తే. వ్యానపవనుండు దేహసర్వావయముల
నిండిశీతోష్ణస్పర్శల నెఱుకఁజేయు, ర... 16

### ఉపవాయువులలక్షణము.

సీ. నాగుండు నుద్గారణంబు సేయుచునుండు
మేలుగాఁ గూర్మఁ డున్మీలనంబు
జేయించుఁ గృకరుండు జేరి తుమ్మించును
జిత దేవదత్తుఁడు జృంభణంబు
మరణదేహములందు సరవి ధనంజయుం
డతిశోభము ఘటించి యడఁగఁజేయు
ఘనముగాంతర్యామియును ప్రపంచకుఁడను
వాయువు ల్వారుసకు వాహానముగ
తే. నుండు వజ్రుండు ముఖ్యుండు నొనరుగాను
కీలుకీలందు నుండును జీలపగిది, ర... 17

సప్తధాతువులనిర్ణయము.

సీ. మఱి రసరుధిరము ల్మాంసము మేదస్సు
మజ్జాస్థి రేతస్సుమానితముగ
నివి సప్తధాతువు ల్నిబిడీకృతంబుగా
దేహి కావరణంబు దేహమాయె
పాదాదిమస్తకపర్యంతమును నిండి
ప్రకృతిభేదంబుల ప్రబలమాయ
స్థూలమై దీర్ఘమై సూక్ష్మమై పటిమించి
యం దెందు మరణంబు జెందుచుండు
తే. నిట్టి దేహంబులం దాస లేమిలేక
నిన్ను గనువాఁడు మునిజనసన్నుతుండు, ర ...

శరీరత్రయలక్షణము.

సీ. జ్ఞానేంద్రియంబులు కర్మేంద్రియంబులు
నంతరింద్రియవిషయేంద్రియములు
ప్రాణాదులనుగూడి పరగ నిర్వదియాఱు
తత్త్వంబులను స్థూలతనువు నయ్యె
బాహ్యేంద్రియంబులు పదిప్రాణములు నైదు
ధీమనంబుల సూక్ష్మదేహ మయ్యె
నీశరీరద్వయహేతువై యాద్యవి
ద్యాశ్రితమై కారణాంగమయ్యె
తే. మూఁడుదేహంబులకు నాదిమూలమైన
తురున కతురునకు విలక్షణుఁడ వీవు, ర... 19

చతుర్దశేంద్రియవిషయములు.

సీ. శబ్దంబు చెవులకు స్పర్శ చర్మంబున
కక్షికి రూపు జిహ్వకు రసంబు
ముక్కుకు గంధంబు వాక్కుకు వచనంబు
కరమున దానంబు చరణములకు
గమనంబు గుదముకు గలుగు విసర్జన
గుహ్యము కానందగుణము గలుగు
మనసు చలించును మతి నిశ్చయించును
చిత్తంబుఁ జితించు మొత్తముగను
తే. మఱి యహంకారమున కభిమానపడును
నిన్నెఱిఁగిన తెలివి దా నెఱుఁగవలయు, ర...

చతుర్దశేంద్రియములకు అధిదేవతలు.

సీ. శ్రవణంబులకును దిక్చర్మంబునకు వాయు
చక్షువులకు జగచ్చక్షు వరుణుఁ
డును జిహ్వకును ఘ్రాణమున కశ్వినీసుతు
ల్వాగింద్రియమునకు వహ్నిహస్త
ములకు నింద్రుడు పాదములకు నుపేంద్రుండు
గుదమును మృత్యువు గుహ్యమునకు
చతురాననుడు మానసమునకు జంద్రుండు
బుద్ధికి పరమేష్ఠి శుద్ధచిత్త
తే. మునకు జీవుం డహంకారమునకు శివుఁడు
తెలియవలె నీచతుర్దశదేవతలను, ర...

## జాగ్రదవస్థలలక్షణము.

సీ. పంచవింశతి తత్త్వపరిపూర్ణ మైనట్టి
స్థూలదేహామునందు సురుచిరముగ
రసస్పర్శలనరూపరసగంధవచనదా
నగమనోత్సర్జనానందములను
మానసాహంకారమతిచిత్తములఁగూడి
జీవుండు ముఖమునఁ జేరి నిలిచి
విశ్వనామముఁ జెంది వేర్వేర విభజించి
సకలవ్యాపారము ల్సలుపుచుండు
తే. నదియు జాగ్రదవస్థయు ననుదినంబు
జనితమై జనుచుండును జన్మమునను, ర...

## స్వప్నావస్థలక్షణము.

సీ. శబ్దాదివిషయపంచకము వాక్యాదిపం
చకము నీపదియు నచ్చటను నిలిపి
మానసాహంకార మతిచిత్తములఁ గూడి
సప్తదశకతత్త్వసంజ్ఞసూక్ష్మ
దేహమందున కంఠదేశంబునను జేరి
నిలిచి కొంచెముసేపు నిదురఁజెంది
జాగ్రత్తయందు తా జరిపినట్లుగఁ గ్రియ
ల్జేసి మేల్కాంచని జూడ లేశమైన
తే. లేదు గనుకను స్వప్నంబు నాదిపురుష
సత్య మిదిగాదు జనితమై చనుచునుండు, ర

—సుషుప్త్యవస్థలక్షణము.—

సీ. కంఠదేశమునహంకారచిత్తము లుంచి
ధీమనంబుల రెండి దీసికొనియు
కారణదేహాహృత్కమలమందునఁ జేరి
యజ్ఞానసన్నిధియందు నిలిచి
నది సుషిప్త్యనఁబడు నచట రెంటిని నుంచి
తానవిద్యనుగూడి లీనమైన
నదియు గాఢసుషుప్తి యనఁబడు మహిమీఁద
సర్వంబు నెడబాసి స్మరణతప్పి
తే. యుండ తుర్యం బటంచును యోగివరులు
చాటుచుందురు జనితమై జనుచు నుండు, ర...

—సాత్వికగుణలక్షణము.—

సీ. సత్యవ్రతాచారసంపన్నుఁడై యుండు
సత్కర్మక్రియ లెల్ల సలుపుచుండు
తపము మౌనంబు నుత్సాహంబు గలిగుండు
ధర్మమార్గంబులు దలఁపుచుండు
శమదమంబులు శాంతి శ్రద్ధలు గలిగుండు
శాస్త్రపురాణము ల్పలుపుచుండు
ధ్యాన సుజ్ఞానసన్మానము ల్గలిగుండు
శ్రేష్ఠదానంబులు సేయుచుండు
తే. ధైర్యనిశ్చయబుద్ధి సద్భక్తినుండు
సకలభూతసముండు సాత్వికయుతుండు, ర...25

### రాజసగుణలక్షణము.

సీ. కామంబు క్రోధంబు గర్వంబు గలుగుట
కామ్యసంగతులహంకారపడుట
పరరాష్ట్రములమీఁద బంతంబు సేయుట
పరధనంబులఁ జూచి భ్రాంతిపడుట
వారకాంతల మెండు వాంఛించుచుండుట
నేరము లెన్నైనఁ గోరి వినుట
డంబ ముద్యోగమార్గంబుల మెలఁగుట
యుద్ధరంగమున సన్నద్ధమగుట
తే. భోగభాగ్యంబుఁ గోరుట పొగడుకొనుట
లాలితంబుగ రాజసలక్షణములు, ర... 26

### తామసగుణలక్షణము.

సీ. అజ్ఞానవృత్తి మోహాంధకారయుతుండు
భూరినిద్రాసక్తి బొందియుండు
ఎదురు తన్నెఱుంగక విదళించి యదలించుఁ
గోయును తోయును గోపఁబడును
అతిభోజనప్రియుం డతిపానధర్ముండు
పాతకంబుల పట్టుఁబడుచు నుండు
దూషించుచుండు దుర్భాషలు భాషించు
రోషంబు లాడిన రోయకుండు
తే. బుద్ధిలోలుండు సంసారబద్ధకుండు
కుటిలసంగుండు తామసగుణరతుండు, ర...27

## గుణత్రయవిభాగలక్షణము.

సీ. సాత్వికగుణునికి సగము రాజసము రా
జసములో సగము తామసమునుండు
రాజసగుణుని కర్ధము సత్వమందుండు
సత్వంబులోను తామసము సగము
తామసగుణుని కర్ధము రాజసము రాజ
సమునకు సత్వంబు సగమునుండు
త్రిగుణంబు లీరీతి దేహంబులందుండు
సాత్వికగుణ మందుసజ్జనుండు
తే. గురుముఖంబున మీరూప మెఱుఁగుచుండు
త్రిగుణరహితుండు వర్ణింప నగణితుండు ర,...

## దశనాడులస్థాననిర్ణయము.

సీ. గాంధారిహస్తిని ఘననాళములు రెండు
నేత్రద్వయంబుల నిలిచియుండు
సమరిన యూర్మిళ లనునాళములు రెండు
కర్ణద్వయంబులఁ గలసియుండు
పరజిహ్వనాడియు వక్త్రంబునందుండు
నాభిని శంఖినీనాళ ముండు
కులహాసినీ వాలికూడి రత్నాహ్వయ
గుదగుహ్యములయందుఁ గుదిరియుండు
తే. కంఠమందున యశ్విని గలిగియుండు
నుభయుఁ దృష్టియు నెఱిఁగించుచుండు నెపుడుర

ఇడాపింగళసుషుమ్నానాడులలక్షణము.

సీ. ఇడయు పింగళయును గుడియెడమలనుండు
నడుమ సూక్ష్మసుషుమ్ననాడి యుండు
నీనాడి రంధ్రమధ్యమునందు సూర్యసో
మాగ్నివిద్యుత్క్షరమాయ యాత్మ
సప్తసముద్రము ల్సప్తపర్వతములు
చతురాగమంబులు శాస్త్రములును
పంచభూతములు సప్తద్వీపములు లోక
ములు గుణంబులు మంత్రములు కళలును
తే. బిందునాదము దిగ్వాయుబీజమాది
సకలదృశ్యపదార్థము ల్సమతనుండు ర,... 30

చతుర్దలోకస్థలనిర్ణయము.

సీ. అతలంబు పాదము ల్వితలంబు గుల్భలు
జంఘలు సుతలంబు జానులందు
నుండు తలాతలం బూరువులందు భూ
తలము గుహ్యము రసాతలమునుండు
కటిని పాతాళలోకము నాభిభూలోక
ముండు భువర్లోక ముదరమందు
స్వర్గంబు హృదియుఁబక్షము మహర్లోకంబు
ఘనజనుర్లోకంబు గళము బొమల
తే. మధ్యమందు తపోలోక మమరు మూర్ధ్ని
సత్యలోకము నీనివాసస్థలంబు ర,... 31

## అష్టదిక్పాలకులస్థలనిర్ణయము.

సీ. భూమిమధ్య జంభారిపురంబుండు మఱియును
నగ్నిహోత్రునిపురం బఱియందు
దక్షిణకర్ణమం దంతకుపురముండుఁ
దత్పార్శ్వమున యాతుధానపురము
పరగఁ బృష్ఠమునందు వరుణునినగరంబు
పవనపురంబు నాపార్శ్వమందు
వామకర్ణమునందు వరకుబేరపురంబు
హరునిపురము దక్షిణాక్షియందు
తే. శిరమునడుమను నుండు సుస్థిరము గాను
కుంఠితముగాన నీదు వైకుంఠపురము ర...32

## షడూర్ములలక్షణము.

సీ. పృథివి జీవులకెల్ల క్షుధతృష్ణలును రెండు
ప్రాణధర్మములని పలుకఁబడెను
శోకమోహంబులు శోధింపఁగా మనో
ధర్మంబు లని వాని దలఁపవలయుం
జననంబు మరణంబు జడరూపమైనట్టి
దేహధర్మములని తెలియఁబడెను
ఇవి షడూర్ము లటంచు వివిధమార్గంబుల
వివరించి వీనిని విడచి నిన్ను
తే. సద్గురూక్తంబుగాఁ గన్నసజ్జనుండు
నిష్కళబ్రహ్మమై యుండు నిగమవినుత ర...

## అష్టమదములలక్షణము.

సీ. ఎక్కువకులమందు నేజనించితి నాదు
కుల మెక్కు వనుటయుఁ గులమదంబు
సకలనిష్ఠాచారసంపన్నుఁడను నేను
శ్రేష్ఠుఁడ ననుటయు శీలమదము
ద్రవ్యంబు నావద్ద దండిగా నున్నది
యని గర్వపడుటయు ధనమదంబు
ధరను నావంటి సుందరుఁడు లేఁడని నిక్కు
రూఢిగాఁ దిరుగుట రూపమదము
తే మదములన్నియు నీదేహమందు విడచి
భక్తి నీమీఁద గలవాఁడు ముక్తుఁడగును ర,..

సీ. బలవంతుఁడ వయసుగలవాఁడ వైరుల
నవధియింతు ననుట యౌవనమదంబు
సకలశాస్త్రంబులు చదివి వంచించిన
నధికుఁడ ననుట విద్యామదంబు
అఖిలదేశాధిపత్యము నాకు గలదని
రంజిల్లుచుండుట రాజ్యమదము
స్నానసంధ్యాద్యనుష్ఠానుండ నే నని
మది నుబ్బుటయుఁ దపోమదము సుమ్మి
తే. యష్టమదముల నణఁచి ననిష్టపరుఁడు
పుణ్యపురుషుండు వైకుంఠపురమునుండు ర,..

## అష్టపాశముల నిర్ణయము.

సీ. తల్లిదండ్రియు భార్య తనయులు మిత్రులు
ధనము సహోదరు లనువులైన
అష్టపాశంబులు నమరి బంధములచేఁ
దగిలుండు నరులు నీధరణియందు
అత్తమామల బావ లల్లుండు కోడండ్రు
వదినెలు మఱదండ్రు మఱఁదు లనుచు
తాపత్రయంబులఁ దగిలి వర్తించుచు
మత్తులై మనుజులు మందమతిని
తే. సాధుసజ్జనసంగతి సలుపలేక
మోక్షమార్గంబు నెఱుఁగరు మోహరహిత ర,

## మలత్రయలక్షణము.

సీ. పరమాత్మ మెఱుఁగక తెరువు మరుపుచేత
గాత్రపుత్రకళత్రమిత్రులందు
సక్తుఁడై కడలేని సంసారవార్థిలో
మునిఁగి తేలుట నెల్ల యాణవమలము
పరద్రవ్యమాపేక్షపడి పరజములకు
నపకృతిసేయు మాయామలంబు
పుణ్యపాపములచేఁ బుట్టుచావులను ని
ర్మించుచుండుటయుఁ గార్మికమలంబు
తే. మూఁడుమలముల విడువక ముక్తిపథము
గాన లేరైరి పామరమానవులును ర, ... 37

## తాపత్రయలక్షణము.

సీ. తాపత్రయంబుల ధర్మములేవేర్వేఱ
వివరించి చెప్పెద విమలచరిత
దేహజన్యము లైనత్రివిధరోగంబుల
తాపదుఃఖంబు లధ్యాత్మికంబు
వ్యాళవృశ్చికచోరవ్యాఘ్రాదిభూతసం
భవదుఃఖములు నాధిభౌతికంబు
వర్షాశనీపాతవాయురగ్నిశిలాప
తనదుఃఖములు నాధిదైవకంబు
తే. నిట్టితాపత్రయంబులఁ గొట్టివేసి
ధీరుఁ డగువాఁడు మోక్షాధికారియగునుర.

## ఈషణత్రయలక్షణము.

సీ. కామధర్మార్థము ల్గలుగుటకై భార్య
నిచ్ఛనుంచుటయు దారేషణంబు
సుతులు లేకున్న సుగతులు లేవనుచుఁ బు
త్రేచ్ఛనుండుటయ పుత్రేషణంబు
దానధర్మములచే తరియింతు నని ద్రవ్య
మిచ్ఛయించుటయు ధనేషణంబు
దారాది కేషణత్రయములచేతను
నవనిలో సౌఖ్యంబు లనుభవించి
తే. పుణ్యలోకంబు లెల్లనుఁ బొందవచ్చు
గాన మీలోన నైక్యమార్గములు గావు ర.

వాసనత్రయలక్షణము.

సీ. లోకానుసారియై లౌకికవృత్తుల
వసియించుటయు లోకవాస నండ్రు
శాస్త్రపద్ధతి తపోజపక్రతువ్రతముల
వర్తించుటయు శాస్త్రవాస నండ్రు
దేహశోషణఁ జేసి తీర్థయాత్రల కెల్ల
వడి తిరుగుట దేహవాస నండ్రు
ఈమూఁడువాసన లిచ్ఛయించక దేశి
కులసేవ చేసి షడ్గుణము లణఁచి
తే. తత్త్వమస్యాదివాక్యతాత్పర్య మెఱిఁగి
తన్ను తాఁ గన్నపురుషుఁడ ద్వైతుఁడగును ర.

వ్యాధిత్రయలక్షణము.

సీ. వాతంబునం దుద్భవం బైనరోగము
ల్బాగుగా నెనిమిదిపదులు నయ్యె
పైత్యమం దుద్భవం బైనరోగంబులు
దండిగా నెనుబదిరెండునయ్యె
శ్లేష్మమందున జనించినరోగములును ని
న్నూటనిర్వదినాల్గు నుచితమయ్యె
త్రివిధరోగంబు లీతీరున మున్నూట
నెనఁబదినారును నెన్నికయ్యె
తే. నట్టి వ్యాధుల కాధారమైనదేహ
భ్రాంతి విడచినవాఁడు సద్బ్రహ్మవిదుఁడు ర.

## జన్మహేతులక్షణము.

సీ. ఆత్మయందున మాయ యారోపితంబయ్యె
మాయయం దజ్ఞాన మపుడు గలిగె
నజ్ఞానమునఁ దోఁచె నవివేక మవివేక
మందున నభిమాన మమరఁ బుట్టె
నభిమానమందు రాగాదు లుద్భవమయ్యె
రాగాదులందుఁ గర్మములుఁ బొడమె
కర్మలవలనను గడలేని సుఖదుఃఖ
మూలమైనశరీరములఁ జనించె
తే. నీవిధంబున దేహంబు లెత్తి జనులు
నిన్నుఁ గనలేరు నిరుపమ నిర్మలాత్మ ర,...

సీ. రాతిరిపడి యున్నరజ్జు వంతటఁ జూచి
భ్రమసి పామని భయపడిన యట్లు
శుక్తి దూరంబునఁ జూచి వెండి యటంచు
ప్రబలినయాశచే భ్రమసినట్లు
దండకారణ్యమం దెండుమొద్దును జూచి
దొంగవాఁడని భీతి దోఁచినట్లు
కలలోన వస్తువు ల్గని మేలుకొనిలేచి
నావస్తువుల వెదుకాడినట్లు
తే. నరులు సత్యయు జగమని నమ్మినారు
జ్ఞానపథమందు నిజరూపు గానలేక, ర...

### అనాత్మలక్షణము.

సీ. జన్మాస్తివృద్ధులు క్షయపరిణామ నా
శములు షడ్విధవికారముల నాత్మ
ఘనబాల్యయౌవనకౌమారవార్ధక
ములు జాగ్రదాద్యవస్థలును నాత్మ
కమనీయమహదహంకారభూజలవాయుతా
శనసమీరాంతరిక్షముల నాత్మ
త్రిగుణముల్ స్థూలాదిదేహత్రయములన్న
మయమాదిపంచకోశములనాత్మ
తే. యంతరింద్రియబాహ్యేంద్రియముల నాత్మ
దృశ్యరూపంబు శ్రోత్రమును దృక్కనాత్మ, ర...

### సాధనచతుష్టయసంపత్తిలక్షణము.

సీ. సత్యంబు బ్రహ్మం బసత్యంబు సర్వప్ర
పంచంబ యని విమర్శించువాఁడు
ఇహపరసౌఖ్యంబు లిచ్ఛయింపకయుండి
పాపపుణ్యంబులఁ బడనివాఁడు
శమదమంబులు శాంతిశ్రద్ధోపరతితితీ
క్షలు సతతంబును గలుగువాఁడు
మోక్షంబుమీఁద నాపేక్షవిస్తారమై
కాని యేయాపేక్ష లేనివాఁడు
తే. గురుకటాక్షంబుచేతను గురుతెఱింగి
నసిపదం బగునీయందు నైక్యమగును, ర... 45

### శమదమాదిషట్కసంపత్తిలక్షణము.

సీ. అంతరింద్రియనిగ్రహంబు శమం బగు
బహిరింద్రియములనిగ్రహము దమము
నపవర్గషట్కంబు లణఁచుట శాంతియు
సుఖదుఃఖములకు నోర్చుట తితిక్ష
వేదాంతశాస్త్రము ల్వాని విమర్శించి స
ద్గురువందు భక్తిగల్గుటయు శ్రద్ధ
కర్మంబులను బ్రహ్మ కల్పించి హృత్పర
బ్రహ్మసంగం బుపరతి యటంచు
తే. నెఱిఁగి నడిచినవాఁడు యోగీశ్వరుండు
నతఁడు ముక్తుండు నాద్యుండు నచ్యుతుండు, ర.

### అరిషడ్వర్గములలక్షణము.

సీ. కోరుట కామంబు కోరినయర్థంబు
కొనసాగకుండిన క్రోధమగును
వచ్చినద్రవ్యంబు వదలకుండును లోభ
మాధనాపేక్ష మోహంబ యగును
ధనమున్నదని మోదమున నుబ్బి నాకేమి
కొదువని గర్వించినది మదంబు
పరద్రవ్య మపహరింతమ నెడిజనులందు
మది నీర్ష్యయుంచుట మత్సరంబు
తే. గనుక నీశత్రువర్గషట్కముల నణఁచి
శాంతిఁ బొందినపురుషుండు సర్వసముఁడు, ర.

## ఉపదేశమయ్యెడుక్రమము.

సీ. సాధనచతుష్టయసంపత్తియును గలిగి
పరిపూర్ణుఁడైనసద్గురినిఁ జేరి
ద్వాదశాష్టాంగదండంబుల నర్పించి
తనుమనఃప్రాణము లారఁబోసి
భక్తితో నాత్మాంగభావసుస్థాన శు
శ్రూషలుఁజేసి సంతోషపఱిచి
నట్టి శిష్యుని మెచ్చి గట్టిగా గురుమూర్తి
త్రివిధదీక్ష లొనర్చి దివ్యముగను
తే. హస్తమస్తకసంయోగమంచితముగఁ
జేసి నిజకేవలాత్మోపదేశ మొసఁగు, ర... 48

## ఉపదేశించుక్రమము.

సీ. యమము నియమము నాసనము ప్రాణాయామ
మమగ ప్రత్యాహారమంచితముగ
ధ్యానధారణసమాధ్యష్టాంగయుతమంత్ర
యోగము లయహఠయోగములను
రాజయోగంబు తారకము సాంఖ్యామాన
సమును ముద్రలు లక్ష్యసాధకములు
పరతత్త్వమస్యాదివాక్యము ల్జీవేశ్వ
రైక్యసంధానము లార్జితముగ
తే. శిష్యునికిఁ దెల్పి గురుమూర్తి స్థిరముగాను
పూర్ణభావంబుఁ బొందించు బుధులు మెచ్చ, ర.

### ధ్యానముద్రమంత్రయోగలక్షణము.

సీ. భూసురుం డెవఁడైనఁ బుణ్యశీలుఁడు మహా
నదులతోయముల స్నానంబుఁ జేసి
శుభ్రవస్త్రముగట్టి శుచియైనస్థలమందుఁ
గ్రమముతోఁ బూర్వచక్రము లిఖించి
దర్భకృష్ణాజినధవళాసనములపై
పద్మాసనస్థుఁడై పదిలముగనుఁ
గన్నులు బిగియించి కడువెన్ను నిక్కించి
నాసాగ్రమునఁ జూపుఁ జూచి మనసు
తే. కష్టమైనట్టి మంత్రంబు నిష్ఠతోను
జపము సేసినయోగి సజ్జనుఁడు సుమ్మి, ర... 5

### రాధాముద్రలయయోగలక్షణము.

సీ. ఱెప్పలు వ్రాల్పక రెండుఁజూపులఁ గను
బొమలమధ్యమునందుఁ బొందనిలపి
కర్ణరంధ్రంబులుఁ గడియంగ బిగియించి
నంతరజ్ఞప్తిచే నాలకించి
గజ్జమువ్వలనాదుఘంటారవము శంఖ
వీణతాళధ్వను ల్వేణుభేరి
మద్దలమేఘాదిమహనీయదశవిధ
నాదము ల్వీని చాల మోదమంది
తే. నందులోపలఁ దదనాదమందు మనసు
లయముజేసిన యోగి విలక్షణుండు, ర... ౬

షణ్ముఖీముద్రహఠయోగలక్షణము.

సీ. అంగుష్ఠములను గర్ణాంగంబులను మూసి
చక్షులు మధ్యతర్జనులమూసి
నాసికాయుగ్మమనామికంబుల మూసి
ఘనవక్త్రము కనిష్ఠకమున మూసి
పాదమూలమున బాయూపస్థలనుమూసి
నాధారమున వాయు నపుడు లేపి
షట్చక్రములనున్న సంజ్ఞలకడ తేరి
యాజ్ఞాసుచక్రమం దమర నిలపిఁ
తే. జూపు పవనంబు యామున స్ఫోకటిఁ జేసి
ధ్యాన మొనరించి హఠయోగి ధన్యుఁడగును, ర

శాంభవీముద్రరాజయోగలక్షణము.

సీ. సురచిరశాంభవిఁ జూడంగఁ జూడంగ
చంద్రసూర్యాగ్నులు నింద్రధనువు
నవరత్నములభాతి నక్షత్రములరీతి
బిరుసుగాల్చిన యట్లు మెరుపువలెను
మండుమంటలభంగి నిండుచీకటిఁబోలు
మెండు వెన్నెలకాంతి యెండవలెను
ఇది జలమాదిగా ని ట్లనేకము పుట్టి
నణఁగిన పిమ్మట నమల మగును
తే. బట్టబయ లైనబ్రహ్మంబు గట్టిగాను
వెలియు లోపలఁ గనుపడు వేత్తలకును, ర...53

ఆధారచక్రనిర్ణయము.

సీ. ఆసనస్థానమం దాధారచక్రము
నందు నాలుగురేకు లమరియుండు
వశషస లనియెడివర్ణము ల్గాల్గుండు
నర్థచంద్రాకార మమరియుండు
కుంకుమవర్ణంబు కింకిణీనాదంబు
నార్యాఖ్యహంసలు నాడుచుండు
సద్భక్తియును క్రియాశక్తియు వర్తించు
ఘనతరంబున నిన్ని గలిగినట్టి
తే. కమలమందున ప్రేమతో విమలమైన
నీవు గణపతిరూపమై నిలచినావు, ర...

స్వాధిష్ఠానచక్రనిర్ణయము.

సీ. ఆధారమునకు రెం డంగుళాలకుమీాద
లింగస్థలం బుండు రంగుగాను
స్వాధిష్ఠచక్రము షడ్దళంబులఁ ద్రికో
ణాకారమై యందు నమరియుండు
బభమయరల లుండు పాటిల్లు నైష్ఠిక
భక్తి వీరము జ్ఞానశక్తి యుండు
విమలవిద్యుత్కాంతి వీణారవంబును
నార్యేలుహంసలు నాడుచుండు
తే. ప్రకటితంబుగ వికసితపద్మ ముండు
నీవు బ్రహ్మస్వరూపమై నిలచినావు, ర...

## మణిపూరకచక్రనిర్ణయము.

సీ. మఱియు నాభిస్థానమణిపూరకం బది
దశదళంబులతోడ దనరియుండు
డఢలాదిఫాంతముదృఢతనక్షరములు
పది వేణునాదంబు ప్రబలియుండు
శ్యామలవర్ణ మిచ్ఛాశక్తి షట్కోణ
మగ్నిభూతంబు రా నంటియుండు
నవధానభక్తియు నచట కుండలిమీఁద
నార్వేలహంసలు నాడుచుండు
తే. నిన్నుయుండినచక్రమం దిష్టముగను
నీవు విష్ణుస్వరూపమై నిలచినావు, ర... 56

## అనాహతచక్రనిర్ణయము.

సీ. హృదయస్థలమ్మునం దిరవై యనాహత
పద్మమందున దళాల్ పదియు రెండు
కఖగాదిపాంతము ఘనతరాక్షరములు
పది రెండుయుండును బాగుగాను
వర్తులాకారము వాయుభూతము నాది
శక్తియుండును భవభక్తి యుండు
శాతకుంభపుకాంతి శంఖారవంబును
నార్వేలహంసలు నాడుచుండు
తే. భరితమై యున్నచక్రాధిపత్యముగను
నీవు రుద్రస్వరూపమై నిలచినావు, ర... 57

విశుద్ధచక్రనిర్ణయము.

సీ. కాలుమూలలయందు స్థానంబుగా విశు
ద్ధాంభోజ ముండు సుందరముగాను
పదియారుదళములు బాగుగా షోడశ
స్వరము లుండును పరాశక్తి యుండు
స్ఫటికవర్ణం బందు సావానందభక్తియు
నాకాశభూతంబు నమరియుండు
మోదంబుతో మేఘనాదంబు మ్రోయంగ
హంసలు దశశతం బాడుచుండు
తే. భాసురంబుగ నానందభరిత మగుచు
నీవు యీశ్వరరూపమై నిలచినావు, ర... 58

ఆజ్ఞాచక్రనిర్ణయము.

సీ నాసాగ్రవీథిని నయనద్వయంబుల
నడుమ నాజ్ఞేయంబు నమరియుండు
రెండురేకులు దానికుండు మీదను రెండు
హంక్షంబు లనియెడి యక్షరములు
నభినాదంబు మహాతత్త్వభూతంబు
మాణిక్యకాంతి సమరసభక్తి
గంగాసరస్వతీసంగమస్థానంబు
హంసలు పదినూర్లు నాడుచుండు
తే. శ్రీకరంబుగ నట సదాశివవిలాస
రూపమైనావు నీవు నిరూఢముగను, ర... 59

## సహస్రారచక్రనిర్ణయము.

సీ. సరససహస్రారచక్రంబు మూర్ధస్థ
లం బందు యుండు విలక్షణముగ
నందు వేరేకు లింపొందుగా వర్తించు
సాక్షీభూతము సహజాత్మశక్తి
ఓంకారబీజము ఝుంకారనాదము
బహుచిత్రవర్ణముల్ పరమభక్తి
నమృతంబు నెప్పుడు నతివృష్టి గురియంగ
హంసలు దశశతం బాడుచుండు
తే. నందు నిరుపమసచ్చిదానందముగను
నీవు సద్గురురూపమై నిలచినావు, ర... 60
సీ. కొండమీదను పెద్దగుండు నొక్కటియుండు
గుండునడుమను నల్లగుండ్లు రెండు
గుండ్లమధ్యను నక్క కూఁత లెట్టుచునుండు
కూఁతలనడుమను నూతియుండు
నూతిమధ్యంబున నాతిరొక్కతె యుండు
నాతిమీఁదను నొక్కకోఁతి యుండు
కోఁతిమీఁదను బరంజ్యోతి వెల్గుచునుండు
జ్యోతియే జగమెల్లఁ జూచుచుండు
తే. జూచుచుండెడి దానెందు చోద్యమెరిగి
నదియు తా నని యున్నవాఁ డాత్మవిదుఁడు, ర

పరమాత్మస్థాననిర్ణయము.

సీ. విమలచిన్మయనేత్రకమలమధ్యంబున
మార్తాండసోమాగ్నిమండలములు
మండలంబులయందు మహనీయముగ నొక్క
నీలమేఘం బుండు నిజముగాను
మేఘమధ్యంబున మెరుపుమెరయుచు నుండు
నందు నీవారశూకాగ్ర ముండు
శూకాగ్రమున నతిసూక్ష్మస్వరూపమై
బహిరంతరంబులఁ బ్రజ్వరిల్లి
తే. వెలుఁగుచున్నాఁడ వేకమై వెరపులేక
నిర్మలాకార నిరుపమనిర్వికార, ర... 62

ప్రకృతిలక్షణము.

సీ. జ్ఞానేంద్రియము లైదు కర్మేంద్రియము లైదు
ప్రాణాదు లైదు శబ్దాదు లైదు
ఘనమనోబుద్ధ్యహంకారచిత్తంబులు
నాల్గును నిరువదినాల్గుతత్త్వ
ములఁగూడి ధవళశ్యామలరక్తపీతవ
ర్ణములు నాలుగుగల్గి నదియె ప్రకృతి
యది క్షరం బది క్షేత్ర మదిజడం బది దృశ్య
మది యవిద్యాజ్ఞాన మదియ నాత్మ
తే. నదియె జీవంబు నది దేహ మది జగంబు
నదియు సంసార మది బంధనరక మదియు, ర

అక్షరస్వరూపలక్షణము.

సీ. శ్వేతరక్తాసిత పీతవర్ణంబుల
నడుమసునీలవర్ణంబునుండు
నిది నీలతోయద మగు దావినడుమని
శ్వాతదీపముకాంతిరీతినుండు
నదియు విద్యుల్లేఖ నదియు నాపోజ్యోతి
నదియు నోంకారంబునక్షరంబు
నది మేరుశిఖరంబు నదియుఁ గైలాసంబు
నది సత్యలోకంబు నాశ్రయంబు
తే. నదియు వైకుంఠపదము తత్పదము నదియు
నదియు త్వంపద మరి యంతరార్థ మదియు, ర

పరమాత్మనివాసస్థలనిర్ణయము.

సీ. శ్వేతరక్తాసితపీతనీలంబుల
నడుమ నివాస మైనావు నీవు
మానితాదిత్యసోమాగ్నిమండలముల
నడుమ నివాస మైనావు నీవు
పొందుగాఁ గళనాదబిందుత్రయంబుల
నడుమ నివాస మైనావు నీవు
విమలభాగీరథీ యమునా సరస్వతి
నడుమ నివాస మైనావు నీవు
తే. అండపిండాండబ్రహ్మాండభాండములను
నడుమ నున్నావు నీవు సానందముగను, ర...

ఆత్మసర్వగతలక్షణము.

సీ. ధరణిలోఁ దిలయందుఁ దైల ముండినతీరు
దారువునం దున్న దహనుమురీతి
నాణెమౌ దధియందు నవనీత మున్నట్లు
పుష్పమందున గంధ మున్నయట్లు
రంజిల్లు ఫలమందు రసము లుండినభంగి
జేలమం దున్నట్టి నూలుభంగి
తారహారాదులదార ముండినతీరు
నిసుకరాళ్లందున్న యినుముతీరు
తే. నఖిలజగముల సకలదేహంబులందు
నండియున్నాఁడ వీరితి నిజముగాను, ర...

దేహేంద్రియవిలక్షణము.

సీ. నాతల్లి నాతండ్రి నాసతు ల్నాసుతు
ల్నాపశుసంఘంబు నాగృహంబు
నాభూషణంబులు నావాహనంబులు
నాక్షేత్రపాత్రము ల్నాజనంబు
నాధాన్య మని పల్కునప్పుడు పురుషుండు
తానవిగాక వేఱైన విధము
నాశరీరంబును నాయింద్రియంబులు
నాజీవధర్మము ల్నాగుణంబు
తే. లనుచు బల్కిన దేహేంద్రియాదులకును
నీవు వేఱుగ నుందువు నిశ్చయముగ, ర..

ఎఱుకనిర్ణయము.

సీ. ఇదిఘటం బిదిపటం బిదిమఠం బిదిశకటం
బిదిహాఠం బిదిపటం బిది యటంచు
నిదిమనం బిదిజనం బిదిధనం బిదిఘనం
బిదిదినం బిదివనం బిది యటంచు
నిదిహాయం బిదిప్రియం బిదివ్రయం బిదినయం
బిదిజయం బిదిభయం బిదియటంచు
నిదిశిరం బిదికరం బిదినరం బిదిమదం
బిదిపరం బిదిస్థిరం బిది యటంచు
తే. నదియు నిదియును నేదియు నది యటంచు
నెఱుఁగుచుండిన యెఱుకలో నెఱుక నీవు, ర.

సీ. ఇది యపశబ్దంబు నిది సుశబ్దం బని
యెఱిఁగిన యెఱుకలో నెఱుక వీవు
ఇదియుష్ణ మిదిశీత మిదిమృదుత్వం బని
యెఱిఁగిన యెఱుకలో నెఱుక వీవు
ఇదిశుక్ల మిదిరక్త మిదియుఁ గృష్ణం బని
యెఱిఁగిన యెఱుకలో నెఱుక వీవు
ఇది మధురం బామ్ల మిది లవణం బని
యెఱిఁగిన యెఱుకలో నెఱుక వీవు
తే. ఇది సుగంధంబు దుర్గంధ మిది యటంచు
నెఱుఁగుచుండిన యెఱుకలో నెఱుక వీవు, ర.

నేతి నేతియనుమహావాక్యలక్షణము.

సీ. నీవు పృథ్వివిగావు నీరగ్నులునుగావు
మారుతము మఱి వ్యోమంబుగావు
శ్రోత్రత్వక్కులుగావు నేత్రజిహ్వలుగావు
ఘ్రాణంబుగావు వక్త్రంబుగావు
పాదపాణులుగావు పాయుపస్థలుగావు
ప్రాణముల్గావు శబ్దంబు గావు
స్పర్శరూపులుగావు పరగరసముగావు
గంధంబుగావు చిత్కళలుగావు
తే. మానసాదులుగావు కర్మములుగావు
సచ్చిదానందరూపాత్మసాక్షి వీవు, ర... 70

సీ. షట్చక్రములుగావు షడ్వర్గములుగావు
కామాదిశత్రువర్గములుగావు
షట్కోణములుగావు షడ్భ్రమంబులుగావు
షడ్వికారంబులసరణి గావు
షట్కసంపత్తుల షడ్గుణంబులుగావు
వరషడూర్ములుగావు క్షరముగావు
షణ్మతంబులుగావు షట్శాస్త్రములుగావు
షట్కర్మములుగావు సత్తుగావు
తే. సప్తధాతువులునుగావు సప్తకోటి
మంత్రములుగావు నానందమయుఁడ వీవు, ర.

సీ. అష్టతనులుగావు అష్టాత్మలునుగావు
అష్టాంగయోగాదినిష్ఠగావు
అష్టమూర్తులుగావు యష్టపురంబులు
గా వష్టమతములు గావు నీవు
అష్టాబ్జములుగావు యష్టపాదంబులు
యష్టస్థలంబులు నరయ గావు
దశరంధ్రములుగావు దశనాడులునుగావు
దశవాయుగుణవికారములుగావు
తే. పంచశక్తులు గా వాదిప్రకృతిగావు
సర్వపరిపూర్ణచైతన్యసాక్షి వీవు, ర... 72

సర్వం ఖల్విదం బ్రహ్మ యను శ్రుతిపద్ధతి.

సీ. తత్పదంబును నీవు త్వంపదంబును నీవు
నసిపదంబును నీవు నాత్మ నీవు
అండాండములు నీవు పిండాండములు నీవు
బ్రహ్మాండములు నీవు బ్రహ్మ నీవు
సత్తుచిత్తులు నీవు సాక్షిరూపము నీవు
క్షరుఁడవు నీవు నక్షరుఁడ వీవు
క్షేత్రంబులును నీవు క్షేత్రజ్ఞుఁడవు నీవు
కర్మంబులును నీవు జ్ఞాన మీవు
తే. స్థూలదీర్ఘంబులును నీవు సూక్ష్మమీవు
నీవు నేనను నీవైన భావమీవు, ర... 73

సీ. విశ్వసృష్టివి నీవు విశ్వేశుఁడవు నీవు
విశ్వవంద్యుఁడ వీవు విశ్వ మీవు
వేదవేద్యుఁడ వీవు వేదాంతకుఁడ వీవు
వేదస్థుఁడవు నీవు వేద మీవు
యజ్ఞకర్తవు నీవు యజ్ఞభోక్తవు నీవు
యజ్ఞరూపుఁడ వీవు యజ్ఞ మీవు
వేదవేద్యుఁడ వీవు వేదాత్మకుఁడ వీవు
దైవజ్ఞుఁడవు నీవు దైవ మీవు
తే. శిష్యుఁడవు నీవు పరమదేశికుఁడ వీవు
సగుణనిర్గుణములు నీవు సాక్షి నీవు, ర... 74

పంచభూతములైక్యనిర్ణయము.

సీ. అవని నీరంబులో నైక్యంబుగాఁజేసి
యానీర మగ్నిలో నైక్యపఱచి
నాయగ్ని వాయువం దైక్యంబుగాఁజేసి
యావాయు గగనమం దైక్యపఱచి
గగనంబు మహదహంకారంబులోఁ గల్పి
తదహంకృతియు మహాతత్త్వమందు
నైక్యంబుగాఁజేసి యామహాతత్త్వంబు
నద్వయబ్రహ్మమం దైక్యపఱచి
తే. నట్టి యోగీంద్రుఁ డద్వయుం డప్రమేయుఁ
డప్రమత్తుఁ డనంతుండు నఖిలసముఁడు, ర...75

◆ జ్ఞానియగు లక్షణము. ◆

సీ. బ్రహ్మాండాత్మైక్యభావంబు దెలిసిన
నజ్ఞానవృత్తులు నణఁగుచుండు
నజ్ఞానవృత్తులు నణఁగిన పిమ్మట
నవివేకవృత్తులు నణఁగుచుండు
నవివేకవృత్తులు నణఁగిన పిమ్మట
నభిమానవృత్తులు నణఁగుచుండు
నభిమానవృత్తులు నణఁగిన పిమ్మట
రాగాదులెల్ల విరాగమౌను
తే. రాగములు బోయినపుడు కర్మములు దొలఁగు
కర్మములు బోవ నిర్మలజ్ఞాని యగును, ర...76

◆ ప్రజ్ఞానంబ్రహ్మయనేశక్తిలక్షణము. ◆

సీ. శ్రవణేంద్రియంబులశబ్దము ల్వినుచుండు
చర్మేంద్రియంబున స్పర్శనెఱుఁగు
చక్షురింద్రియముల వీక్షించు రూపముల్
రూఢిగా జిహ్వచే రుచుల నెఱుఁగు
ఘ్రాణరంధ్రంబుల గంధమాఘ్రాణించు
వాక్కున వచియించు వాక్యములను
యేజ్ఞానమున నిన్నియెఱిఁగె నాజ్ఞానంబు
ప్రజ్ఞానమని శ్రుతు ల్పలుకుచుండు
తే. నట్టిప్రజ్ఞానలక్ష్యార్థ మనుభవంబు
నీస్వరూపంబు నిక్కంబు నిజముగాను, ర...77

తత్త్వమసియనేశ క్తిలక్షణము.

సీ. మఱియు సృష్టికి పూర్వమందు ద్వితీయమై
నామరూపక్రియ లేమిలేక
యేకమై యచలమై యేదియుండునో యది.
తత్పదలక్ష్యతాత్పర్య మిదియుఁ
దనవివేకమున సాధనచతుష్టయములు
గల్గినపూర్ణాధికారియందు
ధీమనోచిత్తాదిదేహేంద్రియములక
తీతమై సాక్షియై తేజరిల్లు
తే. నదియు త్వంపదలక్ష్యార్థ మనఁగ నొప్పు
నసిపదార్థంబు నీరెంటి నైక్యమధిప, ర... 78

అయమాత్మశక్తియను బ్రహ్మలక్షణము.

సీ. స్వచ్ఛమై సత్యమై స్వప్రకాశంబునై
యపరోక్షమై సదా యమల మగుచు
నాద్యంతరహితమై యచలమై నిత్యమై
శుద్ధమై బుద్ధమై సిద్ధ మగుచు
నిర్వ్యాజి యైనట్టి నిర్గుణంబయి యాత్మ
పదమును లక్ష్యతాత్పర్య మిదియు
ప్రతిలేనిదై నిరుపద్రవంబై స్వతః
పరిపూర్ణమైనట్టి బయలు నగుచు
తే. జగదధిష్ఠానమై చరాచరములందు
బాధితములేక యున్నదే బ్రహ్మమగుచు, ర...

సీ. అలచతుర్వేదమహాకావ్యములయందు
  నీవె బ్రహ్మవు బ్రహ్మ వీవె యనుచు
ఉపనిషద్భాష్యంబు లూహించి వెదకిన
  నీవె బ్రహ్మవు బ్రహ్మ వీవె యనుచు
యోగశాస్త్రములలో యుక్తిసాధించిన
  నీవె బ్రహ్మవు బ్రహ్మ వీవె యనుచు
మంత్రశాస్త్రంబులు మర్మము ల్దెలిసిన
  నీవె బ్రహ్మవు బ్రహ్మ వీవె యనుచు
తే. వేదవేదాంతసిద్ధాంతవేద్యులెల్ల
  నిశ్చయింతురు నిత్యంబు నిగమవినుత, ర...80

సీ. వరబ్రహ్మక్షత్రియవైశ్యాదివర్ణము
  ల్నీకు నెన్నఁడు లేవు నిశ్చయముగ
వలబ్రహ్మచర్యాదియాశ్రమధర్మము
  ల్నీకు నెన్నఁడు లేవు నిశ్చయముగ
స్వగతివిజాతిస్వజాతిభేదంబులు
  నీకు నెన్నఁడు లేవు నిశ్చయముగ
కులరూపనామము ల్గోత్రసూత్రంబులు
  నీకు నెన్నఁడు లేవు నిశ్చయముగ
తే. భేదమోదంబులును భేదవాదములును
  నీకు నెన్నఁడు లేవుగా నిశ్చయముగ, ర...81

అంటియంటనిలక్షణము.

సీ. జలజపత్రమునందు సలిల మంటనియట్లు
నద్దమందున రూప మంటనట్లు
బురద యాకుమ్మరపురుగు కంటనియట్లు
నాజ్యంబు జిహ్వాయం దంటనట్లు
భువి చింతపండుపై బొబ్బరంటనియట్లు
బలుచల్లలో వెన్న గలయనట్లు
చిత్రభానుండును చీఁక టంటనియట్లు
నాకాశమున వాయు వంటనట్లు
తే. బ్రహ్మవేత్తలు మాయాప్రపంచమందు
నఖిలవ్యవహారములు జేసి యంట రధిప, ర...82

పరిపూర్ణబోధ.

సీ. ఈయుత్తబట్టబయ లేమి లే దనుచును
ద్వాదశాక్షరి చాల దలఁచలేను
మూల మింతయు లేక మేలుగా నెఱిఁగెడి
నీశరీరద్వయ మేమి లేదు
అని గురువాక్యము విని సంతతము మది
నుంచంగవలె నిది కొంచె మనఁగ
నిది నిశ్చయముజేసి యిది విడిపించిన
పరిపూర్ణమైయుండు బాధలేక
తే. రాకపోకలు రెండును లేకనుండు
నట్టిసూత్రంబు దెలిసిన నచలముగును, ర...83

సీ. అవనిలో నీరులో నగ్నిహోత్రంబులో
మారుతమునను వ్యోమంబులోను
సురలలో నరులలో గిరులలో చరులలో
దరులలో హరులలో కరులలోను
ఊళ్లలో గూళ్లలో రాళ్లలో రోళ్లలో
వేళ్లలో గోళ్లలో తేళ్లలోను
ఇండ్లలో గుండ్లలో బండ్లలో నోళ్లలో
చీమలో దోమలో పాములోను
తే. అచలమైయుండు కాలత్రయంబులందు
బాధితములేక కేవలబ్రహ్మ ముండు, ర... 84
సీ. సృష్టికి పూర్వంబు సృష్టికి పరమందు
సృష్టి యున్నప్పుడు సృజనలేక
ప్రాగ్దక్షిణంబులుఁ బశ్చిమోత్తరముల
నాల్గుమూలలమీఁద నడుమక్రింద
నిష్కళంకంబయి నిర్వికారంబయి
ఘనతేజమై స్వప్రకాశ మగుచు
నచలమై స్వచ్ఛమై యాద్యంతశూన్యమై
పరిపూర్ణమై బట్టబయలుగాను
తే. నేకమై యుండు నేబాధ లేక నుండు
నట్టివస్తువు కేవలాత్మనఁగఁబడును, ర... 85

సీ. సగుణనిర్గుణములు సదసత్తులును నిరా
కారసాకారము లౌని దేవొ
క్షేత్రజ్ఞక్షేత్రము ల్జీవజంగంబులు
కారణకార్యము లౌని దేవొ
పాపపుణ్యంబులు బంధమోక్షంబులు
జ్ఞానకర్మంబులు గాని దేవొ
క్షరమక్షరంబులు సత్య మసత్యము
ల్ఖండ మఖండము లౌని దేవొ
తే. రాకపోకలఁ జెప్పంగ రాని దేవొ
యదియుఁ గేవలపరిపూర్ణ మనఁగ నొప్పు, ర.
సీ. వసుధలోఁ నణఁగదు వారిలోఁ మునుఁగదు
గాఢాగ్నిచేత దగ్ధంబుగాదు
గాలికిఁ గూలదు కరములఁ జిక్కదు
పాషాణములనైనఁ బగిలిపోదు
వానకుఁ దడవదు వడిగండ్ల నొవ్వదు
యస్త్రశస్త్రంబుల హాతముగాదు
ఎండకు నెండదు నెండ నీడకుగాదు
ఘనపాశములనైనఁ గట్టుపడదు
తే. చలికి వణఁకదు భయముల కులికిపడదు
యచ్చలమై యున్నపరిపూర్ణ మమలచరిత, ర..

సీ. బాధితంబైన యీప్రకృతిద్వయము లేని
కేవల పరిపూర్ణ భావమునను
స్థూలదేహము లేదు సూక్ష్మదేహము లేదు
కారణదేహసంఘటన లేదు
ఘనమహాకారణఘటము లేనే లేదు
లేదు జాగ్రదవస్థ లేదు లేదు
లేదు స్వప్నావస్థ లేదు నిద్రావస్థ
లేదు తుర్యావస్థ లేదు లేదు
తే. సర్వ మీశ్వరతను చతుష్టయము లేదు
విశ్వతైజ సిట్టి ప్రాజ్ఞాదివిభులు లేదు, ర... 88
సీ. పుట్టదు గిట్టదు పట్టదు ముట్టదు
కొట్టదు తిట్టదు కట్టుపడదు
తొలఁగదు మరుగదు కరుగదు పెరుగదు
పరగదు విరగదు తరుగుపడదు
ఆడదు పాడదు వాడదు వీడదు
వేడదు గూడదు జూడపడదు
అదరదు బెదరదు గదురదు చెదరదు
ముదురదు పదరదు గదలఁబడదు
తే. చనదు పెనఁగదు చినుగదు వినదు గనదు
ఖేదమోదద్వయము లేని కేవలాత్మ, ర... 89

సీ. సార్వకాలము చలించక నొక్కతీరుగాఁ
బరిపూర్ణమై యున్న బట్టబయలు
పతిగాదు సతిగాదు రతిగాదు ప్రతిగాదు
స్తుతియుఁ గా దుత్పత్తిస్థితియుఁ గాదు
మృతిగాదు స్మృతిగాదు శ్రుతిగాదు ధృతిగాదు
కృతిగాదు వికృతి హాంకృతియుగాదు
క్షితిగాదు మతిగాదు మితిగాదు ద్యుతిగాదు
యతిగాదు మూలప్రకృతియుఁగాదు
తే. గతియు దుర్గతియును లసద్గతియుగాదు
గతము విగతముగాదు నాగతముగాదు, ర...

సీ. నేత్రజిహ్వాఘ్రాణ శ్రోత్రత్వగింద్రియం
బుల కేవలాత్మను దెలియరాదు
పీతవర్ణముగాదు శ్వేతవర్ణముగాదు
కృష్ణపీతసునీలములునుగాదు
కటులవణామ్లతిక్తకసాయ మధురాది
రస రుచి వస్తువర్గములుగావు
వీణారవముగాదు వేణునాదము గాదు
తాళమృదంగాది ధ్వనులుగావు
తే. విమల పరిమళ మిళితద్రవ్యములు గాదు
గఠినశీతోష్ణమృదుసదాగతులుగాదు, ర... 91

సీ. ఆద్యంతములులేని యచలము రెండు ప్ర
కారంబు లెన్నఁడు గాకయుండు
క్రిందటగాలేదు ముందరగాబోదు
నిప్పుడుగాలేదు నికనుగాదు
సార్వకాలం బేకసరణిగాఁ గదలక
మెదలక వదలక జెదరకుండు
నీప్రపంచంబున కీపరిపూర్ణంబు
నకును సంబంధ మెన్నటికి లేదు
తే. చావు పుట్టువు గలిగుండు జగమునకును
చావు పుట్టువు లేనిదే కేవలాత్మ, ర... 92
సీ. ఆదిమధ్యాంతశూన్యంబైన దానెందు
పంచభూతములు జన్మించలేదు
బంధముక్తులులేని పరిపూర్ణమందు నీ
పంచకోశము లుద్భవించలేదు
జ్ఞానకర్మంబులు లేనివస్తువునందుఁ
బ్రకృతిస్వయంబు లుత్పత్తిలేదు
అచలమునందు మాయావిద్యలాదియు
పాధిద్వయంబు లుద్భవములేదు
తే. జగము జీవులు స్థావరజంగమములు
బట్టబయలందు నెన్నఁడు బుట్టలేదు, ర... 93
సీ. సురలు రాక్షసులు భూసురులువైశ్యులు శూద్రు
నరులు మానులు దిగంబరులు ఋషులు

యోగులు భోగులు రోగులు త్యాగులు
తరులు ఖేచరులు వానరులు గిరులు
రాజులు మంత్రులు రథతురంగంబులు
శరచాపధరులు భీకరులు కరులు
కలలో ననేక మెక్కడనుండి వచ్చెనో
గాని మేల్కొనిన నొక్కటియు లేదు
తే. నీప్రపంచంబు నారీతి నేమిలేదు
బట్టబయలైన యచల మెప్పటికి నుండు,ర...94
సీ. క్షర మక్షరంబులు సగుణనిర్గుణములు
సత్య మసత్యముల్ సత్తుచిత్తు
కారణకార్యముల్ జ్ఞానకర్మంబులు
పురుషుండు బ్రకృతియు నెఱుకమఱపు
పాపపుణ్యంబులు బంధమోక్షంబులు
జననంబు మరణంబు జడ మజడము
క్షేత్రజ్ఞక్షేత్రము జీవదేహంబులు
మానాభిమానము ల్మంచి నెబ్బ
తే. యట్టి ప్రకృతిద్వయంబులు గట్టిగాను
బట్టబయలందు నెన్నఁడు బుట్టలేదు, ర... 95
సీ. చైతన్య మని యన్న క్షేత్రజ్ఞుఁ డని యొన్న
జ్ఞానము నెన్న హంకార మెన్న
సద్రూప మని యొన్న చిద్రూప మని యొన్న
స్వస్వరూపం బన్న సాక్షియొన్న

-ఈశ్వరుఁ డని యొన్న నిల విష్ణు వని యొన్న
పరమాత్మ వని యొన్న బ్రహ్మ యొన్న
యాదిశక్త్యని యొన్న నానంద మని యొన్న
పరమబంధం బెన్న బ్రకృతి యొన్న
తే. మాయ కేగల్గు నీనామధేయములును
బట్టబయలందు నొకపేరు బుట్టలేదు, ర... 96
సీ. కర్తృత్వ భోక్తృత్వ స్మృత్యత్వ మంత్రత్వ
ములు కేవలాత్మకుఁ గలుగ వెపుడు
జ్ఞాతృత్వ శ్రోతృత్వ ద్రష్టృత్వ వక్తృత్వ
ములు కేవలాత్మకుఁ గలుగ వెపుడు
ధాతృత్వ జేతృత్వ పాత్రత్వ యంత్రత్వ
ములు కేవలాత్మకుఁ గలుగ వెపుడు
శత్రుత్వ మిత్రత్వ జైత్రత్వ భేదిత్వ
ములు కేవలాత్మకుఁ గలుగ వెపుడు
తే. గోత్రసూత్రపవిత్రాదిగాత్రములను
కేవలాత్మకు గలుగఁగాఁ బోవు సుమ్మి, ర... 97
సీ. ఈయుక్తబట్టబై లేమి లే దనువాఁడు
రాగిగాఁ డతఁడు విరాగిగాఁడు
నెఱిఁగి శరీరంబు నేమిలేదనువాఁడు
జ్ఞానిగాఁ డతఁడు నజ్ఞానిగాఁడు
నున్న దున్నట్టుగా నుండఁజూచినవాఁడు
కర్మిగాఁ డతఁడు దుష్కర్మిగాఁడు

లేమి మాయావిద్య లేమి లేదనువాఁడు
ఘనుఁడుగాఁ డతఁడు కించనుఁడుగాఁడు

తే. అనుమతంబైన జగము లేదన్నవాఁడు
బంధమోక్షద్వయంబులఁ బడనివాఁడు, ర...98

సీ. ఈయుత్తబట్టబె లేమి లేదనుస్వధా
పరిపూర్ణమై యుండు బ్రకృతి లేదు
కలలోనఁ గనుఁగొన్న గజమేమి లేనట్టి
యొఱుఁగ శరీరము నేమి లేదు
ఇది గురువాక్యంబు నింతకంటెను మహా
వాక్యరహస్య మెందైన లేదు
ఇది రాజమార్గంబు నిది యనాయాసంబు
నిది భ్రాంతిరహితంబు నిది స్థిరంబు

తే. నిదియు నమ్మినవారికే యొగ్గులేదు
లేదు జన్మంబు మరణంబు లేదు లేదు, ర...99

సీ. భారతీపతి రమాపతి పార్వతీపతి
వాసవాద్యఖిల దేవతలయందు
మానవాశ్వగవాది మశకపిపీలికాం
తము జీవులందుఁ జైతన్య మొకటి
యట్టిచైతన్యమే యాత్మబ్రహ్మం బను
పదములకు లక్ష్యార్థభావ మిదియుఁ
గమలజాదిపిపీలికాంతశరీరముల్
వాచ్యార్థ మని వాని వదలితేని

తే. యాపరబ్రహ్మచైతన్య మాత్మలనెడు
వాదభేదంబులేకాని వస్తు వొకటి, ర... 100

సీ. బ్రహ్మకల్పంబులు ప్రతియుగంబులుగాదు
సంవత్సరములు మాసములుగాదు
పక్షముల్ తిథివారనక్షత్రములుగాదు
గ్రహయోగకరణలగ్నములుగాదు
పర్వముల్ ఋతువులు పగలు రాత్రులుగాదు
వెలుఁగు చీకటి మేఘములునుగాదు
యుదయాస్తమయములు నుపరాగములుగాదు
త్రివిధకాలముగాదు దిశలుగాదు

తే. నాదబిందుకళల్గాదు నభముగాదు
జీవనిర్జీవులును గాదు కేవలాత్మ, ర... 101

సీ. పరిపూర్ణమైయున్న పరమాత్మబ్రహ్మవి
ద్యకు యోగమైన కాయంబు నిందు
బుద్ధికి సాక్షియై స్ఫురియింపుచున్నది
యహమనుపదమున కర్థమగును
ప్రతిలేనిదై స్వతఃపరిపూర్ణ పరమాత్మ
బ్రహ్మశబ్దమున కర్థంబు నిదియు
నహమేవ బ్రహ్మబ్రహ్మైవాహ మని యున్న
నస్మ నేపదమున కర్థ మనుచు

తే. నెఱిఁగి వాచ్యార్థములనెల్లఁ బరిహరించి
యనుభవజ్ఞాని పొందు లక్ష్యార్థమందు, ర...

సీ. దయభయధైర్యశ్రద్ధాలజ్జశమదమ
దర్పహంకారేచ్ఛదంభదైన్య
మదలోభమోహకామక్రోధమత్సర
సుఖదుఃఖక్షయవృద్ధిక్షుత్పిపాస
సంశయ నిశ్చయ సంకల్ప వైకల్ప్య
కంపనాకుంచన గమన చలన
శ్వాసనిశ్వాసవిసర్గవ్యాపక రాగ
ద్వేషకుటిలగర్వవేషభాష
తే. వినయమానాభిమానాదివిషయసంఘ
ములును నిజకేవలాత్మకు గలుగ వెపుడు, ర...
సీ. బ్రాహ్మణోత్తములైన పరగక్షత్రియులైన
వైశ్యశూద్రులునైన వాంఛ గలిగి
ఈపద్యముల నన్ని యింపుగా విని వ్రాసి
చదివినజనులకు సౌఖ్యముగను
ధనధాన్యములు వస్త్రకనకభూషణములు
సుతసతుల్ హితబంధుసోదరులును
గజతురంగంబులు ఘనమైన పశువర్గ
మాందోళనము శుభం బతిథిపూజ
తే. లాయురారోగ్య మైశ్వర్య మమరి సుఖము
గలిగియుందురు మోక్షంబు గలిగి నిజము ర...
సీ. శ్రీకరలోకప్రసిద్ధుఁడై పరశురా
మాన్వయాంభోధిహిమాంశుఁడైన

కూలంకషజ్ఞానకోటీశ్వరునకు శ్రీ
సుబ్బమాంబకు నేను సుతుఁడ నయ్యు
నరసింహదాసుండ నని పేరు విలసిల్లి
యమలకంభాలూరి యప్పగురుని
కరుణాకటాక్షంబు గలిగి వేదాంతార్థ
సారము లెస్సగా సంగ్రహించి
తే భరితముగ నూటనెనిమిదిపద్యములను
ప్రేమతోఁ జెప్పి మీకు నర్పించినాను, ర...
సీ. ఇంపుగా జెప్పిన యీనూట యెనిమిది
మహనీయపద్యముల్ మౌక్తికములు
ప్రాసవిశ్రమములు బంగారుకోలుకులు
కూర్చిశబ్దంబులు కూర్పుటయగు
పరమతత్త్వార్థముల్ పచ్చలపతకంబు
మీయంకితంబును మేరుపూస
యీరీతి మౌక్తికహారంబు జేసి నే
ముదముతో నర్పించి మ్రొక్కినాను
తే. కంఠమందున ధరియించి ఘనతమెఱసి
నన్ను రక్షించు నిను సదా నమ్మినాను, ర...
సీ. దశరథసుకుమార దానవసంహార
మందరనగధీర మంగళంబు
నీరజదళనేత్ర నీలతోయదగాత్ర
మౌనిజనస్తోత్ర మంగళంబు

సీ. దయభయధైర్యశ్రద్ధాలజ్జశమదమ
దర్పహంకారేచ్ఛదంభదైన్య
మదలోభమోహకామక్రోధమత్సర
సుఖదుఃఖక్షయవృద్ధిక్షుత్పిపాస
సంశయ నిశ్చయ సంకల్ప వైకల్ప్య
కంపనాకుంచన గమన చలన
శ్వాసనిశ్వాసవిసర్గవ్యాపక రాగ
ద్వేషకుటిలగర్వవేషభాష
తే. వినయమానాభిమానాదివిషయసంఘ
ములును నిజకేవలాత్మకు గలుగ వెపుడు, ర...
సీ. బ్రాహ్మణోత్తములైన పరగక్షత్రియులైన
వైశ్యశూద్రులునైన వాంఛ గలిగి
ఈపద్యముల నన్ని యింపుగా విని వ్రాసి
చదివినజనులకు సౌఖ్యముగను
ధనధాన్యములు వస్త్రకనకభూషణములు
సుతసతుల్ హితబంధుసోదరులును
గజతురంగంబులు ఘనమైన పశువర్గ
మాందోళనము శుభం బతిథిపూజ
తే. లాయురారోగ్య మైశ్వర్య మమరి సుఖము
గలిగియుందురు మోక్షంబు గలిగి నిజము ర...
సీ. శ్రీకరలోకప్రసిద్ధుఁడై పరశురా
మాన్వయాంభోధిహిమాంశుఁడైన

కూలంకషజ్ఞానకోటీశ్వరునకు శ్రీ
సుబ్బమాంబకు నేను సుతుఁడ నయ్యు
నరసింహదాసుండ నని పేరు విలసిల్లి
యమలకంభాలూరి యప్పగురుని
కరుణాకటాక్షంబు గలిగి వేదాంతార్థ
సారము లెస్సగా సంగ్రహించి
తే భరితముగ నూటనెనిమిదిపద్యములను
ప్రేమతోఁ జెప్పి మీకు నర్పించినాను, ర...

సీ. ఇంపుగా జెప్పిన యీనూట యెనిమిది
మహనీయపద్యముల్ మౌక్తికములు
ప్రాసవిశ్రమములు బంగారుకొలుకులు
కూర్మిశబ్దంబులు గూర్పుటయగు
పరమతత్త్వార్థముల్ పచ్చలపతకంబు
మీయంకితంబును మేరుపూస
యీరీతి మౌక్తికహారంబు జేసి నే
ముదముతో నర్పించి మ్రొక్కినాను
తే. కంఠమందున ధరియించి ఘనతమెఱసి
నన్ను రక్షించు నిను సదా నమ్మినాను, ర...

సీ. దశరథసుకుమార దానవసంహార
మందరనగధీర మంగళంబు
నీరజదళనేత్ర నీలతోయదగాత్ర
మౌనిజనస్తోత్ర మంగళంబు

భానుజవర్ధన భక్తజనార్దన
భవలోకపరిహార మంగళంబు
కమలామనఃఖేల కాంచనమయచేల
మహనీయకులశీల మంగళంబు
తే. మన్మథాకార రఘువీర మంగళంబు
మాధవానంద గోవింద మంగళంబు
రమ్యగుణధామ భద్రాద్రిరామ పరశు
రామ నరసింహదాససంరక్షితాంహ. 107

సీ. ఈపద్యశత మెవ్వ రింపుతోడఁ బఠించి
యాచార్యకరుణచే నమలమైన
స్వానుభూతివహించి సరవిఁ జెన్నొందుదు
రట్టివారలు భువి నహరహంబు
వాక్కుచే వర్ణింప వశము గానిదియును
నాత్మలోఁ దలఁపరానట్టిదియును
దేశకాలాదులం దిమడనట్టిదియును
నంతటఁ దానయై యలరునదియు
తే. నగుచుఁ దన కన్యమును లేక యలవిగాక
నిట్టి దట్టిది యని నిర్ణయింపరాని
బట్టబయలైన బ్రహ్మంబుఁ బడయగలరు,రమ్య...

# పీఠిక.



ఈశతకము రచించినది తిరువాయిపాటి వెంకటకవి. పరాంకుశునికుమారుఁడు. ఇతఁడు రచించిన శతకము యాదగిరినృసింహా యనుమకుటము గల కందశతక మింకను ముద్రితము కాలేదు. కవికులస్థలము లీశతకమునందు లేకున్నను ప్రవాదములనుబట్టి యెఱుంగవచ్చును. కవి నిజాము రాష్ట్రములోని నల్లగొండమండలమునకు జెందిన కొలనుపాకలోఁ గొంతకాలము నివసించెననియు సాతానివైష్ణవుఁడనియు ఎనుబదిసంవత్సరములక్రిందట నుండియుండెననియుఁ గొందఱు చెప్పిరి. ఇతరాధారములు లభించువఱకీ ప్రవాదమును విశ్వసింపక తప్పదు.

మేము శతకసంపుటములోనికి అముద్రితశతకములను సేకరించుట విన్నంతమాత్రమున తమ చెంతగల యీశతకమాతృకను మఱియొక(యాదగిరినృసింహా)శతకమును మాకొసంగి మ-రా-శ్రీ గంగరాజు రఘునాథరావుగారు తోడ్పడుటచే శుద్ధప్రతివ్రాసి ప్రథమముద్రణము గావింప నవకాశము చిక్కినది. రఘునాథరావుగారివలె నాంధ్రభాషాభిమాను లెవరే నిజామురాష్ట్రకవుల యముద్రితశతకము లొసంగిరేని ప్రత్యంతరము వ్రాసి

కొని వారిప్రతి వారి కొసంగి కృతజ్ఞులము కా నున్నారము. ఈయవకాశమును బోనీకుండుటకు రాష్ట్రీయసోదరాంధ్రులు ప్రార్థితులు.

ఈశతకమకుటమునందలి యాదగిరినృసింహ క్షేత్రము ఇది నిజాము రాష్ట్రమునందు సుప్రసిద్ధదుర్గము భువనగిరికి ఆరుకోసులదూరమునను వంగపల్లి స్టేషనుకు మూఁడునాలుగుమైళ్లదూరమునను గల గుట్టపై నున్నది. మార్గశిర శుద్ధమునం దిచట గొప్పయుత్సవములు జరుగుచున్నవి. యాదగిరి నేకృష్ణామండలమునందలి వేదగిరిగాఁ గొందఱు భావించిరిగాని యది ప్రమాదము. యాదగిరి నరసింహునిగూర్చి వ్రాయఁబడినశతకములు యక్షగానములు గేయములు పెక్కులు గలవు. నిజాము రాష్ట్రీయ సోదరులతోడ్పాటుతో నవి యన్నియు నార్జించిన వాఙ్మయమున కెంతయో సేవగావించినట్టు లగును. ఈయముద్రితశతకమును ముద్రణమున కొసంగిన రఘునాథరావుగారియెడలఁ గృతజ్ఞులము.

ఇట్లు భాషాసేవకులు
శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

నందిగామ,
1-6-26

శ్రీ ర స్తు.

# యాదగిరీంద్ర శతకము.

---

ఉ. శ్రీనరసింహా దోషగజసింహా రమేశ మహాను
భావ యో, భానుసహస్ర తేజ భవబంధవిమో
చన భక్తరక్షణా, దీనదయాపరా సుగుణదీపిత
తావకపాదపద్మముల్, ధ్యానముజేసి నిన్ను
మది దల్చెద యాదగిరీంద్ర మ్రొక్కెదన్. 1

చ. యతిగణప్రాసలక్షణరహస్య మెఱుంగను బద్య
శైలియున్, మితముగ శబ్దసంతతులు మేలుగఁ
గూర్పురహస్య మింతయున్, మతిని గ్రహింపకే
తమనుమానసమందున సంతతంబు నీ, క్షితి గదు
నమ్మియుంటిగద శ్రీహరి యా... 2

ఉ. నీదుబలంబుఁ జూచుకొని నిక్కముగా రచి
యింపఁ బూనితిన్, మేదిని నాదుజిహ్వపయి
మీకృపతోడ సుశబ్దసంగతుల్, మోదముతోడఁ
గూర్చి యిఁక ముందు జను లని మెచ్చునట్లుగాఁ,
బాదుగఁ జేయ నీదె సుమి భారము యా...3

ఉ. సంశయ మేల నీకు సురసన్నుతగాత్ర రమా
కళత్ర నే, వింశతు లైదుపద్యములు వేగమె
కూర్పఁ దలంచినాఁడ నీ, యంశను దప్పు లొప్పు
లను హానియు వృత్తులు దొర్లలేవుగా, సంశయ
మింత లేదు గుణసాగర యా... 4

ఉ. శ్రీతరుణీసమేత మునిసేవిత భక్తజనాళిపోష
పా,పాత్ముల పాపసంఘములఁ బారఁగఁదోలెడి
వాఁడ వంచుఁ బ్ర, ఖ్యాతిగ నమ్మితిఁ జగతి
కర్తవు మన్మథకోటితేజ స, త్ప్రీతిగ మమ్ము
బ్రోవు భవభేదన యా... 5

ఉ నమ్ముకయున్నవాఁడ సుమి నారదసన్నుత లక్ష్మి
నాథ నీ, సమ్మతితోడఁ గూపమునఁ జక్కఁగ
నుంచిన మేలు మేలెకా, సమ్మతిలేక మోక్షసుఖ
సంపద లిచ్చిన మేలె నేను నీ, సొమ్మని నమ్ము
కొంటి మురసూదన యా... 6

ఉ. దుష్టజనంబులం దొడరి త్రుంచిన దివ్యపరాక్ర
మాఢ్య నీ, చేష్టల నెంచ రుద్రసరసీరుహసంభవ
శక్యమే ననుఁ; శిష్టులలోనఁ జేర్చి దయజేసెడి
దాతవుగాన నిన్ను వి, స్పష్టము నమ్మినాఁడ భవ
బంధన ధర్మపురీనృకేసరీ. 7

ఉ. భావములోన నిన్నుఁ గడుభక్తి దలంచుచు

నున్నవాఁడ నఁట, గావవె సర్వలోకజనకర్తవు
భర్తవు దాత దైవముఁట, నీవె యితఃపరం
బెఱుఁగ నీరజలోచన పాపలోకసం, జీవము
పాదసేవ దయచేయవె యా... 8

ఉ. ధారుణి నెట్టివాని సతతంబును నమ్ముక యున్న
మానవుఁట, గూరిమితోడఁ జూచి కులగోత్రము
లెంచక మానగుప్తముఁట, ధీరతయిచ్చినట్టు లిఁక
దీనునియం దదెరీతిఁ జూడుమీ, కోరితి నీపదా
బ్జములఁ గొల్వఁగ యా... 9

ఉ. నిన్ను మదిం దలంచితిని నీరజలోచన నీమహా
త్వముఁట, ఎన్నతరంబుగాదు నను నేమరకఁట
దరిజేర్చుశౌరి యా, పన్నశరణ్య భక్తజనపాల
సుశీల గుణాలవాల నిఁట, సన్నుతిజేసితిఁట
సుగుణసాగర యా... 10

ఉ. కంటిని పాదపద్మములు కంటిని జంఘులు మధ్య
దేశముం, గంటిని శంఖచక్రములఁ గంటిని నీ
కనుదోయి కర్ణముల్, గంటిని నీదుపల్వరుసఁ
గంటిని నీముఖతేజముఁట మధిఁట, గంటి కిరీట
మస్తకము గావవె యా... 11

ఉ. చూచెద ఫాలమందుఁ దిరుచూర్ణపురేఖలు
కోరమీసముల్, చూచెద నీదునాసికము

సొంపగు శ్రీపతకంబు హారముల్, జూచెద హాట
కాంబరము చోద్యపుగంటలు గజ్జె లందెలుల్,
జూచెద నీదువైభవముఁ జూపవె యా... 12

ఉ. ఎంతని వేఁడుకొందు నిఁక నేమని కోరుదు
నిందిరేశ నీ, కెంతకు రాకయుండె దయ
హీనుఁడు వీఁడని యెంచినావ నీ, చెంతకు రాక
యన్యులను జేరను నీవిఁకఁ బ్రోవఁజూపుమా,
సంతతభోగితల్పగుణసాగర యా... 13

ఉ. పిల్లకుఁ దల్లిచందమునఁ బ్రేమను నుగ్గును బోసి
నట్లు నీ, న్నుల్లములోనఁ జాల దయయుంచియు
సాకెడిభారమంటి బ, ల్బల్లనిసామి వంటి నిను
సన్నుతిఁజేయుచు నుంటి నయ్య యు, త్ఫుల్ల
సరోజనేత్ర నను బ్రోవవె యా... 14

ఉ. ఏ రిఁక వేల్పు నీకు సరియొందును గాంచినఁ
గానరారు నీ, వ్రాఱకయుండఁ జెల్ల దిఁక నుర్విని
నెవ్వఁడు సంస్మరించినన్, వారిని గాచి బ్రోచి
మది వాంఛలు దీర్చితివేని గల్గు నీ, ధారుణి
కీర్తియంచు మది దల్చవె యా... 15

ఉ. చక్కనివాఁడవంటి సరసంబు లెఱింగినసామి
వంటి నీ, వెక్కడ నుంటి వంటి నిను నెప్పుడు
కన్నులఁ గాంతు నంటి నే, నిక్కము నమ్మియుంటి

నీఁక నేర్పునఁ బ్రోవుమి యంటి నీసుతుల్,
మ్రొక్కినఁ జేతులన్ దునుమముద్దౌ యా...

ఉ. కంజదళాక్ష నిన్ను నవకంజదళాక్షిని కండ్లగాం
చెదన్, రంజితమైనకంఠమున రత్నసరు ల్గని సం
తసించి నే, నంజలిజేసి నీదుచరణాంబుజముల్
తలపైని దాల్చెదన్, మంజులభాష సత్సుగుణ
మానస యా... 17

ఉ. భూమిని దుష్టచిత్తమున భూరిగఁజేసితి పాప
సంఘముల్, ఏమని విన్నవింతు మఱి యేవిధ
మియ్యది నిర్వహింతు శ్రీ, స్వామి పరాత్పరా
యనుచు సన్నుతిఁజేయక మోసపోయితిన్,
ప్రేమదలంచి కావు మిక వేగమె యా... 18

ఉ. రోగము రాఁగ మీపదసరోరుహతీర్థము లిచ్చి
కావవే, బాగుగ క్షుత్తుబాధకును భారము దీర్చి
ప్రసాద మిచ్చియున్, రాగము నిల్పి సౌఖ్య
మిడరాద మురారి సురారిభంజనా, యేగతి
నిన్ను వీడునెడ నీశ్వర యా... 19

ఉ. నిక్కము నీదుదాసులను నిందలుజేయుచు
నుంటి దాతలున్, జక్కఁగ దానమీయగను
జయ్యన వద్దని సంతసించితిన్, గ్రక్కున దేవ
బ్రాహ్మణులకార్యము లన్నిటి నెత్తి గొట్టితిన్,
ఎక్కువ పాపి వీఁ డనక యేలవె యా... 20

చ. అడవి జరించుపక్షులకు నన్నిటి కెవ్వఁడు మేఁత యిచ్చెనో, పుడమిని వృక్షసంతతికిఁ బూర్తిగ నెవ్వఁడు నీరుబోసెనో, పడఁతుల గర్భపిండములఁ బాలన యెవ్వరు చేసి రివకా, తడయక నన్ను బ్రోచుటకు దాతవు యా... 21

ఉ. శ్రీశ పరాశరాదిమునిసేవిత భాస్కరవంశభూషణా, కేశవ వాసుదేవ సురఖేదనివారణ వీరశూరలో, కేశ రమేశ దివ్యతరకీర్తివహించినశౌరి నీకృపన్, దాసునిఁ జేసికోవె ననుధారుణి యా... 22

ఉ. శ్రీధర మేరుధీర మునిసేవిత కౌస్తుభవక్షదుష్టదు, ర్యోధనవంశనాశనుత యోగిముకుందాంతక మాధవాచ్యుతా, భూధరధారి భక్తకులపోష సురార్చిత తార్క్ష్యవాహనా, ఈధర ప్రేమతోడ నను నేలవె యా... 23

ఉ. వాదముచేయఁగా నరులు వాక్యపరుండనియొగ్గుచేతురన్, మోదముతో భుజించునెడ ముందుగఁ బిల్తురు తిండిపోతుగా, ఏదియుఁ బల్కకున్నయెడ నీతఁడు మూగని యెంచుచుందు రా, నీదయ గల్గఁగా సుఖము నేర్పను యా... 24

ఉ. తల్లియుఁ దండ్రియున్ మఱియుఁ దమ్ములనన్నల మేనమామలన్, గొల్లగ బంధువర్గములఁ గూరి

మిభార్యను మేనబావలన్, ఉల్లములోన నమ్ము
కొనియున్ జెడిపోయితి నిన్నుగానకే, కల్లలు
గావు నీకృపను గావవె యా... 25

ఉ. చేతులతోడ నీదుపదసేవ యొనర్చెద నెల్లకా
లముం, బ్రీతిని నీదుసత్కథలు వీనులవిందుగ
విందు లోకవి, ఖ్యాతిని నిన్ను నాకనులఁ గాం
చియు సంతస మందుచుందు నీ, భూతలమందు
నీదుదయ ముఖ్యము యా... 26

ఉ. మందరధీర విద్య గలమానవు లందఱు నీకు
భక్తులే, సుందరగాత్రసద్గుణులు సూరిజనం
బులు చేరియుందురే, యిందఱిలోన ద్రవ్యపరు
లెందఱికైనను దాన మిత్తురే, యొందును గాని
వాఁడ నను నేలవె యా... 27

ఉ. కాలము రాఁగ నిన్ను మది గ్రక్కున నెంచిన
వాఁడె ముక్తుఁడౌ, కాలుని బాధలం బడఁడు
గాన నుతించెద నంటినా స్మృతిన్, జాలదు
నీయనుగ్రహావశంబునఁ గొల్చితి నింతలోనిదే,
మేలని నన్నుఁ బ్రోవఁగదె మేకొని యా...28

చ. దురమున శత్రులన్ దోలఁగఁ ద్రోయఁగవచ్చు
మహాబలంబుమై, కరమునఁ బాము నుంచికొని
కంఠమునందునఁ దాల్పవచ్చుఁ బేం, జెఱువుల

నున్న నక్రములం జెందఁగవచ్చు ఫలం బదేమి నీ,
స్మరణము జేయఁగా దొరకు సద్గతి యా... 29

ఉ. ధారుణిలోన దుష్టు లగుతాటక పూతన దుష్ట
కంసునిన్, భూరిబలాఢ్యు రావణుని పృథ్వీభయం
కరుఁ గాంచనాక్షునిన్, శూరుఁడు హేమకశ్య
పుని సోమకదైత్యులనెల్లఁ ద్రుంచియున్, గారణ
మెంచి శిష్టులను గాచిన యా... 30

ఉ. ధాత మహేశ్వరుల్ నరుని దంతిపతిన్ విదు
రార్కసూనులన్, బ్రీతిని వాయుపుత్రకు విభీ
షణు వాయసదానవాధమున్, నాతి యహల్య
ద్రౌపది జనంబుల సద్దయఁ జూచినట్లు నన్, బ్రీతి
మెయిన్ గణించఁ గదవే హరి యా... 31

ఉ. శ్రీహరి యంచుఁ బిల్చితిని శీఘ్రము పల్కవదేమి
పాపమో, ద్రోహములం గలంతు వని తొల్తనె
వేఁడితి కూర్మి లేదొకో, సాహసశౌర్యధైర్యగుణ
సంయుతుఁ డీతఁడు గాఁ డటంచు సం, దేహము
నొందెదేని యిఁక దిక్కెది యా... 32

ఉ. భక్తి మనంబునన్ నిలుప భాగవతుండ ధ్రువుండ
నొదునా, రక్తిని గీర్తనల్ సలుప రమ్యగుణుం
డగునారదుండనా, యుక్తిని శాస్త్రసంతతుల
నొప్పుగఁ జేయఁగ వ్యాసమౌనినా, శక్తివిహీ
నమానవుఁడ సాకవె యాదగిరీంద్ర మ్రొక్కెదన్.

ఉ. కుండలిశాయి సద్విమలకోమలపాదము రారి
మాధవా, ఖండలమండితాసురవిఖండనసూరి
జనాళిసేవితా, చండిమనోహరాది విధిసన్ముని
మిత్ర రమాకళత్ర వే, దండ సురక్షభూరిజనదా
తవు యాదగిరీంద్ర మ్రొక్కెదన్. 34

ఉ. కారణపుణ్యమూర్తి యగుకాముని గన్న మహా
నుభావ బృం, దారకమానిపోష సముదారమనో
హారచంద్ర చంద్రికా, స్మేరముఖాంబుజాత రిపు
శిక్షణదక్షిణహస్త భక్తవ్యా,ద్వారవిహార నాయ
ఘము బాపవె యా... 35

ఉ. శ్రీరమణీకళత్ర బుధసేవితభూరిభవాబ్ధినావ స,చ్ఛీ
లగుణాలవాల యదుశేఖర సంతతదాసపోష నీ,
లాలకకాంచనాంబర సులాలిత నీరదగాత్ర నీకృ
పన్, బాలనచేయవే పతితపావన యా... 36

ఉ. నీరజనేత్ర నామనవి నీచెవి సోకఁగ విన్నవిం
చెదన్, జారుఁడఁబాపసంచయుఁడ చాలదురాత్మ
దురంతకర్ముఁడన్, గ్రూరుఁడఁ జోరుఁడన్ గఠిన
కుత్సితుఁడన్ దొసఁ గెంచఁబోక నన్, నేరుపు
తోడఁ జూచి కరుణింపవె యా... 37

ఉ. మందరగోత్రధారి వనమాలి మదాసురజాలహం
తగో,విందముకుందభక్తజనవిశ్రుతనామ యశో
దనందనా, వందితమానిబృంద సురవాసవసన్ను

తపంకజాననా,సుందరపాదపద్మములఁ జూపవె.
యా... 38

ఉ. మానము నేల ద్రౌపదికి మన్ననఁ గోకలఁ బెక్కు
లిచ్చితో, ధ్యానము చేయఁగాఁ గరికి తత్త్వపదం
బగుమోక్ష మిచ్చితో, పూని దరిద్రవిప్రునకు
భూరిపదార్థము లిచ్చినాఁడ వ, న్లే నను నేల
భారమొ కడింది గ యా... 39

చ. గిరిధరణప్రవీణ నవకీర్తిసమంచిత దిగ్దిగంతరా,
కరిదురితౌఘదూర ఖరఖండనసాగరకన్యకావనా,
కురుకులవంశనాశ గుణకోటిసమన్విత పుణ్య
విగ్రహా,తరణికులాబ్ధిచంద్ర వరదాయకయా...

చ. తిరుమల వేంకటేశుఁడవు ధీయుత కాంచిపురీనివా
సుఁడుగా, ధరణిని యాదవాద్రిపురధాముఁడ
వైతివి భద్రశైల సు, స్థిరరఘురాముఁడుగా
మఱియు శ్రీపురుషోత్తమపౌరధాముఁడుగా, నిర
తము నీవెగానఁ గరుణింపుమి యా... 41

చ. కురుకులవంశనాశ యదుగోత్రవిభూష మురారి
మాధవా, స్మరశతకోటితేజ సురశత్రువిదారణ
మిత్రపోషణా, సరసిరుహాక్ష పాపచయసంహార
నీరదనీలగాత్ర మం, దరధరధీర పాహినుత
తాపస యా... 42

చ. నిరతము నిన్ను నమ్మితిని నీరజలోచన నామనం
బునన్, దురితములం గనుంగొనెడి తోయజనా
భుఁడ వంచు వేఁడితిన్, పరమదయాళు భక్త
జనపాలక నీరదనీలసుందరా, ధరధర నీవు నాకు
గతి ధారుణి యా... 43

చ. సునయముతోడ నన్నుఁ బరిశుద్ధుని జేసియు నేల
రాదె స, ద్వినయవిధేయ నాదుభవవేదన మా
న్పఁగలేవ యింక నీ, మనసుకు రాదె వీఁడు చెడు
మానిసి యంచుఁ దలంప నాయమా, నెన
రిసుమంతవద్దె నుతనిర్జర యా... 44

ఉ. సత్యము బల్క కెల్లపు డసత్యములాడుచుఁ
బొద్దుపుచ్చితిన్, నిత్యము నిన్ స్మరింపకయె
నే భవసాగరమందుఁ గ్రుంకి దు,ష్కృత్యుఁడనై
తిఁగాదె మృదుకోమలదేహ సరోరుహాక్ష యా,
భృత్యుని గావరాదె యింకఁ బొంగుచు యా...

ఉ. వక్షమునందు లక్ష్మిగలవాఁడ వటంచుఁ దలంచు
చుంటి నీ, కుక్షిని సర్వలోకములఁ గూర్చుక
యున్న మహాత్మ వేగఁ బ్రత్యక్షపురూపుఁ జూపి
నను నారసి బ్రోవఁగ వేఁడితిన్ జగ, ద్రక్షక
పక్షివాహ గుణరాజిత యా... 46

చ. భువిఁ గమలాప్తవంశమునఁ బుట్టినసద్గుణుఁ డం
బరీషభూ, ధవునికుమారిక న్గనియుఁ దప్పక

నారదపర్వతుండు నా, యువిదను మాకొసంగు
మన నొప్పునె యిద్దఱి కీయ నంచనన్, వివర
ముతో గ్రహించితివి వేగమె యా... 47

ఉ. సూరకులాబ్ధిచంద్ర భవశోషణ కాంచనచేలధారి
సద్భూరిభుజాపరాక్రమవిభూషిత హేమకురం
గహంత శ్రీం, గారకిరీటనీలనిభగాత్ర ముకుంద
మురారి రత్నశ్రీం,గారమనోజ్ఞహార బుధకల్పక
యా... 48

ఉ దుష్టుఁడు పాపకర్ముఁ డని దూరముచేయక వేగ
బ్రేమచే, శిష్టులలోన నిల్పి దరిజేర్పఁగ నిన్నెద
నాశ్రయించితిన్, సృష్టిని మున్ను దోసములఁ
జేసినవారల నేలలేదె నీ,యిష్టమురాద నాపయి
హరీ హరి యా... 49

ఉ. అండజవాహ మంగళగిరచ్యుత కూర్మగిరీశవా
డప, ల్లండఁగఁ జేసికొన్నహరి వైతి వహోబల
నాథ ధర్మపు, ర్యండమహానుభావ విమలార్వ
పలీశ్వర నీపదంబులన్, దండిగ నామనంబునను
దాల్చెద యా... 50

దశావతారములు.

ఉ. ఆదియుగంబునందు నిగమాదులకై వడి మీన
రూపమున్, మోదముతోడఁ దాల్చి సురము

ఖ్యులు గొల్వఁగ సోమకాసురుణ్, బాదుగఁబట్టి
త్రుంచితివి పద్మదళాక్ష జగత్పవిత్రకాశ నీ,పాదయు
గంబు నెంతు గుణావన్మణి యా... 51

ఉ. భీకరమైనకూర్మమున బింకముతో వడి కొండ
నెత్తి ల,క్ష్మీకర దేవసంఘముల క్షేమము గోరియు
నాతిరూపమై, చేకొనియుణ్ సుధారసము
సేవకులందఱి కిచ్చివట్టి సు, శ్లోకరమేశ దైత్య
గణసూదన యా... 52

ఉ. ఆదివరాహరూపమున నాకనకాక్షునిబట్టి త్రుంచి
యుణ్, మోదముతోడ భూమి భయమున్
దొలఁగించిన జాణవయ్య దు, ర్వాదులయందు
నిగ్రహము వారక చూపియుఁబ్రేమమీఱఁగాఁ,
బేదలఁ గాచి బ్రోచితివి వేడ్కను యా... 53

ఉ. ఆకనకాక్షు నగ్రజునికై మును స్తంభమునందు
బుట్టి యా, లోకము చూడఁగాఁ గడుపులోని
నరంబులదీసి చంపితో, భీకరనారసింహ జగదీ
శ్వర పుణ్యపురాణమూర్తి సు,శ్లోకభవత్పదద్వ
యముఁ జూపవె యా... 54

ఉ. వామనరూపివయ్యు బలివద్దకుఁ జేరియు మూఁడు
పాదముల్, భూమిని దానముం గొనియు భూగ
గనంబులఁ గొల్చి గర్వముణ్, జాముగ వంచి వేసి

తివి సామజరక్షక నీప్రతాపము, శ్రీమహిమంబు
నెమ్మది స్మరించెద యా... 55

ఉ. భార్గవరామమూర్తివయి పట్టి వధించి తనేకరా
జులన్, స్వర్గముదాఁక వారల విశాలశిరంబుల
మెట్లుగట్టియున్, మార్గములన్ సృజించితివి
మన్మథకోటిసమానరూప యా, మార్గముఁ
జూపరాదె హరి మాధవ యా... 56

ఉ. తాటకఁ ద్రుంచి యాగమును దక్షిణమే మును
గాచి అతిని, బోటిగ వేగఁజేసి చని భూమి
సుతం దగఁబెండ్లియాడి బ, లాఢ్యుఁడైన రావ
ణుని గ్రక్కునఁ ద్రుంచి యయోధ్యఁజేరు నీ,
సాటియుదారు లేరి బుధసన్నుత యా... 57

ఉ. యాదవవంశమం దుదయమై బలరామసమాఖ్య
నొప్పియున్, మేదినియంతయుం దిరిగి మేటి
వటంచును పేరుపొందితో, నీదుపరాక్రమక్ర
మము నేరను వాకొన రేవతీశ నీ, పాదయు
గంబు నెంతు బలభద్రుఁడ యా... 58

ఉ. భూవర భక్తరక్ష పరిపూర్ణదయాకర లోకపా
లకై, రావతరూఢవంద్య త్రిపురాసురభార్యలప
ద్వ్రతంబులన్, భావజరూపబౌద్ధమున భంగ
ముజేసిన లోకరక్ష నీ, సేవ యొనర్తు సంతతము
శ్రీహరి యా... 59

ఉ. ఏకులమందుఁ గాంచినను నింత సుశీలము జ్ఞాన
భక్తులుఁ, లేక చరింపఁ జూచి యటులే యవ
తారము లెత్తి నిల్చియుఁ, లోకములోని
దుష్టజనలోకము దున్మిన కల్కిరూపముఁ,
మాకడఁ జూపరాదె గుణమండన యా... 60

రామచరితము.

చ. దశరథరాజుగర్భమున ధారుణియందు జనించి
మించి యా, కుశికజు వెంబడించియును గుత్సిత
రాక్షసు నట్టె గూల్చియుఁ, విశదముగాను
జన్నమును వేగమ కాచినవాఁడ వౌ భళీ, రసి
కతతోడ నీవిటుల రాఁగదె యా... 61

చ. జనకునియాజ్ఞఁ బుచ్చుకొని జానకి లక్ష్మణ
మూర్తి నీవు స, య్యన విపినంబు జేరి మును
లంద ఱొసంగినవిందులఁ భుజిం,చిన పిదపఁ
ముదంబునను జిత్రకుటీరము జేరి యావలఁ,
దనుజువిరాధునిఁ దునుము ధన్యుఁడ యా. 62

ఉ. తాపసవర్యులందఱ కుదారతతో నభయంబు
లిచ్చి య్యప్పాపపుఁ జుప్పనాతి విషభావముతో
నిను డాయవచ్చి నీ, రూపును జూచి మోహ
పడి రూఢిగ నన్ను రమింపుమన్న బ్బలోకప
ము జేసి ముక్కు చెవి గోసిన యా... 63

ఉ. ధీరుఁడవై యరణ్యమునఁ దేజముమై నిలుచుండి
యుండ బల్, శూరుఁడు దైత్యుఁడౌ ఖరుఁడు
సూర్యసముద్భవురీతివచ్చి తా, ఘోరున బొబ్బఁ
బెట్టి నిను భూమిని గూల్చెద నన్న యాతనిన్,
మీఱి వధించితీవెగద మేకొని యా... 64

చ. దురమున దూషణుండు మఱి ద్రోహి త్రిశీర్షుఁడు
సేనగొల్వఁగా, నురువడి రాఁగఁ జూచి తమరొ
క్కరె నిల్చియు వారి నందఱిన్, శరముల వేసి
త్రుంచితివి శంకరముఖ్యులు సన్నుతింపఁగా,
మఱి నిను గొల్వ నాకు వశమా హరి యా...

చ కపటముతోడ దానవుఁడు గ్రక్కునఁ దాను
కురంగరూపుఁడై, విపినమునన్ జరించునెడ
వేగమె జానకి జూచి సుందరం, బపరిమితం
బటంచు హృదయంబున మెచ్చియు మీకు
దెల్పఁగా, నవుడె వధించినాఁడవు రయం
బున యా... 66

ఉ. సీతను దేరిపైన నిడి శీఘ్రింబుగాఁ జను రావణా
సురున్, ఆతఱి జూచి పక్షివిభుఁ డాతనితో నని
చేసి చావఁగా, భూతలమందునన్ యశము
పుణ్యము స్వర్గమునందుఁ గూర్చు నీ, ఖ్యాతిఁ
బ్రశంసజేయతరమా హరి యా... 67

చ. ఇభపరిరక్షకా శబరి యిష్టఫలంబులఁ దెచ్చి
యీయఁగా, రభసముతోడఁ బుచ్చుకొని
రక్షణజేసినవాఁడ వీవెగా, శుభకరసౌఖ్యసంప
దలు సుస్థిరతన్ గృపజేయఁ బూని నా, కభ
యము లీయరాదె కరుణాకర యా... 68

చ. వనచరుఁ డైనవాయుసుతువాక్యములన్ విని
భానుసూను స, ద్వినయముతోడ మిమ్ముఁ గని
వేఁడుచు దండముఁ బెట్టినంతటన్, మనమున
సంతసించి కడుమక్కువతో నభయంబు లిచ్చితో,
పనుపడి మమ్ము నేలు మెడబాయక యా... 69

ఉ. భక్తునిమాట మీఱకయె భారముదాల్చి కాన
నుండ నా, సక్తిని నింద్రనందనుఁడు సాయము
గోరననుగ్రహించియున్, యుక్తిగ నొక్కబాణ
మున నొయ్యన వాలిని సంహరించి స, న్ముక్తి
యొసంగితౌర రఘుపుంగవ యా... 70

చ. అనిలజుఁ జేరఁ బిల్చుకొని యంబుధిదాఁటియు
లంక కేఁగి సీ, తను గని ముద్దుటుంగరము
దత్తముజేసి మదీయవృత్తమున్, వినయము
మీఱఁ దెల్పి కడువేగముగా నొగి నానవాలు
తె, మ్మనిన మహానుభావ పరమాత్ముఁడ యా...

చ. పరువడి లంక కేఁగి యలపావని జానకిజాడదీసి

బల్, గరిమ శిరోమణిం గొనియుఁ గాలుని
వీటికి నక్షయాసురుఁ, బరపియు వీతిహోత్రు
నకుఁ బట్టణ మాహుతిచేసివచ్చి నీ, శరణము
గొన్న వాయుజుని సాకిన .... 72

చ. వనచరసేనతోడఁ జని వార్థిసమీపముఁ జేరి
యున్న మి, మ్మును గని యాత్మలోన బహు
మోదమునందియు వేగ నంతటన్, వననిధి
పొంగఁగా శరము వైవఁగఁబూని తదీయగర్వ
భం, జన మొనరించినట్టి గుణసాగర యా...73

ఉ వారిధిదాఁటి లంకకును వానరసైన్యముతోడఁ
జేరఁగా, ధీరుఁడు రావణానుజుఁడు దీనతతో విను
తించుచుండఁగాఁ, గూరిమిచేఁ గనుంగొనియుఁ
గోర్కులఁ దీరిచి యాదరించి తీ, ధారిణి నేడి
నీకు సరిదైవము యా... 74

ఉ. రావణివచ్చి నాగప్రదరంబును వేయఁ బ్లవంగ
సంచయం, బావసుధం బడంగఁ గని యంతటఁ
దార్క్ష్యుని బిల్చి వారలన్, లేవఁగఁజేసినట్టి తమ
లీలల నెన్నఁగ నాకు శక్యమా, శ్రీవర నీవె
నాకు గతి సృష్టిని యా... 75

చ. అసురవరుండు రావణున కాత్మజుఁడై తగునింద్ర
జిత్తుఁడున్, వసుధచలింప నీపయికి వచ్చిన గన్గొని

తమ్ము నంపి ర, క్కసునిశిరంబు వేగ శితకాండ
ముతో వధియింపఁజేసితొ, కుసుమశరారి సేవ్య
పదకోమల యా... 76

ఉ. కాటకుఁ డైనదైత్యుఁ డతికాయుఁడు దివ్య
రథంబు నెక్కి నీ, తోటిరణంబుఁజేసి నిను
ద్రుంచెదనంచని వెంబడింపఁగా, సూటిగ నొక్క
బాణమున ద్రుక్కఁగ జేసినవాఁడ వౌర నీ,
సాటిబలాఢ్యు లేరి రఘుసత్తమ యా... 77

ఉ. రాక్షసరాజు నీవు రణరంగమునన్ దురమాడ
లక్ష్మణుం, డాక్షణమందు రావణశితాశుగసం
హతిమూర్ఛనొందఁగా, దీక్షదలిర్ప వానిఁ గని
దీనతనొంది సమీరపుత్రు నీ, వాక్షణమందు
మందుకొఱ కంపవె యా... 78

ఉ. శ్రీరఘురామమూర్తివయి శ్రీశితికంఠుని సూనుఁ
బిల్చి బ, ల్భైరవుతోడ శల్యకరణిన్ గొని
తెమ్మని తెల్పి పంపఁగా, ధీరత తత్సహాయమునఁ
దేకువ నీయనుజుండు పొందఁగా, నారసి సంత
సించిన మహోమహ యా... 79

చ. పటుతరదైత్యసంచయము బాణచయంబునుబట్టి
కొల్వఁగా, దిటమునఁ గుంభకర్ణుఁ డతిదివ్యశరం
బులఁ జేతఁ బూనియున్, దటుకునవచ్చి సంగ

ర ముదారతమై యొనరించునంతలో, తృటిని
దదీయశీర్షమును ద్రుంచిన యా... 80

చ. కపటపురావణాసురుఁడు కార్ముకముల్ శరముల్
రథంబుపై, నపరిమితంబు జేర్చుకొని యద్భుత
సైన్యము వెంటనంటి రా, నపు డతివేగవచ్చి
నిశితాస్త్రము లేయఁగఁ జూచి వానిశీ, ర్షపటలి
నెల్ల నేలపయి రాల్చిన యా... 81

ఉ. లక్షణశీలి లక్ష్మణుని లంకకుఁ బంపి విభీషణా
ఖ్యున, ధ్యక్షు నొనర్పఁజేసి సురలందఱి సంతస
పెట్టి సగర్వలో, కక్షయకారులౌ నసురకాంతుల
శాంతుల సల్పి భూతలం, బక్షయభోగలీల నల
రారుచు యా... 82

ఉ. జానకి నీవు లక్ష్మణుఁడు సారసమిత్రసుతుండు
పౌరులున్, వానరసైన్యమున్ దనుజవర్గము
గొల్వ నయోధ్యఁ జేరఁగా, మానవనాథులెల్ల
నిను మన్ననమీఱఁగఁ గొల్చి రాష్ట్రమున్,
పూనికఁ గట్టిపెట్టిరట పొందుగ యా... 83

చ. పరగ నయోధ్యయందు నొగి బ్రాహ్మణవర్యులు
క్షత్రవైశ్యులున్, సరసత శూద్రసంఘములు
సామజగామిను లైనచేడియల్, వరభటసంచ
యంబు నిను వర్ణనజేయఁగ భక్తరాజికిన్, వర
దుఁడ వైతి వీవ మునివర్ణిత యా... 84

## కృష్ణచరితము.

ఉ. అందముగాఁగ నీవు మును నభ్యుదయంబయి
తల్లిదండ్రులకా, సుందరదైవరూప గుణశోభిత
లీలల దన్పు వార లా, నందపయోధిమగ్నులయి
నక నిజమాయను వారిఁ గప్పి మే, లొందఁగఁ
జేసినట్టి సుగుణోత్కర యా... 85

ఉ అష్టమి రోహిణీదివసమందున దేవకిదేవిగర్భ
మం, దిష్టముతో జనించి కలుషేంగితపూతన
సంహరించియుకా, దుష్టుఁడు రాక్షసుండొకఁడు
తూగియు బండివిధానఁ బైఁబడకా, కష్టుని వాని
గూల్చినగణ్యుఁడ యా... 86

చ. మదవతి నిద్రవోవునెడ మాయఁగ నాయమ
చెంతఁ జేరి యా, సుదతి కేలుంగకుండఁగను
సుందరమన్మథగేహమం దొగికా,గుదురుగ వృశ్చి
కం బొకటి కుట్టఁగఁజేసినవాఁడ వీవె నీ, పదము
లఁజూపి బ్రోచుటలు భాద్యము యా... 87

ఉ చేడియ తీర్థమాడునెడఁ జెండును దానిగృహాన
వైచి నీ, వాడుచుఁబోయి కన్గొని మహాద్భుత
మంచుఁ దలంచి చీర ముకా, వేడుకతోడ దీసి
కొని వేగమె దాఁచినవాఁడ వీవె కా, వేఁడెద
భక్తితోడ గుణవిశ్రుత యా... 88

చ. రసికుఁడు శక్రుఁ డల్గి మును జాళులవానల నించుచుండఁగాఁ,బసువులుయాదవుల్ మిమును బ్రస్తుతిజేయుచు నుండ నంతటన్, వసమును గాని పర్వతము వైళము యెత్తి సముద్ధరించు నీ, యసదృశశక్తి నెన్నవశమా యిల యా... 89

ఉ. వారిజలోచనల్ యమునవారిని దీర్థము లాడు చుండఁగాఁ, గూరిమితోడఁ జేడియలకోకలు గైకొని చెట్టుమీఁదికిం, గోరిక నెక్కియున్ శరణు గోరఁగ వారల గారవించుశ్రీం, గారమ నోజ్జ వేష మముఁ గావవె యా... 90

చ. సతిపతు లొక్కయింట సరసంబుగ నిద్దురఁబో వుచుండఁగా, హితమతితోడ వేగఁ జని యిద్దటి మధ్య భుజంగ మేయఁగా, నతిభయ మంది వస్త్రముల నక్కడ వీడియుఁ బర్వలెత్తఁగాఁ, గుతుకమునొంది నవ్వితివె కోవిద యా... 91

చ. అరిదరహస్తదివ్యమణిహారవిభాసిత శేషతల్ప శ్రీ, నరహరి వామదేవసఖ నారదసన్నుత నంద నందనా, హరిహరినేత్ర నీదు మృదుహస్తము నాశిరమందుఁ జేర్చియున్, చిరసుఖసంపదల్ గలుగఁజేయవె యా... 92

ఉ. ఫుల్లసరోజనేత్ర పువుబోడి యశోదయు నాగ్ర

హించి నీ, యల్లరిచేత లాపుకొనకై యొకరోటికి
గట్టివేయఁగా, మెల్లన యిగ్గి వద్దులను మేదిని
పైఁబడఁ గూల్చి శాపముఁ, జెల్లఁగఁజేసి యేలి
తివి చేకొని యా... 93

చ. నరహరి వాసుదేవ సురనాయకసన్నుత కృష్ణ
మూర్తివై, బిరబిర బిడ్డచుంచుకును బిత్తరి
లేఁగమెలుంగుతోఁకకుఁ, సరగునఁగట్టి వీథికిని
జయ్యనఁ దోలితి వౌర నీకథా, స్మరణము
విన్నవారలకు మోక్షము యా... 94

చ. తనయులఁ బూడఁగొట్టుకొని దైన్యపువిప్రుఁడు
నిన్నుఁ గొల్వఁగా, మనమున సంతసించి యను
మానము లేకయె తెచ్చి యీయఁగా, వనరుహ
సంభవాదిసురవర్గము నిన్ను బ్రశంసజేసి నీగొన
ముల నెన్నినారు సుమకోమల యా... 95

చ. ఘనమధురాపురంబునకు గ్రక్కునఁ బోవఁగ
మార్గమందు స, ద్వినయవిధేయతఁ విరులు
వేగసమర్పణ చేయఁగానె నీ. మ్మనమున సంత
సించి యల మాలకరిఁ గరుణింపలేదె సన్నుని
జనపాల భక్తజనమోహన యా... 96

చ. పుడమిని నీవు యాదవులపూరిగృహంబుల కేఁగి
పాలుమీఁ, గడ నవనీతముం బెరుగు కమ్మనినే

యియుఁ ద్రొవ్వుచుండఁగాఁ, బడఁతులు జూచి
నీవు నిది భావ్యముగాదన వారిమోములం,దిడి
నమహేంద్రజాలకమణీ హరి యా... 97

ఉ. గొప్పభుజంగరూపమున గొబ్బున వచ్చియుఁ
ద్రోవకడ్డమై,యొప్పుగ వక్త్రగహ్వరమునొక్కట
విస్తృతిజేసి రక్కసుం, డప్పుడు ధేనువత్సని
చయంబును దాఁ గబళింపనుండఁగాఁ, దప్పక
వానిఁగూల్చిన యుదారుఁడ యా... 98

ఉ. యాదవసుందరీమణుల నందఱ గానసుధాప్తిఁ
దేల్చి యా,మోదము నొందఁజేసితివి మోదము
మీఱఁగఁ గ్రీడఁదేల్చి నీ, గాదిలిసంద్రమందు
మునుఁగఁ గరుణించితి వెట్టి నీదయా,స్వాదన
మెప్డు చూరఁగొనఁజాలుదు యా... 99

ఉ. గోపకులెల్ల లేఁగలను గొప్పులఁ దోడ్కొని
కాననంబునం,దేపుగ మేపుచుండునెడ నింద్రుని
శత్రుఁడు వత్సరూపుఁడై, కోపున వేగరాఁగఁ
గని కోపమునం దెగటార్చితో భళీ, తాపసవం
ద్య నీవు నెఱదాతవు యా... 100

ఉ. చిన్నతనంబునన్ మడుగుఁ జేరి భుజంగ మశీర్ష
పీఠిపై, యున్నతమైననాట్యమును నొప్పుగఁజేసి
మదం బడంచి యా, పన్నునిజేయఁగా నతని

భార్యలు నిన్ను నుతించినంతనే, పన్నుగ నేలి
తే సుగుణవైభవ యా... 101

ఉ. ద్వారకపట్టణేశ మదదైత్యవినాశ మురారి
యీశ యా, క్రూరసుపోష సర్వజనగోకులవంద్య
సురేశ సన్నుతా, సారసపత్రనేత్ర గుణసాగర
యాదవవంశభూషణా, ఘోరభవాబ్ధినావ నిను
గోరితి యా... 102

చ. నరహరి నారసింహ నిను నామదిలోపల నమ్మి
యుండి నీ, చరణములన్ స్మరించుచును సంతత
ముత్పలచంపకంబు లే, నరుదుగ నేర్చి కూర్చి
యొకహారము నీకు నొసంగ నుంటి సా,దరముగ
నేలరావె గుణదామక యా... 103

ఉ. మంగళ మాదిదేవ పరమాత్మ దయానిధి సద్గు
ణాకరా, మంగళ మిందిరారమణ మందరధీర
మురారి కేశవా, మంగళ మాత్మరక్ష మునిమా
నితభూనుతవాసవార్చితా, మంగళమయ్య యె
ల్లపుడు మాధవ యా... 104

ఉ. హెచ్చరి కాదిశేషశయనేందుదివాకరచారులో
చనా, హెచ్చరి కాదిదేవ హరి హేతుమయా
త్మకలోకరక్షణా, హెచ్చరి కాంగజారినుత హే
మపిచండముఖాఖిలార్చితా, హెచ్చరి కౌను
నీకు నను నేలర యా... 105

ఉ. లాలి ముకుంద నాగనుత లాలి శుభాకర మార
సుందరా, లాలి త్రిశూలపాణినుత లాలి మునీ
శ్వరలోలసాధనా,లాలి సమీరపుత్రనుత లాలి
పరాత్పర లాలి శ్రీధరా, లాలి ధరారిభక్తజన
లాలిత యా... 106

ఉ. జోల మురారి మౌనినుత జోల రమేశ మురా
రి కేశవా, జోల సురేంద్రసూనుసఖ జోల ప
రాత్పరభక్తరక్షణా, జోల భుజంగతల్ప హరి
జోల జనార్దన నారదార్చితా, జోలలు బాడె
దన్ గరుణ చూడవె యా... 107

ఉ. శ్రీతిరువాయిపాటి కులశేఖరుఁడౌ మణవాళ
జియ్యరుం, డాతనిపుత్రుఁడౌ వరపరాంకుశ
సూనుఁడ వేంకటాఖ్యుఁడన్, శ్రీతరుణీశ నీకథ
లఁ జేసి ధరాతలమందు భూజనుల్, జేతము
నన్ బఠించునెడఁ జేకొన యా... 108

సమాప్తము.



# పీఠిక.

ధర్మపురిరామాయణము నరసింహశతకము రచించిన శేషప్ప యను శేషాచలదాసుఁడె యీశతకమును రచించెను. కవి తనకులము నీమూఁడు పాత్రములలోఁగూడఁ జెప్పుకొనలేదు. శైలినిబట్టి వందికులమువాఁడని శతకకవిచరిత్రకారులు అనుమానించిరి. కులమున కొకశైలియుండునా? ప్రమాణశూన్యమగు ననుమాన మెపుడును చరిత్రమునకు శరణ్యము కాఁజాలదు. కవి నివాసము ధర్మపురి. ఇది నిజామురాష్ట్రమునందు ఓరుగల్లునకుఁ బంద్రెండామడలదూరమునున్న సుప్రసిద్ధమగు నృసింహక్షేత్రము. ఇటఁ గల నృసింహస్వామిని గూర్చియే యీకవి నరసింహశతకము, నృకేసరిశతకము రచించెను. చిత్రభారతము, పద్మపురాణము, నవీనవశిష్ఠరామాయణము లోనగు గ్రంథములలో ధర్మపురి ప్రశంసగలదు. ఆంధ్రులందఱకుఁ దీర్ఘరాజముగా నున్న నిజామురాష్ట్రములోని క్షేత్రములు పెక్కులు యవన పరిపాలనమునకు లోఁబడినపిదప నితరరాష్ట్రవాసుల కగమ్యములయ్యెను. క్రమముగ విస్మృతికి వచ్చెను. అట్టివానిలో సుప్రసిద్ధమగు ధర్మపురి క్షేత్రముకూడ నొకటి. ఈనృకేసరిశతకము వ్రాఁతప్రతియొకటి నిజామురాష్ట్రమునందలి మెదకు మండలములోఁ బరిశోధనము గావించుతఱి జోగి

పేటలో లభించెను. పరిశోధకసంఘమువారి కీయవలసిన యీశతకమాతృకను దగ్గరనుంచికొని శుద్ధప్రతివ్రాసి యెటులేని ముద్రించి వ్యాప్తిలోనికిఁ దేవలయునని సంకల్పించుకొంటిమి. ఇంతలో బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు శతకములు సంపుటములుగా వేయ నెంచి మమ్మాపనిజూడ నియోగించుటచే మాచెంతను అందుబాటులోను గల యముద్రితశతకములతోఁబా టీశతకమును గూడ ముద్రించి ప్రకటింప నవకాశము లభించినది. నిజాంరాష్ట్ర శతకకవులజీవితమునం దీశతకకర్తచరిత్రము చేరఁదగి యున్నది.

కవి దాదాపు నూఱుసంవత్సరములకు నావలివాఁడు కాఁడని మేము విచారింపఁ దత్రత్యులు చెప్పిరి. ప్రమాణములగు నాధారములు లభింపకున్నను నీకాలము విశ్వసనీయమె. నృకేసరిశతకము భక్తిరసోద్బోధకమై సులభశైలిలో సరసముగా నున్నది. అందందుఁ గొలఁదిగ వ్యాకరణలోపములు గలవు. శుద్ధప్రతివ్రాయుతఱి కొన్నిచోటులఁ గవిభావానుసారముగా లేఖకులలోపముల సవరించితిమి.

ఇట్లు భాషాసేవకులు
శేషాద్రిరమణకవులు.
శతావధానులు.

నందిగామ.
1-6-26.

శ్రీ ర స్తు.

# నృకేసరిశతకము.

---

ఉ. శ్రీకమలాలయారమణ శీఘ్రముగా దయఁజూచి
నామనో, వ్యాకులమెల్లఁ దీర్పు మిఁక వారిజ
లోచన నమ్మినాఁడ నే, లోకులఁ గొల్వనేర భువి
లో నను వంచనజేయఁబోకుమీ, నీకు నమస్క
రించెదను నేర్పుగ ధర్మపురీనృకేసరీ. 1

చ. అమరము పంచకావ్యముల నైనఁ బఠింపఁగలేదు
లెస్సగా, శ్రమపడి ప్రాసవిశ్రమవిచారము
జేయఁగలేదు నే కవి, త్వము గని నిన్ను వేఁడి
తిని తప్పులో యొప్పులో చిత్తగించుమీ,
కమలదళాక్ష పండితుఁడఁ గానుర ధ... 2

చ. రవికుల రేఁగుకాయలకు రత్నములే వెలబోసి
నట్లు దు, ష్కవిజనులంత బుద్ధిచెడి కాసులకో
సము తుచ్ఛమైనవా, నవులను బ్రస్తుతించుచు
ఘనంబుగఁ బద్యము లమ్ముకొంద్రు మా, ధవ
నినుఁ గానఁజాలరు ముదంబున ధ... 3

చ. పెదవులు దీర్ఘదంష్ట్రలును భీకరమైన విశాలనే

త్రముల్, కుదిరినమీసలుఁ నుదురు కుంజ
రముఁ దునిమేటి కేసరీవదనము దీర్ఘబాహు
లును వజ్రనఖంబులు నీశరీరసం, పద పొడసూ
పవయ్య మునిప్రస్తుత ధర్మ... 4

ఉ. తిన్ననిశంఖచక్రములు దివ్యకిరీటము కుండలం
బులున్, పన్నగరాజతల్పమున బన్నశరీరము
నాల్గుచేతు ల, త్యున్నత మైనవక్షమున నుంచి
నలక్ష్మిని నీదురూపు నా, కన్నులఁ జూపవయ్య
పొడగాంచెద ధ... 5

ఉ. చూచితి నీకిరీటమును జూచితి కుండలముల్
ముఖంబు నేఁ, జూచితి శంఖచక్రములు చూచి
తి కౌస్తుభవక్షదేహమున్, జూచితి పీతవస్త్ర
మును జూచితి లక్ష్మిని నిన్ను లెస్సగాఁ, జూచితిఁ
గన్నులార మధుసూదన ధ... 6

ఉ. తల్లివి దండ్రి వాప్తుఁడవు దాతవు భ్రాతవు నీ
వె సుమ్మి నే, చిల్లరదేవతార్చనలు చేసెడివాఁడ
నుగాను స్వామి నీ, చల్లనిపాదపద్మముల సన్నిధిఁ
గోరితి జిహ్వతోడ నే, కల్లలు బల్కనయ్య నను
గావుము ధ... 7

ఉ. అందఱికంటె నేను దురితాత్ముఁడనయ్య జగత్ప్ర
సిద్ధిగా, ముందఱ నా గతేమొ యని మూర్ఖుఁడ
నై భయమొందుచున్న నా, యందుఁ గటాక్ష

ముంచి సకలాపదలన్ దొలఁగింప నీకు నే, వం
దన మాచరించెదను వాసిగ ధ... 8

ఉ. నమ్మితి నీవె దిక్కనుచు నారదసన్నుత దేవ హైమై
తె నీ, కమ్మితినయ్య నే నొరుల యాశఁ బడుండ
సుమీ సురేశ నా, నెమ్మదిఁ గోర్కిదీర్చు మిఁక
నీవు ప్రసన్నుఁడ వైనఁ జాలు నే, సమ్మద మొం
దెదన్ దనుజసంహార ధ... 9

ఉ. బొందిని ప్రాణముల్ వెడలిపోయెడినాఁటికి
వాసుదేవ గో, వింద ముకుంద యంచు నిను
వింతగ నెంతునో యెంచలేనో నే, నందుల కెం
తో చింతిలెద నాసమయంబున కీవు వచ్చి నా,
ముందఱ నిల్చియుండఁగదె మ్రొక్కెద ధ...

ఉ. ఆయువు గల్గినంతపరియంతర మన్నివిధాల
నాకు నో,పాయముజేసి సేవకునిప్రాణము లేఁగె
డివేళ శంఖచ, క్రాయుధముల్ ధరించి భుజ
గారివిహంగము నెక్కివచ్చి నీ, చాయకుఁ దీసి
కొమ్మి నను జయ్యన ధ... 11

ఉ. ఇప్పుడు నేను పాతకము లెక్కుడుజేసితి భీతి
నొందకే, తప్పులు బెట్టుచున్ యముఁడు దండ
న నాఁటికిఁ జేయునేమొ నే, నప్పటి కాఁగలేను
సుమి యాయమదూతలు పట్టరాఁగ నిన్, దప్ప
క వేఁడుకొందు నను బ్రోను ధ... 12

ఉ. దుష్టుఁడ సుమ్మి నన్ను యమదూతలు గైకొని
పోవునాఁటి కే, కష్టము ప్రాప్తమౌనో నరకంబు
లవార్తలు వింటి నీకృపా, దృష్టి యనేసముద్ర
మునఁ దేల్చియు నా కభయం బొసంగు మీా,
శిష్టులలోన నన్ను దరిఁ జేర్చుము భ... 13

చ. మరణమునాఁటి కాయముని మన్ననదూతలు
రాకమున్నె నీ, కరముల శంఖచక్రములఁ గావ
లిబంపుమి ధీరుఁడైన నీ, గరుడునిఁ బంపు మిక్కు
డకుఁ గష్టములేక సుఖాన వారియా, సరగొని
నిన్ను వేఁడెదను సయ్యన భ... 14

చ. సమరసమైన పెద్దపులిచాటున కేఁగిన నెల్క
కండ్లకుఁ, నమిలెడిగండుబిల్లి యొకనల్లిసమా
నము నిశ్చయంబుగాఁ, గమలదళాక్ష నీకరుణ
గల్గిన భక్తుని నేత్రదృష్టికిఁ, యముఁ డొకనల్లి
పిల్లజతయా సుమి భ... 15

ఉ. శ్రీనరసింహ నీభజనఁ జేసెడిభక్తులతోడఁ గూడు
చో, నేను పవిత్రమయ్యెదను నీచులసంగతి
చాలుచాలు నే, మానవజన్మమెత్తి పలుమందిని
వేఁడితిఁ బొట్టకోసమై, దీనుఁడనయ్య నన్నుఁ
గడతేర్చుమి భ... 16

ఉ. కాయజకోటిరూప నవకంజదళాక్ష ముకుంద

కృష్ణ నా, రాయణ వాసుదేవ గజరక్షక నీల
శరీర శంఖచ, క్రాయుధ మేరుధీర భుజగాంతక
వాహన మోక్షదాయకా, నాయిలువేల్పవంచు
నిను నమ్మితి ధ... 17

ఉ. కంటిని నీకృపారసము కష్టము లొందుచు నిన్ను
వేడఁగా, వెంటనె మేలుజేసితివి వేల్పులు
భూమిని నెందరైన నీ, దంటకు సాటిరా రనుచు
పండిగ బొబ్బలుపెట్టి చేతఁ జే, గంటనుగొట్టి
సాటెదను గట్టిగ ధ... 18

ఉ. పుట్టితి మీపదాబ్జముల భూమిని నాతలవంచి
దండముల్, బెట్టితి నీదుపేరిటను బెద్దకుఠా
రము చేతఁబట్టి నేఁ, గొట్టితి పాతకాటవిని
కుంజరరక్షక నీకు బంటనై, పుట్టితి భూమిలోన
సురపూజిత ధ... 19

ఉ. వింటిని నీకథల్ చెవుల వేడుకతో నరసింహ
మాధవా, యంటిని నోట లెస్స బలువాసను నీ
నయమైనరూపు నేఁ, గంటిని కండ్లనిండ నను
గాచెడి దాతవుగాఁగ నమ్ముకో, నుంటిని నీ
పదాబ్జముల నొప్పుగ ధ... 20

ఉ. ఎంచెద నీగుణంబులను హెచ్చుగ నీకథఁ
బాడుకొంచు వా, యించెద వీణతాళముల

నెప్పుడు నాహృదయంబులోన ధ్యా, నించెద
నీపదాబ్జములు నేర్పున నీదయ చాల్పుగాఁగ
ర, ప్పించెదఁ జూడు నాతెలివి పేరుగ ధ...21

చ. కువలయపత్రనేత్ర శతకోటిదివాకరతేజ పద్మ
సం, భవనుత పక్షిరాడ్ధ్వజ కృపాజలధీ జగదీశ
యిందిరా, ధవ మధుకైటభాంతక సుధాకరకీర్తి
విశాల కుండల, శ్రవణపరోజనాభ కరిరక్షక ధ.

చ. సురనుత చక్రహస్తరణశూర నవాబ్జదళాక్ష
కంబుకం, ధర గజరాజవాహన గదాధర కౌస్తు
భవక్షపింగళాం, బరధర భోగిరాట్శయన భక్త
జనాంబుజమిత్ర మందరో, ద్ధర మునిజాలవందిత
పదద్వయ ధ... 23

ఉ. శ్రీహరి వాసుదేవ నరసింహ జనార్దన చారు
పక్షిరా, డ్వాహన శంఖచక్రధర వారణ
రక్షక భూపతీ జగ, న్మోహన దుష్టదానవ
సమూహవినాశ త్రిలోకవంద్య మాం, పాహి
ముకుంద దీనజనబాంధవ ధ... 24

ఉ. వారిజపత్రనేత్ర సురవందిత పాదసరోజసింధు
గం, భీరవిరించిరుద్రనుత భీకరదైత్యవినాశ చక్ర
మం, దార రమాకళత్ర ఫలదాయక సర్వ
జగన్నివాస శృం, గారశరీర కేశవ ఖగ
ధ్వజ ధ... 25

ఉ. శ్రీతరుణీమనోహర శశీధవసన్నుత చారునీల
జీ, మూతశరీర పాతకవిమోచన సద్గుణజాల
భ_క్తకం, జాతవిలోల దుర్దనుజసర్పఖగేశ్వర
యామినీకర, శ్వేతయశోవిశాల మునిసేవిత ధ.

ఉ. చి_త్తములోన నీభజనఁ జేసెడివాఁడు వయోధ
నాళిచే, మత్తుఁడుగాక నీకథలు మానక వీనుల
విన్నవాఁడు నో, రెత్తి మహోముదంబునను
నెప్పుడు నిన్ను నుతించుచున్నవాఁ, డు_త్తమ
జాతివాఁడు పురుషో_త్తమ ధ... 27

చ. గజహయదానముల్ గ్రహణకాలపుగోగణభూ
మిదానముల్, రజతహిరణ్యదానములు రత్న
పుదానము లన్నదానముల్, నిజముగఁ గోటిచేసి
నను నీరజలోచన వాసుదేవ నీ, భజనసమాన
మౌనె మురభంజన ధ.... 28

ఉ. గోవులఁ బంచిపెట్టినను గోటిధనంబును లూటి
బుచ్చినన్, బావులు చాల ద్రవ్వినను బట్టలు
కట్నము లెన్ని బెట్టినన్, త్రోవల చెర్వు వేసినను
తోఁటలఁ బెంచినగాని దేవ నీ, సేవకు సాటి
రావు సుమి శ్రీహరి ధ... 29

ఉ. వేదము లాదిగా సకలవిద్యల నేర్వఁగలేను
ద్రవ్యసం, పాదనఁజేసి త్యాగమునఁ బైకొని

దానము లివ్వఁ జాల నే, కాదశు లుండలేను
నదిగంగను స్నానము చేయలేను నీ, పాద
యుగంబు నమ్మెదను భక్తిని ధ... 30

ఉ. కూటికి మానవాధములఁ గొల్చినరీతిని నిన్నుఁ
గొల్వ నా, కేటికి బుద్ధిపుట్టదుర యెంత దురా
త్ముఁడ నైతి నయ్యయో, నాఁటిదినాలనుండి నిను
నమ్మిన సద్గతిగల్గు లెస్సగా, హాటకదైత్యనాశ
విభవాచ్యుత ధ... 31

ఉ. శ్రీరమణీయ నీ కధికసేవలు చేయఁగలేను గాని
సం,సారము నుద్వహింప ఘునజారుల నీచులనైనఁ
గొల్చితిఁ, సారెకుఁ బొట్టకై సకలజాతిమనుష్యు
ల సంగ్రహించితిఁ, బేరుగ నాకు ముక్తి కడువే
సుమి ధ... 32

చ. కుజనులఁగూడి నేఁ బెరుకు కూఁతలఁ గూయఁగ
నేర్తుఁగాని నీ, రజదళనేత్ర నిన్నుఁ జతురత్వ
ముతోఁ గొనియాడఁజాల నే, నిజముగఁ బాప
కర్ముఁడను నీకృపచేఁ గడతేర్చు నన్ను మా,రజనక
నీకు మ్రొక్కెద సురస్తుత ధ... 33

ఉ. దానవనాథ నీ కిపుడు దాసుఁడనై నినుఁ గొల్చు
చుంటి మే, లైనవరం బొసంగు మిపు డన్యుల
నే బ్రతిమాల పొట్టకై, యేనుఁగునెక్కి దిడ్డి

చూర నీఁగుదు నెట్లు మహానుభావ నీ, వే నను
జేతఁబట్టు మని వేఁడితి ధ... 34

ఉ. రేయుఁబవల్లు ని న్ననుసరించిన నీదయ బుట్ట
దెందు క, న్యాయముఁ జేయ సాగితివి నాయప
రాధము లేమిరా జగ, న్నాయక నీవు నన్నుఁ
గఠినత్వముమై గన ధర్మమా నా కో, తోయజ
నాభ యెంతకని దూరుదు ధ... 35

ఉ. ఎవ్వరివద్ద కేఁగుదు నిఁ కెవ్వరితో మొఱబెట్టు
కొందు నే, నెవ్వరి నాశ్రయించెద నిఁ కెవ్వరు
చింతలుదీర్చువారు న, న్నెవ్వరు చేతఁబట్టెద రిఁకే
యొ్యది తోఁచదు నీవుదప్ప నా, కెవ్వరు గాన
రారు జగదీశ్వర ధ... 36

ఉ. ఏమిర నారసింహ యిపు డెందుకు నీదయ రాదు
నాయెడఁ, బ్రేమను సారెసారెకును బిల్చినఁ
బల్కవ దేమిరా పరం, ధామ భవత్పదాబ్జములు
ధ్యానము జేయుదురా ముకుంద నీ, మోమిటు
జూపరా భువనమోహన ధ... 37

ఉ. నానరసింహ సాధనమ నాయిలువేలుప నామనో
హరా, నీ నగుమోముఁ జూపర మునిస్తుత నిన్ను
గణించుచుంటిరా, దీనతనొంది వేఁడఁగను దిప్ప
లఁబెట్టక నన్నుఁ గావరా, నేను పరుండనార
గణియింపర ధ... 38

ఉ. దండము నారసింహ నను దగ్గఱదీసి వరంబు
లిచ్చి భూ, మండలమందు నాబ్రదుకు మంచిగఁ
జేసి సుఖాన నుంచుమీ, దండిమహాత్మకుం
డనుచు ధైర్యముతోడుత నమ్ముకొంటి నీ,యండ
తొలంగనయ్య కరుణార్ణవ ధ... 39

ఉ. సారసపత్రనేత్ర నిను సారెకు నే బతిమాలి
మాలి వే, సారితినా! యిదే మిపుడు సాగకవ
చ్చెను నీకు బట్టుకై,వారము లేమనందు ననువంచ
నజేయఁ దలంచినావా నీ, కారడ మేమొ నాకుఁ
బోడకట్టదు ధ... 40

ఉ. ఓనరకేసరీ యనఁగ నో యని పల్క విదేమి
మాటమా,త్రానికి నోఁచనా యిపుడు దాసుని
మీఁద మఱింతకోపమే, పూనితి వెందుకయ్య
దయబుట్టదు నే నపరాధి నంచు హా, మానవ
దేల మచ్చరము మాధవ ధ... 41

చ. శరణని గోరియుంటి ననుఁ జయ్యనఁ గావ
విదేమి నీకు నా, మొఱ వినఁ జెప్పవచ్చితిని
మ్రొక్కఁగఁ గోర్కెను దీర్చుకుంటి నీ, బిరుదుకు
భంగమయ్యె సుమి పెద్దపకీర్తి గడించుకోకుమీ,
చెఱుపక నన్నుఁ జేకొనుమి శ్రీధర ధ... 42

చ. నలినదళాక్ష కృష్ణ శరణాగతవత్సల యంచు

నిన్ను నేఁ, బిలువఁగ నీవు నో యనవు బెల్లపుగ
డ్డలు నోటఁ బెట్టుకో, పలుకఁగ లేకపోయితివొ
బాగుగ నేఁడు పరాకువైతివో, పలుకుటిలంబు
లం దలఁతో పావన ధ... 43

ఉ. మంచిప్రతాపమూర్తి వని మాటికి నేను కరంబు
లెత్తి జో, డించి నమస్కరించుచుఁ బదింబది
వేఁడఁగ నీవు నామొఱా, లించవ దెందుకయ్య్య
లవలేశము నీదయ లేకపోయెఁ బో,షించెడిదాత
లెవ్వ రిఁక శీఘ్రము ధ... 44

ఉ. సుందరరూప నిన్నుఁ బొడచూచెద నంటె బిరాన
నీవు నా, కెందుకుఁ గానరావొ యిపు డెచ్చటి
కేఁగితివో జనార్దనా, యిందుదివాకరాక్ష ధన
మిమ్మని వేసటఁ బెట్టఁగాని నీ, యందము జూపు
శీఘ్రముగ నచ్యుత ధ... 45

ఉ. హేమము భూషణావళియు సేస్గులు నశ్వములం
దలంబులుఁ, గ్రామము లీయ లేవు ఘనకార్య
ములం దగిలించుకోకుమీ, నీముఖమైనఁ జూపు
మిఁక నీ కిది కష్టముగాదు చుల్కనే, నా మన
సింతకే భ్రమసె నమ్మితి ధ... 46

చ. కరి మకరంబునోటఁ బడి కష్టము లొందఁగఁ
జేతిచక్రముఁ, సరగునఁ బంపి నీటను మొసల్ని

వధించి గజంబు వేలు నా, తెలుఁగున నేఁడు
నన్నుఁ గడ తేర్చుమి నీకు నమస్కరించెదన్, బిర
బిర వచ్చి నాకుఁ గనుపింపవె ధ... 47

ఉ. మ్రొక్కినఁ జూడవేమి నిను ముద్దుగఁ బిల్చినఁ
బల్కవేమి నేఁ, జక్కన సేవసేయఁగను చయ్యనఁ
గోర్కెని దీర్చవేమి నా, కక్కఱబడ్డవేళ యిపు
డాదుకొజాలవదేమి నీకు నా, కెక్కడివైర
మో తెలుపవేమిర ధ... 48

చ. సరసిజనాభ నే సకలజన్మము లె_త్తితి ధాత్రిలో
పలన్, స్థిర మొకటైన లేదుగద తీవ్రమె పుట్టు
చు మర్లఁ జచ్చుచున్, దిరిగితి రాను పోను
బహుత్రిప్పల నొందితి వేసటైతి నీ, చరణము
లాన జన్మములు చాలిఁక ధ... 49

ఉ. మామిడిపండ్లపానకము మంచిమధూదకమిశ్ర
భక్ష్యముల్, జేమలు నారికేళములు చక్కెర
ద్రాక్షఫలంపులక్షలున్, తామరసాక్ష మేలిమి
సుధామధురాదులు లక్షయైన నీ, నామము సా
టిగావుర జనార్దన ధ... 50

ఉ. మేలిమి భూసురాది బలుమేటికులంబులు నాలు
గుండఁగాఁ, జాలువు వి_స్తరించె నరజాతిని సజ్జ
నుఁ డెవ్వఁ డుండినన్, చేలుగ మిమ్ము నిత్యము

భజించుచు నమ్మినఁ జాలు ము_క్తి చం, డాలున
కైనఁ గద్దు గరుడధ్వజ ధ... 51

చ. ఇలను మనుష్యజాలమున నెక్కువతక్కువ లు
న్నవన్నచోఁ, గులముల శ్రేష్ఠ మెవ్వరిది కొం
చెము గానఁగరాదు వారు ని, ర్మలినశరీరులో
గుమగుమా యనుకుత్తుని గందముఁన్న దా, తెలి
సిన నిండుభక్తులె సుధీరులు ధ... 52

ఉ కేశవ మీకథల్ మిగులఁ గీర్తనఁజేయుచుఁ గా
మ్యమైన దు, ష్పాశము గోసివేసి నిజభ_క్తి విర
_క్తి సుబుద్ధి జ్ఞానముల్, వాసిగ సంగ్రహించిన
భవజ్జను లేకులమందుఁ గల్గినన్, నే శరణందు
వారలకు నిక్కము ధ... 53

ఉ. శాంతము సత్యవృ_త్తి ఘనసాధుతయున్ గరుణా
సమృద్ధి వి, శ్రాంతిగ భ_క్తి జ్ఞానము విర_క్తి సదావ
ననామకీ_ర్తనల్, భాౖంతి సుబుద్ధు లేజనునిపాలఁ
జెలంగునో వాఁడె దివ్యవే, దాంతులకన్న
శ్రేష్ఠుఁడు కృతార్థుఁడు ధ... 54

చ. భ్రమరము కీటకంబు నొగిఁబట్టుకవచ్చి నిజస్వ
రూపమున్, సమముగఁ జేసినట్లు ఘనసజ్జను లై
నమహాత్ములున్నఁ బాపమతులఁ జేరఁబిల్చుకొని
భక్తులఁ జేయరె నిశ్చయంబుగన్, విమలసరోజ
లోచన వివేకులు ధ... 55

ఉ. చిన్నతనంబునుండి కడుఁ జేసితి పాపము లన్ని
నావి నా, కెన్నఁదరంబుగాదు సుమి హీనుఁడ
నీచుఁడఁ బాపకర్ముఁడన్, ఎన్నిటఁ జూడ నాన
డక లించుక మంచివి లేవు స్వామి నీ, మన్ననచేత
దోషములు మాన్పుము ధ... 56

ఉ. నీరజపత్రనేత్రయుగ నేను గడించిన పాతకంబు
వి, స్తారము గద్దు నాకొకఁడు సాటిదురాత్ముఁడు
లేఁడు సుమ్మి నా, నేరము లన్నిగాచి కరుణిం
చెడి తండ్రివిగాఁగ నేఁడు నీ, చేరువఁ జేరినాఁ
డ దరిఁజేర్పుము ధ... 57

ఉ. పుట్టిననాఁటనుండి యొకపుణ్యము జేయఁగలేదు
గాని నే, పుట్టితిఁ బాతకంబులను బూని గడిం
చితి కావరంబునన్, బొట్టను లెస్సగా బుగులు
పుట్టిన దిప్పుడు నాఁటికోసమే, చుట్టములేక
నీశరణుఁ జొచ్చితి ధ... 58

ఉ. నిర్మలులైనమానవుల నిందలఁ జేయఁగ నేర్తు
నేను దు, ష్కర్మముజేసి మందికి సుకర్మముఁ
జెప్పుకొనంగ నేర్తు స, ద్ధర్మము లాచరించునెడఁ
దప్పక విఘ్నము జేయనేర్తు నే, దుర్మనుజుండ
నయ్య పెనుద్రోహిని ధ... 59

చ. గడుసుదనంబునం బరుల కాంతల వశ్యము జేయ

నేర్తుఁ గా, రఁడమున మందిద్రవ్యమును ర_క్తిని
గుంజఁగ నేర్తు లెస్సగా, విడిబడి పెద్దపిన్నలను
వేమఱు నిందయొనర్ప నేర్తు నే, పెడసరబాప
కర్ముఁడను బెద్దను ధ... 60

ఉ. ప్రొద్దువలేచి నేను కడుబొంకులు బల్కుచు
నుందు నోట నా, వద్ద నిజంబు లేదు పెరవారి
సుఖంబు సహింపలేను నా, బుద్ధి మహావికార
పుది భూమిని దుష్టగుణంబులందు నే, పెద్ద దు
రాత్ముఁడన్ వినుమి పేరుగ ధ... 61

ఉ. మాటలు వాఁడిబల్లెములు మానసమున్న విషం
బు హస్తముల్, నా పెడుతమ్మముండ్లు నయనం
బులు నిప్పులు దుర్గుణంబులే, కూటికి లేదు నా
కధిక కోపము పాతకు లెందఱైన నా, గోటికి
పాటిరారు చెడఁగొట్టకు ధ... 62

ఉ. చాటుకుఁ బెద్దతప్పులను జాలఁగఁజేసి భయంబు
నొందకే, నేటుకువచ్చి దుర్గుణము నేరనిపెద్దలఁ
గూడి వారితో, సాటికి నిల్పి నే నొకరిజాతుల
నీతుల నెంచుచుందు నా, పాటిదురాత్ముఁ డేడి
రిపుభంజన ధ... 63

ఉ. నేటుగ మందిమెప్పులకు నే నొకవింతగఁ గంత
మందు వే, నేటివి పెద్దపెద్దతులసీవనమాలలు
చాటుచేరి చే, నేటివి నీచకార్యములు శ్రీధర

నాపని నీ వెఱుంగవా, నేఁటికి సద్గుణం బొకటి
నేరను ధ... 64

ఉ. లోపలి పాపకర్మములు లోకుల కేర్పడకుండఁ జే
యుచుఁ, నేపడిమంది కందఱకు నీతులు తత్వ
ము లెల్లఁ జెప్పెదన్, నాపురుషార్థ మింతె సుమి
నల్గురికండ్లకు నేను పెద్దనీ, నాపస మేడిపండు
సురనాయక ధ... 65

ఉ. మంచిగ ధర్మశాస్త్రములు మందికిఁ జెప్పఁగ నేర్తుఁ
గాని నే, కించతనాలు మాననగద కేవలదుర్గు
ణుఁడన్ సుబుద్ధి లే, దించుక రైనఁగాని మన
సెప్పుడు చంచలమందు చుండు నా, సంచితపాప
కర్మములఁ జంపుము ధ... . 66

ఉ. ఇంటికి నిత్యభిక్షమున కెందఱు వచ్చినఁగాని
తెంపుతో, గంటెడు గింజ లొక్కరికి గ్రక్కున
వేయఁగలేదు ధర్మమే, మంటగలేదు నాకుఁ గరు
ణార్ణవ నే నతిలోభినయ్య నీ,బంటను నమ్మికొంటి
ననుబాయకు ధ... 67

చ. ధనము గడించి పెద్దలకు దానము చేయఁగలేను
గాని నే, పెనఁగొని జారకాంతలకుఁ బెట్టితి
సొమ్ములు మందికేర్పడన్, ఘనులను గూడలేక
పలుగాకులలోపల నుంటినయ్య నా, మనసున
సిగ్గులేదు లవమాత్రము ధ... 68

ఉ. చంచలచిత్తుఁడన్ బరమజారుఁడఁ జోరుఁడఁ
బాతకుండ నే, గొంచెమువారితోడ జతగూడి
చరింపుదు నాగుణాలు వర్ణించఁదరంబుగాదు
సుమి నీవిపు డన్ని క్షమించి నన్ను రక్షించుమి
నీకు మ్రొక్కెదను గేశవ ధ... 69

ఉ. అంధున కద్ద మేమిటికి నందము దప్పినసుండ
మోపికిన్, గంధపుఁబూఁత లేమిటికిఁ గానన
మందుఁ జరించుగోఁతికిన్, సింధుజరత్న మేమి
టికిఁ జెడ్డదురాత్మున కెన్నఁడైన నీ, గ్రంథపు
విన్కి యేమిటికి గట్టిగ ధ... 70

చ. బురదను బొర్లుచున్నయెనుబోతుల కేటికి మంచి
గంధముల్, గురుతుగ భవ్య భవ్య మను
కుక్కల కేటికి బూరగొమ్ములున్, గలక యేల
గాడ్పునకుఁ గారము తమ్మలపాకు కెందుకున్,
నిరుపమదుష్టు కెందుకుర నీకథ ధ... 71

ఉ. ఏనుఁగు బోవఁ జూచి ధ్వను లెత్తుచుఁ గుక్కలు
గూయుచుసాగుచో, దానిమనస్సు కోపపడి దందడి
వానిని వెంబడించునే, మానవులందు సజ్జనుల
మత్తులు కొండఱు గేలిచేయుచో, ఆనఁ డల్గి
వాండ్ర బడఁ బాడునె ధ... 72

చ. విపుడుగ గడ్డముల్ జడలు పెంచుక నిక్కఁగ
నే మహాత్ముఁడా, పరమతపస్వి గాఁడు సుమి

పందికి నేఁడ్రుక లెప్పు డుండవా, చెరుకుగం
ణాలు మానుకొని ప్రేమను నిన్నెవఁడైనఁ
గొల్చెనా, ధరణిని వాఁడె పావనుఁడు
ధన్యుఁడు ధ... 73

ఉ. ఎన్నఁడు నీవు నాకభయ మిచ్చెదవో కరుణాస
ముద్ర నీవున్న నాసనొందితి సుమానసుదూ
రము చేయఁ బోకుమీ, నిన్నిపుడేను నమ్మితిని
నిర్దయయుంచక కావు కావు నా, విన్నప మాల
కించి నను వీడక ధ... 74

చ. దినకరచంద్రనేత్రయుగ దీనత నొందుచు నిన్నుఁ
బిల్వఁగా, నెనరున మాటుబల్కక విసీ విన
నట్టుల నుంటి వేమి నీ, తనయునిమీఁద నీవు
దయఁ దక్కువ జేసిన నీకు భూమిలో, ఘన మప
కీర్తి సుమ్మి ధృతకౌస్తుభ ధ... 75

ఉ. చూతఫలంబు నోటఁ జవి చూచెడిచిల్క
కుమెత్తకాయయుఁ, (?) బ్రీతి జనించునే మదిని
రేయుఁబవల్లు ముకుంద నీకుఁ బ్రఖ్యాతిగ సేవ
జేసినమహాత్ముఁడు నీచులసేవ జేయునే, పాతక
నాశ యోగిజనప్రస్తుత ధ... 76

చ. ఖగపతి నీకు వాహనము కౌస్తుభరత్నము
భూషణంబు పన్నగపతి శయ్య మన్మథుఁడు

నందనుఁ డంబుధిపుత్త్రి భార్య ము, జ్జగముల
వారు బంట్లు రవిచంద్రులు లోచనముల్
ముకుంద నీ, కగణితమైనభాగ్య మహాహా
భళి ధ... 77

చ. గరుడునితోడ కోడియును గాంతి హిరణ్యము
తోడఁ గంచు భాస్కరు నొగి విస్ఫులింగ
ము గజంబుల దోమ విశాలమైన మందరమును
చిల్లరాయి నిను దల్చెడిభక్తులతోడ దుర్జనుల్,
సరిపడవత్తురే దురితసంహార ధ... 78

ఉ. ఎంతకు నిన్ను వేఁడుదు నిఁ కెన్నివిధంబుల
దూరి పల్కినన్, మంతనమందు నీ నెనరుమచ్చు
కులేదు పరీక్షబట్టుచో, సంతత మిట్లు నీవు పగ
చాలుపు దాల్చిన నేవిధాన జీవింతును నాకు
దిక్కెవరు వేలుపు ధ... 79

ఉ. తల్లి విషంబుఁ బెట్టినను దండ్రి ధనాఢ్యుల కమ్ము
కొన్న భూవల్లభుఁ డిల్లు దోఁచినను వద్దని
పల్కెడివార లుందురా, ఉల్లములోన నీవు
నెనరుంచక వ్యాధులఁ బెట్టి ముంచఁగాఁ, జిల్లర
వైద్యులెల్ల దరిజేర్తురె ధ... 80

చ. జలజదళాక్ష నీకరుణ చాలుపుగాఁ గలిగున్నఁ
జాలు నే, బలుఁడను ధైర్యవంతుఁడను భాగ్యుఁ
డ శూరుఁడ నిర్మలుండఁ గే, వలముగ నే కృతా

ర్థుఁడను వాసిగఁ బుణ్యుఁడ నయ్యెదం జుమీ, 
చెలఁగుచు నీవు నన్ను దరిజేర్చుమి ధ... 81

ఉ. మోక్షము నిన్ను నే నడుగ ముఖ్యపదార్థము
నీకృపారసం, బీక్షణమందు నాకొసఁగు మింత
టితోఁ బరితృప్తి నొందెదరఁ, పాతులు నీపదా
బ్జములు సత్యముఁ బల్కెదఁ గల్లలాడకే, రాక్ష
సనాశ దీనజనరక్షక ధ... 82

ఉ. ఆగజరాజు నీకు ఘనమైనమణుల్ జమచేసి
పంపెనా, త్యాగముతో విభీషణుఁడు ద్రవ్యము
నీ కెఱుఁగంగఁ దెచ్చెనా, కాఁగులతోఁ గుచే
లుఁ డధికంబుగ నీ కటుకుల్ నొసంగెనా, 
బాగుగ వారి నేలితివి పైకొని ధ... 83

చ. జగతిని శ్రేష్ఠమైన నరజన్మము లెత్తినవారలుఁ
జతు, ర్నిగమము లాఱుశాస్త్రములు నేర్చిన
వారలు యజ్ఞసంతతుల్, తెగువ నొనర్చి పుణ్య
కరతీర్థము లాడినవారు నైన నిఁ, బొగడుచు
నుండుభక్తులను బోలరు ధ... 84

చ. వెలయఁగ నేపురాణములు విన్నది లేదు పఠింప
లేదు పె, ద్దలసహవాస మే నెఱుఁగఁ దత్త్వ
ము గానను దేహసౌఖ్యమే, చెలఁగుచు నేను
గోరెదను చెడ్డది మంచిది పుణ్యపాపముల్, దె
లియని వెఱ్ఱిమూఢుఁడను దిద్దుకొ ధ... 85

ఉ. కంజదళాక్ష నిన్ను బహుభంగులఁ గొనియాడెడి
వారికెల్ల నే, నంజలిజేసి మ్రొక్కెద దురాత్ముల
నన్యులఁ గండ్లఁజూచినఁ, రంజిలఁబోదు నామ
నసు రాజనిభానన దుష్టదైత్యరా, డ్భంజన నీప
దాబ్జములఁ బట్టితి ధ... 86
ఉ. సుందరమైనకాంతలను జూచి భ్రమించెదఁగాని
నామన,స్సందున లావసహ్యపడ దాస్త్రియుఁ గా
మిను లేఁగుదెంచి నా, ముందఱ నిల్చినఁ విడు
వ మూర్ఖుఁడ నాకిటువంటిబుద్ధి నీ, వెందుకుఁ
బెట్టి పెంచితివొ యేలుకొ ధ... 87
చ. భువనములెల్లఁ గాచెడిప్రభుత్వము దండిగ నీ
కుఁ గల్గె రా, జవు చతురాననాదిసురజాలము
నీ కనుకూలసైన్యమై, రవికుల నిన్నుఁ గొల్వఁ
గను రాక్షసభంజన నీకు సర్వవై, భవ జయమం
గళం బగుట బ్రాతిరయ ధ... 88
ఉ. మ్రొక్కిన నీకు మ్రొక్కెదను మోదముతోఁ గల
నైనఁగాని నే, తక్కినవేల్పులందఱకు దండము
బెట్టను శర్కరాళియుఁ, బొక్కిననోటితోఁ
దవుడు బొక్కఁగఁ బోవునె యెవ్వఁడైన నీ,
యొక్కనిమీఁద నేను మన సుంచితి ధ... 89
ఉ. నీ నయమైనకీర్తనలు నేర్వనఁ జక్కని వీణె
మీటుచుఁ, గానము బాడ నారదుఁడఁగాను

మహాభయభక్తిప్రేమతో, దానము నీకుఁ జేయ
బలిదైత్యుఁడఁగాను జగత్తులోపలన్, నేను వృ
థా మనుష్యుఁడను నిల్చితి భ... 90

ఉ. నిన్ను భజించుభక్తులను నిందలుబల్కుచు జా
తు లెన్నుచున్, బన్నుగ గేలిసేయుచును బం
డ్లిగిలించుచు నవ్వుచున్ మదిన్, బన్నుదురా
త్ములన్ యముఁడు వర్లఁగ వర్లఁగ నోటిమీఁద
నే, తన్నకపోఁడు నాఁటి కిది తప్పదు భ... 91

ఉ. శ్రీవనితాకళత్ర నిను జిత్తములోన భజించి
నిత్య నీ, సేవలు జేయునట్టి నరశేఖరుసంగతి నా
కుఁ గల్గెనా, పావనమయ్యెదన్ సకలపాపము
లాపద లన్నిదూరమై, పోవును నేకృతార్థతను
బొందెద భ... 92

ఉ. దేవరవారిభక్తులకుఁ దిన్నగ మ్రొక్కరు భక్త
లందఱున్, గోవధఁ జేయుమ్లేచ్ఛులకు గొబ్బున
లేచి సలాము చేతురున్, కేవల పారమార్థికుల
కే సుమి పెద్దలమీఁదిప్రేమలున్, గావరు లైన
దుర్జనులు గానరు భ... 93

ఉ. పెద్దలమంచుఁ బ్రశ్నలిడి పెక్కులు జెప్పెడి
పాపకర్ములన్, వద్దికిఁ జేరఁబిల్చుకొని వారిమన
స్సుల శోధజేయకే, దిద్దక యేసుమంత్ర ముప

దేశము లిత్తురు కాసులాసక్తై, గద్దరివారి కీప
నులు కైకిలి ధ... 94

చ. కలియుగమందు విప్రుఁడనుగాను నృపాలుఁడఁ
గాను మేటివై, శ్యులజతవాఁడఁగాను బలు
శూరుఁడఁగాను సమస్తమైన జా, తుల నొకరుం
డఁగాను సుమి దుర్దనుజాంతక నీపదాబ్జముల్,
దలఁచెడివారిదాసులకు దాసుఁడ ధ... 95

ఉ. కొండలుగావు దేహములు కుంభినిలోపల శా
శ్వతంబుగా, నుండవు ప్రాణముల్ విడువ నొ
ప్పుగ మిత్రులు గాలవేతురో, కండలు మాంస
మొల్చుకొని కాకులు గద్దలు మేసిపోవునో,
పండితులైననుం బ్రదు కబద్ధము ధ... 96

చ. నరములగుత్తి ముల్లొకటి నాఁటినఁ దాళనితో
లుతిత్తి నెత్తురుగదె దీనినిండ బలుతొమ్మిదిచి
ల్లులు గల్గుకుండ భూ, నరున కిదేమి లెస్స య
గు నమ్మినవారికి లావు ఫిస్స ఛీ, మురి కిది పాడు
మొక్క సుమి ముప్పిది ధ... 97

ఉ. నాయజమాని వీవు నిను నమ్మినదాసుఁడ నేను
నీకు నా, కాయము నమ్ముకోను మధుకైటభమ
ర్దన నన్నుఁ గావు నీ, వే యిఁక దిక్కు నాకుఁ
బెరవేలుపు లెవ్వరు లేరు సుమ్మి నే, పాయక
నిన్నుఁ గొల్చెదను భక్తుఁడ ధ... 98

చ. వనజదళాక్ష నన్నుఁ బెరవానిగఁ జూచెద వేల
నీవు గ్ర, క్కున దయజూచి నామదిని గోరిక
దీర్ప వదేమి నేను జే, సినబలుతప్పు లేమిపుడు
చేతులు జూచి నమస్కరించెదన్, గనికర ముంచి
నేరములఁ గావుము ధ... 99

చ. నరహరి నీపదాబ్జములు నాహృదయంబున నిల్పి
లెస్సగా, మురియుచు నే స్మరించెదను మోక్ష
ము లిచ్చెడి దాత వంచు సుం,దర నిను మానఁ
జాలఁ బరదైవములం గొనియాడనేర న, న్నర
మరసేయకయ్య దనుజాంతక ధ... 100

ఉ. ఓకరుణాసముద్ర పురుషోత్తమ నీపదపంకజంబు
లున్, నాకు మహాధనంబు శరణాగతుఁడన్
ననుఁ జేతఁబట్టుమీ, నే కపటాత్ముఁడన్ బరమనీ
చుఁడ నేరము లెంచఁబోకుమీ, చేకొని తప్పు
లన్ని క్షమ జేయుమి ధ... 101

చ. పరమమృదుత్వమైన పదపంకజముల్ నిరసించు
శ్రీరమా, కరముల కబ్బినట్టి త్రిజగంబులవార
ల కిష్టమైన నీ, చరణసరోజయుగ్మములు చయ్య
న నాశిరమందు నిల్పి నా, దురితములన్ని దూర
ముగఁ దోలుము ధ... 102

చ. తరణిసరోజనేత్ర వరదాతవు నీ వనుచుం ద
లంచి నీ, చరణము లాశ్రయించితిని శాశ్వత

మైనవరంబు లిమ్ము మీ, కరుణకు నేను బాత్రుఁ
డను గష్టము లంటఁగనీయఁబోకుమీ, తలఁ
చుగ మిమ్ము వేఁడెదను దాసుని ధ... 103

చ. తరణిని గోరు పద్మములు తన్మకరందము గోరు
భృంగముల్, శరనిధి గోరు మేఘములు చంద్రు
ని గోరు చకోరవర్గముల్, పురుషుని గోరు స్త్రీలు
ఘనపుంగవుఁ గోరుదు రెల్లభక్తులుఁ, గరుణను
గోరు నాహృదయకంజము ధ... 104

చ. ఇతరసుఖంబుఁ గోరకయె యెవ్వఁడు నీపదు
పాదపద్మముల్, సతతముగా భజించినను సత్కు
లవంతుఁడు వాఁడె సుమ్మి దు, ర్గతుఁడయి యె
వ్వఁడైన రఘురాముని భక్తుల నిందజేసెనా, ప
తితుఁడు వాఁడె పంచములబంధుఁడు ధ...

చ. వరుసతో వేదశాస్త్రములు వల్లెనవేసి సమస్త
శాస్త్రముల్, దిరుగుచు రాజపూజితప్రతిష్ఠను
బొందఁగవచ్చుఁగాని పా, మరములు మాని
నీభజనమాత్రము జేసెడిభక్తిగల్గుటే, నరులకు
దుర్లభంబు సుగుణాంబుధి ధ... 106

ఉ. భాగ్యము లిచ్చు నీభజన పాయక నిశ్చలభక్తి
యోగవై, రాగ్యము లిచ్చు నిత్యసుఖరాజిత
మూర్తులఁజేసి సంతతా, రోగ్యసతీసుతాదికని

రూఢి ఘటించుచుంటెగాక ము_క్తికిఁ, యోగ్యులఁ
జేయు నన్నిటికి నొప్పుగ ధ... 107

ఉ. నే చతురత్వ మే మెఱుఁగ నీకృపవల్లఁ గవీశ్వ
రుండ నై, తో ఁచినపద్యముల్ ముదముతో
రచియించితి తప్పులున్న నీ, వే చెలువారఁ జేసి
వెతఁ బెట్టక కోర్కు-ల నెల్లదీర్చి శే, షాచలదాసు
నేలు మునిసన్నుత ధర్మపురీనృకేసరి. 108

సంపూర్ణము.

# పీ ఠి క.

ఆర్యులారా !

ధర్మపురి రామాయణము, నృకేసరిశతకములను రచించిన శేషప్పకవియే ఈనృసింహాశతకమును రచించెను. నృకేసరిశతకమునందుఁ గొంతవఱకుఁ గవిజీవితనివాసాదికములఁగూర్చి చర్చించి యుండుటచే నిటఁ దిరుగ నుదాహరింప మానితిమి. శతక ప్రపంచమునందీ "నరసింహాశతకము" నకు మంచి ప్రచారముగలదు. స్త్రీబాలవృద్ధులు పలువురీ శతకమును బారాయణ గ్రంథముగాఁ బఠించుటయుఁ బళ్లెకూటములలో నీశతకము పఠనీయగ్రంథముగా నియోగింపఁబడుటయు నీశతకప్రశస్తికిఁ దార్కాణములు.

ఈశతకకవితయందు లోపము లున్నను శైలి ధారళముగా మనోహరముగా నున్నది. భావములు లలితముగా నున్నవి. నీతిపద్యములు కొలఁదిగ భక్తిపద్యములు మెండుగా నిందుఁ గలవు. పూర్వ

ముద్రణప్రతులను బూర్వేతర ముద్రణప్రతులను బోల్చి చూచి క్రొత్తగ సంస్కరించి యీకూర్పునం దీశతకమును భక్తిరసశతకసంపుటములందలి మూఁడవభాగములోఁ జేర్చి యాంధ్రమహాజనుల కిప్పటి కర్పింపఁగలిగితిమి.

చెన్నపట్టణం<br>1-8-26.

ఇట్లు,<br>వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీ ర స్తు.

# నరసింహశతకము.



సీ. శ్రీమనోహర సురార్చిత సింధుగంభీర
భక్తవత్సల కోటిభానుతేజ
కంజనేత్ర హిరణ్యాక్షకశ్యపాంతక శూర
సాధురక్షణ శంఖచక్రహస్త
ప్రహ్లాదవరద పాపధ్వంస సర్వేశ
క్షీరసాగరశయన కృష్ణవర్ణ
పక్షివాహన నీలభ్రమరకుంతలజాల
పల్లవారుణపాదపద్మయుగళ
తే. చారుశ్రీచందనాగరుచర్చితాంగ
కుందకుట్మలదంత వైకుంఠధామ
భూషణవికాస శ్రీధర్మపురనివాస
దుష్టసంహార నరసింహ దురితదూర. 1

సీ. పద్మలోచన సీసపద్యముల్ నీమీఁదఁ
జెప్పఁబూనితినయ్య చిత్తగింపు
గణయతిప్రాసలక్షణముఁ జూడఁగ లేదు
పంచకావ్యశ్లోకపఠన లేదు

అమరకాండత్రయం బమరం జూడంగ లేదు
శాస్త్రీయగ్రంథముల్ చదువ లేదు
నీకటాక్షంబున నే రచించెదంగాని
ప్రజ్ఞ నాయదిగాదు ప్రస్తుతింపం
తే. దప్పుపడ నేమి సద్భక్తి తక్కువౌనె
చెఱకునకు వంకవో నేమి చెడునె తీపు...
సీ. నరసింహ నీదివ్యనామమంత్రముచేత
దురితజాలము లన్నిం దోలవచ్చు
నరసింహ నీదివ్యనామమంత్రముచేత
బలువైనరోగముల్ బాపవచ్చు
నరసింహ నీదివ్యనామమంత్రముచేత
రిపుసంఘముల సంహరింపవచ్చు
నరసింహ నీదివ్యనామమంత్రముచేత
దండహస్తునిబంట్లం దఱుమవచ్చు
తే. బలిర నే నీమహామంత్రబలముచేత
దివ్యవైకుంఠపదవి సాధింపవచ్చు...
సీ. ఆదినారాయణా యనుచు నాలుకతోడం
బలుక నేర్చినవారి పాదములకు
సాష్టాంగ మగునమస్కార మర్పణం జేసి
ప్రస్తుతించెద నయ్య బహువిధముల
ధరణిలో నరు లెంత దండివారైనను
నిన్నుం గాననివారి నే స్మరింప

నేము శ్రేష్ఠుల మంచు నిక్కుచుండెడివారి
చెంతఁ జేరఁగఁబోను శేషశయన
తే. పరమసాత్త్వికు లైననీభక్తవరుల
దాసులకు దాసుఁడను జుమ్మి ధాత్రిలోన... 4
సీ. ఐశ్వర్యములకు ని న్ననుసరింపఁగ లేదు
ద్రవ్య మిమ్మని వెంటఁ దగుల లేదు
కనక మిమ్మని చాలఁ గష్టపెట్టఁగ లేదు
పల్ల కిమ్మని నోటఁ బలుక లేదు
సొమ్ము లిమ్మని నిన్ను నమ్మి కొల్వఁగ లేదు
భూము లిమ్మని పేరు పొగడ లేదు
బలము లిమ్మని నిన్ను బతిమాలఁగా లేదు
పసుల ని మ్మని పట్టు పట్ట లేదు
తే. నేను గోరిన దొక్కటే నీలవర్ణ
చయ్యనను మోక్ష మిచ్చినఁ జాలు నాకు... 5
సీ. మందుఁడ నని నన్ను నిందఁ జేసిననేమి
నాదీనతను జూచి నవ్వనేమి
దూరభావము లేక తూలనాడిననేమి
ప్రీతిసేయక వంకఁ బెట్టనేమి
కక్కసంబులు పల్కి వెక్కిరించిననేమి
తీవ్రకోపముచేతఁ దిట్టనేమి
రొచ్చుమాటలచేత నెమ్మెలాడిననేమి
చేరి దాపట గేలి చేయనేమి

తే. కల్పవృక్షమువలె నీవు గల్గ నింక
ప్రజలలక్ష్యంబు నాకేల పద్మనాభ... 6

సీ. చిత్తశుద్ధిగ నీకు సేవఁ జేసెదఁ గాని
పుడమిలో జనులమెప్పులకుఁ గాదు.
జన్మపావనతకై స్మరణఁ జేసెదఁ గాని
సరివారిలోఁ బ్రతిష్ఠలకుఁ గాదు
ముక్తికోసరము నే మ్రొక్కి వేఁడెదఁ గాని
దండిభాగ్యమునిమిత్తంబు గాదు
నినుఁ బొగడను విద్య నేర్చితినే కాని
కుక్షి నిండెడుకూటికొఱకుఁ గాదు
తే. పారమార్థికమునకు నేఁ బాటువడితి
గీర్తికి నపేక్షపడలేదు కృష్ణవర్ణ... 7

సీ. శ్రవణరంధ్రముల నీసత్కథల్ పొగడంగ
లేశ మానందంబు లేనివాఁడు
పుణ్యవంతులు నిన్నుఁ బూజసేయఁగఁ జూచి
భావమం దుత్సాహపడనివాఁడు
భక్తవర్యులు నీప్రభావముల్ పొగడంగఁ
దత్పరత్వములేక తలఁగువాఁడు
తనచిత్తమందు నీధ్యాన మెన్నఁడు లేక
కాలమంతయు వృథా గడపువాఁడు
తే. వసుధలో నెల్ల వ్యర్థుండు వాఁడె యగును
మఱియుఁ జెడుఁగాక యెప్పుడు మమతనొంది...

సీ. గౌతమీస్నానానఁ గడతేరుదామంటె
మొనసి చన్నీళ్లలో మునుఁగలేను
దీర్ఘయాత్రలచేఁ గృతార్థుఁ డౌదామంటె
బడలి నేమంబు లే నడపలేను
దానధర్మముల సద్గతిని జెందుదమంటె
ఘనముగా నావద్ద ధనము లేదు
తప మాచరించి సార్థకము నొందుదమంటె
నిమిషమైన మనస్సు నిలుపలేను
తే. గష్టములకోర్వ నాచేతఁ గాదు నిన్ను
స్మరణచేసెద నాయథాశక్తికొలఁది... 9

సీ. అర్థివాండ్రకు నీక హానిఁ జేయుటకంటెఁ
దెంపుతో వసనాభి దినుట మేలు
ఆఁడుబిడ్డలసొమ్ము లపహరించుటకంటె
బండఁ గట్టుక నూతఁ బడుట మేలు
పరులకాంతలఁ బట్టి బల్మిఁ గూడుటకంటె
బడబాగ్నికీలలఁ బడుట మేలు
బ్రతుకఁజాలక దొంగపనులు సేయుటకంటెఁ
గొంగుతో ముష్టెత్తుకొనుట మేలు
తే. జలజదళనేత్ర నీభక్తజనులతోడి
జగడ మాడెడుపనికంటెఁ జావు మేలు... 10

సీ. గార్దభంబున కేల కస్తూరితిలకంబు
మర్కటంబున కేల మలయజంబు

శార్దూలమున కేల శర్కరాపూపంబు
సూకరంబున కేల చూతఫలము
మార్జాలమున కేల మల్లెపువ్వులబంతి
గుడ్లగూబల కేల కుండలములు
మహిషంబునకును నిర్మలవస్త్ర మది యేల
బకసంతతికి నేల పంజరంబు
తే. ద్రోహచింతనఁ జేసెడిదుర్జనులకు
మధురమైనట్టి నీనామమంత్ర మేల... 11
సీ. పసరంబు పంజైనఁ బసులకాపరితప్పు
ప్రజలు దుర్జనులైనఁ బ్రభునితప్పు
భార్య గయ్యాళైనఁ బ్రాణనాథునితప్పు
తనయుండు దుష్టయినఁ దండ్రితప్పు
సైన్యంబు చెదరిన సైన్యనాథునితప్పు
కూఁతురు చెడుగైన మాతతప్పు
అశ్వంబు చెడుగైన నారోహకునితప్పు
దంతి దుష్టయిన మావంతుతప్పు
తే. ఇట్టి తప్పు లెఱుంగక యిచ్చవచ్చి
నటుల మెలఁగుదు రిప్పు డీయవనిజనులు... 12
సీ. కోఁతికి జలతారుకుల్లాయి యేటికి
విరజాజిపూదండ విధవ కేల
ముక్కిడితొత్తుకు ముత్తెంపుననత్తేల
నద్ద మేమిటికి జాత్యంధునకును

మాచకమ్మకు నేల మౌక్తికహారముల్
    క్రూరచిత్తునకు సద్గోష్ఠు లేల
అంకుబోతుకు నేల బింకంపునిష్ఠలు
    వావి యేటికి దుష్టవర్తనునకు
తే. మాటనిలకడ సుంకరిమోటు కేల
    చెవిటివానికి సత్కథాశ్రవణ మేల... 13
సీ. మాన్యంబు లీయ సమర్థుఁ డొక్కఁడు లేఁడు
    మాన్యముల్ చెఱుప సామంతు లంత
యొండినయూళ్లగో డెఱిఁగింపఁ డెవ్వఁడుఁ
    బండినయూళ్లకుఁ బ్రభువు లంత
యితఁడు పేద యటంచు నెఱిఁగింపఁ డెవ్వఁడు
    కలవారిసిరు లెన్నఁగలరు చాలఁ
దనయాలిచీఁకటితప్పెన్నఁ డెవ్వఁడుఁ
    బెఱకాంతఱంకెన్నఁ బెద్ద లంత
తే. యిట్టిదుష్టుల కధికార మిచ్చినట్టి
    ప్రభువు తప్పిది యంచును బలుకవలెను... 14
సీ. తల్లిగర్భమునుండి ధనము తేఁ డెవ్వఁడు
    వెళ్లిపోయెడినాఁడు వెంటరాదు
లక్షాధికారైన లవణ మన్నమె కాని
    మెఱుఁగుబంగారంబు మ్రింగఁబోఁడు
విత్త మార్జనచేసి విఱ్ఱవీఁగుటె కాని
    కూడఁబెట్టినసొమ్ము తోడరాదు

పొందుగా మఱుఁగైన భూమిలోపలఁ బెట్టి
దానధర్మములేక దాఁచి దాఁచి
తే. తుదను దొంగల కిత్తురో దొరల కవునొ
తేనె జుంటీగ లియ్యవా తెరువరులకు... 15
సీ. లోకమం దెవఁడైన లోభిమానవుఁ డున్న
భిక్ష మర్థికిఁ జేతఁ బెట్టలేఁడు
తాను బెట్టకయున్నఁ దగవు పుట్టదుగాని
యొరులు పెట్టఁగఁ జూచి యోర్వలేఁడు
దాతదగ్గఱఁ జేరి తనముల్లె చెడినట్టు
జిహ్వతోఁ జాడీలు చెప్పుచుండు
ఫలము విఘ్నంబైన బలుసంతసము నందు
మేలు గల్గిన చాల మిణుకుచుండు
తే. శ్రీరమానాథ యిటువంటి క్రూరునకును
భిక్షుకులశత్రు వని పేరు పెట్టవచ్చు... 16
సీ. తనువులోఁ బ్రాణముల్ తరలిపోయెడివేళ
నీస్వరూపమును ధ్యానించునతఁడు
నిమిషమాత్రములోన నిన్నుఁ జేరునుగాని
యమునిచేతికిఁ జిక్కి శ్రమలపడఁడు
పరమసంతోషాన భజన జేసెడివాని
పుణ్య మేమనవచ్చు భోగిశయన
మోక్షము నీదాసముఖ్యుల కగుఁ గాన
నరక మెక్కడిదయ్య నలిననేత్ర

తే. కమలనాభునిమహిమలు గానలేని
తుచ్ఛులకు ముక్తి దొరకుట దుర్లభంబు...17

సీ. నీలమేఘశ్యామ నీవె తండ్రివి మాకుఁ
గమలవాసిని మమ్ముఁ గన్నతల్లి
నీభక్తవరు లంత నిజమయినబాంధవుల్
నీకటాక్షము మా కనేకధనము
నీకీర్తనలు మాకు లోకప్రపంచంబు
నీసహాయము మాకు నిత్యసుఖము
నీమంత్రమే మాకు నిష్కళంకపువిద్య
నీపదధ్యానంబు నిత్యజపము
తే. తోయజాతాక్ష నీపాదతులసిదళము
రోగముల కౌషధము బ్రహ్మరుద్రవినుత...18

సీ. బ్రతికినన్నాళ్లు నీభజనఁ జేసెదఁగాని
మరణకాలమునందు మఱతునేమొ
ఆవేళ యమదూత లాగ్రహంబున వచ్చి
ప్రాణముల్ పెకలించి పట్టునపుడు
కఫవాతపైత్యముల్ గప్పఁగా భ్రమచేతఁ
గంప ముద్భవమంది కష్టపడుచు
నాజిహ్వతో నిన్ను నారాయణా యంచుఁ
బిలుతునో శ్రమచేతఁ బిలువలేనొ
తే. నాఁటి కిప్పుడె భక్తి నీనామ మిదిగొ
తలఁచెదను జెవి నిడవయ్య ధైర్యముగను...19

పొందుగా మఱుఁగైన భూమిలోపలఁ బెట్టి
దానధర్మములేక దాఁచి దాఁచి
తే. తుదను దొంగల కిత్తురో దొరల కవునొ
తేనె జుంటీగ లియ్యవా తెరువరులకు... 15

సీ. లోకమం దెవఁడైన లోభిమానవుఁ డున్న
భిక్షు మర్థికిఁ జేతఁ బెట్టలేఁడు
తాను బెట్టకయున్నఁ దగవు పుట్టదుగాని
యొరులు పెట్టఁగఁ జూచి యోర్వలేఁడు
దాతదగ్గఱఁ జేరి తనముల్లె చెడినట్లు
జిహ్వతోఁ జాడీలు చెప్పుచుండు
ఫలము విఘ్నంబైన బలుసంతసము నందు
మేలు గల్గిన చాల మిణుకుచుండు
తే. శ్రీరమానాథ యిటువంటి క్రూరునకును
భిక్షుకులశత్రు వని పేరు పెట్టవచ్చు... 16

సీ. తనువులోఁ బ్రాణముల్ తర్లిపొయ్యెడివేళ
నీస్వరూపమును ధ్యానించునతఁడు
నిమిషమాత్రములోన నిన్నుఁ జేరునుగాని
యమునిచేతికిఁ జిక్కి శ్రమలపడఁడు
పరమసంతోషాన భజనజేసెడివాని
పుణ్య మేమనవచ్చు భోగిశయన
మోక్షము నీదాసముఖ్యుల కగుఁ గాన
నరక మెక్కడిదయ్య నలిననేత్ర

తే. కమలనాభునిమహిమలు గానలేని
తుచ్ఛులకు ముక్తి దొరకుట దుర్లభంబు...17

సీ. నీలమేఘశ్యామ నీవె తండ్రివి మాకుఁ
గమలవాసిని మమ్ముఁ గన్నతల్లి
నీభక్తవరు లంత నిజమయినబాంధవుల్
నీకటాక్షము మా కనేకధనము
నీకీర్తనలు మాకు లోకప్రపంచంబు
నీసహాయము మాకు నిత్యసుఖము
నీమంత్రమే మాకు నిష్కళంకపువిద్య
నీపదధ్యానంబు నిత్యజపము
తే. తోయజాతాక్ష నీపాదతులసిదళము
రోగముల కౌషధము బ్రహ్మరుద్రవినుత...18

సీ. బ్రతికినన్నాళ్లు నీభజనఁ జేసెదఁగాని
మరణకాలమునందు మఱతునేమొ
ఆవేళ యమదూత లాగ్రహంబున వచ్చి
ప్రాణముల్ పెకలించి పట్టునపుడు
కఫవాతపైత్యముల్ గప్పఁగా భ్రమచేతఁ
గంప ముద్భవమంది కష్టపడుచు
నాజిహ్వతో నిన్ను నారాయణా యంచుఁ
బిలుతునో శ్రమచేతఁ బిలువలేనొ
తే. నాఁటి కిప్పుడె భక్తి నీనామ మిదిగో
తలఁచెదను జెవి నిడవయ్య ధైర్యముగను...19

సీ. పాంచభౌతికము దుర్బల మైనకాయం బి
దెప్పుడో విడుచుట యెఱుకలేదు
శతవర్షములదాఁక మితముఁ జెప్పిరిగాని
నమ్మరా దామాట నెమ్మనమున
బాల్యమందో మంచిప్రాయమందో లేక
ముదిమియందో లేక ముసలియందొ
యూరనో యడవినో యుదకమధ్యముననో
యెప్పుడో విడుచుట యేక్షణంబొ
తే. మరణమే నిశ్చయము బుద్ధిమంతుఁ డైన
దేహ మున్నంతలో మిమ్ముఁ దెలియవలయు...
సీ. తల్లిదండ్రులు భార్య తనయు లాప్తులు బావ
మఱఁదు లన్నలు మేనమామగారు
ఘనముగా బంధువుల్ గల్గినప్పటికైనఁ
దాను దర్లగ వెంటఁ దగిలి రారు
యమునిదూతలు ప్రాణ మపహరించుకపోఁగ
మమతతోఁ బోరాడి మాన్పలేరు
బలఁగమందఱు దుఃఖపడుటమాత్ర మెకాని
యించుక యాయుష్య మియ్యలేరు
తే. చుట్టములమీఁది భ్రమదీసి చూరఁబెట్టి
సంతతము మిమ్ము నమ్ముట సార్థకంబు... 21
సీ. ఇభరాజవరద ని న్నెంతఁ బిల్చినఁగాని
మాఱు పల్కవదేమి మౌనితనము

మునిజనార్చిత నిన్ను మ్రొక్కి వేఁడినఁగాని
కనులఁ బడవదేమి గడుసుఁదనము
చాల దైన్యమునొంది చాటు చొచ్చినఁగాని
భాగ్య మియ్యవదేమి ప్రార్థితనము
స్థిరముగా నీపాదసేవఁ జేసెద నన్ను
దొరకఁజాలవదేమి ధూర్తతనము
తే. మోక్షదాయక యిటువంటి మూర్ఖజనుని
కష్టపెట్టిన నీకేమి కడుపు నిండు... 22
సీ. నీమీఁదికీర్తనల్ నిత్యగానముఁ జేసి
రమ్య మొందింప నారదుఁడఁ గాను
సావధానముగ నీచరణపంకజసేవ
సలిపి మెప్పింపంగ శబరిఁ గాను
బాల్యమప్పటినుండి భక్తి నీయందులఁ
గలుగను ప్రహ్లాదఘనుఁడఁ గాను
ఘనముగా నీమీఁద గ్రంథముల్ గల్పించి
వినుతి సేయను వ్యాసమునిని గాను
తే. సాధుఁడను మూర్ఖమతి మనుష్యాధముఁడను
హీనుఁడను జుమ్మి నీవు నన్నేలుకొనుము...23
సీ. అతిశయంబుగఁ గల్లలాడ నేర్చితిఁ గాని
పాటిగా సత్యముల్ పలుకనేర
సత్కార్యవిఘ్నముల్ సలుప నేర్చితిఁ గాని
యిష్టమొందఁగ నిర్వహింపనేర

నొకరిసొమ్ముకు దోసి లొగ్గనేర్చితిఁ గాని
చెలువుగా ధర్మంబు సేయనేర
ధనము లియ్యంగ వద్దనఁగ నేర్చితిఁ గాని
శీఘ్ర మిచ్చెదునట్లు చెప్పనేరఁ
తే. బంకజాక్షా నే నెంతో పాతకుఁడను
దప్పులన్నియు క్షమియింపు తండ్రి నీవె... ౬

సీ. ఉర్విలో నాయుష్య మున్నపర్యంతంబు
మాయసంసారంబు మఱిగి నరుఁడు
సకలపాపములైన సంగ్రహించునుగాని
నిన్నుఁ జేరెడియుక్తి నేర్వలేఁడు
తుదను కాలునివద్ది దూత లిద్దఱు వచ్చి
గుంజుక చని వారు గ్రుద్దుచుండ
హింస కోర్వఁగ లేక యేడ్చి గంతులు వేసి
దిక్కు లేదని నాల్గుదిశలుఁ జూడఁ
తే. దన్ను విడిపింప వచ్చెడిధన్యుఁ డేడి
ముందె నీదాసుఁ డైయున్న ముక్తి గలుగు...

సీ. అధికవిద్యావంతు లప్రయోజకు లైరి
పూర్ణశుంఠలు సభాపూజ్యు లైరి
సత్యవంతులమాట జనవిరోధం బాయె
వదరుపోతులమాట వాసికెక్కె
ధర్మవాసనపరుల్ దారిద్ర్య మొందిరి
పరమలోభులు ధనప్రాప్తు లైరి

పుణ్యవంతులు రోగభూతపీడితు లైరి
దుష్టమానవులు వర్ధిష్ణు లైరి
తే. పక్షివాహన మావంటిభిక్షుకులకు
శక్తిలేదాయె నింక నీవె చాలు మాకు... 26
సీ. భుజబలంబునఁ బెద్దపులులఁ జంపఁగ వచ్చుఁ
బాముకంఠముఁ జంకఁ బట్టవచ్చు
బ్రహ్మరాక్షసకోట్లఁ బాఱఁ దోలఁగవచ్చు
మనుజులరోగముల్ మాన్పవచ్చు
జిహ్వ కిష్టముగాను జేదు మ్రింగఁగవచ్చుఁ
బదనుఖడ్గముచేత నదుమవచ్చుఁ
గష్ట మొందుచు ముండ్లకంపలోఁ జొరవచ్చుఁ
దిట్టుపోతులనోళ్లు కట్టవచ్చుఁ
తే. బుడమిలో దుష్టులకు జ్ఞానబోధ తెలిపి
సజ్జనులఁ జేయ లేఁ డెంతచతురుఁడైన... 27
సీ. అవనిలోఁ గలయాత్ర లన్ని చేయఁగవచ్చు
ముఖ్యుఁడై నదులందు మునుఁగవచ్చు
ముక్కుపట్టుక సంధ్య మొనసి వార్చఁగవచ్చు
దిన్నగా జపమాలఁ ద్రిప్పవచ్చు
వేదాల కర్థంబు విఱిచి చెప్పఁగవచ్చు
శ్రేష్ఠక్రతువు లెల్లఁ జేయవచ్చు
ధనము లక్షలు కోట్లు దాన మియ్యఁగవచ్చు
నైష్ఠికాచారముల్ నడపవచ్చుఁ

తే. చిత్త మన్యస్థలంబునఁ జేరకుండ
నీపదాంభోజములయందు నిలుపరాదు... 28

సీ. కర్ణయుగ్మమున నీకథలు సోఁకినఁ జాలు
పెద్దపోఁగులజోళ్లు పెట్టినట్లు
చేతు లెత్తుచుఁ బూజసేయఁ గల్గినఁ జాలు
దోరయఁ గాఁ గడియాలు దొడిగినట్లు
మొనసి మస్తకముతో మ్రొక్కఁగల్గినఁ జాలుఁ
జెలువ మైనతురాయి చెక్కినట్లు
గళము నొవ్వఁగ నామస్మరణ గల్గినఁ జాలు
వింతగాఁ గంఠీలు వేసినట్లు
తే. పూని నినుఁ గొల్చుటే సర్వభూషణంబు
లితరభూషణముల నిచ్చగింపనేల... 29

సీ. భువనరక్షక నిన్నుఁ బొగడ నేరనినోరు
ప్రజకు గోచరమైన పాడుబొంద
సురవరార్చిత నిన్నుఁ జూడఁగోరనికనుల్
జలములోపల నెల్లిసరపుగుండ్లు
శ్రీరమాధిప నీకు సేవఁ జేయనిమేను
కూలి కమ్ముడువోని కొలిమితిత్తి
వేడ్కతో నీకథల్ వినని కర్ణములైనఁ
గఠినశిలాదులఁ గలుగుతొలలు
తే. పద్మలోచన నీమీఁద భక్తిలేని
మానవుఁడు రెండుపాదాలమహిషమయ్య...

సీ. అతివిద్య నేర్చుట యన్నవస్త్రములకే
పసుల నార్జించుట పాడికొఱకె
సతిని బెండ్లాడుట సంసారసుఖముకే
సుతుల పోషించుట గతులకొఱకె
సైన్యముల్ గూర్చుట శత్రుభయమునకే
సాము నేర్చుటలెల్ల చావుకొఱకె
దాన మిచ్చుటయు ముందటిసంచితమునకే
ఘనముగాఁ జదువుట కడుపుకొఱకె
తే. యితరకాముంబు గోరక సతతముగను
భక్తి నీయందు నిలుపుట ముక్తికొఱకె... 31
సీ. ధరణిలో వెయ్యేండ్లు తనువు నిల్వఁగఁబోదు
ధన మెప్పటికి శాశ్వతంబుగాదు
దారసుతాదులు తనవెంట రాలేరు
భృత్యులు మృతిని దప్పింపలేరు
బంధుజాలము తన్ను బ్రతికించుకోలేరు
బలపరాక్రమ మేమి పనికిరాదు
ఘనమైన సకలభాగ్యం బెంత కల్గియు
గోచిమాత్రంబైనఁ గొనుచుఁ బోఁడు
తే. వెఱ్ఱికుక్కలభ్రమ లన్ని విడిచి నిన్ను
భజనసేసెడివారికిఁ బరమసుఖము... 32
సీ. నరసింహ నాకు దుర్నయములే మెండాయె
సుగుణ మొక్కటి లేదు చూడఁ జనిన

యన్యకాంతలమీఁద నాశ మానఁగలేను
ఒరుల క్షేమము చూచి యోర్వలేను
ఇటువంటిదుర్బుద్ధు లిన్ని నా కున్నవి
నేను జేసెడివన్ని నీచకృతులు
నావంటి పాపిష్ఠనరుని భూలోకానఁ
బుట్టఁజేసితి వేల భోగిశయన
తే. అబ్జదళనేత్ర నాతండ్రి వైనఫలము
నేరములు గాచి రక్షించు నీవె దిక్కు... 33
సీ. ధీరతఁ బరుల నిందింప నేర్చితిఁగాని
తిన్నగా నినుఁ బ్రస్తుతింపనైతిఁ
బొరుగుకామినులందు బుద్ధి నిల్పితిఁగాని
నిన్ను సంతతము ధ్యానింపనైతిఁ
పొరుగుముచ్చటలైన మురిసి వింటినిగాని
యెంచి నీకథ లాలకించనైతిఁ
గౌతుకంబునఁ బాతకము గడించితిఁగాని
హెచ్చుపుణ్యము సంగ్రహింపనైతి
తే. నవనిలో నేను జన్మించినందు కేమి
సార్థకము గానరాదాయె స్వల్పమైన... 34
సీ. అంత్యకాలమునందు నాయాసమున నిన్నుఁ
దలఁతునో తలఁపనో తలఁతు నిపుడె
నరసింహ నరసింహ నరసింహ లక్ష్మీశ
దానవాంతక కోటిభాను తేజ

గోవింద గోవింద గోవింద సర్వేశ
పన్నగాధిపశాయి పద్మనాభ
మధువైరి మధువైరి మధువైరి లోకేశ
నీలమేఘశరీర నిగమవినుత
తే. ఈవిధంబున నీనామ మిష్టముగను
భజన సేయుచునుందు నాభావమందు... 35
సీ. ఆయురారోగ్యపుత్రార్థసంపదలన్ని
గలుగఁజేసెడిభారకర్త వీవె
చదువు లెస్సగ నేర్పి సభలో గరిష్ఠాధి
కార మొందించెడి ఘనుఁడ వీవె
నడత మంచిదిపెట్టి నరులు మెచ్చెడునట్టి
పేరు రప్పించెడి పెద్ద వీవె
బలువైన వైరాగ్య భక్తిజ్ఞానము లిచ్చి
ముక్తి బొందించెడు మూర్తి వీవె
తే. అవనిలో మానవుల కన్నియాస లిచ్చి
వ్యర్థులనుజేసి తెలిపెడివాఁడ వీవె... 36
సీ. కాయ మెంతభయానఁ గాపాడినంగాని
ధాత్రిలో నది చూడ దక్కఁబోదు
ఏవేళ నేరోగ మేమరించునొ సత్త్వ
మొందఁగఁజేయు నేచందమునను
ఔషధంబులు మంచి వనుభవించినఁగాని
కర్మ క్షీణం బైనఁగాని విడదు

కోటివైద్యులు గుంపుగూడి వచ్చినఁగాని
మరణ మయ్యెడివ్యాధి మాన్ప లేరు
తే. జీవునిప్రయాణకాలంబు సిద్ధమైన
నిలుచునా దేహ మిం దొకనిమిషమైన...2

సీ. జందె మింపుగ వేసి సంధ్యవార్చిన నేమి
బ్రహ్మ మందక కాఁడు బ్రాహ్మణుండు
తిరుమణిశ్రీచూర్ణ గురురేఖ లిడినను
విష్ణు నొందక కాఁడు వైష్ణవుండు
బూడిని నుదుటను బూసికొనిన నేమి
శంభు నొందక కాఁడు శైవజనుఁడు
కాషాయవస్త్రాలు గట్టి కప్పిన నేమి
యాశ పోవక కాఁడు యతివరుండు
తే. ఇట్టి లౌకికవేషాలు గట్టుకొనిన
గురునిఁ జెందక సన్ముక్తి దొరకఁబోదు... 3

సీ. వరసింహ నే నిన్ను నమ్మినందుకుఁ జాల
నెనరు నాయం దుంచు నెమ్మనమున
నన్నివస్తువులు ని న్నడిగి వేసటపుట్టె
నింకనైన గటాక్ష మియ్యవయ్య
సంతసంబున నన్ను స్వర్గమందే యుంచు
భూమియందే యుంచు భోగిశయన
నయముగా వైకుంఠనగరమందే యుంచు
నరకమందే యుంచు నళిననాభ

తే. ఎచట నన్నుంచినంగాని యెపుడు నిన్ను
మఱచి పోకుండ నీనామస్మరణ నొసఁగు... 39

సీ. దేహమున్నవఱకు మోహసాగరమందు
మునుఁగుచుందురు శుద్ధమూఢజనులు
సలలితైశ్వర్యముల్ శాశ్వతం బనుకొని
షడ్భ్రమలను మానఁజాల రెవరు
సర్వకాలము మాయసంసారబద్ధులై
గురునికారుణ్యంబు గోరుకోనరు
జ్ఞానభక్తివిరక్తులైనపెద్దలఁ జూచి
నిందఁజేయక తాము నిలువలేరు
తే. మత్తులైనట్టి దుర్జాతిమనుజులెల్ల
నిన్నుఁ గనలేరు మొదటికే నీరజాక్ష... 40

సీ. ఇలలోన నే జన్మ మెత్తినప్పటినుండి
బలుగడించితినయ్య పాతకములు
తెలిసి చేసితిఁ గొన్ని దెలియఁజాలక చేసి
బాధ నొందితినయ్య పద్మనాభ
అనుభవించెదనన్న నతిప్రయాసం బంచుఁ
బ్రజలు చెప్పఁగఁ జాల భయముగలిగె
నెగిరిపోవుటకునై యేయుపాయంబైనఁ
జేసి చూతమటన్నఁ జేతకాదు
తే. సూర్యశశినేత్ర నీచాటుఁ జొచ్చితిపుడు
కలుషములు ద్రుంచి నన్నేలు కష్టమనక... 41

సీ. తాపసార్చిత నేను బాపకర్ముఁ డటంచు
నాకు వంకలఁ బెట్టఁ బోకు సుమ్మి
నాఁటికి శిక్షలు నాకుఁ జేయుటకంటె
నేఁడు సేయుము నీవు నేస్త మనక
అతిభయంకరు లైన యమదూతలకు నన్ను
నొప్పగింపకు మయ్య యురగశయన
నీదాసులను బట్టి నీవు దండింపంగ
వద్దు వద్దన రెంత పెద్దలైనఁ
తే. దండ్రి వై నీవు పరపీడ దగులఁ జేయ
వాసి గలపేరు కపకీర్తి వచ్చునయ్య... 42

సీ. ధరణిలోపల నేను తల్లిగర్భమునందు
బుట్టినప్పటినుండి పుణ్యమెఱుఁగ
నేకాదశీవ్రతం బెన్నఁ డుండఁగలేదు
తీర్థయాత్రలకైనఁ దిరుగలేదు
పారమార్థిక మైనపనులు సేయఁగలేదు
భిక్ష మొక్కనికైనఁ బెట్టలేదు
జ్ఞానవంతులకైనఁ బూని మ్రొక్కఁగలేదు
ఇతరదానము లైన నియ్యలేదు
తే. నళినదళనేత్ర నిన్ను నే నమ్మినాను
జేరి రక్షింపవే నన్ను శీఘ్రముగను.... 43

సీ. అడవిపక్షుల కెవ్వఁ డాహార మిచ్చెను
మృగజాతి కెవ్వఁడు మేఁతఁ బెట్టె

వనచరాదులకు భోజన మెవ్వఁ డిప్పించెఁ
జెట్ల కెవ్వఁడు నీళ్లు చేఁది పోసె
స్త్రీలగర్భంబున శిశువు నెవ్వఁడు పెంచె
ఫణుల కెవ్వఁడు పోసెఁ బరఁగఁ బాలు
మధుపాళి కెవ్వఁడు మకరంద మొనరించెఁ
బసుల కెవ్వఁ డొసంగెఁ బచ్చిపూరి
తే. జీవకోట్లను బోషింప నీవెకాని
వేఱె యొకదాత లేఁడయ్యొ వెదకిచూడ...44

సీ. దనుజారి నావంటిదాసజాలము నీకు
కోటిసంఖ్య గలరు కొదవలేదు
బంట్లసందడివల్ల బహుపరాకై నన్ను
మఱచిపోకుము భాగ్యమహిమచేత
దండిగా భృత్యులు దగిలి నీకుండంగ
బక్కబంటే పాటిపనికి నగును
నీవు మెచ్చెడిపనుల్ నేను జేయఁగలేక
యింతవృథాజన్మ మెత్తినాను
తే. భూజనులలోన నే నప్రయోజకుఁడను
గనుక నీసత్కటాక్షంబు గలుగఁజేయు... 45

సీ. కమలలోచన నన్నుఁ గన్నతండ్రివిగాన
నిన్ను నేమఱకుంటి నేను విడక
యుదరపోషణకునై యొకరి నే నాశింప
నేర నా కన్నంబు నీవు నడపు

పెట్టలే నంటివా పిన్న పెద్దలలోనఁ
దగవు కిప్పుడు దీయఁ దలఁచినాను
ధనము భారంబయినఁ దలకిరీటము లమ్ము
కుండలంబులు పైఁడిగొలుసు లమ్ము
తే. కొనకు నీశంఖచక్రముల్ కుదువఁబెట్టి
గ్రాసము నొసంగి పోషించు కపట ముడిగి ...
సీ. కువలయశ్యామ నీకొలువుచేసిన నాకు
జీత మెందుకు ముట్టఁ జెప్పవైతి
మంచిమాటలచేతఁ గొంచె మియ్యఁగలేవు
కలహ మానీకఁ జుమ్మి ఖండితముగ
నీవు సాధువు గాన నింతపర్యంతంబు
చనువుచే నిన్నాళ్లు జరుపవలసె
ఇఁక నే సహింప నీ విపుడు నన్నేమైన
శిక్షచేసినఁ జేయు సిద్ధ మయితి
తే. నేఁడు కరుణింపకుంటివా నిశ్చయముగఁ
దెగఁబడితిఁ జూడు నీతోడ జగడమునకు...47
సీ. హరి నీకుఁ బర్యంకమయిన శేషుఁడు చాలఁ
బవనము భక్షించి బ్రతుకుచుండు
ననువుగా నీకు వాహన మయినఖగరాజు
గొప్పపామును నోటఁ గొఱుకుచుండు
నదిగాక నీభార్య యైనలక్ష్మీదేవి
దినము పేరంటంబు దిరుగుచుండు

నిన్ను భక్తులు పిల్చి నిత్యపూజలు చేసి
ప్రేమఁ బక్వాన్నముల్ పెట్టుచుండ
తే. స్వస్థముగ నీకు గ్రాసము జరుగుచుండఁ
గాసు నీచేతి దొకటైనఁ గాదు వ్యయము...48

సీ. పుండరీకాక్ష నా రెండుకన్నులనిండ
నిన్నుఁ జూచెడిభాగ్య మెన్నఁడయ్య
వాసిగా నామనోవాంఛ దీరెడునట్లు
సొగసుగా నీరూపుఁ జూపవయ్య
పాపకర్మునికంటఁ బడక పోవుద మంచుఁ
బరుషమైన ప్రతిజ్ఞ పట్టినావ
వసుధలోఁ బతితపావనుఁడ వీవంచు నేఁ
బుణ్యవంతుల నోటఁ బొగడ వింటి
తే. నేమిటికి విస్తరించె నీ కింతకీర్తి
ద్రోహినైనను నాకీవు దొరకరాదె... 49

సీ. పచ్చిచర్మపుఁదిత్తి పసలేదు దేహంబు
లోపల నంతట రోయ రోఁత
నరములు శల్యముల్ నవరంధ్రములు రక్త
మాంసంబుకండలు మైలతిత్తి
బలువైన యెండవానల కోర్వ దెంతైనఁ
దాళలే దాఁకలిదాహములకు
సకలరోగములకు సంస్థానమయియుండు
నిలువ దస్థిరమైన నీటిబుగ్గ

తే. బొందిలోనుండి ప్రాణముల్ పోయినంత
కాటికేకాని కొఱగాదు గవ్వకైన... 50
సీ. బలురోగములకు నీపాదతీర్థమెకాని
వలపుమందులు నాకు వలదువలదు
చెలిమిసేయుచు నీకు సేవఁజేసెదఁగాని
నీదాసకోటిలో నిలుపవయ్య
గ్రహభయంబునకు జక్రము దలంచెదఁగాని
ఘోరరక్షలు గట్టఁ గోరనయ్య
పాముకాటున నిన్ను భజనజేసెదఁగాని
దానిమంత్రము నేను దలఁపనయ్య
తే. దొరికితివి నాకు దండివైద్యుఁడవు నీవు
వేయికష్టాలు వచ్చిన వెఱవనయ్య... 51
సీ. కూటికోసరము నేఁ గొఱగానిజనులచే
బలుగద్దరింపులు బడఁగవలసె
దారసుతభ్రమ దగిలియుండఁగఁగదా
దేశదేశములెల్లఁ దిరుగవలసెఁ
జెనుదరిద్రత పైని జెనఁగి యుండఁగఁగదా
చేరి నీచులసేవ చేయవలసె
నభిమానములు మది నంటియుండఁగఁగదా
పరులఁ జూచిన భీతి పడఁగవలసె
తే. నిటుల సంసారవారిధి నీఁదలేక
వేయివిధముల నిన్ను నే వేఁడుకొంటి... 52

సీ. సాధుసజ్జనులతో జగడమాడినఁ గీడు
కవులతో వైరంబు గాంచఁ గీడు
పరమదీనులఁ జక్కఁబట్టి కొట్టినఁ గీడు
భిక్షుకులను దుఃఖపెట్టఁ గీడు
నిరుపేదలను జూచి నిందఁజేసినఁ గీడు
పుణ్యవంతులఁ దిట్టఁ బోసఁగుఁ గీడు
సద్భక్తులను దిరస్కారమాడిన గీడు
గురునిద్రవ్యము దోఁచుకొనినఁ గీడు
తే. దుష్టకార్యము లొనరించు దుర్జనులకు
ఘనతరం బయిననరకంబు గట్టిముల్లె... 53
సీ. పరులద్రవ్యముమీఁద భ్రాంతినొందినవాఁడు
పరకాంతల నపేక్ష పడెడువాఁడు
అర్థులవిత్తంబు లపహరించెడువాఁడు
దాన మియ్యంగ వద్దనెడువాఁడు
సభలలోపల నిల్చి చాడిచెప్పెడివాఁడు
పక్షపాతోక్త్యంబు పలుకువాఁడు
విష్ణుదాసులఁ జూచి వెక్కిరించెడువాఁడు
ధర్మసాధులఁ దిట్టఁ దలఁచువాఁడు
తే. ప్రజల జంతుల హింసించుపాతకుండు
కాలకింకరగదలచేఁ గష్టమొందు... 54
సీ. నరసింహ నాతండ్రి నన్నేలు నన్నేలు
కామితార్థము లిచ్చి కావు కావు

దైత్యసంహార చాల దయయుంచు దయయుంచు
దీనపోషక నీవె దిక్కు దిక్కు
రత్నభూషితవక్ష రక్షించు రక్షించు
భువనరక్షక నన్నుఁ బ్రోవు ప్రోవు
మారకోటిసరూప మన్నించు మన్నించు
పద్మలోచన చేయి పట్టు పట్టు
తే. సురవినుత నేను నీచాటుఁ జొచ్చినాను
నామొరాలించి కడతేర్పు నాగశయన... 55

సీ. నీభక్తులను గనుల్ నిండఁ జూచియు రెండు
చేతుల జోహారు సేయువాఁడు
నేర్పుతో నెవ్వరైన నీకథల్ చెప్పంగ
వినయమందుచుఁ జాల వినెడువాఁడు
తనగృహంబునకు నీ దాసులు రాఁ జూచి
పీఁటపైఁ గూర్చుండఁ బెట్టువాఁడు
నీసేవకులజాతి నీతు లెన్నక చాల
దాసోఽహ మని చేరఁ దలఁచువాఁడు
తే. పరమభక్తుండు ధన్యుండు భానుతేజ
వానిఁ గనుఁగొన్నఁ బుణ్యంబు వసుధలోన...

సీ. పంజరంబునఁ గాకిపక్షి నుంచిన లెస్స
పలుకునే వింతైన చిలుకవలెను
గార్దభంబును దెచ్చి కళ్లెమింపుగ వేయఁ
దిరుగునే గుఱ్ఱంబుతీరుగాను

ఎనుపపోతును మావటీఁడు శిక్షించిన
నడుచునే మదవారణంబువలెను
పెద్దపిట్టకు మేఁతఁ బెట్టి పెంచినఁ గ్రొవ్వి
సాగునే వేఁటాడుడేగవలెను
తే. కుజనులను దెచ్చి నీసేవకోటిఁ బెట్ట
వాంఛతోఁ జేతురే భక్తవరులవలెను... 57
సీ. నిగమాదిశాస్త్రముల్ నేర్చినద్విజుఁడైన
యజ్ఞకర్తకు సోమయాజియైన
ధరణిలోపలఁ బ్రభాతస్నానపరుఁడైన
నిత్యసత్కర్మాదినిరతుఁడైన
నుపవాసనియమంబు లొందుసజ్జనుఁడైనఁ
గావివస్త్రము గట్టు ఘనుఁడునైనఁ
దండి షోడశమహాదానపరుండైన
సకలయాత్రలు సల్పు సరసుఁడైన
తే. గర్వమునఁ గష్టపడి నిన్నుఁ గానకున్న
మోక్షసామ్రాజ్య మొందఁడు మోహనాంగ.
సీ. పక్షివాహన నేను బ్రతికినన్నిదినాలు
కొండెగాండ్రను గూడి కుమతినైతి
నన్నవస్త్రము లిచ్చి యాదరించుము నన్నుఁ
గన్నతండ్రివి నీవె కమలనాభ
మరణమయ్యెడినాఁడు మమతతో నీయొద్ది
బంట్లఁ దోలుము ముందు బ్రహ్మజనక

ఇనజభటావళి యీడిచికొని పోక
కరుణతో నాయొద్దఁ గావలుంచు
తే. కొనకు నీసన్నిధికిఁ బిల్చుకొనియు నీకు
సేవకునిఁ జేసికొనవయ్య శేషశయన... 59
సీ. నీకు దాసుఁడనంటి నిన్ను నమ్ముకయుంటిఁ
గాన నాపై నేఁడు కరుణఁ జూడు
దోసి లొగ్గితి నీకు ద్రోహ మెన్నఁగఁబోకు
పద్మలోచన నేను బరుఁడఁగాను
భక్తి నీపైనుంచి భజనఁజేసెదఁ గాని
పరుల వేఁడను జుమ్మి వరము లిమ్ము
దండిదాతవు నీవు తడవుసేయక కావు
ఘోరపాతకరాశి గొట్టివైచి
తే. శీఘ్రముగఁ గోర్కె లీడేర్చు చింతదీర్చు
నిరతముగ నన్నుఁ బోషించు నెనరునుంచు. 60
సీ. విద్య నేర్చితి నంచు విఱ్ఱవీఁగఁగ లేదు
భాగ్యవంతుఁడ నంచుఁ బలుక లేదు
ద్రవ్యవంతుఁడ నంచుఁ దలుచు నిక్కఁగ లేదు
నిరతదానములయిన నెఱప లేదు
పుత్రవంతుఁడ నంచుఁ బొగడుచుండఁగ లేదు
భృత్యవంతుఁడ నంచుఁ బొగడ లేదు
శౌర్యవంతుఁడ నంచు సంతసింపఁగ లేదు
కార్యవంతుఁడ నంచుఁ గడవ లేదు

తే. నలుగురికి మెప్పుగానైన నడవలేదు
నళినదళనేత్ర నిన్ను నే నమ్మినాను... 61

సీ. అతిలోభులను భిక్ష మడుగఁబోవుట రోఁత
తనద్రవ్య మొకరింట దాఁచ రోఁత
గుణహీనుఁ డగువాని కొలువుగొల్చుట రోఁత
యొరులపంచల క్రింద నుండ రోఁత
భాగ్యవంతునితోడఁ బంతమాడుట రోఁత
గుఱిలేనిబంధులఁ గూడ రోఁత
ఆదాయములు లేక యప్పుదీయుట రోఁత
జారచోరులఁ గూడి చనుట రోఁత

తే. యాదిలక్ష్మీశ నీబంట నయితి నయ్య
యింక నెడఁబాయ జన్మం బదెన్న రోఁత... 62

సీ. వెట్టివానికి నేల వేదాక్షరంబులు
మోటువానికి మంచిపాటలేల
పసులగాఁపరి కేల పరతత్త్వబోధలు
విటకాని కేలపో విష్ణుకథలు
వదరుఁబోతుల కేల వ్రాఁతపుస్తకములు
తిరుగుద్రిమ్మరి కేల దేవపూజ
ద్రవ్యలోభికి నేల దాతృత్వగుణములు
దొంగబంటుకు మంచిసంగతేల

తే. క్రూరజనులకు నీమీఁదఁ గోరికేల
ద్రోహిపాపాత్ములకు దయాదుగఖమేల... 63

సీ. నాతండ్రి నాదాత నాయిష్టదైవమా
  నన్ను మన్ననసేయు నారసింహ
దయయుంచు నామీఁదఁ దప్పులన్ని క్షమించు
  నిగమగోచర నాకు నీవె దిక్కు
నే దురాత్ముఁడనంచు నీమనంబునఁ గోప
  గింపఁబోకుము స్వామి కేవలముగ
ముక్తిదాయక నీకు మ్రొక్కినందుకు నను
  గరుణించి రక్షించు కమలనాభ
తే. దండిదొర వంచు నీవెంటఁ దగిలినాను
  నేఁడు ప్రత్యక్షమై నన్ను నిర్వహింపు... 64
సీ. వేమాఱు నీకథల్ వినుచు నుండెడువాఁడు
  పరులముచ్చటమీఁద భ్రాంతిపడఁడు
అగణితంబుగ నిన్నుఁ బొగడనేర్చినవాఁడు
  చెడ్డమాటను నోటఁ జెప్పఁబోఁడు
ఆసక్తిచేత నిన్ననుసరించెడివాఁడు
  ధనమదాంధులవెంటఁ దగులఁబోఁడు
సంతసంబున నిన్ను స్మరణఁ జేసెడివాఁడు
  చెలఁగి నీచులపేరుఁ దలఁపఁబోఁడు
తే. నిన్ను నమ్మినభక్తుండు నిశ్చయముగఁ
  గోరి చిల్లరదైవముల్ గొల్వఁబోఁడు... 65
సీ. నే నెంత వేఁడిన నీ కేల దయరాదు
  పలుమాఱు పిలిచినఁ బలుక వేమి

పలికిన నీకున్న పద వేమి పోవు నీ
మోమైనఁ బొడచూప వేమి నాకు
శరణుఁ జొచ్చినవాని సవరించవలెఁగాక
పరిహరించుట నీకు బిరుదుగాదు
నీదాసులకు నీవు నిర్వహింపకయున్నఁ
బరు లెవ్వ రగుదురు పంకజాక్ష
తే. దాత దైవంబు తల్లియుఁ దండ్రి నీవె
నమ్మియున్నాను నీపాదనలినములను... 66
సీ. వేదముల్ చదివెడు విప్రవర్యుం డైన
రణము సాధించెడురాజు లైన
వర్తకకృషికుఁ డౌ వైశ్యముఖ్యుం డైనఁ
బరిచరించెడి శూద్రవర్యుఁ డైనఁ
మెచ్చుఖడ్గముఁ బట్టి మెఱయుమ్లేచ్ఛుం డైనఁ
బ్రజల కక్కఱపడు రజకుఁ డైన
చర్మ మమ్మెడి హీనచండాలనరుఁ డైన
నీమహీతలమందు నెవ్వఁ డైన
తే. నిన్నుఁ గొనియాడుచుండెనా నిశ్చయముగ;
వాఁడు మోక్షాధికారి యీవసుధలోన... 67
సీ. సకలవిద్యలు నేర్చి సభ జయింపఁగవచ్చుఁ
బూర్ణుఁడై రణమందుఁ బోరవచ్చు
రాజరాజై పుట్టి రాజ్య మేలఁగవచ్చు
హేమగోదానంబు లియ్యవచ్చు

గగనమందున్న చుక్కల నెంచఁగా వచ్చు
జీవరాసులపేళ్లు చెప్పవచ్చు
అష్టాంగయోగము లభ్యసింపఁగవచ్చు
మేఁకరీతిగ నాకు మేయవచ్చుఁ
తే. దామరసగర్భహరపురందరుల కైన
నిన్ను వర్ణింపఁ దర మౌనె నీరజాక్ష... 6

సీ. నరసింహ నీవంటిదొరను సంపాదించి
కుమతిమానవుల నేఁ గొల్వఁ జాల
నెక్కువైశ్వర్యంబు లియ్య లేకున్నను
బొట్టకుమాత్రము పోయరాదె
ఘనముగా దిది నీకు కలవునఁ బోషింపఁ
గష్ట మెంతటిస్వల్పకార్యమయ్య
పెట్టఁ జాలక యేల భిక్ష మెత్తించెదు
నన్ను బీదను జేసినా వదేమి
తే. అమల కమలాక్ష నే నిట్లు శ్రమపడంగఁ
గన్నులకుఁ బండువై నీకుఁ గానఁబడునె... 6

సీ. వనజాతనాభ నీవంకఁ జేరితి నేను
గట్టిగా ననుఁ గావు కావు మనుచు
వచ్చినందుకు వేగ వరము లియ్యకఁ గాని
లేవఁబోయిన నిన్ను లేవనియ్యఁ
గూర్చుండఁబెట్టి నీకొంగుఁ గట్టిగఁ బట్టి
పుచ్చుకొందును జూడు భోగిశయన

ఈవేళ నీకడ్డ మెవరు వచ్చినఁగాని
వారికైనను లొంగి వడఁకఁబోను
తే. గోపగాఁడను నీవు నాగుణము తెలిసి
యిప్పుడే నన్ను రక్షించి యేలుకొమ్ము... 70
సీ. ప్రహ్లాదుఁ డేపాటి పైడికానుక లిచ్చె
మదగజం బెన్నిచ్చె మౌక్తికములు
నారదుం డెన్నిచ్చె నగలు రత్నంబు ల
హల్య నీ కేయగ్రహార మిచ్చె
ఉడుత నీ కేపాటియూడిగంబులు చేసె
ఘనవిభీషణుఁ డేమి కట్న మిచ్చె
పంచపాండవు లేమి లంచ మిచ్చిరి నీకు
ద్రౌపది నీకెంత ద్రవ్య మిచ్చె
తే. నీకు వీరంద ఱయినట్లు నేను గాన
యొందు కని నను రక్షింప విందువదన... 71
సీ. వాంఛతో బలిచక్రవర్తిదగ్గఱఁ జేరి
భిక్ష మెత్తితి వేల బిడియపడక
యడవిలో శబరి దియ్యనిఫలా లందియ్యఁ
జేతు లొగ్గితి వేల సిగ్గుపడక
వేడ్కతో వేవేగ విదురునింటికి నేఁగి
విందుగొంటి వదేమి వెలితిపడక
నడుకు లల్పము గుచేలుఁడు గణించుక దేర
బొక్కసాగితి వేల లెక్కగొనక

తే. భక్తులకు నీవు పెట్టుట భాగ్యమౌను
వారి కాశించితివి తిండివాఁడ వగుచు... 72

సీ. స్తంభమం దుదయించి దానవేంద్రునిఁ ద్రుంచి
కరుణతో ప్రహ్లాదుఁ గాచినావు
మకరిచేఁ జిక్కి సామజము దుఃఖించంగఁ
గృపయుంచి వేగ రక్షించినావు
శరణంచు నావిభీషణుఁడు నీచాటున
వచ్చినప్పుడె లంక నిచ్చినావు
ఆకుచేలుఁడు చేరెఁ డటుకు లర్పించిన
బహుసంపదల నిచ్చి పంపినావు

తే. వారివలె నన్నుఁ బోషింప వశముగాద
యింతవలపక్ష మేల శ్రీకాంత నీకు... 73

సీ. వ్యాసుఁ డేకులమందు వాసిగా జన్మించె
విదురుఁ డేకులమందు వృద్ధిఁ బొందె
గర్గుఁ డేకులమందు ఘనముగా వర్ధిల్లె
నావసిష్ఠుం డెట నవతరించె
నింపుగా వాల్మీకి యేకులంబున హెచ్చె
గుహుఁ డనువుణ్యుఁ డేకులమువాఁడు
శ్రీశుకుఁ డెచ్చటఁ జెలఁగి జన్మించెను
శబరి యేకులమందు జన్మ మొందె

తే. నేకులంబున వీ రింద తెచ్చినారు
నీకృపాపాత్రులకు జాతి నీతు లేల... 74

సీ. వసుధాస్థలంబున వర్ణహీనుఁడుగాని
బహుళదురాచారపరుఁడుగాని
తడవి కాసివ్వనిధర్మశూన్యుఁడుగాని
చదువనేరనిమూఢజనుఁడుగాని
సకలమానవులు మెచ్చనికృతఘ్నుఁడుగాని
చూడ సొంపును లేనిశుంఠగాని
అప్రతిష్ఠలకు లోనైనదీనుఁడుగాని
మొదటి కే మెఱుఁగనిమోటుగాని
తే. ప్రతిదినము నీదుభజనచేఁ బరఁగునట్టి
వాని కేవంక లేదయ్య వచ్చు ముక్తి... 75
సీ. ఇభకుంభములమీఁది కెగిరెడిసింగంబు
ముట్టునే కుఱుచైనమూషకమును
నవచూతపత్రముల్ నమలుచున్నపికంబు
గొఱుకునే జిల్లేడుకొనలు నోట
అరవిందమకరంద మనుభవించెడితేఁటి
పోవునే పల్లేరుపూలకడకు
లలితమైనరసాలఫలముఁ గోరెడిచిల్క
మెసవునే భ్రమత నుమ్మెత్తకాయ
తే. నిలను నీకీర్తనలు పాడ నేర్చినతఁడు
పరులకీర్తనఁ బాడునే యరసి చూడ... 76
సీ. సర్వేశ నీపాదసరసిజద్వయమందుఁ
జిత్త ముంచఁగ లేను జెదరకుండ

నీవైన దయ యుంచి నిలిచి యుండెడునట్లు
చేసి నన్నిపు డేలు సేవకుఁడను
వనజలోచన నేను వట్టిమూర్ఖుఁడ సుమ్మి
నీస్వరూపముఁ జూడ నేర్పు వేగ
తనకుమారున కుగ్గు దల్లి వోసినయట్లు
భక్తిమార్గం బనుపాలుఁ బోసి
తే. ప్రేమతో నన్నుఁ బోషించి పెంచికొనుము
ఘనత కెక్కించు నీదాసగణములోన... 7
సీ. జీమూతవర్ణ నీమోముతో సరిరాక
కమలారి యతికళంకమునఁ బడియె
బాగసైన నీనేత్రయుగముతో సరిరాక
నళినబృందము నీళ్లనడుమఁ జేరెఁ
గరిరాజవరద నీగళముతో సరిరాక
పెద్దశంఖము బొబ్బ పెట్టఁ దొడఁగె
శ్రీపతి నీదివ్యరూపుతో సరిరాక
పుష్పబాణుఁడు నీకుఁ బుత్రుఁ డయ్యె
తే. నిందిరాదేవి నిన్ను మోహించి విడక
నీకుఁ బట్టమహిషి యయ్యె నిశ్చయముగ...
సీ. హరిదాసులను నింద లాడకుండినఁ జాలు
సకలగ్రంథమ్ములు చదివినట్లు
భిక్ష మియ్యంగఁ దప్పింపకుండినఁ జాలుఁ
జేముట్టి దానంబు చేసినట్లు

మించి సజ్జనుల వంచించకుండినఁ జాలు
నింపుగా బహుమాన మిచ్చినట్లు
దేవాగ్రహారముల్ దీయకుండినఁ జాలుఁ
గనకకంబవుగుళ్లు గట్టినట్లు
తే. ఒకనివర్షాశనము ముంచకున్నఁ జాలుఁ
బేరుకీర్తిగ సత్రముల్ పెట్టినట్లు.... 79

సీ. ఇహలోకసౌఖ్యము లిచ్ఛగించెద మన్న
దేహ మెప్పటికిఁ దా స్థిరత నొంద
దాయుష్య మున్నపర్యంతము పటుతయు
నొక్కతీరున నుండ దుర్విలోన
బాల్యయువత్వదుర్బలవార్ధకము లను
మూఁటిలో మునిఁగెడి ముఱికికొంప
భ్రాంతితో దీనిఁ గాపాడుద మనుకొన్నఁ
గాలమృత్యువుచేతఁ గోలుపోవు
తే. నమ్మరా దయ్య యిది మాయనాటకంబు
జన్మ మిఁక నొల్ల న న్నేలు జలజనాభ... 80

సీ. వదనంబు నీనామభజన గోరుచు నుండు
జిహ్వ నీకీర్తనల్ సేయఁ గోరు
హస్తయుగ్మంబు ని న్నర్చింపఁ గోరును
గర్ణముల్ నీమీఁదికథలు గోరుఁ
దనువు నీసేవయే ఘనముగాఁ గోరును
నయనముల్ నీదర్శనంబు గోరు

మూర్ధ నీపాదముల్ మ్రొక్కఁగాఁ గోరును
ఆత్మ నీదై యుండు నరసి చూడ
తే. స్వప్నమున నైన నేవేళ సంతతమును
బుద్ధి నీపాదములయందుఁ బూనియుండు... 81
సీ. పద్మాక్ష మమతచేఁ బరము నందెద మంచు
విఱ్ఱవీఁగెద మయ్య వెఱ్ఱిపట్టి
మాస్వతంత్రం బైన మదము గండ్లకుఁ గప్పి
మొగముపట్టదు కామమోహములను
బ్రహ్మదేవుండైన బైఁడిదేహము గల్గఁ
జేసి వేయక మమ్ముఁ జెఱిచె నతఁడు
తుచ్ఛమైనటువంటి తోలెమ్ముకలతోడి
ముఱికిచెత్తలు చేర్చి మూటకట్టె
తే. నీశరీరాలు పడిపోవు టెఱుఁగ కేము
కాముకుల మైతి మింక మిమ్ముఁ గానలేము...82
సీ. గరుడవాహన దివ్యకౌస్తుభాలంకార
రవికోటితేజ సారంగవదన
మణిగణాన్విత హేమమకుటాభరణ చారు
మకరకుండలలసన్మందహాస
కాంచనాంబరరత్నకాంచీవిభూషిత
సురవరార్చిత చంద్రసూర్యనయన
కమలనాభ ముకుంద గంగాధరస్తుత
రాక్షసాంతక నాగరాజశయన

తే. పతితపావన లక్ష్మీశ బ్రహ్మజనక
భక్తవత్సల సర్వేశ పరమపురుష... 83

సీ. పలుమారు దశరూపములు ధరించితి వేల
నేకరూపముఁ బొంద వేల నీవు
నయమున క్షీరాబ్ధినడుమఁ జేరితి వేల
రత్నకాంచనమందిరములు లేవె
పన్నగేంద్రునిమీఁదఁ బవ్వళించితి వేల
జలతారుపట్టెమంచములు లేవె
తెక్కలు గలపక్షి నెక్కసాగితి వేల
గజతురగాందోళికములు లేవె
తే. వనజలోచన యిటువంటివైభవములు
సొగసుగా నీకుఁ దోఁచెనో సుందరాంగ... 84

సీ. తిరుపతిస్థలమందుఁ దిన్నగా నే నున్న
వేంకటేశుఁడు మేఁత వేయలేఁడొ
పురుషోత్తమమున కేఁ బోయినఁ జాలు జ
గన్నాథుఁ డన్నంబుఁ గడపలేఁడొ
శ్రీరంగమునకు నేఁ జేరఁబోయినఁ జాలు
స్వామి గ్రాసముఁ బెట్టి సాఁకలేఁడొ
కాంచీపురములోనఁ గదిసి నే కొలువున్న
గరివరదుఁడు పొట్టఁ గడపలేఁడొ
తే. ఎందుఁ బోవక నేను నీమందిరమున
నిలిచితిని నీకు నామీఁద నెనరు లేదు... 85

సీ. తార్క్ష్యవాహన నీవు దండిదాత వటంచుఁ
గోరి వేడుక నిన్నుఁ గొల్వ వచ్చి
యర్థిమార్గమును నే ననుసరించితి నయ్య
లావైనఁ బదునాల్గులక్షలైన
వేషముల్ వేసి నావిద్యాప్రగల్భతఁ
జూపసాగితి నీకు సుందరాంగ
ఆనంద మైన నే నడుగవచ్చిన దిచ్చి
వాంఛఁ దీర్పుము నీలవర్ణ వేగ
తే. నీకు నావిద్య హర్షంబు గాకయున్న
తేపతేపకు వేషముల్ దేను సుమ్మి... 86

సీ. అమరేంద్రవినుత నే నతిదురాత్ముఁడ నంచుఁ
గలలోననైనను గనులఁ బడవు
నీవు ప్రత్యక్షమై నిలువకుండిన మానె
దొడ్డగా నొకయుక్తి దొరికెనయ్య
గట్టికొయ్యను దెచ్చి ఘనముగా ఖండించి
నీస్వరూపము చేసి నిలుపుకొంచు
ధూపదీపము లిచ్చి తులసితోఁ బూజించి
నిత్యనైవేద్యముల్ నేమముగను
తే. నడుపుచును నిన్నుఁ గొలిచెద నమ్మి బుద్ధి
నీప్రపంచంబు గలిగె నా కింతెచాలు... 87

సీ. భువనేశ గోవింద రవికోటిసంకాశ
పక్షివాహన భక్తపారిజాత

యంభోజభవరుద్రజంభారిసన్నుత
సామగానవిలోల సారసాక్ష
వనధిగంభీర శ్రీవత్సకౌస్తుభవక్ష
శంఖచక్రగదాసిశార్ఙ్గహస్త
దీనరక్షక వాసుదేవ దైత్యవినాశ
నారదార్చిత దివ్యనాగశయన
తే. చారునవరత్నకుండల శ్రవణయుగళ
విబుధవందితపాదాబ్జ విశ్వరూప... 88
సీ. నాగేంద్రశయన నీనామమాధుర్యంబు
మూఁడుకన్నులసాంబమూర్తి కెఱుక
పంకజాతాక్ష నీబలపరాక్రమ మెల్ల
భారతీపతియైన బ్రహ్మ కెఱుక
మధుకైటభారి నీమాయాసమర్థత
వసుధలో బలిచక్రవర్తి కెఱుక
పరమాత్మ నీదగుపక్షపాతిత్వంబు
దశశతాక్షులపురందరుని కెఱుక
తే. వీరి కెఱు కగునీకథల్ వింత లెల్ల
నరుల కెఱు కన్న నెవ్వరైన నవ్విపోరె... 89
సీ. అంద ఱేమైన ని న్నడుగ వచ్చెద రంచు
క్షీరసాగరమందుఁ జేరినావు
నీచుట్టు సేవకుల్ నిలువకుండుటకునై
భయదసర్పముమీఁదఁ బండినావు

భక్తబృందము వెంటఁ బడి చరించెద రంచు
నెగసి పాఱ్యెడిపక్షి నెక్కినావు
దాసులు నీద్వార మాసింప కుంటకు
మంచియోధుల కావ లుంచినావు
తే. లావుఁ గలవాఁడ వైతి వేలాగు నేను
నిన్నుఁ జూతును నాతండ్రి నీరజాక్ష... 90

సీ. నీకథల్ చెవులలోఁ సోఁకుట మొదలుగాఁ
బులకాంకురము మేనఁ బుట్టువాఁడు
నయమైన నీదివ్యనామకీర్తనలోన
మగ్నుఁడై దేహంబు మఱచువాఁడు
ఫాలంబుతో నీదుపాదయుగ్మమునకుఁ
బ్రేమతో దండ మర్పించువాఁడు
హే పుండరీకాక్ష హే రామ హరి యంచు
వేడ్కతోఁ గేకలు వేయువాఁడు
తే. చిత్తకమలంబునను నిన్నుఁ జేర్చువాఁడు
నీదులోకమునం దుండు నీరజాక్ష... 91

సీ. నిగమగోచర నేను నీకు మెప్పగునట్లు
లెస్సగాఁ బూజింపలేను సుమ్మి
నాకుఁ దోఁచినభూషణములు పెట్టెద నన్నఁ
గౌస్తుభమణి నీకుఁ గలదు ముందె
భక్ష్యభోజ్యముల నర్పణముఁ జేసెద నన్న
నీవు పెట్టితి సుధ నిర్జరులకుఁ

గలిమిఁ గొద్దిగఁ గానుకల నొసంగెద నన్న
భార్గవీదేవి నీభార్య యయ్యె
తే. నన్నిగలవాఁడ వఖిలలోకాధిపతివి
నీకు సొమ్ములు పెట్ట నే నెంతవాఁడ... 92

సీ. నవసరోజదళాక్ష నన్నుఁ బోషించెడు
దాతవు నీ వంచు ధైర్యపడితి
నామనంబున నిన్ను నమ్మినందుకుఁ దండ్రి
మేలు నా కొనరింపు నీలదేహ
భళిభళి నీయంతప్రభువు నెక్కడఁ జూడఁ
బుడమిలో నీపేరు పొగడవచ్చు
ముందుఁ జేసిన పాపమును నశింపఁగఁ జేసి
నిర్వహింపుము నన్ను నేర్పుతోడఁ
తే. బరమసంతోష మాయె నాప్రాణములకు
నీఋణము దీర్చుకొన నేర నీరజాక్ష... 93

సీ. ఫణులపుట్టలమీఁదఁ బవ్వళించినయట్లు
పులులచోటులఁ జేరఁబోయినట్లు
మకరివర్గం బున్నమడుఁగు జొచ్చినయట్లు
గంగదాపున నిండ్లు గట్టినట్లు
చెదలుభూమిని చాఁప చేరఁ బఱచినట్లు
లోటిబిందెలఁ బాల నునిచినట్లు
వెఱ్ఱివానికి బహువిత్త మిచ్చినయట్లు
కమ్మగుడిసె మందుఁ గాల్చినట్లు

తే. స్వామి నీభక్తవరులు దుర్జనులతోడఁ
జెలిమిఁ జేసినయట్లైనఁ జేటువచ్చు... 94

సీ. దనుజసంహార చక్రధర నీకు దండంబు
లిందిరాధిప నీకు వందనంబు
పతితపావన నీకు బహునమస్కారముల్
నీరజాతదళాక్ష నీకు శరణు
వాసవార్చిత మేఘవర్ణ నీకు శుభంబు
మందరధర నీకు మంగళంబు
కంబుకంధర శార్ఙ్గకర నీకు భద్రంబు
దీనరక్షక నీకు దిగ్విజయము
తే. సకలవైభవములు నీకు సార్వభౌమ
నిత్యకల్యాణములు నగు నీకు నెపుడు... 95

సీ. మత్స్యావతారమై మడుగులోపలఁ జొచ్చి
సోమకాసురుఁ ద్రుంచి చోద్యముగను
దెచ్చి వేదములెల్ల దేవభూసురులకు
మెచ్చి యిచ్చితి నీవు మేలు నొంద
నావేదముల నియ్య నాచారనిష్ఠల
ననుభవించుచు నుందు రవనిసురులు
సకలపాపంబులు సమసిపోవునటంచు
మనుజు లందఱు నీదుమహిమఁ దెలిసి
తే. యుందు రిటువంటివారు నీయునికి దెలియ

వారలకు వేగ మోక్షంబు వచ్చు ననఘ... 96

సీ. కూర్మావతారమై కుధరంబు క్రిందను
    గోర్కెతో నుండవా కొమరుమిగుల
వరహావతారమై వనభూములను జొచ్చి
    శిక్షింపవా హిరణ్యాక్షు నపుడు
నరసింహమూర్తివై నరభోజను హిరణ్య
    కశిపుని ద్రుంపవా కాంతిమీఱ
వామనరూపమై వసుధలో బలిచక్ర
    వర్తి నణంపవా వైర ముడిగి
తే. యిట్టిపనులెల్లఁ జేయఁగా నెవ్వరికిని
    దగును నరసింహ నీకె కాఁ దగును గాక...97

సీ. లక్ష్మీశ నీదివ్యలక్షణగుణములఁ
    వినఁ జాల కెప్పుడు వెఱ్ఱి నైతి
నా వెఱ్ఱిగుణములు నయముగా ఖండించి
    నన్ను రక్షించు మోనళినసేత్ర
నిన్ను నే నమ్మితి నితరదైవముల నే
    నమ్మలే దిప్పుడు నాగశయన
కాపాడినను నీవె కష్టపెట్టిన నీవె
    నీపాదకమలముఁల్ నిరత మేను
తే. నమ్మియున్నాను నీపాదనళినభక్తి
    వేగ దయచేసి రక్షించు వేదవేద్య... 98

సీ. అమరేంద్రవినుత ని న్ననుసరించినవారు

ముక్తిఁ బొందిరి వేగ ముదముతోడ
నీపాదపద్మముల్ నెఱ నమ్మియున్నాను
నాకు మోక్షం బిమ్ము నళిననేత్ర
కాచి రక్షించు నన్ గడతేర్చు వేగమే
నీసేవకునిఁ జేయు నిశ్చయముగఁ
గాపాడినను నీకుఁ గైంకర్యపరుఁడనై
చెలఁగి నీపనులను జేయువాఁడ
తే. ననుచుఁ బలుమాఱు వేఁడెద నబ్జనాభ
నాకుఁ బ్రత్యక్ష మగుము ని న్నమ్మినాను...99
సీ. శేషప్ప యనుకవి చెప్పినపద్యముల్
చెవుల కానందమై చెలఁగుచుండు
నేమనుజుం డైన నెలమి నీశతకంబు
భక్తితో విన్న సత్ఫలము గలుగుఁ
జెలఁగి యీపద్యముల్ జేర్చి వ్రాసినవారు
కమలాక్షుకరుణను గాంతు రెపుడు
నింపుగాఁ బుస్తకం బెపుడుఁ బూజించిన
దురితజాలంబులు దొలఁగి పోవు
తే. నిద్దిపుణ్యాకరం బని యెపుడు జనులు
గష్ట మెన్నక పఠియింపఁ గలుగు ముక్తి
భూషణవికాస శ్రీధర్మపురనివాస
దుష్టసంహార నరసింహ దురితదూర. 100

# పీఠిక.

ఈశతకము రచించినకవి భల్లా పేరయ. ఇతఁడు కౌండిన్యసగోత్రుఁడు లింగనకుఁ బౌత్రుఁడు పెద్దనకుఁ గుమారుఁడు. శతకకవులచరిత్ర మీశతకము నెఱుంగదు. కవి వైదికబ్రాహ్మణుఁడై యుండును.

భద్రగిరిశతకము సింహాద్రినారసింహశతకము వెంకటాచలవిహారశతకము మట్టపల్లి నృసింహశతకము తెగలోఁ జేరినది. యవనులు సైన్యసహితులై వచ్చి హైందవదేవాలయములను భగ్నముగావించు తఱి దేశమునందు బయలువెడలి క్షోభ కీతెగ శతకములు దృష్టాంతప్రాయములుగ నున్నవి. పరస్పరవైషమ్యములతో నిండియున్న ఆంధ్రులను లోబఱచికొని వారిమతమునకు దేశమునకు సంఘమునకు రాజ్యతృష్ణాపరవశులు మతోద్రేకులు నగుయవనులు గావించినదురంతములు తెలుపుచరిత్రకాలమునాఁటి యీతెగశతకములు భావిచరిత్రమునకుఁ బరమ ప్రమాణములు కాఁగలవు.

నైజాము ప్రభువులవద్దనుండి సామాన్యసైనికోద్యోగిగా నియమింపఁబడిన ధంసాయను యవనుఁడు వేల్పుకొండ (ఇది ఒరంగల్లునకు ౨౮ మైళ్ల దూరమునఁ గలదు) పై దుర్గములుగట్టి దేశము నాక్రమించుకొనుటకు బయలువెడలి యెన్నియో దురంతములు గావించెను. ఈతనిదురంతములు

శ్రీనాథుని వేంకటరామకవికృత అశ్వారాయచరిత్ర మునందుఁ గలవు. దేశద్రోహులగు కొందఱను తనలోఁ గలిపికొని గౌరవపాత్రము లగుసంస్థాన ములను బెక్కింటిని రూపుమాపి కడ కీతఁడు భద్రా చలమును ముట్టడించెను. పురవాసుల నందఱి నానా వస్థలపాలు గావించెను. దేవళములోఁ జొరఁబడి విగ్రహముల నెక్కడఁ బాడుచేయునో యని యర్చ కులు శ్రీరామాదివిగ్రహములను బోలవరమునకు రహస్యముగాఁ బడవలపై నెట్లో చేర్చిరి. భక్తులం దఱు దిక్కుచెడి ధంసాచే నవస్థలఁబడుచుండ నీవు సుఖముగాఁ బోలవరములోఁ దలదాఁచుకొంటివా రామా! నిన్నింతతో నీతురకలు విడువరని నిష్ఠు రములాడుచు నీపేరయకవి శతకమును రచించెను. ధంసా పరిపాలనము శ్రీరామచంద్రుఁడు వలస కేఁగి నట్లు భద్రాద్రిలోని శాసనమునందుఁ గలదు. దాని నిట నుదాహరించెదము.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శా॥ శ॥ ౧౭౭౭౭ అగు నేటి వర్తమానవ్యవహారికచాంద్రమాన నందన నామసం॥ వైశాఖ శు ౭ లు భానువారము శ్రీభ ద్రాచలసీతారామచంద్రమహాప్రభువువారిసన్నిధిని శ్రీరామదాసుగారు తానీషాగారి యనుమతివెంబ డిని జరిగించినదేవబ్రాహ్మణవృత్తులు శ్రీవారిసన్ని ధిని జరుగు ఉత్సవప్రకరణములు వ్రాసియున్న శాస

సము. ధంసా ప్రపంచములో శ్రీవారు పోలవరము వలస వేంచేసినపుడు వకదుర్మార్గుడు శాసనం చెక్కి వేసినందున సర్వజనులు తెలిసి సంతోషించేటందుకు లేకపోగా ఆదుర్మార్గుడు పుత్రమిత్రకళత్రాదులతో నశించిపోయినాడు" (ఆలయములోని శాసనము).

ఈవిధముగా ధంసాదుర్న యము గ్రంథములందు శాసనములందు శాశ్వత మొనర్పఁబడెను. 105 వ పద్యమువలన ధంసా కధికార మిచ్చినవాఁడు విభ రాహీముఖా నని తెలియును. క్రీ. శ 1687 లో ఔరంగజేబు తనపుత్రుఁ డగుమహమ్మదు ఆజా ముతో గోలకొండ ముట్టడింపవచ్చినపుడు తానీషా యెడ ద్రోహముతలఁచి గుట్టు తెలిపినవాఁడును స్వామిద్రోహియు నగు ఇబ్రహీమె యిందుఁ జెర్కొ నబడిన యిభరాహీముఖాను. ఇతఁడు ఔరంగజేబు పాలనకాలమునఁ బ్రముఖుఁడై ధంసాచేత నింతలేసి పనులు చేయించెను.

తానీషా రాజ్యాంతమున ఇబ్రహీముకాలము నుండి ధంసా ప్రముఖుఁడయ్యెను. ఔరంగజేబు అంత్యకాలము ధంసా విజృంభణకాలము నొక టియె. శ్రీరాముఁడు పోలవరమునకు వలస యేగి నది సర్వధారిసంవత్సరమున. అక్కడ నున్నది ఐదేండ్లు. తరువాత పూసపాటి విజయరామరాజు సీతారామరాజులకాలమున విజయసంవత్సరముఁన

దిరిగి భద్రగిరికి వేంచేసెను. వీని నన్నింటిని సమన్వ యించితిమేని ధంసా భద్రగిరిమీదికి దండెత్తి రెండు వందలసంవత్సరము లైయుండునని చెప్పవచ్చును. ఇది ఔరంగజేబు అంత్యకాలమునకు పూసపాటి విజయరామరాజు రాజ్యారంభకాలమునకు సర్వ ధారివిజయసంవత్సరములకు జేరువగా నున్నది. కాల నిర్ణయమును గూర్చి మఱియొకమాఱు విపులముగా వ్రాయనున్నారము.

ఇందలి కవిత సరళముగ సుబోధముగ నున్నది. భగవంతునిహృదయము వ్రచ్చిపోవునటుల యాకవి వ్రాసిననిష్ఠురవాక్యములు కవి పరితాపాతిశయమును వెల్లడించుచున్నవి. శ్రీరాముఁడు పోలవరము వలస యేగుటతో కవి శతక మారంభించి తిరుగ వచ్చిన పిదప నైదేండ్లకుఁ బూర్తిచేసియుండును. పఠనీయ శతకరాజములలో నిది యొకటి.

శ్రీపిఠాపురము మహారాజావారు తాళపత్రప్ర త్యనుసారముగా వ్రాయించిన వ్రాఁతప్రతి నాధార పఱచికొని యీభద్రగిరిశతకమునకు శుద్ధప్రతి వ్రాసి తిమి. యవనవిప్లవకాలమునాఁటి పరిస్థితుల దెలుపు శతకము గాన యాదరమునకుఁ బాత్రమగునని తలంచుచున్నారము.

నందిగామ. }
1-6-26. }

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శ్రీ ర స్తు.

# భద్రగిరి శతకము.



సీ. శ్రీజానకీమనోరాజీవషట్పద
పంకజాశ్రితపదపద్మగర్భ
గర్భనిర్భేదసంగరబాణతూణీర
నీరజబాణసన్నిభశుభాంగ
అంగజవైరిశరాసనభేదన
దనుజవిద్వేషి సుందరపదాబ్జ
అబ్జబాంధవకులాధ్యక్షనీరదవర్ణ
వర్ణితామరమౌనివరకలాప
తే. పవననందనసన్ముఖభక్తపాల
పాలకడలిని విహరించు పద్మనాభ
భద్రగిరివాస శ్రీరామభద్రదాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక. 1
సీ. పద్మభవస్తోత్ర పావనచారిత్ర
పంకజదళనేత్ర బహుపరాకు
దైతేయశిక్షణ ధర్మవిచక్షణ
భక్తసంరక్షణ బహుపరాకు
వారిధిబంధన వరభక్తచందన
భరతాదివందన బహుపరాకు

తాటకభంజన తాపసరంజన
పరమనిరంజన బహుపరాకు
తే. భద్రగిరినాఁడె వచ్చు నీపౌరుషంబు
విశ్వవిఖ్యాతిసేయక విడువ నింక, భద్ర... 2
సీ. పదియు రెండేడుల ప్రాయంపువాఁడవై
మించి తాటక నెట్లు త్రుంచినావొ
రణశూరు లగుదైత్యగణములఁ బరిమార్చి
కౌశికసవ మెట్లు గాచినావొ
తరములఁబట్టి యెత్తఁగరాని హరువిల్లు
చెఱకువిల్లవడి నెట్లు విఱిచినావొ
సంగరరంగవిశారదుం డైనభా
ర్గవరాము నేరీతి గడపినావొ
తే. కాని తెలియద యప్పటిక్రమము దెలుప
తురకదొరలన్నభీతిని నురుకుదొరవు, భద్ర...3
సీ. కాకంబుగాదు వేగమబాణ మెక్కించి
కావు కా వనిపించి కాచి విడువ
ఉదధిగా దవనిపై నుప్పొంగఁగాఁ జూచి
బాణాగ్రమున నిల్పి భక్తి బ్రోవ
చిత్రమృగముగాదు సీత మెప్పులకునై
వెంటాడి వనవీథి నంటితఱుమ
పుడమి నెన్నఁగఁ గబంధుఁడుగాఁడు భుజలతల్
నఱికి పాఱఁగ వైవ సరకుఁగొనక

తే. అవని తురకల కెదురుగా దని తలంచి
వలసబోతివి నీసరివారు నవ్వ, భద్ర... 4

సీ. ఖరదూషణాదుల ఖండించితి నటన్న
యహమిక మదిలోన నణఁచి వైచి
మాయామృగంబును మర్దించితి నటన్న
గర్వంబు మనసులోఁ గట్టిపెట్టి
వాలి నొక్కమ్మునఁ గూలనేసితి నన్న
సాహసోక్తులు మదిఁ జక్క విడిచి
రావణకుంభకర్ణ నిశాచరులఁబట్టి
పరిమార్చితి నటన్న ప్రజ్ఞ మఱచి
తే. ఓడపై నెక్కి తురకలజాడ గాంచి
యురకఁదగునయ్య నీవంటిదొరల కెందు, భద్ర.

సీ. సున్నతీ లోఁగిఁజేయఁ జూతురో యని వేగ
మేలుకొంటివి యింత మేలుగలదె
గుడిగుడీపొగలు పైకొనఁజూతురో యని
వలసబోతివి సరివారు నవ్వ
మును పులావును దిను మని యందురో యని
పాఱిపోతివి యింతపాటి గలదె
లుడికీయఫీమూదు లిడఁజూతురో యని
యోడ నెక్కితిరి మీ రొగి ధరిత్రి
తే. కులము గలిగిన నెందైన స్థలము గలుగు
ననుచు భక్తులఁ దిగనాడి చనఁగ నౌనె, భద్ర. 6

సీ. చెప్పినట్టుల వినఁజేయ నోపిక కొండ
చరియలయందుండు చరియదుంప
దోడులు తినుశక్తి వాఁడికోఱలుగల
తులువమృగాలలో మెలఁగుయుక్తి
జడలదాలుచు నేర్పు జడదారులనుగూడి
యిడుమలఁ బడు తాల్మి వడుకులందుఁ
బండుకష్టతరంబు పర్ణశాలలయందుఁ
గాపురంబులు సేయుక్రమము తొల్లి
తే. తల్లికోరిక చెల్లించ ధరణిలోన
నేర్చితినటన్నఁబలుమాఱునెఱపనగునె, భ... 7
సీ. రఘువంశమున కెంత రట్టడి దెచ్చితి
వరుస పోలవరంబు వలసబోయి
శోకమూకల కెంత చులుకన యైతివి
వరుస పోలవరంబు వలసబోయి
భక్తకోటికి నెంత భయము బుట్టించితి
వరుస పోలవరంబు వలసబోయి
... ... ...
... ... ...
తే. దశరథునిగర్భమునఁ బుట్టి దశశిరస్కుఁ
దునిమి నటువంటి దొరకిది దొడ్డతనమె, భ...
సీ. కైకవరము జ్ఞాపకమువచ్చెనో మళ్లి
వనములోఁ జరియింప వసుధలోన

నీలాద్రిపతిఁ జూచి నేరుచుకొంటివో
వలసఁబోవంగ నీవసుధలోన
పట్టిస సతికిఁ జెప్పఁ దలంచి పోతివో
వలస పేరిడికొని వసుధలోన
రామలదేవు కారణజన్ముఁ డని తోఁచి
వర మియ్యఁబోతివో వసుధలోన
తే. లేక యిదియేమివింత ముల్లోకములను
జడిసి వేంచేసితిరటన్న జడుపుగాదె, భద్ర...
సీ. సౌమిత్రికైనఁ దోఁచకపోయెనా యిట్లు
పోవరాదని నీకు బుద్ధి దెలుప
సీతయైనను మీకుఁ జెప్పలేదాయెనా
యిలువెడలుట మహాహీన మనుచు
హనుమంతుఁ డిపుడు మీయాజ్ఞకు వెఱచెనా
యోను గాదని మిమ్ము నడ్డగింప
శిష్టరాజగు మీవసిష్ఠు లేఁడాయెనా
యిది బుద్ధిగాదని యెఱుఁగఁజెప్ప
తే. భద్రగిరినుండి శ్రీవీరభద్రగిరికి
వలసబోవుట యిదియేమి వాంఛలయ్య, భద్ర.
సీ. హనుమంతు నెచ్చోటి కనిపితిరో మీకు
జడుపుబుట్టిన యట్టి సమయమునను
సుగ్రీవుఁ డేగుహఁ జొచ్చియుండెనో మీకు
జడుపుబుట్టిన యట్టి సమయమందు

అంగదుఁ డేవంక కల్గిపోయెనో మీకు
జడుపుబుట్టిన యట్టి సమయమందు
జాంబవదాదు లెచ్చటనుండిరో మీకు
జడుపుబుట్టిన యట్టి సమయమందు
తే. కపులు మీయొద్దనుండిన రిపుల కేల
యోడి వేంచేతురయ్య మీరోడమీఁద, భద్ర.
సీ. పట్టాభిషేకసంభవవియోగము జటా
వల్కలంబులు వనవాసములును
యతిపూజ గొనుటలు సతితోడఁ దిరుగుట
లాలి గోల్పోవుట లడవులందు
సంచరించుటలు నిశాచరబాధలు
చెంచుముద్దియ విందు లెంచ మొండె
మునఁ గాల్చుటలు దాని విని ముక్కుగోయుట
క్రోఁతి నేయుట బ్రహ్మకులజుఁ జంపు
తే. టిల్లు వెళ్లుట లాదిగా నినకులమున
ననయ మీనాఁడె ధరగల్గెననియె జనము, భద్ర.
సీ. భరతశత్రుఘ్నులు వరశంఖచక్రముల్
సౌమిత్రి శేషుఁడు జనకతనయ
యిందిర కపులెల్ల బృందారకు లటంచు
స్మృతులెల్లఁ గొనియాడ నతివినోద
లీలలు గల్పించి లీలవై కేవల
మానుషచర్యలు బూనె దకట

వలసలు మీకేల వనవాసము లవేల
వైకుంఠవాసివి వరుసతోడ
తే. మీబలపరాక్రమములెల్ల మీరె మఱచి
తొలఁగి పోవచ్చునే తురకలకు జడిసి, భద్ర...
సీ. ముసలిమానులతోడ ముచ్చటాడఁగలేక
తురకల కెదురుగా నరుగలేక
మ్లేచ్ఛుల మన్నించి మెప్పు లీయఁగలేక
పారసీకులబాధ పడఁగలేక
అచ్ఛిద్రకర్ములయాజ్ఞ నుండఁగలేక
యపసవ్యరిపుల తె న్నరయలేక
చేరి ఖానులకుఁ దాజీము లియ్యఁగలేక
మును నమాజుధ్వనుల్ వినఁగలేక
తే. పాఱిపోవుట యిదియేమి ప్రజ్ఞ గాదుగు
నెఱిఁగి యేయెండ కాయెండ నిడఁగవలయు, భ.
సీ. తెలివి దెచ్చుకయుండఁ దెన్ను వీక్షింపక
వాహనంబులమీఁది వాంఛలిడక
ద్వారపాలకులకు దారి జెప్పక భక్త
గణములకెల్లను గనులఁబడక
సొమ్ములచందుకల్ చూడనొల్లక కపి
బలములనెల్లను బిలువనీక
సౌమిత్రి కరిగెడి జాడఁ జెప్పఁగలేక
సీత నెత్తుక యతిశీఘ్రముగను

తే. కలముపై నెక్కి మీవంటిఘనులు తొలఁగి
పోవఁగా నౌనె వలసగాఁ బోలవరము, భ...1

సీ. సొమ్ములు బీబీల సొగసు కర్పణజేసి
వాహనంబుల నశ్వవాహనులకు
పంచపాత్రలు సురాపానవర్తనులకుఁ
బళ్లెరంబులు మాంసభక్షకులకు
శఠగోపములు విప్రశఠులకు బంగారు
తబుకులు బలుదునేదారులకును
గిన్నెలు వరుస ముంగిముచ్చులకుఁ బట్టు
పీతాంబరంబులు పింగళాక్షు

తే. లకు నొసంగి యుభయమున సుకము దక్కి
పాటిపోతిరి మీరున్న యూరువిడిచి, భ... 1

సీ. సంచరించిరిగదా సమదాపసవృక్షలు
విమలబృందావనవేదికలను
పీటిబుచ్చిరిగదా విరులచేఁ జెన్నొందు
ఘనమల్లికాపుష్పవనచయంబు
గాళుచేసిరిగదా కళ్యాణమందిర
గారవాహనగృహాంగణము లెల్ల
కొల్లలాడిరిగదా కోమలనవవీచి
కల నొప్పు దివ్యగంగాఝరములు

తే. చూరవట్టిరి పురమెల్లఁ జొచ్చి విప్ర
మందిరములన్ని తురకలు మత్తు లగుచు, భ..

సీ. సంస్కృతాంధ్రోక్తులసారంబు లుడివోయి
నపసవ్యభాషల నమరె జగము
పౌండరీకాదులపశుబంధనము దప్పి
కటికి మేఁకలజవా ల్గలఁగె నూళ్లు
కర్పూరచందనాగరుధూపములఁ బాసి
గంజాయి పొగలచేఁ గప్పె గుళ్లు
వేదశాస్త్రంబులు వెలయు బాఁపలపట్ల
మొల్లాఖురానులు మ్రోఁగె నహహ
తే. యేమిచెప్పుదు మీమాయ లెవ్వ రెఱుఁగఁ
గలరు బ్రహ్మాదులకు నెల్ల నలవిగాదు, భద్ర...
సీ. ధర్మపేటనివాసి ధైర్యంబు విడనాడె
వేఁటగోపాలుండు మాట లుడిగె
పాలవంచపురీశు బలహీనత వహించెఁ
గృష్ణసాగరపయ్య క్రిందుఁ జూచె
రామానుజవరపురాము లూఱకయుండె
సిరివేడి సామి యబ్బురము గదిరె
పర్ణశాలేశుండు బహుభంగులఁ దపించె
శ్రీరామగిరివాసి చింత నొందె
తే. భద్రకడనుండి శ్రీవీరభద్రుకడకు
వలస వేంచేయవలసినవార్త వినియు, భద్ర...19
సీ. తురకలతో మైత్రి నెఱప లేవైతివి
లోకత్రయం బెట్లు సాకగలవు

గర్నేలుగుండ్లడాకా తోర్వ లేవైతి
వరులబలంబు లె ట్లణఁచఁగలవు
నీస్థలంబున నీవు నిలువ లేవైతివి
భక్తుల నెట్లు గాపాడఁగలవు
మానవాధీశ్వరు మరుగుఁజొచ్చినవాఁడ
వమరారులకు నెట్టు లభయ మొసఁగి
తే. తకట నిను మనమున నమ్మినట్టిజనులఁ
దొలఁగి వేంచేసితిరి తురకలకు జడిసి, భద్ర...
సీ. శ్రీరామముద్ర లీతీతిని నీరసమందె
నగ్బర్ బక్తై రను నచ్చు లమరె
గోవిందశబ్దముల్ గురిమాల యాహాస్
బావుసేననుపల్కు లావహిల్లె
గరుడాశ్వగజరథవరవాహనములచేఁ
బరగు నిండ్లను పీర్ల ప్రభలు చెందె
సత్రశాలాంగణల్ చలువపందిరులు బ
ర్బరచిఖాసాల చప్పరములయ్యె
తే. మత్స్యమాంసాదికముల నమరెను గోద
రేవు లెచ్చట గన్న గోరీల నమరె, భ... 21
సీ. హనుమంతు ముట్టి సర్వాంగవేణిలిచేత
నెమరి పెట్టెలమాయ జమరె నొకఁడు
గరుడాళువారి తెక్కలు చెక్కుముక్కలు
నొక్క మట్టసముగాఁ జెక్కె నొకఁడు

ఎంబెరుమానారు నింటిలోన నమాజు
చదివియుఁ దసిబిసి సలిపె నొకఁడు
వరుసఁ బన్నిద్ద ఱాళ్వారి నొక్కమ్మడి
డేడిక్కలాడించి వీడె నొకఁడు
తే. మిగిలినజనంబు చింత లేమిటికిఁ దలఁప
పరగ మీారలు తిరువళ్లెపట్టు నెడల, భ... 22
సీ. అతిసరంబులుగావు ఆరగించి వయారి
కోఱమీాసంబులకొనల్లు పఱుప
తిరుపణ్ణారములుగా వురువుగా భుజియించి
పొరలియాడుచుఁ జిన్నిబొజ్జ నిమురు
దధ్యోదనముగాదు తగినంత భక్షించి
గుఱ్ఱురఁ ద్రేన్చుచుఁ గూరుచుండ
వడలు గావు యయోధ్యవాసులతోఁగూడి
ముచ్చట దెలుపుచు మొనసి మెసవ
తే. చేరి భక్ష్యంబులా గావు చిత్తగింప
కినియు జాల్దంగుమేటిజంగీబలములు, భ... 23
సీ. పుట్లాదిపొంగలి పులిహోరలను మెక్క
వారికి రణముపై వాంఛ గలదె
శర్కరపొంగళ్లి చవిగొన్న వారికిఁ
బ్రాణంబుపైఁ దీపి బర్వకున్నె
వైష్ణవసద్గోష్ఠి వర్తించువారలు
తురకలమ్కరులపై దుముకఁ గలరె

ఉభయవేదాంతసద్భావ నుండెడివారు
మంత్రాంగశక్తులు మలపఁ గలరె
తే. దేవమానవశక్తుల తెఱఁగు వదలి
తురకదొరలన్న భీతిలి యురుకు దొరవు, భ...
సీ. సొగసుగా శంఖచక్రగదల్ ధరించుట
తడబాటు చతురహస్తమున వెలయు
ఘనతకా......సనములు దాల్చుట
పురజనంబులకు నద్భుతముగాఁగ
అవుడు కామార్యపుత్రా సేన...
...నేలుటలు సూర్యకులములోన
ప్రజ్ఞకాపతితపావనబిరుదాంకంబు
చూపుటెల్లను బలుచోద్యముగను
తే. యవనబలములు నల్గడల్ కవిసి మిమ్ము
దోఁచుకొనువేళ శౌర్యంబు దాఁచితకట, భ.
సీ. శంఖంబు కడుబీదజంగంబుచే నున్న
పూదిద్దెయైనను బొట్టవోసికొనును
చక్రంబు కుమ్మరి సరసనుండిన వేడ్క
కుండలైనను జేసికొనురయమున
గద సుకాలీవానికడనున్న వేవేగ
గోనెపైనము నెత్తుకొనుముదమున
తగనాల్గుచేతులు ధంసాకుఁ గల్గిన
నీఁక నింతరాజ్యంబు నేలుకొనును

తే. స్వామినీ కేల యివి వృథా సరసముగను
వారివారికి దయసేయు వరుసతోడ, భ... 26

సీ. సరసప్రబంధానుసంధానములు గావు
మొల్లాఖురానులమ్రోఁతగాని
మహిమహీసురల నమస్కారములు గావు
మల్కులు సేయు సమాజుగాని
తగ నర్చకులు సేయు తళిహాలుగావు లా
వుపాలావుదీకి బల్వొల్పుగాని
చందనాగురుధూపసమితిగాదు గుడాకు
గంజాయి పొగలసంఘంబుగాని
తే. బలిసి తిరునాళ్ల కేతెంచు ప్రజలుగారు
ఘనతరంబైన తురకలపక్కరులు తెలియ, భ...

సీ. పన్నీరు నించిన పసిఁడికొప్పెల మీకు
సారాలు నిండుసీసాలవారు
దాసులు దెచ్చు తీర్థపుబిందెలే మీకు
పారసీకులమధ్యభాండవితతి
భువి భక్తు లొనరించు భోగంబులే మీకు
తురకలు చేయుకందూరిచయము
కల్యాణవేదికాగ్రము నుండుహోమగుం
డంబులే పీర్లగుండములు నీకు
తే. కాకయుండిన యిళ్లేల కాకపుట్ట
దవని తురకలు చిందుచెండాడునపుడు, భ... 28

సీ. గజరథఘీంకారఘుంటారవంబులు
తగవిన్నఁ జెవులు చిందరలు గొనెనొ
కంచుఫిరంగీలు ఘననాదములు విన్న
ఫెల్లున గుండియల్ ఝల్లుమనెనొ
యవనాశ్వఖురపుటజవమున దెసలెల్ల
గదిసిన పెంధూళి గప్పుకొనెనొ
అరబు సిద్దీల పెళావాడులోపలఁ జొచ్చి
తొలుదొల్త పదములు తొట్రుపడెనొ
తే. కలముపై నెక్కితిరి మీరు ఘనత విడిచి
క్రమముచే నంగరక్షైనఁ గట్టుకొమ్ము, భ... ?
సీ. భరతాదిసమాజన్మవరులకు నీపాటి
ఫారసీ చెప్పించు పంత ముడిగి
వ్యాసాదిమునిగణప్రతతికెల్లను ఖురా
నులు జదివింపఁగాఁ దలఁపుసేయు
పరగ నింద్రాదిదిక్పాలకశ్రేణికి
నెరి నమాజులుసేయ నేర్పు నేర్పు
వారింపఁజాల వాళ్వారాదులకు వేగ
సున్నతీలప్రయత్న మెన్నఁజేయు
తే. చేయకుండిన తురకలు చెడుగువాండ్రు
హద్దు విడివచ్చి రింక మీరాగఁ గలరె, భ...
సీ. సర్వాంగితురకలు సవరించినారింతె
నీలికూసంబైన నెరి ధరించు

మణికిరీటము మ్లేచ్ఛఘనుల కిచ్చితి వింతె
టోపిర్యైనను దాల్చు మేపుమీఱి
పావాలు యవనులపాలుజేసితి వింతె
ముచ్చెలైనను గాళ్ల కిచ్చగించు
ఢిల్లీశ్వరునికూఁతు నిల్లాలిగా ముందు
నేలితి వింక నీకెక్కు-లేల
తే. మతమువిడుచుటలెల్ల సమ్మతము మీకుఁ
గాముకులకును బ్రజ్ఞలు గలవె తలఁప, భ...31
సీ. గరుడధ్వజము లన్న కాంక్షతో నుంటిరో
డాలైన తగటుజండాలు జూచి
తమనిత్యసేవవాద్యము లనుకొంటిరో
యరయ బాజాల నెయ్యంబుఁ జూచి
తిరునాళ్లయంగళ్లతీ రనుకొంటిరో
సరిలేనిదండుబాజార్లు జూచి
వరుసతోడుత భక్తవరు లనుకొంటిరో
దరిలేని బలుసుబేదార్ల జూచి
తే. కాక భువి విభవాహిముఖానుఁ డెంత
మేటిదానవులను గెల్చు మేటికరయ, భ... 32
సీ. ఆవు బైటో యని యాదరింతురుగదా
తురకలతో మైత్రి నెరపవైతి
రాము రా మనుచుఁ దాజీము లిత్తురుగదా
యూరకుండిన మిమ్ము నూఱడించి

కదిదిమిల్నా యని కౌఁగిలింతురుగదా
రొుదురుగా నేఁగిన బెదరులేక
కర్పూరవిడెముల ఘనత నిత్తురుగదా
నజరు పట్టినమద్దె నజరుగలిగి
తే. కానిపని జేసితివి పోటుకానివలెనె
వరుస తురకలపై నల్గి వలసబోయి, భ... 33
సీ. అరబు సిద్దీల దివాన్యజ్ఞలో వర్తించి
చేరి మేఁకలజబా సేయలేక
వరుసతో ధరియించు వరభూషణము లిచ్చి
యొడుకునూనియలఁ జేయుంచలేక
సెట్టిపల్లియవారు చేయునిర్బంధంబు
సొరిది మీఱఁగఁ గండ్లఁ జూడలేక
తగుగుమాస్తా యనఁదగు నశ్వరాయని
కరుణ నిండారఁగాఁ గాంచలేక
తే. తొలఁగిపోతిరి మీవంటిదొరల నమ్మి
కొలువఁ దగునయ్య దీనులు కొలఁదిమీఱె, భ.
సీ. విల్లునమ్ములఁబట్టి వెల్గులో జొన్పనా
వెడలిపోయెడి దొరబిడ్డలకును
చేతిచక్రము కొల్మిఁ జేర్చనా వెన్నిచ్చి
పాఱిపోయెడి దొరబాలురకును
క్షాత్త్రధర్మములెల్ల సరసిలోఁ ద్రొక్కనా
తొలఁగిపోయెడి యినకులజులకును

బంటుతనంబెల్ల పాథోధి గలుపనా
వరుసదప్పిన రఘువంశజులకు
తే. అనుచు ఖేచరులెల్ల మిమ్మనఁగఁ దోల్లి
చెలఁగి సింహాసనంబున స్థిరుఁడ వగుము, భ...35
సీ. శంఖంబుకోసము చక్కీలు నిల్పితే
నే నీయ నని పోవ నీతరంబె
చక్రంబుఁ దెమ్మని స్వారీలఁ బంపితే
యడిమల్పుకొనుట నీయబ్బతరమె
గద తెమ్మనుచు వేగఁ గడిదీలఁ బంపితే
తప్పించుకొనఁగ నీతాతతరమె
ఖడ్గంబుకోసమై ఖానుండు మళ్లితే
తిరిగి పోవంగ నీదేవుతరమె
తే. వరుస తురకలగతి నెంచి వలసబోయి
నిల్పితివి తూత్ర మీపాటి నీకె చెల్లు, భద్ర.
సీ. ఈపాటి దోరవాట యొఱిఁగి యామందర
కైకకు నుపమలు గఱపె వేడ్క
ఈపాటి దోరవాట యొఱిఁగి మీపినతల్లి
వెఱవక నిను నిల్లు వెళ్లఁగొట్టె
ఈపాటి దోరవాట యొఱిఁగి వేగ సుమిత్ర
కొడుకుసహాయంబు గూర్చి పంపె
ఈపాటి దోరవాట యొఱిఁగి శూర్పణఖ రా
వణుతోడ నీస్థితి వరుసఁ జెప్పె

తే. ఎఱుఁగ కవనిజ నీవెంట నేఁగుదెంచె
చెఱను బడియుండవే దైత్యచరునియింట, భద్ర.

సీ. శంఖంబులోఁ గీర్తిచంద్రిక లిమిడెనో
కనుపట్టదాయె సంగరమునందు
చక్రంబులో భూమిచక్రంబు దాఁగెనో
బలమీయదాయె నిబ్బరము గదుర
గదలోపలను శౌత్ర మొదిగెనో యరులపై
రాణింపదాయె గర్వంబుదక్కి
కత్తిలోఁ గోపంబు నొత్తిలియుండెనో
తురకలపై చురకు ఱుకదాయె

తే. స్వామి యిదియేమివింత మీసాహసంబు
లెందు వేంచేసి యరులపై ముందగించె, భద్ర.

సీ. ఈపాటి దొర వౌట యెఱుఁగక మిము నమ్మి
దేశస్థులెల్లను దిగులువడిరి
ఈపాటి దొర వౌట యెఱుఁగక మిము నమ్మి
భక్తులెల్లను మ్లేచ్ఛబాధపడిరి
ఈపాటి దొర వౌట యెఱుఁగక మిము నమ్మి
సెట్టిపల్లియవారు మట్టుమెరి
ఈపాటి దొర వౌట యెఱుఁగక మిము నమ్మి
యశ్వరాయఁడు భూపలాయనంబు

తే. నొందె నీపాటి దొర వౌట ముందెఱింగి
కదనమునకుఁ దురుష్కుండు గదిసె సహహా...

సీ. భుక్తాన్న శేషంబు పొసఁగ దాసుల కిమ్మి
దినములు గడుపు జగ్గనఘనుండు
తను గానకుండ గంధము మేన నలఁదించు
కొని నిష్ఠ సల్పు నప్పనఘనుండు
బీదసాదల దోఁచి పృథ్విని వంచించి
పన్నిచ్చు వేంకటపతినృపాలుఁ
డోషయఁ డై మణి దెచ్చి ముడుగులోపలఁ జొచ్చి
దాఁగియుండిన వరధనఘనుండు
తే. వారలెల్లను నీవంటివారుగారె
యొదిగి యుండిరి యుగచర్య లూహజేసి, భ. 40
సీ. శబరి విందయ్యెనే సరభసంబున మీకు
భావింప రామలదేవుభక్తి
హనుమంతుఁ డయ్యెనే యతిసాహసుండైన
జోగిపంతులయుక్తి చూడ మీకు
సుగ్రీవుఁ డయ్యెనే సారిది గోరుం దొర
కపి తానుఘనుఁడు మీకార్యమునకు
ఘనఋష్యమూకమయ్యెనె రాజమాహేంద్ర
వరమెన్న మీచునోవాంఛదీర్ప
తే. శాకయుండిన యిచ్చోటి రాక కేమి
కారణం బెన్న మీవంటి ఘనుని కరయ, భ...
సీ. జోగిపంతులకు మెచ్చులు గూర్పఁబోతివో
యింగిరీజుల ప్రాపు నిచ్చగించి

తురకరూపము చాల్చుతెఱవచ్చెనో మ్లేచ్ఛ
సంహార మొనరింప జగ మెఱుంగ
శాఖామృగంబుల జతగూర్చ ఋశ్యమూ
కము జేరఁబోవుటో క్రమముతోడ
నన్ను ధన్యునిజేయ నాచేత పద్యముల్
చెప్పింపఁ బూనుటో యొప్పమీఱఁ
తే. గాక యిదియేమివింత ముల్లోకములను
వలస వేంచేసితి రటన్న యలుసుగాదె, భ...42
సీ. అరయంగ మీకు భద్రాచలం బయ్యెనే
పొలుపుమీఱఁగ రాజు పోలవరము
కోవెల ప్రాకారగోపురా లయ్యెనే
తలుపులు లేని కఱ్ఱదడికయిండ్లు
కల్యాణమంటపాగారంబు లయ్యెనే
సంతమామిళ్లలోఁ జప్పరములు
భువి నెన్నఁగా రథోత్సవమయ్యెనే మీకు
వాహనరహితప్రవర్తనంబు
తే. మేలురాజ్యంబు తురకలపాలుజేసి
హార వృషభమధ్యమున నుండు టర్హమగునె,భ.
సీ. గోవిందరాజులు గురులఘుత్వము మది
దలఁపక మీవెంటఁ దగిలె నెట్లు
రంగనాయకులు శ్రీరంగాధికారంబు
నెఱుఁగక యేరీతి నేఁగుదెంచె

నరసింహుఁ డుగ్రంబు నట్టేటిలోఁ గల్పి
వెడఁగున్నై యెటుల మీవెంటవచ్చె
క్షేత్రపాలకుఁడై శ్రీరామలింగంబు
ప్రమథులతో నెట్లు పాఱిపోయె
తే. అహహా సహవాసుగుణము వీరందఱకును
సంభవించెను గాఁబోలు జగమెఱుంగ, భ...44
సీ. బిబ్బీలసిబ్బెంపు బిగువుగుబ్బల నీదు
వజ్రాలపతకముల్ వరలవలెనొ
పారసీకాంతలపాపట్లయందు నీ
ముత్యాలపేరులు మురియవలెనొ
తురకబిత్తరులపెందురుములలో వేడ్క
మొగలిపూ రేకులు ముడువవలెనొ
యవనాబ్జవదననవకంపు మేనులఁ
బీతాంబరముగేషు బెనఁగవలెనొ
తే. కాక యిది యేమి నీసొమ్ము లోకమెఱుఁగ
మానవులు వేగ హరియించి మనఁగలారె, భ.
సీ. తూర్పునాఁటి తెనుంగు దొరతనంబులుగావు
తోమాలలంది సంతోషపడను
దక్షిణదేశంపు ద్రవిడసాములుగారు
వినియోగములు గొని వేడ్కఁ జెందఁ
బశ్చిమమహారాష్ట్రప్రభువరేణ్యులుగారు
పాదతీర్థంబున మోదమొంద

ఉత్తరదేశంపు టోఢ్రరాజులుగారు
దర్శనమాత్రానఁ దనివినొంద
తే. యవను లఘాత్వతురు లటన్న సవి యెఱింగి
వస్తువాహనవిభవముల్ వదలి తహాహా, భ...
సీ. ధీమంతులెల్లను దెప్పించుకోక రా
రో మీస్థలానికి రూఢి మెఱయఁ
గవులు పంపింపక కదలరో మీమొఖా
పాలకెల్లను గడుశాశ్వతముగ
సనదులు పుట్టక సనుదెంచరో యగ్ర
హారికులకును మహాదరముల
వరుసతోడుత పరవానాలు లేక వేం
చేయరో భూసురశ్రేణికెల్ల
తే. తురకలెల్లను మీత్రోవఁ ద్రొక్కకుండ
ధరణి తాఖీదు లియ్యక తర్లినారొ, భ... 47
సీ. ద్వాత్రింశదాయుధోద్ధరణంబు గావించి
నెరి తుపాకులఁబట్ట నేరవైతి
సకలదానవులను సంహారించు టెఱింగి
తురకలతోఁ బోర నెఱుఁగవైతి
కుక్షిలో లోకముల్ కుదురుసేయుట నేర్చి
మీజీ సొమ్ములవాంఛ నేరవైతి
పదునాల్గులోకముల్ పాలించుట యెఱింగి
నీదు రాజ్యము కావ నేరవైతి

తే. వవని తెల్లనివెల్లఁ బాలనుచు నమ్మి
మోసపోతిరి గర్వంబు మొదల దొట్టి, భ...48

సీ. అగ్నివర్ణాదివీరాగ్రేసరులకంటె
మిక్కిలై పోర్దాదు లక్కజముగ
వృశ్చికరోమాదివీరుల కినుమడే
సిఫిరుషెంషేరులసిద్ధఫలము
ఇంద్రజిత్తాదుల కెక్కుడే తలపోయ
ధరణిలోఁ బలుగుచుఁదాను లరయ
యవనరాతుసమాయ కధికమే లెక్కింప
మొగలాయి మర్మంబు మొగి దలంప
తే. పోసఁగఁ ద్రేతాయుగంబు రక్కసులకంటెఁ
గలియుగమునాఁటితుర్కలు ఘనమె మీకు, భ.

సీ. కపులచేఁ గటిపింప చపలదైత్యులుగారు
జెంజెరి వాలుక్కాల చెడుగుదొరలు
రాళ్లచే నడపింప రాతుసావళిగాదు
వడినెన్న బారుజవానుగములు
లగ్గలుపట్టింప లంకాపురముగాదు
మహిని జాఫరగడిమహాలుగాని
పిలిచి కొల్వీయ విభీషణుం డిలగాఁడు
బిగిగల్లు నలయారుబేగుగాని
తే. చేసితివి మ్లేచ్ఛజనముతోఁ జెలిమి వెఱపుఁ
గఱపఁ బూనియు వెఱచిన క్రమముదోఁప, భ.

సీ. పితృవాక్యమునకునై పినతల్లి కోరిక
గడుపఁగా నేరీతి గడఁగినావొ
కడఁగినవాఁడవై ఖరదూషణాదిరా
క్షససమూహము నెట్లు చదిమినావొ
చదిపినవాఁడవై శాఖామృగశ్రేష్ఠు
నేగతి బంటుగా నేలినావొ
యేలినవాఁడవై రోటువలెఁ గపులచే
ఘనవార్ధి నేక్రియఁ గట్టినావొ
తే. కట్టి లంకాధిపుని నెట్లు గొట్టినావొ
యిట్టిధైర్యము గలదొరపట్టి వరయు, భ... 51
సీ. సోమకాసురునితోఁ జొచ్చి పాథోరాశి
మత్స్యమై సుఖలీల మరగినావొ
కూర్మరూపముచేతఁ గుంభిని జొరఁబాఱి
వ్రేగుచే బయలికి వెళ్లలేదొ
వరహావతారమై వసుధ వర్తించిన
సిగ్గుచే మూలలఁ జేరినావొ
బాలునిపల్కువెంబడి వేగరా నుక్కు
కంబములో దాఁగఁ గడగినావొ
తే. కాక నిజరూపముననున్న ఖలులు జేయు
చేతలకు నూరకుందువే చేయ మఱచి, భ...52
సీ. బలిచేత దానంబుఁ బ్రార్థింపఁబోతివో
కుబ్జరూపముచేతఁ గుటిలబుద్ధి

పరశుహస్తుండవై పార్థివావళి ద్రుంచి
ధరయేలఁ బోతివో ధర్మనిరతి
మనుపటివనవాసమును జెందునాయాస
ముడువుకోఁ బోతివో యుత్సుకమున
తడయక గొల్లబిత్తరుల నిత్తఱిఁ జేసి
కరుణింపఁ బోయితో కాముకేళి
తే. అహహ బౌద్ధుండవై ఖాను లాగడమునఁ
జేయుపనులన్ని జూచెదు సిగ్గులుఁగక, భ...53
సీ. అవనిలోపలఁ గాలయవనునినాఁటి నీ
పాఱుబోతుగుణంబు బాయదయ్యె
కొంచెబాఁపఁడవయి కోరినబలినాఁటి
మంకుబిచ్చపుబుద్ధి మానదయ్యె
పరగఁగఁ బితృవాక్యపరిపాలనమునాఁటి
దుడుకుకష్టతరంబు తొలఁగదయ్యె
పండాలచేత దుర్భాషలఁబడునట్టి
పుడమి మొండితనంబు పోవదయ్యె
తే. నేఁటికైనను నెన్నన్న మాట వినక
తొలఁగి యిట్లుండుటకు నేమితోఁచదకట, భ...
సీ. తాటిపండులు దిని తనిసినవారికి
శాల్యన్నమన్న ముచ్చటయుఁ గాదె
దుంపతోడులు దిని దొరకొన్నవారికిఁ
బరమాన్నమన్న సంబరముగాదె

తొడురొట్టెలతోడఁ దపము జేసినవారి
కతిరసాలన్న నెయ్యంబు గాదె
నారచీరలుగట్టినట్టివారికిఁ బట్టు
పీతాంబరములన్నఁ బ్రియము గాదె
తే. చెంచుముద్దియవిందారగించినట్టి
దొరకు రాజులవిందన్న దొడ్డగాదె, భ..
సీ. క్రూరదానవులను జీరినచక్రంబు
మొఱపలు బోయెనో మోటువడెనొ
పగతులశిరములు బద్దలుగాఁజేయు
గద త్రుప్పుబట్టెనో కలికెనొక్కొ
రావణాదులమీఁద రవణించు పెనువిల్లు
నడిమికి విఱిగెనో నారి తెగెనొ
శత్రువర్గమునెల్ల సమయించుపెనుతూపు
కాకంబు మ్రింగెనో కాడువడెనొ
తే. కాక యిది యేమి యవనులు కాకుజేసి
మండపాగారములు మట్టుమసలి రహహా, భ..
సీ. తాటకపై నుగ్రతరముగ వెడలిన
బాణంబు లెక్కడఁ బడియె నొక్కొ
ఘనసుబాహుని బట్టి ఖండించి వైచిన
శరము లెచ్చోటికి నరిగె నొక్కొ
చిత్రమృగముమీఁదఁ జిందుచెండాడిన
మార్గణం బెచ్చోట మడిసె నొక్కొ

వాలిపై నవలీల వ్రాలి జీవముగొన్న
యాశుగం బెచ్చట నణఁగె నొక్కొ
తే. అవని యవనులు మీ రాజ్య మాక్రమించి
యేలుకొనుచున్న తఱి ప్రాలుమాలె దకట, భ..
సీ. అంగదసుగ్రీవహనుమదాదులకు లా
ల్కుడతాలు దొడిగించు గుఱుతుమీఱ
జాంబవత్ముఖ్యదాదిశాఖామృగంబుల
గారడీ యాడింపఁగాఁ దలంచు
ముసలముద్గరశూలముల మార్చి చెకుముకి
బందూకలు ధరింపఁ బాటిసేయు
వరుస గీర్వాణముల్ వదలించి వేవేగ
తురకమాటలు నేర్పు కఱకుమీఱ
తే. మీరు దేవత్వము వహించి మేటినంచు
మీఱి వేఱొకరీతిని మెలఁగరాదు, భ... 58
సీ. సూకరరూపంబు సూచన వినిగదా
విడిచిపెట్టిరి నిన్ను వెర వెఱింగి
బలి బిచ్చమెత్తినబాఁపఁడ వనిగదా
విడిచిపెట్టిరి నిన్ను వెర వెఱింగి
ఢిల్లీశ్వరున కైనయల్లుఁడ వనిగదా
విడిచిపెట్టిరి నిన్ను వెర వెఱింగి
పాఱిపోయినవానిఁ బట్టరాదనికదా
విడిచిపెట్టిరి నిన్ను వెర వెఱింగి

తే. కాక యుండిన తురకల గడచిపోవఁ
గలరె మీవంటివారలు క్రమముతోడ, భ..

సీ. శేషావతారవిశేష మెక్కడఁబోయె
లక్ష్మణార్యునకు సలక్షణముగ
శంఖచక్రాన్వయసంజ్ఞ యెచ్చటఁ జెల్లె
భరతశత్రుఘ్నుల కరయ భువిని
లోకమాత్రాఖ్య యేలోకంబునకుఁ జేరె
భూమిపుత్త్రికి నెన్న భూమిలోన
ఆదినారాయణాహ్వయ మెందులకు నేఁగె
రామాఖ్యగలమీకు రమణతోడ

తే. తురకలెల్లను దొరవని సరకుగొనక
మంటపాగారముల మట్టుమసలి రహహా, భ..

సీ. చెక్కులు నిమురక సీతోర్మికాదులఁ
గని యూరకుందురే మనసు నిల్పి
పాటిపోవఁగనైనఁ బట్టలు నాకక
విడుతురే వైష్ణవవితతినెల్ల
బిరుసుగడ్డంబులఁ బెఱుకక రిత్తగా
నాదరింతురె వసిష్ఠాదిమునుల
ముక్కులు గఱువక మునుమొనకట్టి పో
నిత్తురే కపినాయకోత్తములను

తే. మొగలుబచ్చాల కగుపడ దగదటంచుఁ
తొలఁగిపోతి రిఁకేటికి దొరతనంబు, భ...

సీ. పురలక్ష్మి నురువడి చెఱపట్టి కీడులో
వనలక్ష్మికరపల్లవములు నులిమి
గంగను గడిసి వేగమె ధైర్యలక్ష్మిని
జేకొని ధనలక్ష్మిఁ జెట్టపట్టి
రాజ్యలక్ష్మిని సంగరమునఁ బెండిలియాడి
ధాన్యలక్ష్మిని సరదార్లకిచ్చి
ఘనగజాంతర్లక్ష్మి గైకొని వేవేగఁ
గీర్తికాంతకుఁ గులగిరు లొసంగి
తే. నట్టి ధంసాను శిక్షింప నలవిగాక
యడుగుకొంటివి నృపతులకడుపుకొఱకు, భ...
సీ. హరువిల్లువిఱువక వరపుత్రి నీయంగ
జనకరా జేమి విచారపడెనొ
పరశురాముని భంగపఱుపఁగా నెంచిన
దశరథుం డేరీతి తల్లడిలెనొ
మిముఁ గాపుఁజేసి యాగముఁ బూర్తిచేసిన
కౌశికుం డేమి వ్యగ్రతఁ గొనియెనొ
వనరాశి గట్టి రావణుఁ ద్రుంచఁ గనిన వి
భీషణుం డేరీతిఁ బెగడువడెనొ
తే. తురకబలకోటివలని యాతురత పోల
వరము వేంచేసినట్టి దుర్వార్త వినిన, భ... 6౩
సీ. వరుసఁ గోడలిదురవస్థలు విన సారె
కౌసల్య యేగతిఁ గాంచెనొకో

మీశ్రవఃమెల్ల సుమిత్ర యాలించి గా
సిలి దుఃఖవారాశిఁ జేరె నొక్కొ
కలకాల మీరీతిగడుపంగఁ గాలంబు
విని విందు లేమని వెఱచి రొక్కొ
గతకాలమునఁ బండ్లు కానుక యిచ్చిన
శబరి యేగతిఁ జింతసలిపె నొక్కొ
తే. అహహా భద్రాద్రినుండి మీ రరిగి పోల
వరము వేంచేసినట్టి దుర్వార్త వినిమ్ము,భ..

సీ. ఆదిభిక్షునిఁ బెండ్లియాడినపార్వతి
కన్నవస్త్రముల కే మాపదయ్యె
కోరి బాఁపనిఁ జేసికొన్నసరస్వతి
కిడుమలు వచ్చెనే యిల్లులేక
కాళ్లులేనిఫణీంద్రుఁ గట్టుకొనినయుర్వి
కూరు లేదాయెనే యుండుటకును
తనువులేనివయ్యారిఁ దగిలి రతీదేవి
సుఖపడదాయెనే సురలు మెచ్చ
తే. భళిర మీవంటి ప్రభుఁ జెట్టపట్టి సీత
సకలవెతలకు లోనయ్యె సరవితోడ, భ...

సీ. పొరుగూళ్లవెంబడి తిరుగుచునుండు ల
క్ష్మీదేవి కేయపకీర్తి వచ్చె
సభలలో నేప్రొద్దు సంచరించుచునుండు
వాణి కేమపకీర్తి వచ్చె జగతి

వేలారుమనువుల కాలయ మైయున్న
భూదేవి కేమి తప్పులు ఘటిల్లె
శివునిఁ బాసి సముద్రుఁ జెందినపార్వతి
సవతి కే మాడికల్ సంభవించె
తే. తోడునీడయి మీవెంటఁ గూడియున్న
సీతదురవస్థ లేవని చెప్పతరము, భ... 66
సీ. జనకుఁ డిచ్చెను బన్నసరము చును సురూప
తెలుపు సీతామహాదేవి యిష్ట
జనులతో సూర్మిళ తనతల్లి యొసఁగిన
పచ్చలకళలని బల్కు ప్రాణ
సఖులతో మాండవి సరవి కెంపులనత్తు
పొలుపును గనుఁగొని మురియు బంధు
వర్గంబులో జాళువావల్వ శ్రుతకీర్తి
మేనమామ యొసంగె మిథిలయందు
తే. అనుచుఁ గొనియాడు పుట్టింటిఘనత మెఱయు
వారి నేరీతి నోదార్చ వశము నీకు, భ... 67
సీ. గుజరాతికెంపులకుంటేళ్లు చెవుల ధ
రించదాయెఁగదయ్య వాంఛదీర
వరుణదేవుఁ డొసంగు వజ్రాలకమ్మలు
పెట్టదాయెఁగదయ్య ప్రేమదీర
అలకుబేరుఁ డొసంగు నద్దాలరవిక పైఁ
దొడుగదాయెఁగదయ్య యొడలునిండ

కట్టు మింద్రుఁ డొసంగు గంటలమొలనూలుఁ
గట్టదాయెఁగదయ్య కాంతిదీర
తే. వేడ్కదినములు నడవుల వెంటవెంటఁ
ద్రిప్పితిరి సీత నూరక తప్పులేక, భ... 68
సీ. తెచ్చితి కీర్తి కీర్తివిశారదు లగుని
క్ష్వాకువంశోద్భవఘనుల కెల్ల
యేలితి వవనిలో నెలమి శంకరగిరి
హాసనుబాదాలు మహాద్భుతముగఁ
దోలితి వరుల హద్దులు తప్పి రాకుండ
భక్తకోటికి ముద్దుభావ మలర
... ... ...
... ... ...
తే. నేమివర్ణింతు మీపాత్ర మేమనెంతు
లోకు లెఱుఁగంగ నీమూఁడులోకములను, భ.
సీ. అల పాకశాసనునైనను యాచించి
చేయించు ముత్యాలచేరుచుక్క
రమణతోడుత ధర్మరాజునుదయబుట్ట
నడిగి చేయించు ముత్యాలనత్తు
వరుణదేవునినైన వరుసతోఁ బ్రార్థించు
కలకొద్ది జేయించు కమ్మజోడు
రాజరాజును గోరి తేజంబుతో ముందు
నిప్పించు సవరంపుఁ గొప్పె ముందు

తే. వేద పోడుము లివియైనఁ బెట్టనున్నఁ
జూపరులకెల్ల మిక్కిలి చులకదనము, భ... 70

సీ. ఇల్లు నప్పులగంప యిల్లాలు చలచిత్త
పాన్పు నాగులపుట్ట వదినె జ్యేష్ఠ
గొల్ల పెంపుడుతల్లి కోడలు రాఁగ కూఁ
తురు పాలుఁబోతు అతూరుఁడు పక్షుఁడు
మనుమఁడు తండ్రి కాముకుఁడు కుమారుండు
క్షయరోగి మఱఁది వంచకుఁడు తండ్రి
అన్న పానఘునుండు శరయ నిష్టుఁడు పేఁడి
వేసదారివి నీవు వేయునేల

తే. ఇన్నియును నాదునెమ్మది నెఱిఁగి యుండి
కొలిచితిని మిమ్ము విశ్వాసగుణము దలఁచి, భ.

సీ. పన్నీరు సీసాల పరగనించినభాతి
నెనయంగఁ బ్రమథు మారెత్తురీతి
పరుస ముత్యాలుకోవలు నించినక్రమంబు
మల్లెపూసరములు మలుపుమాడ్కి
విరిజాజిపై సుధావృష్టి దోఁగినరీతి
కస్తూరివీణియల్ గలుపుపోల్కి
పరగ నౌదాతుగంపలు పంపినక్రమంబు
తేనెబానలతెరల్ దీసినట్లు

తే నీదునామామృతంబు నానేర్చినంత
కొల్లలాడెద భక్తులు నుల్లసిల్ల, భ... 72

సీ. సర్వమొఖాసాలు చాలని మీకేల
  కట్టడి నేరీతి గడచెనయ్య
బహ్వవసరములు భక్షించు మీరెట్లు
  నొక్కప్రొద్దున కోర్చి యుంటిరయ్య
సంగీతసాహిత్యసద్గోష్ఠి గలవార
  లొంటి మీరెట్లొదిగుంటిరయ్య
తిరుపీథు లెడపక తిరిగెడి మీరెట్లు
  గడపదాటక ప్రొద్దు గడపితి రహా
తే. వాహనంబులపై నుండువారి కహహ
  యోడపై నెక్కఁగా నెట్లు గూడె నయ్య, భ.

సీ. పదియు రెండేఁడుల ప్రాయంబువాఁడవై
  మించి తాటకను శిక్షించు టెఱిఁగి
రణశూరులగు దైత్యగణములఁ బరిమార్చి
  కౌశికుజన్నంబుఁ గాచు టెఱిఁగి
తరములఁబట్టి యెత్తఁగరానిహరువిల్లు
  చెఱకుకైవడి చేత విఱచు టెఱిఁగి
సంగరరంగవిశారదుండైన భా
  ర్గవరాము నవలీల గడపు టెఱిఁగి
తే. దూరితిని మిమ్ము రోషంబుదొట్టి రిపుల
  మదమణంగించునట్టి సమ్మదమెలర్ప, భ... 74

సీ. ప్రారబ్ధ మనుభవింపని భక్తజనముల
  యాతనలను ద్రుంప మీతరంబె

కారణహేతువికారముల్ దప్పింప
నధికులఁ జేయ మీ యయ్యతరమె
మిము తొల్లి పూజించి మీవరంబులు గొన్న
ధంసాను గెల్వ మీ తాతతరమె
గతజన్మమునఁ బెట్టి గతిలేక పుట్టిన
దీనులఁ బ్రోవ నీదేవుతరమె
తే. అనుచు జనులెల్లఁ గొనియాడ వినఁగ లేక
దూరితిని నాదుదోషముల్ తొలఁగఁ జేయు,భ.
సీ. ఈతఁ డాధంసాను నెదిరి పోరఁగలేక
పాఱిపోయిన రామపార్థివుండు
ఈతఁ డాయరికి వెన్నిచ్చి పోలవరంబు
దరికిఁ జేరిన సుమిత్రాతనూజుఁ
డీపె కాకలసొమ్ము లిచ్చి మ్లేచ్ఛులబాధ
పతికిఁ దప్పించిన భాగ్యమూర్తి
ఈతఁ డాపగదళం బిదె వచ్చెనని చూపి
భయము బుట్టించిన పావనియని
తే. పల్కుదురు సామి మిముఁ జూచి ప్రజలు కార్య
భార మెఱుఁగక కోపింప వలదు తండ్రి,భ...76
సీ. పిఱికివాఁ డంటిఁగా యసురదానవాదుల
గర్వ మడంచినఘనుని నిన్ను
లోభివాఁ డంటిఁగా లోకంబు లెఱుఁగంగ
లంక దానము జేయు రాజు నిన్ను

బలహీనుఁ డంటిఁగా బలిమి సముద్రుని
బాణాగ్రమున నిల్పు జాణ నిన్ను
వెఱ్ఱివాఁ డంటిఁగా వెర వెఱుంగక కోఁతి
గములచే వారధి గట్టినట్టి
తే మిమ్ము లోకోపకారినై నెమ్మిఁ బూని
దూరితిని గాక మీవంటిదొర గలండె, భ...
సీ. అల కుచేలుని చేరెఁ డటుకుల భక్షించి
సంపద లొసఁగిన సరసగుణుఁడ
గజరాజు మొసలిచే గాసిలి మొఱవెట్ట
కాచి రక్షించిన కమలనాభ
కలఁ డనఁ బెన్నుక్కుకంబంబులో నుండి
వెడలి బాలునిఁ గాచు వీరవర్య
తలఁచిన ద్రౌపది తలఁపు వెంబడి మాన
భంగంబుఁ గాచిన ప్రభువరేణ్య
తే. లోభివంటిని పగఱకు లొంగితంటి
పిఱికివంటిని నేరక యుఱికితంటి, భ... 78
సీ. పగతుఁడై బహుఫణార్భటిఁ జేరవచ్చిన
కాళియఫణివర్యుఁ గావలేదె
సీతను జెఱఁగొన్న పాతకాగ్రేసరు
ననుజుని శరణన్న మనుపలేదె
మీశరణార్థియై మెలఁగి కావు మటన్న
కాకాసురునితప్పు గడుపలేదె

... ... ...

... ... ...

తే. పృథివి శరణాగతత్రాణబిరుదు గలుగు
దొరవనుచు మిమ్ముఁ బలుమారు దూరినాఁడ, భ.

సీ. పితృకార్యమునకునై పినతల్లికోరిక
వెలువకతీర్చిన వేల్పు నిన్నుఁ
బాదరేణు వహల్యపాపంబు లెడఁబాపి
భర్తుని గూర్చిన పుణ్యధనుని నిన్నుఁ
దగఁ గన్న పగవానితమ్ముని లంకలోఁ
బట్టంబుగట్టిన ప్రభుని నిన్ను
ఘనసుబాహునిఁ బట్టి ఖండించి కౌశికు
సవముఁ గాచిన సర్వసముని నిన్ను

తే. భక్తలోకోపకారార్థపరుఁడ వగుచు
దూరితిని నాదులోపంబుఁ దొలఁగఁజేయు, భ.

సీ. చిలుకకు మాటలు చెప్పి రామా యను
చేడియ మోక్షంబు చెందలేదె
పరుస దారులు దోఁచి వాల్మీకి రామరా
మా యని మీకృపం బ్రబలలేదె
పతిశాపగతినుండి పాదరేణువు సోఁకి
పాషాణ మింతియై పరగలేదె

... ... ...

... ... ...

తే. పృథివి శరణాగతత్రాణబిరుదు నీకుఁ
గాక యితరుల కెంతైనఁ గలుగఁ గలదె, భ...

సీ. కంటినేమో నాదుకఠినచిత్తమునందు
నిలిపిన నీపదనీరజములు
అంటినేమో నాదునఘువంశ మూర్తులో
సంచరించఁగ మేనఁ జెమటలూరి
సోఁకెనేమో నాదుచుఱుకు లోఁజూపులు
చూచుచుండఁగ ముఖసుందరంబు
... ... ...
... ... ...

తే. సామి యింక నేరములు నీరసంబుఁ జేసి
కాచి రక్షించు సత్కృప గడలుకొనఁగ, భ...

సీ. కొల్లలాడితినని కోపింపఁబోకుఁడీ
యవని మీదివ్యనామామృతంబు
పీటఁబుచ్చితినని వింతగాఁ గనకుఁడీ
కృతులందు మీగుణకీర్తనములు
కాకుఁ జేసితినని కంటకపడకుఁడీ
ధరణి మీదివ్యకథారసంబు
ఎఱుఁగఁబల్కితినని యెగ్గుగాఁ గనకుఁడీ
మహిని మీమర్మకర్మంబు లెల్ల

తే. పంచిపెట్టితినని కోపగించవద్దు
సరస మీపద్యముల్ చెప్ప సంతతంబు, భ...

సీ. వేయుకన్నులుగల వేల్పురాయనికైనఁ
గనుఁగొనరాని శృంగారరూప
వేయునోళులుగల పీనులకంటికై
న వచింపరాని యనంతనామ
వేయుచేతులు గల్గు వేఁడివేల్పునకైన
పూజింపఁగారాని పుణ్యమూర్తి
నాలుగుమోముల నలువొందుసుతుకైన
వర్ణింపఁగాఁగాని వరచరిత్ర
తే. తగదు తగదని మూఢచిత్తమున నిన్ను
నిల్ప శక్యంబె నావంటి యల్పునకును, భ ...84
సీ. పనుపట్టితే యొక్కపవనుఁడు చనుదెంచి
యరిబలంబులను జక్కాడలేఁడె
సెలవిచ్చితే యొక్కబలిసుని నీలుండు
నని విరోధులఁ దెగటార్పలేఁడె
ఆనతిచ్చిన యొక్కయంగదుఁ డెదురేఁగి
పగతులయుసురులఁ బాపలేఁడె
... ... ...
... ... ...
తే. స్వామి సాత్వికరూపవిచక్షణులు
మోర్చితిరిగాక తురకలయొదటికెల్ల, భ ...85
సీ. నలనీలకుముదసేనానాయకోత్తముల్
బలసి ముంగల బరాబరులుసేయ

హనుమయు జాంబవదాంగదాదులు నిల్చి
యుంచలంచలను జోహారు లిడఁగ
వరుస సుగ్రీవ గవయ గవాక్షాదులు
నొరసి మిన్నంటి చామరలు వీవ
పరమభాగవత ఖేచరసిద్ధచారణుల్
జయజయా శబ్దసంచయము నుడువ
తే. సురలు విరులు గురియఁ బోలవరమునుండి
భద్రగిరి జేరు వేడ్కలు ప్రస్తుతింతు, భ... ౬
సీ. అంగ వంగ కళింగ బంగాళ నేపాళ
రాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
ఘూర్జర కొంకణ కురుర కొంకణ చోళ
రాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
చోట సింధు మరాట లాట మత్స్య విదర్భ
రాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
పాంచాల సౌరాష్ట్ర బర్బర మగధాంధ్ర
రాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
తే. దివ్యతిరునాళ్లకు సమస్తదేవవరులు
రావలయునంచుఁ జాటింపఁగావలయును, భ..
సీ. శ్రీరామచంద్రులు సీతాసమేతులై
వచ్చిరి భద్రాద్రివాసమునకు
జయనామవత్సర చైత్రశుద్ధాష్టమి
తరువాతదినమందుఁ దగ వివాహ

మరయ మార్గమునందు నొరయ సత్తరులు బలొ
చలువపందిరులు వెచ్చనిజలములు
శీతోదకంబులు చిక్కనిమజ్జిగల్
నిమ్మపండ్లరసంపునీరు చల్ల
తే. తాదిగాఁగల్గు ద్రవ్యంబు లమరఁజేయ
వలయునని వేగఁ బంపుఁడీ వాయుసుతుని,భ...
సీ. తిరిగి రాములు భద్రగిరి కేఁగువార్త లా
లించెనా వజ్రి తాలీ లోసంగు
అవనిజాధిపుఁడు భద్రాద్రిఁ జేరుట వినఁ
గలైనా జముఁడు చొకట్లొసంగు
దశరథాత్మజుఁడు స్వస్థానంబు కరుగుట
వినిరొునా వరుణుండు మణు లొసంగు
భరతాగ్రజుఁడు నిజపురము కేతెంచుట
విన్నచో ధనము కుబేరుఁ డొసఁగు
తే. సనుచు నల నీల జాంబవ దంగదాదు
లమరియున్నారు శుభవార్త లరసి చెప్ప,భ...
సీ. కలిమిచే బుధులను గానసేరనివారి
వారించెఁ గరుణచే వదినెగారు
నెరిపేదనైనను నిల్చి చేపట్టియు
ధీరునిఁ జేయు పత్నీలలామ
పతితాత్ము నైనను బావనుగాఁ జేయు
గుణవతి ముద్దులకూఁతు రరయ

యవివేకినైన విద్యావంతునిగఁ జేసి
గురురూప మొనరించుఁ గోడ లెన్న
తే. యిట్టిసంపత్తి నీకుంట యెఱిఁగి యెఱిఁగి
కొలిచితిని వేగ నాకేమి కొదువ యింక, భ...
సీ. దయశాలి తల్లి యుదారసాహసుఁ డప్ప
భూభారకుఁడు శయ్య పుష్పబాణుఁ
డరయ పుత్రుఁడు శీతకరుఁడు మఱంది వా
సవసూను విష్ణుఁ డైశ్వర్యయుతుఁడు
నెచ్చెలి దేవయోని దలంప మనుమఁడు
రత్నాకరం బిల్లు రమణిదెన్న
రణశూరుఁ డన్న సారసనేత్ర వర్ణింప
నవతారమూర్తి వీ వవనిలోన
తే. ఇట్టిమిముఁ గొల్చు నామది కితరబుద్ధు
లమర నేర్చునె యెన్నిజన్మములకైన, భ... 91
సీ. పరుస విద్యలు చెప్ప వదినె సరస్వతి
యాయువు దయసేయ నన్న యజుఁడు
ముదమీయ నక్షత్రములు మేనయత్తలు
మాకిష్టపడఁ జందమామ యరసి
పాపముల్ బాప యప్ప దివిజగంగ తా
నైశ్వర్య మొసఁగ శ్రీహరుఁడు బావ
మాతల్లి ముల్లోకమాత కమ్మనిదీవ
పోషకుఁడవు తండ్రి పోసఁగ నీవ

తే. యిన్నియును నింట గల్గుట యొఱేఁగి యితర
దైవముల వేఁడ నాకేల దైవరాయ, భ... 92

సీ. బలుసాకు మెక్కి ద్రౌపదిచేత వనములోఁ
బాండవావళిని గాపాడినట్లు
సరవి తెచ్చిన పండ్లసారం బనుభవించు
చెంచుముద్దియను రక్షించినట్లు
అడిగి తెచ్చిన ముక్కయటుకులు భక్షించి
చెలఁగి బాపని ధన్యుఁ జేసినట్లు
పెట్టగానని తొట్టిరొట్టెకు బ్రతిమాలి
ముసలియవ్వకుఁ గీర్తి యొసఁగినట్లు
తే. పూసపాటినృపాలురఁ బ్రోవఁ దలఁచి
తెచ్చుకొంటిరొ మీకరుచ్చు వెచ్చమునకు, భ...

సీ. గోత్రికులని పాలుగొట్టి పోలేక మీ
యంశభూతులటంచు నడిగినావో
పేరుమోసినకట్టు మారసికొంటివో
శూరులనుచు నంపఁ జేరినావో
మీనౌకరులలోన మీఱి మప్పిట దెచ్చె
ననఁ జూపి వ్యయముల కడిగినావో
స్థలము వంశజమీరొరునిపోలిక (?)
బలుకష్టసుఖములు దెలిపినావో
తే. యెట్టు దయచేసిరయ్య మీపట్టు మీకుఁ
బూసపాటికులోద్భవుబాస యొఱేఁగి, భ... 94

సీ. రవికులోత్తమ దశరథరాజనందన
తాటకమదవిమర్దన మునీంద్ర
మఖపరిపాలన మారీచహర యహ
ల్యాశాపమోచన హరశరాస
నవిభంగనిపుణ జానకినాథ దుర్వార
భార్గవరామగర్వప్రనాశ
పితృవాక్యపాలన ప్రీతచతుర్దశ
లోకదుష్టనిశాటభేకసర్ప
తే. దైత్యమర్దన సుకలాప సత్యదీప
మౌనిమానససారసమత్తమధుప, భ... 95

సీ. రణభీమ దైత్యమారణహోమ పుణ్యకా
రణనామ వినుతచారణలలామ
వనచార పతితపావనసార మౌనిభా
వనపూర వీర రావణకుఠార
జనరక్షకృతపుణ్యజనదూర వరభక్త
జనపక్షసత్ప్రియోజననిరీక్ష
జితదోష మౌనిపూజిత శేషశయన వా
రధిశోష పార్థసారథ్యవేష
తే. సరసగుణధామ రవికులసార్వభౌమ
దశరథసుపుత్ర దేవ సీతాకళత్ర, భ... 96

సీ. వరరూపలావణ్య వైభవార్తిశరణ్య
దేవాగ్రగణ్య పార్థివవరేణ్య

ఘననీరదనిభాంగ ఖగనాయకతురంగ
విజితహేమతురంగ కుజనభంగ
మానిమానసభృంగ మథితఘోరభుజంగ
పరిపాలనప్లవంగ ప్రణుతగంగ
భక్తజనమిత్ర పావనచారిత్ర
శతముఖస్తోత్ర కౌసల్యపుత్ర
తే. ధన్యగుణసాంద్ర రఘుకులతారకేంద్ర
సవనసంరక్ష యాశ్రితజనకలాప, భ... 97
సీ. జలజాక్ష ఘనరాక్షసవిపక్ష మునిపక్ష
రణశూర వరచారరఘుకుమార
అరిశోష మునివేష సురపోష మృదుభాష
రఘుపుంగవ భుజంగరాజభంగ
శరచాపధర పాపహార భూపకులదీప
రతిరాజజయతేజ హితసమాజ
మురభీమ సురసోమ వరనామ గిరిధామ
సురపుంగవశుభాంగ సుప్రసంగ
తే. భక్తపరిపాల గుణలోల భవ్యశీల
దివ్యమంగళవిగ్రహా దీనరక్ష, భ... 98
సీ. శరణు త్రిలోకరక్షణ మానిసన్నుత
శరణు సద్భక్తరంజనచరిత్ర
శరణు విశ్వామిత్రసవనసంరక్షణ
శరణు గౌతమపత్నిశాపహరణ

శరణు మారీచభంజన వార్ధిబంధన
 శరణు ప్లవంగపోషణ ముకుంద
శరణు వైకుంఠవాస విశాలలోచన
 శరణ మిక్ష్వాకువంశజ మహాత్మ
తే. శరణు వాసవనుత శేషశయన శరణు
శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గహస్త, భ...

సీ. రామదాసాదుల రక్షించినట్టుల
 నెలమితోడఁ గుచేలు నేలినట్లు
ప్రహ్లాదనారదప్రభృతిఁ బ్రోచినయట్లు
 సరవితో ముచికుందు సాఁకినట్లు
అల ద్రౌపదికి వల్వలాదుకొన్నట్టుల
 గజరాజు నవనిలోఁ గాచినట్లు
శబరివిందుకు సంతసంబు నొందినయట్లు
 మహిని ఘంటాకర్ణు మనిచినట్లు
తే. నన్ను దయ నేలు నేరము లెన్న కవని
మూఢచిత్తుఁడ నవివేకములు హరించి,

సీ. సర్వధారనుశ్వేరి సంవత్సరంబున
 ధంసాకు వెడలిచి యిద్దరికి వచ్చి
పోలవరంబులోఁ బోలుపొంద నైదేండ్లు
 వనవాస మొనరించి వరుసతోడ

శాక్తేయమతయుతు సంహార మొనరించి
మంత్రాంగశక్తి యిమ్మహిని వెలయ
తగ పూసపాటి విజయరామరాజసీ
తారామరాజులతో దయమున
తే. విజయసంవత్సరంబున విజయముగను
భద్రగిరి కేఁగితౌనయ్య భద్రముగను, భ...

సీ. మొదలఁ గావ్యము లేశమును బఠింపఁగ లేదు
శబ్దజాలములవాసన యెఱుంగ
ధర విభక్తిజ్ఞానసరణి యేమియు లేదు
లక్షణశక్తి చాలదు తలంప
గ్రంథశోధకుఁడను గాను వ్యాకరణసూ
త్రము లవలేశమాత్రము నెఱుంగ
అవని మీఁదివ్యనామామృతాసక్తిచేఁ
బూనితి నీకావ్యబూటకంబు
తే. మున్ను నన్ను మరా మరా యన్నఘునుని
పగిది దయజూడవలయు నాపదలు దోలి, భ...

సీ. నదులు తీరద్వయం బదలించి పాఱుచో
నెదురేఁగు మీనముల్ గుదులు గూడి
వనవసంతాగమజనములఁ గోయిలల్
మొగమిచ్చి పలుకును వగలు గులుక

సరవి మేఘోత్పత్తి సమయంబునను శిఖి
పరికించి యాడు నంబరము గాంచి
సిరిగల్గువేళలఁ బరమదయాళురై
పురబంధుజనములు పూజసేతు
తే. రితరకాలంబులను వారలెగ్గుసేతు
రేమి వివరింతు మాయలసామి నేఁడు, భ...

సీ. రమణతోడుత విభరాహిముఖానుని
యేల పుట్టించెనో యిలను బ్రహ్మ
పుట్టించెఁ గాక యీపుడమిలోపల నేల
ఫాజీలు బేగని పలుకఁ జేసె
పల్కఁ జేసినవాఁడు పదవి చాల యొసంగి
ధర జాల్దుంగు...పేరయేల
తెచ్చెఁ దెచ్చినవాఁడు దృఢచిత్తుగాఁ జేసి
ధంసాయను కితాబు ధరణి నొసఁగె
తే. యొసఁగి మిము గెల్చు సాహస మొనర యేల
జేసెనో యని మది చింత చేయ వలదు, భ...

సీ. రమణకౌండిన్యగోత్రపవిత్రుఁడను లింగ
నకుఁ బౌత్రుఁడను బెద్దనకును బుత్ర
వరుఁడఁ బేరయనామధరుఁడ భల్లావంశ
వనధిసోముఁడ బుధవర్గ ఘలర

వలచ వేంచేసిన వరుస యాస్పదము నా
మదిలోన భావించి ముదమెలర్ప
ఘనత వ్యాజస్తుతిగా నొనర్చితి సీస
శతక మష్టోత్తరశతము గాఁగ
తే. చిత్తగింపుము హంసంబు క్షీరములను
గ్రాహ్య మొనరించుచందంబు గనలుకొనఁగ, భ.

సీ. కేశవ మాధవ కృష్ణ హృషీకేశ
నారాయణ ముకుంద నారదనుత
పద్మనాభ చక్రి ప్రద్యుమ్న శ్రీధర
వామన గోవింద వాసుదేవ
విష్ణ్వనిరుద్ధ త్రివిక్రమాధోక్షజ
నారసింహ జనార్దన మధుసూద
నయుపేంద్ర సంకర్షణ పురుషోత్తమ హరి
దామోదరానంత దానవారి
తే. అఖిలలోకాధినాథ దివ్యాంఘ్రిపద్మ
ములకుఁ బ్రణమిల్లెదను ముదమలర నేలు, భ.

సీ. జయ రఘుకులదీప జయ దశరథపుత్ర
జయ భరతాగ్రజ జయ ముకుంద
జయ తాటకాంతక జయ దుఃఖపరిపాల
జయ యహల్యాపాప జయ యుపేంద్ర

జయ హరధనుఖండ జయ జానకీనాథ
జయ భృగుసుతభంగ జయ కృపాబ్ధి
జయ వనసంచార జయ వాలిమర్దన
జయ వార్ధిబంధన జయ మురారి
**తే.** రావణాంతక సాకేతరమణ నీదు
వలస శతకము వినువారివలస లుడుగు
భద్రగిరివాస శ్రీరామభద్ర దాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక.

సంపూర్ణము.

---

# పీఠిక.

ఈశతకము రచించినకవి వెల్లాల రంగయ్య. సుబ్బమ్మ, ఆదినారాయణలకుమారుఁడు. కవివిద్యాగురువు మన్నవ లక్ష్మణార్యుఁడు. కవి యేకులమువాఁడో నివాస మెచ్చటనో యేకాలమున నుండెనో యెఱుంగ నగు నాధారములు శతకమున లేదు దాశరథిశతకములోనిపద్యముల కనుకరణపద్యము లుంటచేఁ గవి యాధునికుఁడని యూహింప నవకాశము కలుగుచున్నది

ఈవసుదేవనందనశతకము 108 పద్యములతో నలరారుచున్నది. ప్రతిపద్యమునందున శ్రీకృష్ణుని యమానుషచర్యలు మనోహరముగా వర్ణింపఁబడినవి. కృష్ణునిశృంగారచేష్టల కీకవి తనశతకమున నెడమీయక కేవల మహిమానువర్ణనమె గావించుటచే నీశతకము కృష్ణభక్తులకు సర్వదా పఠనయోగ్యముగా నుండుననుట సత్యము. ఈకవినామము శతకకవుల చరిత్రమునందుఁ గూడఁ గానరాదు.

కవియందు వ్యాకరణదోషములు లేవనియె చెప్పవచ్చును. ధార నిరర్గళముగ మనోహరముగ నున్నది. అంత్యప్రాసపద్యములు సమాసజటిలపద్యములు చదువఁజదువఁ జవులూరుచుఁ జెవి కింపుగ నున్నవి. కృష్ణునిశృంగారలీలలు వర్ణించుచునో గోపికాలోలత్వమునకుఁ బ్రాముఖ్యమిచ్చి యేచెలి

యనో యభిసారికగాఁ జేసి పిలువమనుటతోడనో ముగింపఁబడినశతకములు గలవుగాని తెలుఁగులోఁ గృష్ణుని దివ్యమహిమానువర్ణనప్రాధాన్యశతకములు లేవనులోపము నీశతకము తీర్చుచున్నది. కావుననే యీశతకము భక్తజనములకుఁ బఠనీయముగ నున్నదని నుడివితిమి.

భాగవతాదిగ్రంథములలోనికథాంశములు శ్రీకృష్ణుని యమానుషకృత్యములు పద్యములం దభివర్ణించెనేగాని కవి తనకవితావిభవమును భావసమృద్ధినిఁ జూపుటకుఁ బ్రయత్నింపలేదు. మొదటిపద్యములోఁ బక్కనిసమాసభూయిష్ఠములగు వింత్యనియమములు గలవు. కవిత మృదుమధురముగా నున్నది. చాలపటకుఁ బద్యములలోనియంశములు పురాణకథలె గావున శతకమున ననుకరణము లంతగా లేవని చెప్పవచ్చును శ్రీరామప్రాముఖ్యము గల దాశరథిశతకమువలె నిది కృష్ణప్రాముఖ్యమగు భక్తిరసశతకము. కవి యెంతమెలకువగఁ బూర్తి చేసినను భక్తిరసోద్దీపమున నీశతకము దాశరథిశతకమునకుఁ దీసిపోయినను దక్కుఁగల శ్రీకృష్ణభక్తిశతకములకుఁ దీసిపోదని మాతలంపు.

నందిగామ.
1-6-26.

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శ్రీ ర స్తు.

# శ్రీవసుదేవనందనశతకము.



ఉ. శ్రీకలితోరువక్ష సరసీజదళాక్ష సమస్తలోకర, క్షా
కరణైకదీక్ష యళికాక్షబుధపక్షవిపక్షశిక్ష గో, పీ
కమనీయకుండలనవీనపయోధరచారుదక్ష ల, క్ష్మీ
కరపత్కటాక్షనతశీలవసూ వసుదేవనందనా 1

ఉ. రంగదరిప్రభంగ ఖగరాజవిరాజతురంగ భక్త
హృ, త్సంగ భవాంధకారసముదగ్రపతంగ సు
రారిపద్మమా, తంగ విదర్భజాహృదయతామర
సభ్రమమాణభృంగ స, ర్వాంగ కరీంద్రతాపపరి
భంగ హరీ వ... 2

ఉ. శ్రీకరుణానిధాన విధిసృష్టినిదాన ఘనోపధాన
స, ల్లోకసుఖప్రదాన మునిలోకతపఃప్రణిధాన
భక్తర, క్షాకరణైకతాన గతకామవితాన ఘనో
జ్జ్వలత్తటి, త్ప్రాకటదివ్యపీతపరిధాన హరీ వ.

ఉ. యాదవవంశభూషణ నిజాశ్రితభక్తజనానురాగ
ప్ర, హ్లాదవిభీషణాదికమహాజనరంజన వైరిభంజ
నా, శ్రీన సమస్తసద్గుణసుశీల యశఃప్రతిపాద
సజ్జనా, హ్లాదకశాంతరంగ దనుజారినుతా వ....

ఉ. నారద శారదాధిపసనందనవందితదాసభూతబృం,
దారక తారకామవదనా మృదువాదన తత్వ
బోధనా, నారదశారదాబ్జరుగనాదరణాంగ వి
లోకయాగకృ, ద్దారకతారకా ఖగరథాసు
కథా వ... 5

ఉ. రాజ ధరాదిసర్వసురరాజనుతాక్షరమంత్రరాజ
గో, రాజనిజేత రూపకపరాజితభవ్యమనోజతేజ
భూ, రాజశిరఃప్రకీర్ణమణిరాజితపాదసరోజ శౌ
ర్యరా, రాజ దరాత్యజేయ యుడురాజముఖా వ.

ఉ. రాజనిభాననా విహగరాజతురంగ దయాంత
రంగ గో, రాజ నిశేశమౌళిసురరాజసరోరుహ
మిత్రభీష్మరా, డ్రాజనుతా హరీ యసురరాజ
భయంకర భక్తశంకరా, రాజసహోదరీహృద
యారంజన శ్రీవ ... 7

ఉ. శ్రీకమలాసనాదిసురసేవితపాదసరోజ దివ్యవా,
సా కమలాధిరాజకలుషామయభేషజ యండజ
ధ్వజా, శ్రీకమలాభహస్త నుతిసేయుదు నెప్డ
నధోక్షజా హరీ, నాకమలామృతం బొసఁగనా
రతముఁగా వ... 8

ఉ. శ్రీధరభూమి వేంకటగిరి న్మదిరంజిలఁ బ్రాఁతకోట
నా, రాధితుఁ డౌచు శ్రీవరదరాజని పేరువహిం
చియున్న నా, నాథుఁడ వంచు నెంచితి ననాథు

నిం బ్రోవు శమాదిపుష్పసా, రాధనఁ జేసెదన్
వరదరాజ హరీ వ... 9

ఉ. నాకుజబాదరాయణుల నన్నయ భీమన కాళిదా
సులన్, బ్రాకటభక్తి మ్రొక్కి శివభక్తునిఁ దిక్క
నఁ బోతనార్యులన్, శ్రీకరవందనంబులను జిత్త
ముఁ దలపోసి భక్తిన, స్తోకత నిన్ను గొల్చె
దను సూరినుతా వ... 10

ఉ. సారసనేత్ర నీవిమలచారుచరిత్రము సేయఁ
బూని బల్నాళ్ళముగల్లు పద్యశతసంఖ్యను మీకు
సమర్పణంబుగా, సారెకునీదురూపగుణసన్నుతిఁ
జేసెదఁ జిత్తమందు సం, సారముఁ బాపవే దయ
ను సారమతీ వ... 11

ఉ ఆదిని సోమకుండు చతురాననవేదచయంబుఁ దె
చ్చియు, న్నాదత నంబుధిం జొరఁగ మాధవవాని
ఝషంబవై సురా, హ్లాద వధించి వేదనిచయం
బును బ్రహ్మకు నిచ్చినట్టి యో, వేదగవేషణా
మనుజవే శఠ నన్ వ... 12

ఉ. సౌధఫవార్ధమైఁ సురనిశాటులు కంధిని మందరా
ద్రిచే, సాధనఁజేయ నబ్ధి నది జారిన యోశర
ణార్థి కావవే, నాథ యనంగఁ గూర్మమయి నాఁ
డెముగా గిరిమోచి కాచి శ్రీ, నాథుఁడ వైతి
గాదె బుధవంద్య హరీ వ... 13

ఉ. భూమినిఁ జంకఁబెట్టుకొనిపోయిన దైత్యుని
హేమనేత్రునిన్, భీమముతోడఁ జంపి పృథివీ
స్థలిఁ గొమ్మున నెత్తినట్టి యో, తామరసాక్ష
యాదికిటి తాపసవందిత యోమురాంతకా,
కామునిఁ గన్నతండ్రి ననుఁ గావు దయన్ వ. 14

ఉ. మాధవ భీకరోగ్రపటుమాఢితయుక్త నృసింహ
రూప స్వ, ర్ణోదరుఁ జంపి నైజచరితోక్తులఁ బాన
ము సేయునట్టి ప్ర, హ్లాదునిఁ గాచినట్లు శరణా
ర్థినిఁ గావఁగదే మహాత్మ నీ, పాదము లెప్పు
డున్ దలఁతు బ్రహ్మనుతా వ... 15

ఉ. ఇంద్రుని రాజ్యలక్ష్మిఁ గొని యేఁగినదానవుఁ జేరి
గుజ్జువై, మంత్రశుభోక్తులం ద్రిపదమండలిదా
నముఁబొంది యంతవై. సాంద్రత నిండి యాబ
లి రసాతలికిం బడఁద్రొక్కి రాజ్యమా, యింద్రు
ని కిచ్చినట్టి జగదీశ హరీ వ... 16

ఉ. ధారుణిలోన రాజుల నుదారత యిర్వదియొక్క
సారి యొ, ప్పార వధించి రక్తమున మాన్యతఁ
దండ్రికిఁ దర్పణంబుఁ బ, ల్మారు నొనర్చి విప్రు
లకు మానుగ నిచ్చితి ధారుణిన్ మహో, దార
క రేణుకాతనయ దండము మా వ... 17

ఉ. తాటకఁగూల్చి శంకరునిధర్మముఁ ద్రుంచి ధరా
సుతాకళా, పాటవ మొంది యింద్రజుని భండన

కుందు వధించి వానరు, లోత్కటులుగూడ రావ
ణు సకూటముఁ జంపినరామ బ్రోవు నీ, చాటు
నఁ గింకరుండ నను శౌరి హరీ వ... 18

ఉ. రాముఁడనంగఁ బుట్టి ధర రాక్షసులం బడఁగొట్టి
యాత్రతో, నైమిశముం జొరంగ మునినాథు
లు సూతుఁడు దక్కలేవఁగా, నేమను నాక
మున్నతని నింకెఱఁగానడువక్ ప్రబోధచేఁ, బ్రే
మను జీవిఁ జేయవె హరీ ముసలీ వ... 19

ఉ. దానవకోటులం దునిమి దానవవైరుల నాదరిం
చి యీ, శానునకుక్ సుతీవ్రతరసాయకమై మ
ఱి మూఁడులోకముల్, ప్రూనికతోడ మోద
మును బూర్ణముఁజేసిన బుద్ధమూర్తి యో, మా
నధనాఢ్య యేలునను మన్ననతో వ... 20

ఉ. అశ్వముఖుండవై జనులయజ్ఞతఁ బాపి మహావి
భూతిమై, శశ్వదమోఘమై విబుధసౌఖ్యదమై
శ్రితసేవ్యమై మహా, శాశ్వతమైనజ్ఞానమును స్థా
పనఁజేసిన కల్కిమూర్తి యో, విశ్వధరా న
నుక్ మనుపవే కృపను వసుదేవనందనా. 21

ఉ. యానవవర్య మీనధులి యజ్ఞవరాహనృసింహ
వైదుషీ, వేదనిరూఢవర్ణి భృగువీర నరాధిప
రామ బుద్ధ సౌ, మోదవిశిష్ట కల్కిభవముల్

ధరియించినబాలకృష్ణ నీ, పాదుకవాహుఁడఁ
మనుపు భర్గనుతా వ... 22

ఉ. సంగరమందుఁ బుణ్యజనసంఘముఁ గోడి సుర ల్మ
హాత్ము ఖ, ట్వాంగునిఁ గూడి మోములను వాని
విరోధులు బాఱఁబోరి యా, సంగడికాని కాయు
వును పార్థతఁ దెల్ప నుహూర్తమందు ని, స్సం
గత ముక్తికిం జనఁడె జ్ఞానమునఁ వ... 23

ఉ గోపకులంబునందు మదిఁ గోరికదీరఁగ నుద్భవించి
యా, గోపవరాంగనామణులకోరికఁ దీర్చినముద్దు
కృష్ణ యో, గోపకులాబ్ధిచంద్ర నను గూర్మినిఁ
జేరఁగదీసి యేలుమా, కాపరివంచునమ్మితిని
గావఁగదే వ... 24

ఉ. ఆసురభామఁ బూతన జనాంతకగంసుఁడు వంప
నం దను, ద్భాసురగేహమందుఁ దనపాలచనుం
గుడిపింప దానిమాం, సాసువులన్నియుం గుడిచి
యాసురి వేగమె జంపినట్టి యో, శ్రీసనకాది
వందిత విరించినుతా వ... 25

ఉ. మూఁడునెలల్ చనంగ మఱి మోదముచేతఁ దృ
ణాచరాఖ్యనిం, గాడుపురూపునిఁ గగనగా
మినివై వధియించి యుర్వ్యోలం, గూడిన ప్రోడ
నీమహిమగుంఫనమెన్న దరంబె యేరికిఁ, నేఁడిదె
దండమయ్య కరుణింపఁగదే వసుదేవనందనా. 26

ఉ. పిన్నతనంబునందు మఱివీథులనాడుచునుండ నమ్మ
తో, మన్నుదినెన్ జనార్దనుఁడు మాధవుఁ
డంచు వచింప నర్భకుల్, మన్ను నదేలతింటివిటు
మాధవయన్న చరాచరాండసం,పన్న జగంబుఁజూ
పవె స్వవక్త్రమునన్ వ... 27

ఉ. గోపులఁగూడి కానలను గోవుల మేపుచునుండ
బ్రహ్మయా, గోపులగోవ్రులన్ మఱుఁగఁగూర్చిన
తత్క్షణమందు నీవ యా,రూపము లెల్లఁదాల్చి
మునురూఢినటింపఁగ నీపదాబ్జికిన్,దాపురమిచ్చి
మ్రొక్కి చనె ధాత హరీ వ... 28

ఉ కొండికనాఁడు గోపకులఁగూడి వనంబుల నాల
మేపుచున్, గండనిఁ గాలిరూపగుని గండఱుఁ
గాండమునందు దూక నీ, దుండగ మవ్విధం
దెలిపి తోడ్కొనిరా ఘణిఁ ద్రోలి యంతఁ గ,
వ్వుండువుగాఁ గనంబడవె భవ్యగుణా వ... 29

ఉ. కాననమందు గోపకులు గంజదళేక్షణ కారుచి
చ్చుచేఁ, బ్రాణములన్ మదిన్ విడచి రావము
తోడఁ గృపాబ్ధి కావవే,దీనులమంచు వేఁడఁ బటు
తీవ్రగతిన్ శిఖి మ్రింగినట్టి యో, దీనపరాయణా
మనుపుదీనుఁడ నో వ... 30

ఉ. వల్లవకాంతలెల్లమునువస్త్రచయంబును విప్పిపెట్టి
సం, ఫుల్లసరోజవాహిని సుమోదముతో జల

కేళులాడ నా, గొల్లలప్పుట్టముల్ నగుచుం గొంచు
కపో మఱివారు వేఁడ నీ, వుల్లసమాడి యీవె
పురుషోత్తమ యో వ... 31

ఉ. మానవజన్మమెత్తి యతిమాయల బాలురఁగూడి
ప్రీతితోఁ, గానలయందు గోవులను గాచుచు
వారికి లీలఁ జూపుచుఁ, మానుగ విప్రభార్య
లకు మాన్యత మోక్షమొసంగినట్టి యో, దీనశ
రణ్య యేలుము సుధీవినుతా వ... 32

ఉ. వాసవుఁ డల్గి గోపకులపై మఱి రాళులవానగుర్వ
నా, యాపముగల్గి గోసహిత యాదవులందఱు
నిన్ను వేఁడ నా, యాపము లేక కొండను రయం
బునఁ గేల నమర్చి గొల్లలు, ల్లాసము వొందఁ
బ్రోచితి విలాసముఖా వ... 33

ఉ. నందుఁడు సార్ధరాత్రి యమునానదికింజని స్నాన
మాడ నా, నందుని దైత్యులు వ్వరుణనాథునిస
న్నిధిఁ జేర్ప నీవు నా, నందముతోడఁ బోవ మఱి
యాతఁడు బూజలొనర్పఁ దృప్తుఁడై, నందుని
దోడి తెచ్చితివి నాథ హరీ వ... 34

ఉ. నీలపయోధరం బనఁగ నీతనువొప్పగు నందు
నిందు నిఁక, బోలెడునీదు మోము నళిమానినక
ల్వలఁ గండ్లఁ జూడ గో, బాలురు వారలఁ దమిని

బాల్పడకుం గళలూని నిల్పి వే, యేలిననాదుతండ్రి
హరి యీశ్వర యో వ... 35

ఉ. దుర్మతియైన కంసుఁడు వధూగురుబాలపనాశకృ
త్యముల్, పేర్మిని జేయువాని హరి భీకరనాగము
బోలెఁ జంపి త, త్పట్టణ భూమిఁ దాతకిడి సౌఖ్య
ము నేసిన చిన్నికృష్ణ యో, నర్మదమందహాస నిను
నమ్మితి శ్రీ వ... 36

ఉ. శ్రీపతి నీవు రాముఁడును శిష్యసుచేలసమేతుఁ
డైన సాం, దీపునియొద్ద శాస్త్రసమితిన్ సుమ
తిన్ గణుతించి నేర్చి య, జ్ఞాపితులైనభంగి నను
జ్ఞానకళాపరిపూర్ణుఁ జేయువే, శ్రీపృథివీపతి వరద
శిష్యుఁడ నో వ... 37

ఉ. తాపవిదూరముల్ గురుపు తన్మృతపుత్త్రు సజీవిఁ
జేసి సం, తాపముదీఱఁ దెచ్చి గురుదక్షిణనిమ్మన
వల్లెయంచు నా, పాపనిఁ గంధి దైత్యయమపట్ట
ణముల్ చని రోసి తెచ్చి సాం, దీపున కిచ్చి
మ్రొక్కినసుధీర భళీ వ... 38

ఉ. నారదచోదితోగ్రయవనప్రభుఁ డాడి బురిన్ముసుంగ
నీ, పౌరులద్వారకం బనిచి వాఁడుచుఁ దోకొని
వాని భూమిభృ, ద్ఘోరగుహన్ సనిద్రు ముచి
కుందునిచేఁ జెడఁజూచి యాబుధో, ద్ధారున కిచ్చె
ముక్తి విబుధస్తుత యో వ... 39

ఉ. బాలవయస్సునందు నినుబాయక నందునిచెల్లె
లిచ్చతోఁ, బాలనఁజేసి పెంచి పరిపక్వవయస్సున
నిన్నుఁజూచి గోఁ, పాలకనన్నుఁబొందుమనఁ బాల
నఁజేసితి రాధికాసతిన్, లోలతనోజనార్దన త్రిలో
కనుతా వ... 40

ఉ. పన్నగవైరి యింద్రునిసభాసదులంపఱిగెల్చి యా
సుధన్, గొన్నవిధాన భూపతులకోటులగెల్చి
రమాలలామఁ గై,కొన్న మహానుభావ ననుఁగారి
మితోఁ గృపఁజూడుమయ్య యా.పన్నుఁడనయ్య
దీనజనపాల హరీ వ... 41

ఉ. ఏమనివిన్నవింతు నిఁకనేమివలంచెద నీమహత్త్వ
ముల్, బామరు లాడునింద విని పాపుకొనన్
గుహఁజొచ్చి బల్మిభా, మామణియున్ శమంత
కము మానుగఁదెచ్చినయట్టికృష్ణ యో, త్సామ
రసేవ్య కైకొనవె జాంబవతిన్ వ... 42

ఉ. దేవజగన్నివాస జగతీధవ దూరితినంచు భీతితోఁ
గావుమటంచు నిన్నుజూఁడు గానుకనిచ్చెను సత్య
భామ నీ, వావనితన్ గ్రహించి మఱి యాతనిఁ
గాచినభంగి కావు మో, పావనమూర్తి యోప
తితపావన నన్ వ... 43

ఉ. ఇందునిభాననా సురలనింపుగఁ బ్రోచినప్రోఢ దేవ
కీ, నందన గోపికాహృదయనందన లక్ష్మణ భాను

పుత్రిఁ గా, లిండనిఁ బెండ్లియాడి మురళీప్రియ
గానముఁ జేసితౌర గో, విందనమోయటంచు
నిను వేఁడెద శ్రీవ... 44

ఉ. రాధను నల్లుఁడై యిలను రమ్యముతోడ వివాహ
మొంది యా, యాదవవంశ మెల్ల భువి ఖ్యాతి
గఁ జేసిన చిన్నికృష్ణ యో, మాధవ కేశవా
యసురమల్లురఁ గూల్చిన నిన్ను గొల్తు నీ, పాద
ములన్ మదిన్ దలఁతుఁ బార్థనుతా వ... 45

ఉ. నారదమౌని దివ్యసుమనంబు సమర్పణఁ జేయ
రుక్మిణీ, నారికి నీయఁగా నతఁడు నవ్వుచు భామ
కుఁ దెల్ప సత్యహృద్దారుఁడ వైతివా యనుచు
దూరిన నాకుల నొడ్డి పారిజం, బూరఁట దెచ్చి
యీవె శ్రుతిసూక్త హారీ వ... 46

ఉ. దానవరాజపుత్రి వనితామణి దెల్పఁగఁ జిత్రరే
ఖయున్, మానినిఁ గూడియున్న సుకుమారుని
నెత్తుకపోయి యాయుషా, మానినికిచ్చె నాతి
యును మారుని కేళిని కూడియుండఁగా, బాణుఁ
డు కోపగించుకొని బాలుని బ్రాదునఁ గట్టివైవ నా,
దానవుబాహులం దునిమి దైత్యుల శంకరు గెల్చి
తెచ్చితె, మానినినిం గుమారకునిమాధవ శ్రీ వ.

ఉ. ఈవసుధన్ మదంబునను నీకుఁడ నేనని క్రూరభా
షలన్, నీవలె చిహ్నమూనిన యనీతునిఁ బౌండ్ర

కవాసుదేవునిన్, గావరమెల్లఁ బోనడంచి కయ్య
ము నవ్వధియించినట్టి యో, దేవర నన్నుఁ బ్రోవ
వుగదే తగదే వ... 48

ఉ నారదుఁ డొక్కనాఁడు నళినాక్ష త్వదీయసుదర్శ
నార్థమై, ద్వారకకుం జనంగ సురతన్ జరియించి
పదారువేలగో, నారులతో సమాఖ్యతను నైజ
సుచాతురిఁ జేసినట్టి నీ, చారువిలాసముల్ నుడు
వ శక్యుఁడనే వ... 49

ఉ. శ్రీపతి మున్ను ధర్మజుఁడు చిత్తమునం దలపోయ
వేగ నా, భూపతిరాజసూయమును బూర్ణముఁ
గాఁగ నొనర్చి ధర్మపు, ధ్వీపతి సేయుపూజఁగొని
ధీరత సంతసమందినట్టి భ, ద్రాపతి బ్రోవుమా
ద్యుమణిధామ హరీ వ... 50

ఉ. నీవును భీమపార్థులును నెమ్మది భూసురవేష
మూని యా, భూవిభునాజ్ఞచే మగధభూవిభు
నిన్ రణభిక్ష వేఁడి యా, కావరపోతుమాగ
ధునిఁ గయ్యమునన్ వధియింపఁజేసితో, దేవ
దయానిధీ గుణనిధీ మృదుధీ వ... 51

ఉ. మానధనుండు ధర్మజుఁడు మాన్యతఁజేసిన రాజ
సూయమునన్, బూనికఁదీర్చి భీష్మకురుపుంగవు
లందఱు చూచుచుండఁగా, మానవనాథుఁడైన

శిశుపాలునిఁజంపిన యట్టిజెట్టి యో, దానరణ
ప్రవీణ గుణధామ హరీ వ... 52

ఉ. పాండవమధ్యముండు నినుఁ బ్రార్థనఁజేసిన సూ
తుఁడై మఱిక్, ఖాండవముం దహింప ఘనగాం
డివచాపము వహ్నియీయ నా, ఖండలు గర్వ
ముంజెఱచి కయ్యమునక్ విజయంబు నిచ్చితో,
చండతరప్రకాశ గుణశాలి హరీ వ... 53

ఉ. బాలసుహృత్కుచేలునికి భాగ్యములిచ్చితివంచుఁ
గుబ్జకుక్, లాలనఁజేసి రూపము విలాసముఁజేసితి
వంచు ధర్మజుం, బాలనఁజేసి రాజ్యవిభవంబుల
నిచ్చితివంచు రుక్మిణీ, లోల నుతింతు నిన్ను మది
లో నెపుడుక్ వ... 54

ఉ. పన్నగశాయి నీవు మును పార్థుఁడు యాత్రకు
వెళ్లివచ్చినం, దిన్నఁగ ద్వారక న్నిలిపి తెంపునఁ
జెల్లెలి నిచ్చిపంప నీ, యన్న హలాయుధుండు విని
హాయని యోర్వక కోపగించినక్, మన్ననఁజేసి
తీర మతిమంత భళీ వ... 55

ఉ. శంభువరంబుఁబొందియు నృశంసతఁ దచ్ఛిరముక్
స్పృశిష్టపం, రంభ వృకాసురు న్నిజకరంబుల
ప్పాతనుజేయఁ గూల నా, శంభుని ప్రాణముల్
నిలిపి సన్నుతికెక్కిన కృష్ణ దేవకీ, డింభక కావు
కాంచనపటీసుకటీ వ... 56

ఉ. భూప్రసూనుండు ధర్మజుఁడు వొప్పున హాస్తిపు
రంబుఁ జయ్యనం, జేరి ముదంబునంది కలసేమ
ములారసి బుద్ధిజెప్పినన్, గౌరవనాథుఁడున్ వినక
క్రౌర్యముఁ జూపఁగ విశ్వరూపమున్, వారికిఁ
జూపినట్టి భగవంత హరీ వ... 57

ఉ. కౌరవరాజధానికిని గార్యముసంఘుటనంబు నేయ
ఢీ, సారుఁడు భక్తుఁడౌ విదురుసద్మముఁజేరి
భుజించి ప్రేమతోఁ, గోరినగోర్కెలిచ్చితి వకుం
ఠితచిత్తము నీకునిచ్చితిన్, నైరణనేమియిత్తువో
వశంకర యో వ... 58

ఉ. నీరజనాభ నిన్ను మునునెయ్యముతోడ ధనంజ
యుండు వే,సారి రణాంబులోఁ దనకు సారథి గా
వలెనంచు వేఁడఁగా, సారథివై కిరీటికిని జాతురిఁ
జూపినసార్థసారథీ, నీరుచిరాంఘ్రిపాళి నను ని
ల్పఁగదే వ... 59

ఉ. పార్థుఁడు దొల్లి యుద్ధమున స్వాంతవిషాదముఁ
జెంద మోహాత్తా, నర్థముఁబాప యోగగతి నం
తయుఁ దెల్పి సువిశ్వరూపముం, బ్రార్థనఁజేయఁ
జూపిన మహాత్మ గురుండనిగొల్తు సర్వదా,
యర్థినిఁబ్రోవు శిష్యసుజనార్తిహరా వ... 60

ఉ. వారిజబాంధవుం డపరవారిధిఁ గ్రుంకకమున్న
సైంధవుం, జేరి శిరంబుఁద్రుంతునని చేసెప్రతిజ్ఞ

ధనంజయుండు నీ, వారవిబింబముఁ మఱి
యవారితచక్రముగప్పి సైంధవుం, జేరి వధింపఁ
జేసితివి శీఘ్రమునన్ వ... 61

ఉ. కౌరవకోటినెల్ల సతికౌశలమొప్ప వధింపఁజేసి
యా, కౌరవరాజ్యమిచ్చితివిగా కరుణించి యజా
తవైరికిన్, గౌరవమైనకీర్తి జయగణ్యత గాండివి
కిచ్చినట్టి యో, శౌరి దయాపయోధి గుణశాలి
హరీ వ... 62

ఉ. ద్రౌణి యపాండవంబుగను బ్రహ్మశిరంబను నస్త్ర
మేయఁగాఁ, బ్రాణభయంబుగాఁ గవియ బాండ
వరక్షణఁజేసియుఁ గదా, పాణివిదైయై తదస్త్రపరి
బాధితు నార్తుని నుత్తరోదరుం, ద్రాణనఁ జేసి
నట్టి సువిధాన హరీ వ... 63

ఉ. భాసురసూనుకై పతితపావను నీశు సమాధి
నుండ ఘుం, టాసురుఁడీశుఁగొల్చి యమృతార్థము
వేఁడఁగఁ గృష్ణుఁ డీగలం, డాసనుఁ గోరుమన్న
నిను నార్తి స్మరింపుచుఁ గాంచి యర్చనో, భూసు
రప్రేతమియాయ నగి భూతపతి న్నవ్వుశుఁజేసి సా
త్వికా, భ్యాసము ముక్తినిచ్చిన దయాంబునిధీ వ.

ఉ. దేవతలన్ రిపుల్ గెలువ దీనతతో నినువేఁడ
వారికిన్, దావకవర్మమంత్రమును దక్షమ్ముగా
నెఱిఁగించి యంతఁ బ్రా, గ్దేవగణంబుఁ బోరున

వధింపఁగఁజేసిన దివ్యమూర్తి నీ, సేవకసేవకుండఁ
బ్రియశిష్యుఁడ నో వ... 65

ఉ. కాండములన్నియుఁ స్వజఠరాంతరమందు ధరిం
చు జెట్టి యీ, పిండమునందు జీవతను జేర్చి
వహించి పిపీలికాదికా, ఖండలదేహము ల్ఫలిత
కాంతులఁజేసి రమించుప్రోడ యో, ఖండితదా
నవా జడుఁడఁ గావఁగదే వ... 66

ఉ. దేహవరత్రయంబునను దృశ్యపదార్థసమూహము
ల్మహా, మోహతనూర్ణనాభిక్రియ మోదముచే
సృజియించి బద్ధుఁడై, దేహివిగాఁ గనంబడుచుఁ
దీక్షితమంబును జేయు నీశ నన్, దేహవిహీనుఁ
జేయవె సుధీరనుతా వ... 67

ఉ. సారసనాథ దుర్మల మసారకదుఃఖమయస్వరూ
పసం, సారపయోధి నుత్కటరసక్రిమిజాలగతా
గతాదిసం, చారమువోలె భ్రాంతిలయజన్మము
లందుదురయ్య నిర్దయా, కార పరాత్మ నీదు
విముఖత్వమునన్ వ... 68

ఉ ఉద్ధవుఁడేఁగుదెంచి మఱియొక్కటఁజేర్ సఖియం
చు వేఁడ శ్రీ, బుద్ధసుమార్గముం దెలిపి భూరికృ
పం గరుణింపలేదె నా, బద్ధతఁ బోవఁద్రోచి ననుఁ
బాలనఁజేయఁగదే పరాత్మ యా, యుద్ధవుమా
డ్కి బ్రోవు మొడయుండవుగా వ... 69

ఉ. శ్రీవిధివందనా వరద సేవిత యోగ్యుఁడవంచు
నెంచి నా, యావరణాదులన్నియును నావలఁ
ద్రోచి త్వదీయరూపునన్, భావము నిల్పినాఁడఁ
భవబంధముఁ బోవఁగఁజేసి వేగమే, యేవిధిఁబ్రో
తువో యభవ యుత్తతిశన్ వ... 70

ఉ. కాలునికింకరు ల్మదసకల్మషచిత్తవిధేయుఁడైన
నా, పాలికివచ్చి దుఃఖమయబాధలు పెట్టెదరంచు
నిప్పుడే, యేలికవైననీభజన మింపుగఁజేసెదనయ్య
యయ్య నీ,బాలుఁడనయ్య వేఁడెదను బార్థపభావ.

ఉ. బాలురతప్పులన్ గురుఁడు బాలనఁజేసినభంగి నా
దుపా, పాలిని బాఱఁద్రోలి కృపఁ బాలనఁజేయఁ
గదే మహాకృపా,శాలివటంచు నెంచి నిజబోధర
సోపమదివ్యనామముల్, గ్రోలితి దైత్యఖండన
త్రిలోకనుతా వ... 72

ఉ. పావన మైన మీకథలు భాగవతు ల్పఠియించు
చుండఁ బల్, పావనమూర్తి వంచు నినుఁ బల్మ
ఱుఁ జిత్తమునందుఁ గొల్చెదన్, శ్రీవర నాదు
జన్మమున సిద్ధి వహింపఁగఁజేయ మ్రొక్కెదన్,
గావఁగదయ్య యీశ విభు కంసహరా వ...73

ఉ. సుందరమైన నీభజన శోభను గాంచ సుశక్తిలేని
వా,రందఱుజన్మదుఃఖనిచయాంబుధియందు నిమ
గ్నులౌచు నెం, దెందు సుమార్గ మేగద సురే

శ్వర దాసుఁడఁ బ్రోవు నన్ గృపా, కంధి
నితాంతశాంత నరకాంతక యో వ... 74

ఉ. నాగధరాదిదేవతలు నారదపర్వత దివ్యమౌను
లున్, యాగముసేయుకర్మఠులు వ్యాసముఖార్య
మహానుభావులున్, యోగిశిఖామణు ల్సకవు
లూహఁగలంగి భవత్పదాబ్జసం, యోగముఁజెంద
లేరు శుకయోగినుతా వ... 75

ఉ. అజ్ఞుఁడ మూఢుఁడన్ జడుఁడ నర్థవిహీనుఁడ దుష్ట
చిత్తుఁడన్, బ్రాజ్ఞత లేనివాఁడ బహురాగవశీ
కరుఁడన్ శఠుండఁ గ్రూ, ర్యజ్ఞుఁడ నన్ భవద్భజన
రక్తుని.జేసి యిఁకైనఁ బ్రోవు స, ర్వజ్ఞ కృపా
సముద్ర భవభంజన యో వ... 76

ఉ. శ్రీరమణీమనోరమణ శ్రీహరి కృష్ణ మదీయపాప
ముల్, బారఁగఁదోలి నాడుమది బాయకయుం
డెదవంచు నిన్ను వే, సారితిఁ గావవే దయను
సంస్తుతిఁ జేసెదనయ్య వేగమే, భూరిదయానిధీ
సుగుణపూజిత యో వ... 77

ఉ. సారసనాభ యార్యజనసన్నుత నీపదసేవఁజేసె
దన్, గోరినకోర్కులిచ్చి ననుగొబ్బున నేలు ముపే
షుఁజేసినన్, గౌరవమైన నీమహిమకౌశలమెల్ల
హారించుఁ గాన నే, మారకుమా యశస్సువిను
మా కనుమా వ... 78

ఉ లోకములెల్ల నీకడుపులోన జనించె నటంచు బ్రు
ధీయుతుల్, శ్రీకమలాసనాదిముని సేవ్యులుసన్ను
తి కెక్క లేదె ము, న్నీకమనీయరూపమును నిల్పి
మనంబునఁగాదె దేవ యే, కాకిని నన్ను నేలి
దయఁ గావఁగదే వ... 79

ఉ. చేసితినయ్య పాపములు సేసితిఁ బెద్దలనెల్లహాస్య
ము, జ్జేసితి నన్యభామలను జేరి సుఖించినవారి
పొందు నేఁ, జేసితి నన్నియు న్మఱచి చిక్కులు
పెట్టకుమయ్య యయ్య నీ, దాసుఁడనయ్య
యార్తజనతాపహారా వ... 80

ఉ. పాపము లెన్నిఁ జేసితినో పంకరుహాక్ష మదీయ
చిత్తము, న్నీపదయుగ్మమందునికి నిల్వదు కర్మ
వశంబునన్ మహా, పాపములందుఁ జొచ్చునికఁ
బాలనఁ జేయఁగదే మహాత్మ నా, పాపము లెంచ
కోవరద భక్తనుతా వ... 81

ఉ. ఆదరమొప్ప మ్రొక్కెద గదాగ్రజ సంసృతిఘోర
సాగరం, బీఁదఁగలేక విశ్రమవిహీనతఁ జెందెద
నయ్య యీవృథా, వాదులఁ జేరనయ్య యతి
పామరుఁడయ్య శరణ్యుఁడయ్య యం, భోదని
భాభయంబుడిపి బ్రోవఁగదే వ... 82

ఉ. శంకలనన్నియు న్విడచి శంకరసాక్షిగ నన్యదేవ
తల్, పొంకముతోడఁ బోవిడచి పొందుగ

నీభజనంబు సేతు నా, వంకకువచ్చి యూఱటలు
వంచనలేకవచించి బ్రోవు నీ, కింకరుఁడయ్య దండ
మిదె కృష్ణహరీ వ... 83

ఉ. ధాతవటంచు నీవిమల తారకమంత్రము సర్వలోక
కవి, ఖ్యాతమటంచు నెంచి వినయంబున జోతలు
సేసి యెప్పుడున్, ధాతను గన్నతండ్రి నినుధ్యా
నము సేసెదఁ గృష్ణ వేగమే, యీతఱి నేలుమా
దయను నీశ్వర యో వ... 84

ఉ. ఓపరమాత్మ యోవరద యోకమలాసనవంద్య
పాద గౌ, రీపతి బాదరాయణ కరిప్రముఖస్తుత
దివ్యనామ ల, క్ష్మీపతియంచు భక్తులకు క్షేమము
నిచ్చెదవంచు వేఁడెదన్, బాపుఁడ నీదుభక్తుఁ
డను బాపహరా వసుదేవనందనా. 85

ఉ. ఏగతిఁ జేరవచ్చు మది నెప్పుడుజూతును నీవిలాస
మున్, రాగము ద్వేషమెప్పుడు హరంబగు
నెప్పుడు మోహ లోభముల్, రోగము వాసి
పోవునను రోయక బాయక బ్రోవుమయ్య నీ,
వేగతివంచు నమ్మితిని వేగమె రా వ... 86

ఉ. ఎన్నిభవంబు లొందితినొ యెన్నిప్రతాపము
లొందినాఁడనో, సన్నుతికెక్కు నీభజనసౌఖ్యము
నిప్పుడు కాంచినాఁడ నా, యన్న క్షమింపుమన్న

శరణాగతుఁడన్న ననుం గృపన్ సదా, మన్ననఁ
జేయుమన్న హరి మాధవ యో వ... 87

ఉ. శ్యామలవర్ణ నాదుమదిసత్వముతో నినుఁబూజఁ
జేసెదన్, గోమలమైన మీపదముఁ గోరి సదా
భజియించుచుండెదన్, దామరసాక్ష నీవిమల
తారకమంత్రమునిచ్చి వేగ ని, ష్కామునిఁ జేయు
మా త్వరితకాలమునన్ వ... 88

ఉ. నెట్టితి వైరివర్గముల నేర్పున మీగుణవర్ణనంబు
చేపట్టితి యుష్మదంఘ్రి గురువర్యుఁడవంచుఁ
ద్వదర్చనాన్యమున్, మెట్టితి వేదశాస్త్రవిధి నేర్ప
రినై భవదన్యమార్గముల్, గొట్టితిఁ గాపుమా
వరద గొబ్బున నన్ వ... 89

ఉ. కర్మము లెన్నిఁ జేసినను కంజదళాక్ష వికారదూ
రమై, శర్మదమైన మీస్మరణఁ జారుమునంబునఁ
జేయునట్టి దు, ష్కర్మరుఁడైన సద్గతినిఁ గాంచు
నటండ్రు త్వదంఘ్రియుక్తుఁడేఁ, గర్మవిభేదసద్గతిని
గాంచఁడొకో వ... 90

ఉ. వారిజలోచనా వినుము వారణమున్ గృపఁ గావ
లేదె పా, కారిసురాదులం గృపను గావఁగలేదె
భయంబుఁబాపి వే, మారుభజించుభక్తుఁడను

మన్ననఁ బోషణఁ జేయరాదె నన్, శౌరి కృపా
నిధీ ప్రబలశౌర్యహారి వ... 91

ఉ. శ్రీధవ మున్ను నీకృపఁ గరిప్రభు ద్రౌపది వాయు
సాధమున్, యోధవిభీషణున్ శబరి యోగికు
చేలుని భీష్మపార్థులన్, మాధవ నారదాదిముని
మాన్యులఁ బ్రోచినపుణ్యమూర్తి న, న్నీధరఁ
బ్రోవుమా కరుణ నీశ హారీ వ... 92

ఉ. భూమి ననేకజన్మములఁ బూనితి నోర్వను జన్మ
మెత్తనీ, నామకథాసుధారసమునాలుకఁ గ్రోలితి
సేవఁ జేసితిన్, వేమఱు వేఁడికొంటి నను వేదనఁ
బెట్టకుమంటి నీయవే, ప్రేమను నిత్యమైనపదవిన్
గృపతో వ... 93

ఉ. దోషముపేరి రుగ్మతకుఁ దోయజనేత్ర త్వదం
ఘ్రిభక్తిసి, ద్ధౌషధమున్ భుజింపఁగ నిరామయ
దివ్యపదంబు నొంది సం, తోషము జెందితిన్
మనుపు తొందరఁ బెట్టకుమయ్య పాపని, శ్శేషతఁ
జేయుమయ్య నిజసేవకుఁడన్ వ... 94

ఉ. భుక్తియు భక్తియున్ మఱియు భూరికటాక్ష
ముచేత ముక్తియున్, శక్తుఁడవంచు నిచ్చుటకు
శైశవకాలమునుండి కొల్తు నా, రిక్తతఁ బాఱఁ

దోలి బహూరిక్షునిఁజేసి యిఁకైన బ్రోవవే, భక్త
మనోభిలాషద శివస్తుత శ్రీవ... 95

ఉ. ఏలర జాగుఁజేసెద వదేలర నీవు కృపారసంబు
తో, నేలవె మూడులోకముల నేలవె యార్యు
ల గోపబాలురన్, బాలుఁడ నీకు మ్రొక్కెదను
బాగుగ బ్రోవవె గోపకామినీ, లోల హరీ య
టంచు మదిలోఁ దలఁతున్ వ... 96

ఉ రార రమావినోద వినరా సుగుణాకర కోటి
మన్మథా, కార సురేంద్రవంద్య యరిఘాతుక
పాండుసుతోపకార రా, రా రవికోటిధామ
రణరంగభయంకర గోపికాన్వయా, ద్ధారక న
న్నేలుమి యుదారమతిన్ వ... 97

ఉ. కుంజరునేలి కుంజరునిఁ గూలిచి వానరునేలి వా
నరున్, భంజనఁజేసి యండజునిబండియు నండ
జుఁ జెండియున్ ధరన్, రంజనఁజేసియున్ ధరను
రాళులవానకుఁ గేలనెత్తియున్, సంజయు నేలి
నట్టి గుణసాంద్ర హరీ వ... 98

ఉ. ఎన్నిక లెన్ననంటి మఱియొగ్గు లసత్యము లాడ
నంటి సం, పన్నత లేదటంటి పరభామలపొందులఁ
గూడనంటి యా,పన్నుఁడనంటి నీవిమలపాదుక

సేవనుజేసెదంటి నే, నెన్నివచించినఁ గరుణనేల
వహో వ... 99

ఉ. అండజకాండుఁ డార్తసుజనార్తివిఖండుఁడు దరి
ప్రఖండకో, దండకళాప్రచండగసుదర్శనవర్తికిఁ
గృష్ణమూర్తికిన్, రెండవసాటిదేవుఁ డిఁక లేఁడ
నిసాటెద భద్రనెక్కి బ్రద్ధంషడఢాండఢాండ
నినదంబుల శ్రీవ... 100

ఉ. పూనికతోడఁ జేసితిని పూర్తిగ నుత్పలవృత్త
మాలికన్, దీనిధరించి నాదుమది దీనతఁబాపి
విముక్తినీయవే, దీనదయాళు కృష్ణ జగతీధవ
మాధవయంచు వేఁడెద, న్సానకనారదాదిముని
సన్నుత శ్రీవ. 101

ఉ. శ్రీలలితంబునైనకృపచేఁ గరుణింపుము శీలమైన
వె, ల్లాలసగోత్రజాతుల విలాసముతోడ మదీ
యవంశముం, బాలనఁజేసి తద్భవుల బంధువు
లన్ దిలకించి బ్రోవుమా, శ్రీలలనామనోంబుజ
వశీకరణా వ... 102

ఉ. శ్రీరమణీయమైనకృపచేతను బ్రోవుడు నాదుమి
త్రులన్, వారిని వారివారి మఱివారిని జేరినవారి
నెప్పుడున్, భూరివివేకసంపదసపుణ్యసముక్తులఁ
జేసి యేలుమా, భూరిగుణాఢ్య వేఁడెదను పూ
జ్యపదా వ... 103

ఉ. ఆగమవేద్య దీనసుజనాశ్రిత మన్నవలక్ష్మణార్య
వి, ద్యాగురువర్యశిష్యుఁడ గదాగ్రజ సుబ్బమ
యాదినార్గకుఁడన్, శ్రీగుణశీలపుత్త్రుఁడను శ్రీధ
వ రంగయనామధేయుఁ డన్, బాగుగఁ గొల్చె
దన్ మనువు భర్గనుతా వ... 104

ఉ. శ్రీపతి నీకు వందనము శ్రీలలనామణియైనలక్ష్మి
కిన్, గోపసతీలలామలకు గొబ్బున మ్రొక్కులు
దాసదాసుఁడన్, నాపతివంచు నమ్మితిని నామది
వాంఛలుదీర్చి కావుమా, పాపినటంచు నెంచకు
మపారకృపా వ... 105

ఉ. మాధవ నీకు నిత్యశుభమంగళ మెప్పుడు నీదు
భార్యకు, రాధకు సత్యభామకును నందకశా
ర్ఙ్గసుచక్రశంఖకా, మోదకికిన్ శుభంబులగు
మోదముగల్గు ఫణీంద్రవైరికిన్, యాదవవంశ
భూషణ మహాత్మ హరీ వ... 106

కందగీతకవినామగర్భిత ఉత్పలమాలా-శైలబంధము.

శ్రీశమనంజనా ఖగహారీ రమణీయసుఖప్రదాయి
రా, ధాశుభదాయకా సుజనతత్యభయంకర
సూరిరక్షణా, శ్రీశమికల్యపో హరవిరించమ
నఃకుముదాబ్జవిష్ణు స్వా, మీ శరణాగతద్విపకు
లేశనుతా వ... 107

ఉ. ఏవసుదేవనందనునియింగిత మౌదలఁ దాల్తు రెల్ల
వా, రావసుదేవనందనునియాజ్ఞ రచించినయుత్ప
లంబులన్, భావనఁజేసిన న్వినిన వ్రాసిన వారి కభీ
ష్టసంపద, ల్పావనము క్తినిచ్చు దయ భవ్యుఁడు
గృష్ణుఁడు సుస్థిరంబుగన్. 103

సంపూర్ణము.

---

# పీ ఠి క.

ఈశతకము రచించినది రావూరి సంజీవకవి. ఈయన పలుగ్రంథములు రచించినట్లుఁ దెలియుచున్నదిగాని యం దొక్క వసుదేవనందనశతకము మాత్రము లభించినది. రుక్మిణీపరిణయము సంజీవకవి రచించి కర్తృత్వము కొప్పర్తి నరసకవి కారోపించినటు లొకకథ కల్పించిరిగాని యది సంజీవకవికృత మన వీలులేదు. ఈకవి గుంటూరుమండలమునందలి రావూరు నివాసి. సాంఖ్యాయనగోత్రుఁడు. ప్రథమశాఖనియోగిబ్రాహ్మణుఁడు. ఈశతకమునందలి గుణబాణగతిచంద్ర అనుపద్యమువలన వీరనారాయణముకుందశతకము శా. శ. 1653 సరియగు క్రీ. శకము 1731 న రచించినటుల నిశ్చయమగుచున్నది.

ఈకవి సంస్కృతాంధ్రములందుఁ గవితఁ జెప్పగలవాఁడెగాక జ్యోతిశ్శాస్త్రమునందుఁగూడఁ గుశలుఁడు. సంజీవకవి భువనగిరియందు విద్యనేర్చి కుశలుఁడై కొలనుపాక కేఁగి గోపరాజురాయనామా

త్యుని గలసికొని తనకవితచే నాతని నలరించి చెంత నున్న పాదలో వీరనారాయణ విగ్రహ ముంట దెలిసికొని పద్యములఁజెప్పి ముందునకు రప్పించె నని చెప్పుదురు. మహమ్మదీయవిప్లవసమయమున స్థాని కులు వీరనారాయణవిగ్రహమును కంపలలో దాఁచఁగాఁ బిదపఁ దనపలుకుబడి నుపయోగించి రాజ సహాయమున సంజీవకవి యుద్ధరించె నని గ్రహింప నగును. వసుదేవనందనశతకము చంపకోత్పలమాలి కలతో మనోహరముగా నున్నది. శాకమూరి బుచ్చ నమంత్రి ప్రోత్సాహమున దానిని రచించినటులఁ గవి చెప్పికొనియున్నాఁడు. వీరనారాయణ ముకుందశత కము గునుగుసీసములతో నలరారుచున్నది. తిక్కన సోమయాజిసీసములవలె నిండలిపద్యములు వచనము వలెనుండి భావసమృద్ధిచే నలరారుచు పఠనార్హ ము గానున్నవి. ప్రతిపద్యము చివరను మనోహరమగు నంత్యనియమము గలదు.

కొలనుపాక యనునది సుప్రసిద్ధమైన క్షేత్రము. తరువాత పశ్చిమచాళుక్యులలో నొకశాఖవారికి రాజధాని కాకతీయులకాలమున శైవులకు నావల

వెలమవీరులకాలమున వైష్ణవులకు నీక్షేత్రము వశ
మయ్యెను. కొలనుపాక హైదరాబాదునకు బెజవా
డనుండి పోవు నినుపదారి మజిలియగు ఆలేరునకు
నాలుగుమైళ్లదూరమున నున్నది. ఇటగల వీరనారా
యణాలయము దర్శనీయము. చిరకాలముక్రింద
నిది జైనాలయమై యుండెను. క్రమముగా నది
రూపుమాపఁబడుటచే వీరనారాయణస్వామి నిటీ
వల ప్రతిష్ఠించిరి. ఇప్పటికి నాలయమున జైనశాసన
మొకటి దేవనాగరిలిపిలో వ్రాయఁబడినది గర్భా
లయమునందుఁ గలదు. కొలనుపాకక్షేత్రవాసులు
వీరనారాయణవిగ్రహము ఆలయమున కెదురుగా
నున్న కోనేటిలోఁ బడిపోవ సంజీవకవి త్రోవనేఁగుచు
నీవార్తవిని నూటయొనిమిదిసీసపద్యములు చెప్పఁగా
విగ్రహము ఒక్కొక్కపద్యమున కొక్కమెట్టు
నెక్కి పైకివచ్చినటులఁ జెప్పుదురు. ఇట్టికథలు చరి
త్రములకంతగా నుపయోగింపఁజాలవు.

సంజీవకవిపుస్తకము లింక నెన్నియో లభింపవల
సియున్నవి.

ఇతఁడు బహుగ్రంథకర్త యని రుక్మిణీపరిణయ
మునందుఁ గలదు. ఈకవి వీరనారాయణముకుంద

శతకము రచించునాఁటికి ఇరువదిసంవత్సరముల వయస్సుగలవాఁడై యుండును. రుక్మిణీపరిణయము రచింప (శా. శ. 1709) క్రీ. శ. 1786 లో ప్రోత్సహించెను గావున నీకవి యెనుబది సంవత్సరములు జీవించి ప్రతిష్ఠగడించె నని తెలుపవచ్చును. కవికి యోగాభ్యాసమునందుఁగూడ నిపుణతయున్నటుల నితనిశతకపద్యములు చెప్పుచున్నవి.

నందిగామ. }
1-6-26. }

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శ్రీ ర స్తు

# వీరనారాయణశతకము.



సీ. శ్రీలాలనవిలాసశీలసద్ధాధీర
ధీరమ్యబుధమనోదృఢవిహార
హారగోహిమసమాఖ్యా(సమజ్ఞా) సుషమోదార
దారకనీతరథప్రచార
చారణసురగణస్తవవచనాధార
ధారాళశస్త్రబద్ధశయసార
సారసారాతివంశక్షీర భవసూర
సూరతాసుకరతా సుగుణవార
తే. వారిధితరంగ దుత్తుంగవారభంగ
భంగవటదళపుటలలదంగభాస
భూరిమయవాస కొల్లిపాకపురనివాస
వీరనారాయణ! ముకుంద! విశ్వతుంద!. 1

సీ. దండ ముద్దండ కోదండ సంభరణవే
దండశుండాభ దోర్దండ నీకు
అంజలికుంజరపుంజరాడ్భంజన
పంజరాయతపాదకంజ నీకు
సాష్టాంగము కుచేలజటిముష్టివిభ్రష్ట
భ్రష్టయవాపహాధృష్ట నీకు
కేల్మోడ్పు కింకరకిల్బిషతృణగుల్మ

శ్రీమజ్జాల్మోల్ముకనామ నీకు
తే. శరణు శరణాగతనతైకచరణ నీకు
సురవిరోధి వరూధినీవరకుటభర
కుటిలపటుతర కుట్టాక కొలనుపాక...

సీ. జయవిజయీభవ శతమన్యు మన్యుకృ
ద్దైతేయకాయభిద్దారుణారణ
జయవిజయీభవ సంయమిజనమన
స్సరసిజాతధ్యానభరణాచరణ
జయవిజయీభవ సకలకకుప్ప్రాప్త
సంక్రాంతఘనయశశ్చంద్రకిరణ
జయవిజయీభవ సంతతశ్వేతాంత
రీపకల్పద్రుకలాపశరణ
తే. జయజయీభవ కాళియచక్రిరమణ
చక్రచక్రభ్రమణపదాబ్జద్విహరణ
భూరిమయవాస కొలిపాకపురనివాస..

సీ. దేవకీగర్భవార్ధిశుపేశ పరాకు
వసుదేవవంశపావన పరాకు
భృశయశోదావ్రతాభీష్టఫల పరాకు
నందమందిరకల్పనగ పరాకు
గోపకన్యామనోవ్యాపిరూప పరాకు
వ్రజబాలజాల వరద పరాకు

కంసనృశంసవిధ్వంసిబల పరాకు
రాధికాచిత్తచోరా పరాకు
ద్వారకానామపురధామ వర పరాకు
భక్తగోపాయనోపాయ బహుపరాకు
భూరిమయవాస కొలిపాకపురనివాస... 4

విన్నపము పరాకు వివిధాగమజ్ఞాన
విధివిధి ముఖసురవిసరభాసు
ర సరసవాక్యపరంపరల్ జాలవు
నిను గొనియాడఁగా నని మనీషి
జనములు బలుకఁగ వినియును బూనితి
నిన్ను వర్ణింపఁగాఁ గన్నతండ్రి
యదియేమొకాని హృదన్తరంబున భవ
త్కల్యాణతరగుణగణము నిండి
పొరలి ఘోషించుచుఁ దన నొప్పులు గలిగిన
తప్పులు గలిగిన గ్రహింపఁదగు కృపాచ
మత్కృతిని మత్కృతిని గు ప్తమానసియు
కుతలసురవరామృతసాక కొలనుపాక... 5

కృష్ణ మాధవ హృషీకేశ కేశవ జనా
ర్దన నరహరి యుపేంద్ర యదునంద
న పరమేశ్వర జగన్నాయక దామోద
ర గరుడవాహ వరద వికుంఠ

పతి విష్టరశ్రవ ఫణిరాజశయన గో
 వింద రక్షితముచికుంద పుండ
రీకాక్ష శార్ఙ్గి శౌరి యధోక్షజ వనమా
 లి గదాగ్రజ సురేశ నగధర ముర
తే. దమన పీతాంబర యటంచు మిము ప్రతిపద
 మునఁ బలుక దయసేయవే ముగ్ధపాక
 దళన మణితనురుచిపాక కొలనుపాక... 6

సీ. కృష్ణాయ విష్ణవే జిష్ణవే హరయే స్వ
 యంభువే శంభవే హారిణే త్రి
విక్రమాయ స్వభువే విభవే చక్రి
 ణే శంఖినే శార్ఙ్గిణే దివే భు
వే! మాధవాయస్థనిష్ఠాయ భక్తరా
 యేగరిపాయ సురేశ్వరాయ
యాతుద్విషే నవనీతముషే శ్రీసు
 రాజ్ఞే భగవతే ధరాధరాయ
తే. మునివరాయచ తుభ్యం నమో నమో య
 టంచు నతిసల్పెదను పరా కతులనంద
 కలవితారిశిరశ్ఛ్యాక కొలనుపాక... 7

సీ. గజరాజు నేలిన కరుణ ద్రుపదకన్య
 కను మనిచిన యనుకంప హారిణ
కాంతను బ్రోచిన కారుణ్యము విభీష

ఋని బ్రతికించిన నెనరు గనక
కశిపుగుమారుని గాచిన ఘృణ గాక
దనుజు బాలించిన దయ కుచేలు
సాకిన గృప దాపసప్రవరులరక్ష
వెలయు ననుక్రోశము లవమైన
తే. పాదసేవకు నామీఁదఁ బరవఁజేయ
వే దయాసుప్రసాదవినోదలలిత
గురుకటాక్షదృగస్తోక కొలనుపాక... 8
సీ. కన్నవాఁడా! నీవు కరుణాకలితదృష్టి
చేత ననుగ్రహించిన నొకింత
రోషవేషకటాక్షరూక్షవీక్షను నిగ్ర
హించిన భళిభళీ దృణము మేరు
వగును మేరువు దృణ మగుగదా యని దేవ
ర యనుగ్రహము గావలయు నని యెద
నే దలంచెద నెవ్వనికి ననుగ్రహ మిచ్చ
యింతు వానిధనము నే హరింతు
తే. ననెడుమాట దలంచక నక్కుచేలు
గన్నరీతిని గనవె నాకథ విధాతృ
గోపతిరథస్తుతశ్లోక కొలనుపాక... 9
సీ. గట్టిగా నీపాదకమలమేపట్టితి
సత్యము సత్యము సందియంబు
లేశమైనను లేదు లేదు దీనికి నగ్ని

ముట్టెద బామును బట్టెద నీక
నేమి సర్వజ్ఞుఁడ వీ వెఱుంగవె నారొ
డ పరాకు గాకయా యిపుడు పాల
ముంచెదవో నీట ముంచెదవో నీకె
తెలియు ననన్యగతికుఁడ నొరుల
తే. వేఁడ నీవాఁడ నోమాయలాఁడ స్వభుజ
మండలితధనురుద్గతకాండభాను
కుండలితదైత్యఘనఘూక! కొలనుపాక... 10
సీ. దయగలవాఁడవు ధర్మరక్షకుఁడవు
పరమశాంతుఁడవు సుభగుఁడవు సద
సద్గుణాపీఠావిచక్షణుఁడవు నఘు
టనఘటనాపటుఁడవు నజాండ
ధారివి శ్రీసతీధవుఁడవు నిన్బోలు
జేజేలు గలరె యాశ్రితుల దీన
జనులను రక్షింతు నని కంకణముగట్టి
యుండువాఁడ వంట యోహహో విచిత్ర
తే. మగునె నావంటివానికు య్యాలకింప
సాదరాలింగితశ్రీవిశాలమసృణ
కుంకుమాకల్పకుచకోక కొలనుపాక... 11
సీ తల్లివి దండ్రివి దాతవు త్రాతవు
భర్తవు నేతవు బంధుఁడవు స
ఖుఁడవు నిల్వేల్పవు గురుఁడవు నన్నియు

నీవ యన్య మెఱుంగ గావున భువి
నను బోలువార లెందఱు నీకు నీవంటి
ఘనుఁడు నా కొక్కఁడెగాని రైన
దీనాశ్రితత్రాణ దీక్షాధురంధరుఁ
డవు దయాబంధురుఁడవు నెనరు జి
తే. లికెడుజూడ్కని నన్ జూపలేవ దేవ
కీసతీవసుదేవసుకృతనిశాంత
ఫల నవారూఢఘనతోక కొలనుపాక... 12

సీ. వలనా కటారులవంటి మిటారుల
దరదము లసమదద్విరదము లన
గరముల శిబికల గబ్బియ రబ్బీకు
రంగములగముల రత్నముల ర
జతహేమములజరీజరబాబునగల వ
గఁ గులుకు తొడవులఁ గావలెనని
యడుగలేదుగదా నిరంతర మెదనెడ
పడని దేవరవారి యడుగుఁదమ్మి
తే. కవనెరయు భక్తి యొక్కటేగాని యిపుడు
గోపగోగోపనార్థదుర్వ్యాపినశిఖి
గిళనచాతుర్య నిర్భీక కొలనుపాక... 13

సీ. అలరి కుచేలుని యకుచేలుఁ జేయు ని
దానరహిత జాయమానమైన
నీకటాక్షమున రానీకడానీమొలా

మాజిల్గునగలు నంబరసుసరిక్షి
ణీలు నూటపదార్వరాల చౌకట్లు కా
వా గుజాలును జాళువాకడెములు
గ్రాలుముత్తెముల తురాయి మొదల్గల
వ్యంజనముల రుచిరంజనముల
తే. వల దఁటన్నను బోనె రావలసియుండె
నేని నిజనయనాంచల నిభృతలుళిత
దరుణ కరుణాఝరీతురీయాంశఘటిత
కుంజర నిరంజన శ్రీక కొలనుపాక... 14
సీ. దేహ మనిత్యము తెలియరా దెట్టిదు
ర్మృతిని బొందునొ యేమిగతిని జెందు
నో నిజమాడెద నేను జేసినపాత
కము లనేకము లటు గావున నను
చేకొని గావ నీచిత్తము నాభాగ్య
ము మరేమి నానియమములఁ గనఁగ
నక్కట యాపద మ్రొక్కులు సంపద
మఱపులుగాని యుష్మత్పదాబ్జ
తే. యుగళసద్భక్తి నిగళసంయుక్తతఁ దగు
లఁగ సదాప్రవర్తించదు లలితసామ
కలితగానకళాచ్ఛేక కొలనుపాక... 15
సీ. ఇపుడు కాచిన మంచిదే కావకున్నను
మంచిదే నిన్ను నేమించి పట్టి

నట్టి పట్టువదల నహహా మదీయసం
 ధాచమత్కృతి నిబంధనము జూడు
మా తహతహ జెందినా రుజావస్థను
 బొందినా లేమిని బొరసినా జ
రావిక్రృతులను వెరసిన విషయవాస
 నల దెరలినను సిరులను బొరలి
తే. నను పతివ్రతవితము పంతము లిఁకేల
చుంబితారుణబింబాభ సూర్యదుహితృ
కుటిలకేశోద్యష్టబంధూక కొలనుపాక... 16
సీ. ఎన్ని జన్మము లెత్తి యేమేమి పుణ్యముల్
 జేసుటనో భవద్భాసురాంఘ్రి
దాసుల నెందఱి దాయుటనో మను
 ష్యశరీరధారి నై యందు స్నాన
సంధ్యాదికక్రియాచరణభాజనమైన
 భూసురత్వంబును బొంది పిదప
దివ్యము క్షిదమైన దేవరసన్నిధి
 వెన్నిధిరీతి గల్పించుకొంటి
తే. నింక విడుతునె విడచిన నీభవంబు
శంక గడుతునె కావుము లెంక నైతి
కృజసురాసువిలుంటాక కొలనుపాక... 17
సీ. పాపము ల్బాప నీవంతు సుకృతగతి
 బూన నావంతు నజ్ఞానకలన

సడలింప నీవంతు జ్ఞానముద్రను బ్రవ
ర్తింప నావంతు నీదివ్యచరణ
కమలయుగళభక్తి గలిగింప నీవంతు
దినదిన మబ్బి కీర్తనము జేయ
నావంతు భూతదయావృత్తి మెలఁగింప
నీవంతు సర్వంబు నీవకా ద
తే. లంచఁగ నావంతు నొండెడ లాభమైన
లోభ మొదవదు పిదప నాలోన విధుత
ఖలఖచరవిద్విషల్లోక కొలనుపాక... 18
సీ. గండుతేటులలీల గ్రాలుముంగురులు భు
గభుగబరిమళించు గస్తురితిల
కపునెన్నుదురుచొక్కటపుచెక్కిళులు మావి
తలిరుబోల్మోవి మొసళులహాయులు
గులుకుప్రోగులు సిరి బెళుకు వీనులు సింగి
ణులరంగు నగుకనొబ్బొమలు చకచక
దళుకు లోలుకు తెలిదమ్మిరేకులవంటి
కన్నులు సంపఁగి కళికబోలు
తే. నాసికము మొల్క లెత్తెడు నగవుగలిగి
నట్టి నీమోముఁ జూపవే యసురవిసర
దళనచంచచ్ఛరానీక కొలనుపాక... 19
సీ. ఆపద వచ్చినయప్పుడు నరులచే
దొరకినయప్పుడు ద్రోవ నొంటి

జరుగునప్పుడు గ్రహచారముఁ జాలని
యప్పుడు విషవృశ్చికాహిపీడ
దొడరినయప్పుడు దుస్స్వప్నమైనయ
ప్పుడు నాభిచారముల్ బొరయునప్పు
డవనిరుజాపీడ లంటుకొనినయప్డు
భూతగ్రహంబులభీతిఁ దోఁచు
తే. నప్పుడు సముద్ధరించు నిర్యంత్రణస్వ
తంత్రము త్వదీయకృష్ణాఖ్యమంత్రము బల
తరనరకదైత్యజైత్రసాత్రాజితీచ
కోరనేత్రాయుతసమీక కొలనుపాక... 20

సీ. అన్నవస్త్రాదులకై దురాశాపాశ
ముల గట్టువడి మహీశులను గీర్తి
సాంద్రులు శౌర్యనిస్తంద్రులు దానరా
ధేయులు సూరివిధేయు లనుచు
సన్నుతుల్ జేయుచుఁ జరమదశాక్రాన్త
జంతువు వింత వహింతుగాని
నిను మహాప్రభుని కుజనశిక్షకు సుజన
రక్షకు నిప్పితప్రదుఁ దలఁపదు
తే. నెమ్మది త్రిశుద్ధిగా నెరనమ్మియుండు
ట లవమైనను లేదు షోడశసహస్ర
కువలయదళేక్షణాభీక కొలనుపాక... 21

సీ. రాకట్టు మేలుంగరముల రంగయి ప్రవా
ళములఁబోలిన యంగుళములు తార
కలరీతిఁ బొల్చు లోపల రక్తిమఁగల న
ఖములుఁ బద్మాదిరేఖలఁ దనర్చి
బాలార్కబింబడంబము లైన పాణులు
వలయకీలితమణిబంధములు ఘ
నాఙ్గదఘటితమధ్యము లున్నతాంసము
లు పృథుప్రకోష్ఠములు గలిగియు వి
తే. జయ రమామంగళప్రశస్తములగు భవ
దీయహస్తముల మది నుతింతు హృతచ
టులజటిపటలభవశోక కొలనుపాక... 22

సీ. ధగధగ మెఱయు నిద్దాకిరీటము మిల
మిల మనుమకరకుండలములు ధళ
ధళ మనుకౌస్తుభదామము మిసమిస
కళగుల్కు సందిటికడెములు చక
చకలీను గరుడపచ్చలకంకణములు ని
గనిగరుచుల మించు కాఞ్చిధగధ
గలయందమైనయందెలు గలదేవర
శ్యామలకోమలధామలలిత
తే. దేహము మదాత్మమోహము దీర నెంతు
త్రాయమాణవిలాస నేత్రాయమాన
కువలయహితాంబరాలోక కొలనుపాక... 23

సీ. అరుణపల్లవముల బురణించు వ్రేళ్లు హీ
    రములఁబోలెడు నఖరములు కమఠ
ములఁబోలు పాదాగ్రములు సొగసగు గుల్ఫ
    ములు వటకుజఫలముల సిరి కడ
కులజేయు మడిమలు హాలకులిశాదిరే
    ఖలు బొల్చుపార్ష్ణులు గలుగుదేవ
రచరణముల నరఖచరచారణ ముఖ
    రశరణముల విఖ్యాతశతధృతివి
తే. ఫులతరాంతఃకరణములఁ దలఁతు పల్ల
వాధరపల్లవాధరా పల్లవాభి
కలన విలసిత హేవాక కొలనుపాక... 24
సీ. సౌరభ దుర్ముఖ జలజభ్రమాగత
    భ్రమరమాలికలు విభ్రమణసమయ
నయనాంచలాంచద్ఘృణాసుధాంబుధిలుఠ
    ద్వీచికలువదనవిమలచంద్ర
చంద్రికలమహోగ్రగేంద్రనీలవిశాల
    మేచకచకచక ద్రోచిరోమ
సంహాననాలకజాలక జలదాంత
    లలదచ్ఛచంచలాలతలనీదు
తే. విపులతారకరక్తాంతవీక్షణగల
దమృతశీతలధారాకటాక్షతతుల
గొలుతు వక్షస్స్థలక్ష్మీక కొలనుపాక... 25

సీ. అక్కున ధగధగ లాడుకౌస్తుభము నా
సను నిగనిగ మనుమిసుకు జిసుకు
రతనము నఱుతను రహిమీఱ ధిగధిగ
ఉలరు మిన్నాముత్తియముల సరము
నుదుటను గమగమ నుదుటువలపు గుల్కు
కస్తురితిలకము కరముల జిగి
యొలికెడు వలయము లొడలను వాసించు
హారిచందనము పాణియందు వరలు
తే. మురళి గనుపడవచ్చి నామ్రోల నీవు
నిలుతు వెన్నఁడు నే నిన్ను బిలుతు నెన్నఁ
డలఘుకరుణాంకితాలోక కొలనుపాక... 26
సీ. కురుల జిగి నుదుటి నెరతనము బొమల
కళ వీనుల చెలువు కన్నుల వగ
ముక్కు చక్కదనము మోవి ఠీవి పలువ
రుస సొంపు చెక్కుల పస చుబుకపు
హారువు కంఠము మేలు నంసముల సొబఁగు
కేల్దోయి సొగసు కెంగేలు జతహా
యలు నెద పొంకము నారు సౌరు కటి మి
టారము పొక్కిలి తీరు తొడల
తే. పొలుపు పిక్కల సిరి యడుగుల మెఱుంగు
గోళ్ల రంగుఁ జెలంగు నీగోపవేష
కలనఁ జూపవె యరలేక కొలనుపాక... 27

సీ. నీవు లాలించిన నెలఁతుక కడకంటి
దృష్టికి వలసిన తెఱవ నీను
డువులకు దక్కిన యువిద నీగానము
నకు తమిజెందిన నాతి నీహా
యలునకుఁ జిక్కిన చెలువ నీసరసత
కు విశాలి యొదవిన గోతి నీన
గవుల కెద గరంగిన వెలఁది నీమహా
లీలకు బ్రమసిన లేమ దక్క
తే యన్య యొక్కతె లేదయ్యె నట వ్రజంబు
నందు నీమోహనాకృతి యారనిజను
గుణతిలకిత లోకాలోక కొలనుపాక... 28

సీ. ఒకయింటిలో నాడి యొకయింటిలోఁ బాడి
యొకకడ నక్కి యొక్కకడ వెన్న
మెక్కి యొక్కెడ మించి యొక్కెడ నాభీర
క్షీరువ్రుల గలంచి వేఱొకట పృ
థునవోద్ధృతక్షీరదుగ్ధతక్రాదికుం
భతుక్కుంభముల వకావకలుగా న
వియ రువ్వుచును వికావికలుగా నవ్వుచు
ను జెలంగి వల్లవవ్రజమునందు
తే. జాల కోలాహలముగాఁగ హేలఁజేలు
బాలు నిను గొల్తు సేవకపటలహృదయ
జలరుహాన్తరలసదోక కొలనుపాక ... 29

సీ. ఒకకేల మునికోల నొండుచే పగ్గముల్
బాగుగాఁ దాల్చి జికాగుటాల
ఢే యని రొప్పుచు దిరుగుడుపడనీక
కౌరవయుద్ధరంగమున దెలివాఱ
మాకావజీరహాం పీవుసారథితాప్ర
థితకర్మము వహించితివి సమస్త
లోకాధిపతికి నీ కీకృపణత్వము
జెల్లునె యార నీశ్రిత సముద్ధ
తే. రణనిబద్ధప్రయత్నము గణుతిసేయఁ
గవలెఁగాక నిజాశ్రితభవదురస్త
జలనిధితరణ పటునౌక కొలనుపాక... 30

సీ. అధ్యాత్మవిద్యారహస్యము తావక
పాదపాథోరుహద్వయవిధేయ
నిస్తులధ్యాననిరతి గంగాది త
రంగిణీతీర్థాచరణము నోద
నాచ్ఛాదనార్జనపాటకఘోటక
ప్రభృతి విహాయిత పటిమ యించు
కైన నాయంద లేదయ్యె త్రివిధపాత
కంబుల నేరీతి గడువువాఁడ
తే. నీభవమె రోఁతయై యున్న దిఁక పునర్భ
వంబు లేకుండునట్టి యుపాయమేమి
బాణనాగాహ్వృతి వితతబాణవీర

ఘోరసేవాలపనభేక కొలనుపాక... 31

సీ. నేఁడు నేఁడా నేను నీవాఁడ నౌట నా
కేఁడుగడయ యనాట నెంచ నిప్పు
డిప్పుడా కా దెన్నియెన్ని జన్మములనుం
డియొ నాశిరమునను నీపదముల
కును లంకెయయ్యె నెకొ్కని మ్రొక్కి మ్రొక్కి వే
సారితి నిఁక నలచకమనుప
లఁచి తేని జాగిదేలర కరాంబుజసంభ
వకరశాఖాప్రవాళకలికాము

తే. హుర్మహుర్ముక్తమానసముజ్జ్వలదురు
కమలసదృశాస్యగహ్వర ఘటితజనిత
కలకలమురళికారోక కొలనుపాక... 32

సీ. వరద జగత్కుటుంబధురీణుఁడవు నీవు
నీగర్భమునను జన్మించి పిదప
నీమేని కాసించి నిన్నుఁ గృష్ణా యని
పేర్కొంచు మనగల ప్రీతినుండు
మాకుఁ గళ్యాణమే చేకూరుఁగాక కీ
డేల నెదుర్కొను నెదురుకొనిన
కెరలి తజ్జన్యాపకీర్తిజన్యము దేవ
రదిగాక యొరులదే యవయవకృత

తే. మైన దౌర్జన్య మవయవిదైనయట్లు
ప్రబల సబలమురాసుర ప్రమథన సమ

తులితబాహాబలోత్సేక కోలనుపాక... 33

సీ. నేఁగి గల్గినపట్టి శిక్షింపఁగాఁ బరీ
క్షింపఁగారాదొ రక్షింపరాదొ
యవమాన మగునో దురవగాహమో సమ
దర్శివి నీకు భేదము సభేద
మును గలవె పిపీలి మొదలు తామరచూలి
కడగాఁగ సర్వ మొక్కటియగాదె
విశ్వరక్షకుఁడవు వేఱున్నదే నన్ను
గావవుగాక పాకప్రమథన

తే. విధి ముఖరఖేచరచ్ఛటావిపులమస్త
రత్నకోటీరకోటినీరాజితైక
కోమలతరాంఘ్రినాళీక కోలనుపాక... 34

సీ. కెందమ్మియడుగులఁ గిలనలనందెలు
మొఱయ మోమునవ్వ దొరయఁగఁ గను
గొనలదయ బెరయ గోపాలబాలక
వేషమునను కేల వేణునాళ
ము వహించి నీవు నామ్రోల నిలువ పాద
ములపైని బడి కడుమోదముననను
లేవకుండినఁ జూచి లేలెమ్ము భయము నీ
కేలని కైదండ యిచ్చి లేవఁ

తే. దిగిచి పలుకుదు వెన్నఁడుఁ దెలియఁజెప్పు
రాపరాభూతమాద్భగ్ధరాసురావి

కలభవమాకాంతరంగౌక కొలనుపాక... 35

సీ. జాగ్రదుదగ్రజలగ్రహగ్రహణార్తిఁ
బొరలి జగత్పతే పుషిత బుషిత
తే పాహి పాహి మాం దీనమాపన్నర
క్షక యంచు మొఱ లిడఁగా బిరాన
చనుదెంచి నిర్వక్రచక్రధారను ఖరి
క్కున మకరిని తలఁ దునిమి కరిని
దరిఁజేరిచిన కన్నతండ్రి న న్గాపాక
రా జూడరా వీడరా భవత్ప
తే. దాబ్జము నిజాశుగాశీవిషాశ్రయిత వి
శంకటనిశాటఝాటదుష్కంటకపట
మిళితవిగ్రహావళ్మీక కొలనుపాక... 36

సీ. అకలుషిత భవదీయకథాసుధానిధా
నమున నోలలదేలు నాదువాక్ఛ
టలు జటుల నటన్నిటలదృగ్జటాకటా
హవిశంకటలు తద్వియచ్చరతటి
నీసముద్భటవీచికాసారఘుమఘుమా
స్ఫటవిస్ఫుటలు దీనపటలగుప్తి
జాగరూకతగను నీగుణములవింత
రొన్నఁగా లేవె యొకింత సంత
తే. సంబు మదిలోనఁ బుట్టి యశంబు నింగి
ముట్ట భ్రష్టయవాముష్టిముక్కుచేల

గోసురశ్రీప్రదాలోక కొలనుపాక... 37

సీ. సదయభవత్కథాశ్రవణంబున మదంత
రంబున నొకవికారంబు వొడమి
ఘోషించుచుందును గ్రోధసంబంధమో
యానందమో శరీరాంతరస్థ
మగునుల్బణానుల్బణాదివికారమో
మోహమో ఖేదమో మోదమో వి
లాసమో యున్మాదమో సివమో దెలి
యదుభక్తియో యక్కటా భవాబ్ధి
తే. ముంచునో దరిజేర్చునో మొదలు జెప్పఁ
గదవె నిజగర్భసంభృతకమలజాండ
కోటికోట్యాదిసంఖ్యాక కొలనుపాక...

సీ. కృష్ణ నే నెట్టిదుష్కృతినిగానీ భవ
త్కైంకర్య మించుక గంటి నింక
మంటి నీమంటిజన్మము రోఁత వింటి ని
న్నే కావు మంటి నే నెడఁ ద్రిశుద్ధి
గా నమ్మియుంటి భాస్కరసుతభీకర
కింకరకరగా శివంకరపటు
ఖరకరవాలధగద్గితనిశాత
ధారాభిఘాతసంతతుల శంక
తే. గొంటి నీలెంక నంటి చేకొనవె యంటి
విశ్వమోహన కరకళావిరళమురళి

కుహరకల్పిత మృదుపైక కొలనుపాక... 39

సీ. సర్వశరణ్య యజ్ఞాన విజ్ఞాన వి
వేకపాకంబున నాకుఁ బంచ
వింశతివర్షముల్ వెడలె నిందున సుఖ
దుఃఖముల్ దలుచుగాఁ దోఁచె నింక
మనఁగల కాలప్రమాణంబు దెలియ నేఁ
డో నెలయో పక్షమో తదగ్ధ
మో విచారించ నేఁడో మఱి రేపో మృ
తిసమయమున నెట్టి తెలివి బరిఢ

తే. విల్లునో నీపదంబు భావింపుచుండ
వింత యేలొను మౌనిరాడ్వ్యాసరచిత
కలితజయలాఞ్ఛనశ్లోక కొలనుపాక... 40

సీ. మేటికమ్మలపౌజు జోటిడాల్ చకచకల్
తలుచైన పౌజుమొత్తముల నడప
సొంపుకీలుకడెంపు కెంపుల ధగధగల్
పరువులెత్తుచు దండిబారు నెఱపి
పక్కిరారతనంపుసతకంపుమిసమిసల్
వ్రాలి నల్లడ నెలగోలు గొలుప
గిలుకుటందియలఁ జెక్కినరాల ధళధళల్
కెలఁకుల వెన్నంటి బలుపు దెలుప

తే. తళుకుమేను తనరు కల్మి చెలువదండ
వరలఁ బొడచూపవే దయాపంజరాస్త

కోవిదవరేణ్య గణశోక కొలనుపాక... 41

సీ. కలుఁగుమెలుంగుబంగరువంటి యొడలు గొం
డల బింకిసేయు వెడందవాల
ము తపనశశిబింబములవంటి వట్రని
కన్నులు మిణుఁగురుల్ గ్రక్కు కోర
లు గరిమీసలుగల మగమీనురూపున
బెళకి సోమకుని గుభేలున జల
నిధినీట ముంచి ఖండించి తదపహృత
శ్రుతు లుద్ధరించి యజునకు నప్ప

తే. గించి మించిన దొరను నుతించఁదరమె
స్వాభిధానైకమంత్రవర్ణానులోపి
తలఘునతపాతకశలాక కొలనుపాక... 42

సీ. మలరాచకవ్వము జిలువరాయాకత్రాఁ
టను బట్టి పాలకడలి పనఁటి నొ
కకడను సోఁకుమూఁకలు రెండవయొడను
జేజేలు గొని నీరుజిలుకఁగ గుభ
గుభగుభధ్వనుల నకొండమున్నీటిసు
డిని గ్రుంకుచున్న కఠినకపాల
మునఁ దాల్చి యుద్ధరించిన నీదుకమఠావ
తారము వారము వారము నెద

తే. నెంతు సంతత దశదిశాక్రాంతదైత్య
హాసన జనప్రతాప మహాప్రదీప్త

జలరుహాప్తారుణాలోక కొలనుపాక... 43

సీ. కడు వెండికొండను గ్రాలు నిగ్రహము సా
గ్రహాత తరుల్ గిరుల్ వ్రక్కలించు
లోమముల్ ఝల్లుఝల్లునను జాడించుచుఁ
కరుకుకోర ఖరికుఖరికున మిణుఁ
గురులు భగ్భగ్గున గిరి కొనగిటుచు
ఘుర్ఘురధ్వనులకుఁ గుతల ములుక
భీకరతరసూకరాకార మంగీక
రించి ధరావహా కాంచనాక్షు
తే. దనుజు భర్జించి నిర్జించి ధరణి కోర
నిలువరించిన దొరను నిన్ గొలుతు ముషిత
గోపకన్యామనోలోక కొలనుపాక... 44

సీ. దనుజరాజు సభాభవనఘనస్తంభము
పెటపెటబగులించె వెడలి కహాక
హాట్టహాసార్భటి నరిమురి దశదిశల్
గలఁగ జగద్భయంకరనృసింహా
రూపముతో సుతద్రోహియైన కనక
కశిపు రక్కసుఁబట్టి కఱచి చఱచి
ఖరనిశాతనఖరాఖండశస్త్రముల ఖ
సిక్కు ఖసిక్కునఁ జించి ద్రుంచి
తే. మించి ప్రహ్లాదుఁ గాచి మన్నించి యలుక
డించిన మహాత్ము నిన్నుఁ బఠింతుఁ గీర్తి

గుంభితాకుంభినీనాక కొలనుపాక... 45

సీ. అదితికిఁ బుట్టి కశ్యపునిచేత నుపనీ
తుఁడవై పవిత్రము గొడుగు గోఁచి
ముంజి కృష్ణాజినము కమండలువు జన్ని
దము దండము నమర గొమరు పొట్టి
వడుగువై త్రిభువనవరుఁడగు బలికడ
కరిగి మూఁడడుగుల యవని యతని
వలన గైకొంచు విశ్వమునిండ బెఱిగి యొ
క్కడుగున దివి యొక్కయడుగున భువి
నడిమి శేషించిన యడుగున కద్దాత
నడుగుఁ బట్టించి సురాధిపతిని
తే. బ్రాజ్యసామ్రాజ్యమునను సంపూజ్యుఁ జేయు
నిను ద్రివిక్రముఁ గొల్చెద ముని మనశ్చ
కోరికాపూర్ణిమాగ్లాక కొలనుపాక... 46

సీ. తతబలోద్దండ వేదండ శుండాదండ
చండదోఃకాండ ప్రకాండమున ఘ
నఘగ్ఘగాయమాన నిశితధారాక
ఠోరమై పేర్చు కుఠారముఁ గొని
ముయ్యేడుమారులు గయ్యాన్యఁ బుడమిఱేఁ
డులఁ జక్కు చక్కుగాఁ దలలుఁ దరిగి
నెత్తురుటేరులు నిగుడించి యన్నిటఁ
బితృతర్పణంబు గావించినట్టి

తే. జెట్టి భార్గవరాము నిన్ జిత్తవీథి
నభిలషింతు న న్నాచుట కై నితాంత
గుప్తనిజకింకరసుధీక కొలనుపాక... 47

సీ. రఘువంశమున దశరథనృపునకు సుద
యించి తాటకను వధించి మఖము
గాచి యహల్యను బ్రోచి పురారికో
దండము ద్రుంచి సీతను గ్రహించి
జనకవాక్యమునకై వనమున కరిగి ఖ
రాదులఁ దరిగి తోయధి దరించి
రావణుఁ జించి తద్రమ విభీషణు కిచ్చి
రమణితోడ నిజపురమ్ముఁ జొచ్చి

తే. రాజవై ధర నేలిన రామునిన్ జ
పింతు పాలితశబరి విభీషణైని (?)
గుహ హనూమన్ముఖ వనౌక కొలనుపాక...48

సీ. చందురు నందంబు క్రిందుఁ జెందఁగఁ జేయు
చందాన రోహిణీకుందరదన
యం దుదయించి బ్రహ్మాండకటాహని
ర్దళనధీర మగుసీరముని రాక్ర
తకృతా స్త్రదస్తురోద్దండకాండప్రద
మగు ముసలాయుధము గయికొని య
చలకోర్కి పండించి ఖలులను ఖండించి
శేవ నల్లడన నిండించి మించి

తే. నట్టి బలరాము ముష్టికహారు భీము
రేవతీకాము నిను గొల్తు రేపు మాపు
గుప్తకుస్తీసుతవధూక కొలనుపాక... 49

సీ. త్రిభువన పరిభవ త్రిపురరాత్రించర
పరివృఢభామినీవరపతివ్ర
తాత్వప్రభంగకృద్ధంతుర మాయాక
లాపు పిప్పలకులదీపు బుద్ధ
రూపు నిన్ వాక్కునఁ బ్రాపు దాపనిపల్కు
బాపురే దరిముట్టఁ బరులవశమె
బహుజన్మములగోలె భక్తులై విషయవి
రక్తులై కొల్చువారలకుఁగాక

తే. పృథులమోక్షప్రదాన సంప్రీణితాత్మ
జాంబవత్యాహ్వయాత్మజోత్సర్జనాతి
కుశల జాంబవద్భల్లూక కొలనుపాక... 50

సీ. పుడమి వేల్పుకులాన బొడమి కడిమిఁ జూపు
కలికి రూపున కరువలి తెరువలి
దిగదించు మింజైన తేజీవజీరుఁడ
వై వాలుడాలు మున్నగు కయిదువ
గమి కయిదోవగమించిమిటారి బాబాచ
*పుపటాలు చివ్వచివ్వన దుముకఁగఁ

* పాఠాంతరము.—వ్రసటాలు చివురుచు చివుక్కు-న దుము, కఁగఁ గలిదోవమునఁ గులదోవముఁబాసి.

గలిదోషమునఁజేసి కులశీలములఁబాసి
వర్ణసంకరులుగా వరలు నరుల
తే. మన్ని గాని ధర్మమేదు నీమహితగుణము
లెన్ని కొనియాడ నేర్తునో యన్న నేను
కోమలశ్యామలగవీక కొలనుపాక... 51
సీ. పుత్తడికత్తళంబు దొడిగి కాసెగ
ట్టి బిరుదగండపెండేరము కాలఁ
గడియించి రంగుబంగరు చెఱంగులవల్వ
రింగులు వారఁగఁగూర్చి రతనాల
బొమిడికము ఘటించి భుజములఁగైదువుల్
దాల్చి గరుడునిపైఁ బొల్చి మొదట
నసురచమూసమూహములగుండెలు గుభుల్
గుభులు గుభులున బగుల రమించు
తే. యుష్మదురుపాఞ్చజన్యసముద్ధత ఘుమ
ఘుమరవము లుగ్గడింతు నకుంఠతరవి
కుంఠపురపాలనాథైక కొలనుపాక... 52
సీ. క్రొవ్వి చివ్వకుఁ గాలుద్రవ్వి మానిసి బువ్వ
మూఁకలపై నెత్తి పోకు పోకు
మని భగ్గు భగ్గున నదలించి ప్రళయకా
ల కరాళలీలాకలాప భగభ
గాయమాన ధళధళాయమానతనూన
పాత్రిరస్ఫురివిస్ఫారతరస

హాస్రధారాసముద్యద్విభాచక్రమై
పేర్చుచక్రము పంపువెట్టి నుగ్గు
తే. నుగ్గుగాఁ గన్నుగొట్టి వినోదముహించు
నింగి ముట్టిన దొర విల నీవె పోషి
తలఘుతర మాదృశవశీక కొలనుపాక... 53
సీ. తగిలి జగములపై దాడివెడలు తెర
గంటికంటు దొరలవెంట వెంట
నంటి నిలునిలువు మని యదలించి కై
గదగొని గొదగొని సదమదముగ
మొదవుకదుపులపైని దుముకు గబ్బిబె
బ్బులిగతి దాఁటి గుబుకుగుబుకుగు
బుక్కన వీఁపులు మూఁపులు పదములు
ను రదములు నురముల్ కరములు మెడ
తే లును దొడల్ బొడిసేయు నీఘనభుజముల
పటుత బొగడెద స్వప్రతాపప్రవాహా
లులితనిఖిలాసురజలూక కొలనుపాక... 54
సీ. నింగి గుబ్బటిల మున్నీట సదా రొంపి
గొని రిక్కగమిడుల్ల కులగిరుల్ వ
డంకఁ జిల్వదొర వెడఁగుపడఁ బుడమియుఁ
దడబాటు వారపాతాళ మొకట
ఘూర్ణిలఁ బరజంతుకోటి దల్లడపడ
దృఢపరిపంథి దైతేయయూపతి

గర్భస్థితార్భకావిర్భేదముగ ఠాము
ఠాము ఠా ఠనుచు నెడతెగక యని
తే. మ్రోయు ఘణఘణద్ఘంటికాభూతకోణ
భవదరీణఘనుగ్గుణార్భటి నుతింతు
కోవిదస్తోత్రవాచాక కొలనుపాక... 55

సీ. కఱుకైన సోఁకుమూఁకల మూఁకలకు నెఱ
దూరి తేఱులబారు దుగ్గు దుగ్గు
గా గబ్బిగబ్బుమెకంపు గుంపులు జక్కు
చక్కుగా ఘోటకచ్ఛటలు పిండి
పిండిగా నుద్భట భీషణచ్ఛటపట
లను నుగ్గు నుగ్గుగాఁ జెనకి ఖరికు
ఖరికుకరిక్కున కరకరి నఱుకు చు
ఱుకుభవచ్ఛార్ఙ్గనామకధనుర్వి
తే. ముక్తపుంఖానుపుంఖాత్యమోఘవిశిఖ
ములు విదారించుఁ గాక మత్కలుషములను
గోపబాలక మూర్తియైక కొలనుపాక... 56

సీ. భవదీయ శార్ఙ్గచాపవరవిముక్తవి
షాక్తబాణాహతి నసురతతిని
దెగినట్టి మొగములు జిగిలిగొన్నట్టిప్రే
వులు నేరులా నెత్తురులు గిజల్లి

జలు దన్నుకొను మొండెములు నీఁదులాడుగం
డలు జక్కజక్కైన తలలు దుత్తు
నుకలైన చేతులు నుగ్గు నుగ్గయిన యొ
డళ్లు వెల్లువలై మెదళ్లు గలిగి
తే. వెఱపు బుట్టించు నట రణోర్వీతలంబు
కల్పితస్వాంశు ఘనవిలోకన సముదిత
గోపికాకేకినీకేక కొలనుపాక... 57

సీ. ధగధగలాడు నందకవరాసి ఝురాన
యొరదూసి రాకాసిబరినిడాసి
గొడుగులు సిడములు పడగలు కంకట
ములు గుఱ్ఱముల పల్లములు కయిదువు
లు ఫలకములు తేరులు ధనువులు శరము
లు కరులు జోదులు శకటములు ఖ
రిక్కు ఖణిల్లు ఖచిక్కు ఖణింగు ఖం
గు ఖసిక్కనను దెగ గుముల కుఱికి
తే తుత్తుమురుగాఁగ నఱికి యుద్వృత్తి గెలుపు
రమ గొను దొరవు నీవే గళమిళిత పరి
మళితఘనవనమాలాక కొలనుపాక... 58

సీ. మారి జొబ్బినగతి మన్త్రించి పడవైచి
నక్రియ కొఱవిద్రిప్పినకయివడి ప్ర
ళయకాలరుద్రునిలాగు నీరసతృణ
వన మేర్చుకార్చిచ్చువడువున గనూ

పట్టు బెట్టిదముగఁ గట్టడి రాకాసి
  తిట్టులపై చలపట్టి కొట్టి
మహిమ మిన్ముట్టి సమస్తలోకముల సం
  కటములు వే విశంకటముగాక
తే. బిరుదు చెల్లించుకొనెదు నీబీర మెన్న
నరుదు శేషాహికైన దోయరుహమిత్ర
గోత్రవరపుండరీక శ్రీకొలనుపాక... 59

సీ. మెఱయు ఫిరంగుల నఱికి బాకుల గ్రుమ్మి
  గదల మొత్తి సురియల దునిమి సుర
కత్తుల నుగ్గాడి గండ్రగొడ్డళ్ల వ్రే
  సి కటారులను బొడిచి జముదాళు
ల గడపి చక్రముల దెగమోఁది పరిఘ
  ముల దంచి యీటెల దూలిచి భిండి
వాలముల దునిమి పాశముల నురులు
  వోసి నీబలము రాకాసిబలము
తే. పై దుమికి నులుమునట నీదు బాసటగాని
యౌర వింత యగారితాక్రూరధీర
కలిత హృత్పుండరీక శ్రీకొలనుపాక... 60

సీ. ఢాకఁ గడిమి బుండరీకము బుండరీ
  కము భల్లుకము భల్లుకము గజము గ
జము శరభము శరభము మృగేంద్రము మృగేం
  ద్రము వృషభము వృషభము నగము న

గము జోరుగతిని యుద్ధము శయాశయి కచా
కచి నఖానఖి కరాకరి రదారద
ది భుజాభుజి పదాపదిని జఱచి కఱచి
వ్రేసి డాసి పొడిచి విడిచి దుమికి
తే. గుమికి రాకాసిమూఁకలఁ గూల్చి వీఁక
గల్గి నీమూఁక సాత్యకి ఘటితమణిల
గుడ లసత్పుండరీక శ్రీకొలనుపాక... 61

సీ. బాణప్రభాతటిత్పటలము భగ్గుభ
గ్గున మెఱయఁగ ధనుర్గుణకఠోర
డాంకారగర్జ బెడబెడమని యుఱుమఁ
గ కనదదభ్ర కార్ముకమహాభ్ర
మున నతిలాఘవమున నిశితశరప
రంపరాసారవర్షంబులు నిగు
డించి యాసురవీరచంచదనీకినీ
తేజోదవాగ్నులఁ దెప్పదేల్చి
తే. యార్చి పేర్చిన నిను నసహాయశూరు
శూరతాస్ఫారు నెద నెంతు శుకహృదయ వి
మలసరోమానసౌక శ్రీకొలనుపాక... 62

సీ. వేలుపుసూడు హాం వీరులఁ జతురంగ
బలముల చలముతో బలసి నఱికి
బాహువిూనములు కబంధమకరములు
శీర్షభేకములు మస్తిష్కఫేన

ములు పలల కమఠములు గృపాణవ్యాళ
ములు బుండరీకాబ్జములు కరేణు
మస్తకాన్తస్సృస్తమౌక్తికభూషణా
వయవవాలుకలు నొప్పంగ శోణి
తే. తప్రవాహములు సమరోదధి ఘటించి
మించు నినుఁ గొల్తు మాదృశాకించనజన
గుప్తతాజాగరూక శ్రీకొలనుపాక... 63
సీ. ఎక్కడచూచిన లెక్కకు మిక్కిలి
యగుచు వెక్కసముగా నిగిడి పింజె
పింజె గఱచి వచ్చి బెట్టుగా నీమింట
గుఱియు చుఱుకుటంప కోలకోల్త
లకు విఱిగి విముఖులయి దెసచెడి పుట్టి
లెక్కుచుఁ గేల్గవ లెత్తి మ్రొక్కు
చు శవాళిలో నక్కుచుఁ గసవు మెక్కుచుఁ
గావుకావు మటంచు గద్గదోక్తి
తే. వెక్కుచుఁ గలఁగి పురపుర పొక్కుచు వడిఁ
దక్కుచుఁ దొలంగునట యాతుధానకులము
గోపితనరాది జనలోక కొలనుపాక... 64
సీ. గౌతమమౌనిరాట్కృతినవాక్కృతమైన
రాయి రామావతారమున కౌశి
కమునీంద్ర వరనియోగమున బాణప్రయో
గమున తాటకను సంగతకృపాణ

ఖేటకను బుడమి గీలించి రాఁ గడు
    మోద మొప్పఁగ భవత్పాదరేణు
కణము సోఁకినయంత కంపించి కఠినత
    వదలి కదలి కాని బొదలి మొదలి
తే. పడఁతి యయ్యె నటౌర మీపాదమహిమ
యవిత శీతాపకారి మహోజవాజి
ఘోరభీభాగహిత కాక కొలనుపాక... 65

సీ. పుత్తడిగుబ్బలి బోలిన మేను నా
    ఖండలమండలాగ్రప్రచండ
తేజము నిరసించు దేజితతుండము
    విస్ఫులింగము లీను వెడఁదకన్నుఁ
గవ నిశితకఠోరక కరాళములగు క
    రజములు నిజమరుద్వ్రజవిధూత
గోత్రంబులైన పత్త్రంబులు గల ప్రో
    ద్యద్భవత్కీర్తి ప్రతాపరూప
తే. మనఁగఁ గనుపట్టు యుష్మదీయాశ్వగరుడ
దేవు నుతియింతు గుక్షమాదృజ్ఞతనర
ఘోరభవకాందిశీక శ్రీకొలనుపాక... 66

సీ. వేషము జక్కఁగావించి తీరరుహా భూ
    రుహము నారోహించి రోసగించి
బిట్టు ఘట్టించి గుభేల్లన నురికిన
    గని నిజాననగుహాఘటిత ఘోర

ఘోరాత్కారజాతప్రభూతవిషజ్వాల
దుజ్జ్వలనజ్వాల లోకకూట గిరి
కొనవచ్చి కాళియుఁడను చిల్వఱేఁడు ని
న్గఱచి చుట్టిన పట్టి చఱచి యమున
తే. నీటపడగలు నుగ్గుగా నిగిడి నాట్య
మొనర తత్సతు ల్వేఁడిన మనిచితివఁట
క్రూరదానవ వ్యూహమ్యూహక కొలనుపాక... 67

సీ. చఱచితో పన్నిదం బుకక నిన్నెట్లు చే
కొనువాఁడ నలయించకని తలంచి
వెఱచితో మత్పాపవిసరాగ్భటులకు చే
కొనవచ్చినను చుట్టుకొనువటంచు
మఱచితో నీలారమాక్షమాలీలావ
తీలాభిశానంగ హేలదగిలి
పఱచితో యాత్మీయభవనంబు దొలఁగి వి
పక్షరాక్షసచమూభయము జెంది
తే. యార్తి విన వాహహో! హో! యని యనవు రావు
పలుకరించవు దగునె గోవర్ధనాఖ్య
కుధరభృద్బాహుబాహీక కొలనుపాక... 68

సీ. త్రుంచలేవో సర్వదుష్కృతంబులచేత
జడమై ప్రవర్తించు జన్మలతల
నుంచలేవో భవదుత్కృష్టసేవక
సంగతి విజ్ఞానసంగు జేసి

నించలేవో సదానిఖిలదుర్విషపాళి
  ప్రీల గృపామృతవీక్షణంబు
మంచలేవో జన్మమరణప్రవాహైక
  మోహం బెడల నిత్యముక్తిఁ జేసి
తే. యెంతసేయఁగలేవు నీ వించుకంత
యొదఁ దలంచిన ఘటితమహేంద్రరుంద్ర
గోపదభాగ్యదభిషేక కొలనుపాక... 69
సీ. కలికితుమ్మెదలడా ల్గురులు ముంగురులు చో
  క్కవుమీలచెన్నులు కన్నులు నెల
వక్కలు జెక్కులు జక్కనివువ్వల
  చెండ్లు బాలిండ్లు రాచిలుకరాయ
కౌతు పొందమ్మివాల్ జోతులు చేతులు
  ననఁటికంబము లన నగు కురువులు
దొనలయిక్కలు బిక్కలు నిగారమగు తేనె
  తేటలు మాటలు నీటుగొన వ
తే. లపులు వెదఁజల్లు జెలులఁ జూచి పరువారు
చి_త్తము భవత్పదాంబుజాయ_త్త మగునె
కుంఠితమురాసురోద్రేక కొలనుపాక... 70
సీ. జగములనెల్ల జొక్కఁగఁజేయఁగాఁ జాలు
  హేల నీవేణుగోపాల బాల
కృష్ణవేషము మును పెన్నడో జూచిన
  యందాన ముందర నాడి చన్న

కరణి దాదవ్వల గానుపించినరీతి
గలలోన గాంచిన గతిని గని ప
రాకైనయోడ దోఁచి రాకున్న కైవడి
కన్నులగట్టిన జెన్నున గని
తే. పించుచున్నది సాక్షాత్కరించునే మొ
భీషణాసురగర్భనిర్భేదనకర
గురుగరుత్మత్పతిపతాక కొలనుపాక... 71
సీ. సారె కృష్ణాయని చీరనో యని యొక
పారిదైనను భళీ పల్కపల్క
వేసారితో లేక వినరాదో యోగని
ద్రను గునికితివో పరాకయితివో
రాణితో నంతఃపురములోపలను రహ
స్యమున నుండితివో నిరాదరణము
దాల్చితో నీప్రభుత్వము తెరఁగో కాక
నాయదృష్టమొ తేలదాయె నింక
తే. నేమిసేయుదు దిక్కు నాకెవ్వరయ్య
యీవుదక్కఁగ లుళితమునీణ్నిరస్త
చలనచేతోమృతతటాక కొలనుపాక... 72
సీ. జారుఁడ చోరుఁడ జడుఁడ నాచారహీ
నుఁడ జాలదురభిమానుఁడ ఖలుఁడ వి
వేకవిదూరుఁడ వివిధపాపాచర
ణ విశారదుఁడ దుష్టుఁడ విగతకుశ

ఉఁడ భవనీరధిలోపల మునిఁగి తీ
రమునకుఁ జేరనేరక దిరుగుడు
బడలినవాఁడ నెబ్భంగి చేపట్టి ర
క్షించెదో వేగ రక్షింపవే ప
తే. రాకుఁగాక పరులచేతికీక బకని
శాటజీవజగత్ప్రాణజాతహరణ
కుశలభుజదండశౌండ శ్రీకొలనుపాక... 73
సీ. అఖిలేశ వినుము నాధ్యానంబు నీవ నా
స్నానంబు నీవ నాసంధ్య నీవ
నాసుకృతము నీవ నాసౌఖ్య మీవ నా
జ్ఞానంబు నీవ నాజపము నీవ
కర్తవు నీవ భోక్తవు నీవ సర్వంబు
నీవ యింకేల గణించి పలుక
నీవె నాథుఁడవు నిన్నేకాని యన్యుల
రక్షింపుమనుచుఁ బ్రార్థనము సేయ
తే. యత్న మించుకయైన జేయదు మదీయ
హృదయ మిది యేమొ గుప్తనాగదనిజైక
గురుకథావాఁదూక శ్రీకొలనుపాక... 74
సీ. స్నానము సున్న ధ్యానము నాస్తి జగము మృ
ష తపము లేదు విజ్ఞానము నహి
సంధ్య యసత్యము జదువు మిథ్య వివేక
ము హుళుక్కి మేధ యేమో స్థితి యన్న

తము శాన్తి తబ్బిబ్బు దను మనుమానము
సుగుణ మబద్ధము సూనృతము ము
ఖాపవాదము దాన మాగడము యహింస
యిల్ల యాచారము కల్ల నీప
తే. దాంబుజంబుల భక్తి కెంకాస్పదంబు
నింక నను బ్రోచువా రెవ్వ రీవుగాక
దళితనిజభక్తవిపద్భయాక కొలనుపాక... 75

సీ. పట్టి రక్షింప నీబాలసఖుఁడగు కు
చేలుఁడనా నీదు చెలియలి సవ
తి యగు పాంచాలినా తివిరి నీ కాణికై
ప్రాణముల్ రక్కసుపాలు జేసి
నట్టి జటాయువునా విందుఁజేసిన
శబరినా భవదంబుజాతదృగప
హారి మర్మము దెలియఁగ జెప్పుటకు గ్రహిం
చిన విభీషణుఁడనా వినవె నేను
తే. నెవ్వఁడను నన్ను రక్షింతు వెటుల నీవు
పృథువిపన్నజనావనాభీతిదాన
కుశలతాస్ఫురదవలీక కొలనుపాక... 76

సీ. అన్యుఁడఁ గా వంటి నాత్మ తక్కోటిలో
పలివాఁడ నంటివే చేపట్టి కాచు
టకు విహితుఁ డవంటి సకటకటా నాఁడి
యేంగితము దెలియ నెంతవిన్న

వించుకొంటిని భళా వేయిభంగులను మొ
ఱ్ఱలు బెట్టుకొన్న బరాకెజేసి
తివి నిన్నెటువలె నమ్మవలె సార్థకకుచే
లు కుచేలుచేలతాలోలు చేతఁ
తే. గొన్ని యటుకులు గొని సిరిఁ గూర్చినట్టి
లంచగాఁడవు నన్ను రక్షించఁగలవె
లుళితరాధావధూస్త్రీక కొలనుపాక... 77
సీ. శరణం కిమపి నాస్తి చరణం వినా తవ
పరమాత్మ రామ మాం పాహి పాహి
యంచు నగ్రజుచేత నంఘ్రితాడితుఁడయి
చనుదెంచి భయమున శరణు వేఁడి
నట్టివిభీషణు నతిదయాదృష్టి వీ
క్షించి వెర్వకు వెర్వకంచు చేతఁ
బట్టి యాలంకకుఁ బట్టముగట్టితి
వప్పుడె భళిర మాయన్న నిన్నె
తే. కొల్చినను గొల్వవలె నీవు కోర్కు లొసఁగి
తే నొసఁగవలె పాలితానూన విషమ
కలితదశరథనృపవాక కొలనుపాక... 78
సీ. ఇదె చూడు నీదు నెమ్మదిలోన నేమి సం
కల్పించితివొ నన్నుఁ గావలేక
నీటమునింగిన నేలజొచ్చిన పంది
వైన నోర్దెఱచిన మేనుడాచి

మసలినఁ గ్రూరకర్మము గైకొనినను ద
పసివైన బసులగాపరితనంబు
మేకొన్న మాయల మించిన గుఱ్ఱపు
రౌతువైన విడువరా పరులను
తే. నుడువరా దైన్యవార్ధిని గడువరామి
దడవరా నన్ను గాచిన గొడవరాదు
కలితనిగమ శిరశ్శీక కొలనుపాక.... 79

సీ. వేదధర్మప్రతిపాదకమో కొండ
నెత్తుటో భూమి వహించుటో సు
రవిరోధి దళనపూర్వక డింభరక్షణ
మో యింద్రపాలనమో యశేష
భూసురస్థాపనమో సప్తతంతుసం
త్రాణమో చిరమృతక్షోణివిబుధ
పుత్రకోద్ధరణమో పురపురంధ్రీవ్రత
హారణహేతుకజగదవనమో య
తే. నంతకులధర్మగుప్తిరో యహాహా నన్ను
నరు నొకనిఁ గావ నీకెంత భరము దళిత
ఘోరరాక్షస శాక్తీక కొలనుపాక... 80

సీ. దేవ నీజీవన వ్యాప్తి నీగోత్ర
సంభరణైకకౌశలము నీర
సాదృతి నీదుప్రహ్లాదైకవృత్తము
నీమహాఖర్వత నీసదావ

నీపకదానోరునిష్ఠ నీధర్మక
 ళాదీక్ష నీదుసురాదరణము
నీప్రబుద్ధతయును నీదుకలికివన
 ము దలంచి నాల్గైదుమోములుగల
తే. వేల్పుతేఁడులకైన భావింప సన్ను
 తింప వీక్షింప వెరఁగు సాధిపవిరోధి
 కుంతభృదనీక యాష్టిక కొలనుపాక... 81
సీ. విషరాశివిహృతి బో విడిచి కాఠిన్యము
 మాని సౌకర్యము బూని వికృత
వేషముఁ జూపక పిన్నబాఁపని శేవ
 బ్రాహ్మణమూర్తిఁ గో రాజముద్ర
గన్పడ ముసలివి గాక మాయలబోక
 కలికితనాన నాకన్నుఁగవకు
బాలకృష్ణాహ్వయబ్రహ్మాము సంజ్ఞను
 నిల్చి కన్పించిన నేటికా త్వ
తే. దీయదర్శన మలయించితివి బహుదిన
 ములని దూరుచు భవదంఘ్రి లలమి పలుకఁ
 దలఁతు సందియ మెదలేక కొలనుపాక... 82
సీ. విషమెక్కెనో తల వెట్టిబట్టెనో బవ్వ
 దాల్చితో నెత్తురు ద్రావి పార
వశ్య మొందితివో యపారముగా బెరి
 గినగర్వమో తపమునను మాన

ము వహించితో రాజ్యపుమదమో పానబ
ద్ధత్వమో శుద్ధబుద్ధస్వరూప
ము ఘటిల్లెనో గుట్టిపురవుతు వాట జా
స దెలియదయ్యెనో సారె బిలువఁ
తే. బలుక విధి తగునే మహావక్రచక్ర
చక్రవచ్చక్రివగహృత్తశైశుపాల
గురుశిరస్థూలమండూక కోలనుపాక... 83.
సీ. క్షితిదరిదీయ నస్మృతమిాయ నేల వ
డయఁ బుణ్యజనస్పృథునియతిఁ దెలుప
వరవర్ణితత్వము ప్రబలింపఁ గామద
మనగురువృత్తిలోఁ గొన విభీష
ణ భవార్తి నడఁప ననంత సత్యాసక్తి
జెలఁగింప నాగమశేఖరప్ర
సిద్ధి ఘటిల్లఁగాఁ జేయఁ గలాఖ్యకృతి
సవరింప నీవని సంభ్రమించి
తే. మదిని నమ్మితి రక్షిత మాదృశభవ
కలుషమగ్నకృతాకృత్యకర్మకలన
విలసితవివేకమూక శ్రీకోలనుపాక... 84
సీ. గణుతి జేసిన జడగతివి కఠోరాత్ముఁ
డవు పెద్దకొమ్ముకాఁడవు నరణ్య
జన్యనరుఁడవు భిక్షాచరుఁడవు నృప
ద్రోహివి క్రోఁతులదొరవు దుక్క-

మ్రుచ్చుపు దెసమొలమూర్తివి శస్త్రధా
ర బ్రాహ్మణుఁడవు సరే భవద్ఘ
నత్వ మెఱిఁగి కొల్చు నన్ను నవలెఁగాక
నిన్ననఁ బనియేమి నిజవిభోగ్ర
తే. ఖరకరాంధీకృత విదర్భకన్యకాస్వ
యంవరోత్సవమిళితచైద్యమగధకురు
కోసలాది నృపాలూక కొలనుపాక...
సీ. పుష్పవద్వంశ ప్రభూతి దానవవని
తావ్రతి యమిస ప్తతంతుగుప్తి
కాశ్యపప్యపత్యైకకరపీడనము గురు
లపితానుసృతిహారిజ పరిరక్ష
గోపతి గర్వనిర్వాపణావృత్తి య
నేకబాహాసురనిగ్రహంబు
నమితవిభీషణనామకోద్భవముఖ్య
సుప్రసిద్ధాత్మపదప్రదంబు
తే. నాదిగాఁగల రామకృష్ణావతార
చర్యల నుతింతు రుక్మిణీస్వాంతకాంత
జలజఘనచంచరీక శ్రీకొలనుపాక...
సీ. రాజవంశోదయు రమణీయసితివర్ణ
కాయు సీతాకరగ్రహణనిష్ఠుఁ
బ్రకటప్రలంబకబంధకరణ కృతాం
తు హారిసుతోచ్ఛేదను హానతాళ

పాలిహారిని సముద్భటవృషభాంకోరు
ధర్మభంగక్రియోదారు నిన్ను
బలభద్రరాము నపార కృపారస
పాథోధి మనమున పనివి పనివి
తే. యెక్క డేవేళ నెవ్వ డింకేమి యగునొ
యనుచు నున్నాఁడ గోఖురోద్ధతపరాగ
మిళదళీక శర్వరీక శ్రీకొలనుపాక... 87
సీ. మునుఁగుచు ఘనభవమునఁ మితిలేని దు
రితమందరతఁ జాల వెత సుడియుచుఁ
దని కెడునన్నుఁ గన్గొనవే మును కరుణ
దేవభావుక వాసుదేవ యజుఁడు
భావింపలేకను దేవ నీదాఁటరా
ని యపారమాయను నిపుణగరిమ
జనఁగ వికారత గనె నట యహహా రా
గములఁ బెనఁగి కడుఁ గదలరాక
తే. సోదరుఁడనయి యేప్రొద్దు జరుపు నాకు
నీచరణముల దృష్టింప నేరుపుదొర
కొనుట యెట్లు మాజాయాక కొలనుపాక...
సీ. నయరాజరాసగోష్ఠీయుతాంగనారోప
ణాంగజ సాధారణానులాప
యమిసంతతిపవిత్రహాత సుప్రభామిత్ర
సకలవిప్రస్తోత్ర జయచరిత్ర

దుర్ధరణక్షేమ వర్ధితసుత్రామ
యేనఃకరవిరామ మానికామ
ఘనయశోవిపులక కమలాప్తకులవత్స
విఫలకనిటలప్రవిచరదలక
తే. పరిభవించెద నేఁడె నీభక్తి దలఁచి
కలుషము తరతరాన తద్బలిమిఁ గలిమి
గలదె భయ మింక భిన్నాక కొలనుపాక....89
సీ. అస్మదీయశరీర మదరిపాటున బిడు
గునఁ గూలునో యగ్ని కొడులఁ గాలు
నో విషంబున జెడునో జలంబునఁ బడు
నో నురిని దగులునో శిలను బ
గులునో పతనమునఁ దొలఁగునో తెవులున
మలఁగునో యెట్టిదుస్మరణమున మ
తి తెలివిదప్పునో కృష్ణకృష్ణేత్యక్ష
రద్వయాపరమమన్త్రస్మరణ మ
తే. కట పురాకృత కర్మసంఘటనమునను
దొరకదో తప్ప నాడితి దొరక దెట్లు
గుప్తమాదృశజల్పాక కొలనుపాక... 90
సీ. రుక్మిణి సరసఁ గూర్చుండ సత్య విడె మొ
సఁగ భద్ర సురటి విసర సుదన్త
పావడ ప్రేయ జాంబవతి నాగ్నజితి కై
కడలను నిల్వ లక్షణ కళింద

జయుచితపుం బనులు మెయికొనఁ బదియారు
వేలు చెలుల్ జుట్టు గ్రాల సిరులఁ
జెలఁగఁ జతుర్విధశృంగారము గలుగ
ద్వారకాపట్టణాన్తఃపురమున
తే. రత్నమయపీఠిశృంగారరసముము గులుక
గొలువు గైసేయు కృష్ణ నిన్గొలుతు వల్ల
వలలనామల్లవరదాక కొలనుపాక... 91
సీ. కన్నులనును గెంపు గదుర బొమ్మ లదర
డాల్గలజిగిపచ్చ డంబు పచ్చ
డంబు కటి ఘటించి డాకేల మునికోల
గదియించి నొగల పగ్గములఁ బూన్చి
రథముపైనుండి ధర కుఱికి కవ్వడి
నిగిడి తెరల్పఁగ నిలక భీష్ముఁ
జంపుదు ననుచుం దచ్ఛరపరంపర కెదు
రెక్కి నడచు నీయహీనవీర
తే. రసము వర్ణింప వెఱఁగవురా ఖలీ చ
రాచరాత్మక కమలభవాండభాండ
గోళగుళికాప్రథనుధాక కొలనుపాక... 92
సీ. మలినద్విషద్ధ్వాతకలనాపరాజితా
త్మీయ సర్వస్వభర్తృక సమగ్ర
జనజాగ్రదాస్థానసరణి దుశ్శాసన
కరసమాకర్షితకబరితద్ధు

రోదర ముక్తవాసోదిష్ట హా కృష్ణ !
సమయోహి ! మాం రక్షతు మయమేవ
పాహి పాహీతి సంభాషిణీకృష్ణను
గాచినయట్టి నీకరుణ దలఁచి
తే. తలఁచి డెందాన ఖేదమోదములు దాల్తు
మాతులమిషద్విషత్కంసమహితకృతవి
పులవిధానాంబుధరధూక కొలనుపాక... 93
సీ. చిన్నప్పు డొకనాఁడు మన్నారగించితి
వని నినుబల్క జననికి నోట
భూమినదీనదముల జనపదముల
లలనాపురుషుల ఋషులఁ దరువుల
బురములఁ బశుమృగముల నగముల సరో
వరముల మఱి చరాచరములఁ బొరిఁ
బొరిఁ జూపి నివ్వెఱఁ బుట్టించి కన్నుమూ
యఁగఁజేయు నీయద్భుతాఖ్యరసవి
తే. లాసము నుతింపఁదరమౌనె రాసకేళి
కాకళాపాళికాపరి కలితజన్య
కోటినానావిధహృషీక కొలనుపాక... 94
సీ. భైష్మకపుస్వయంవరమిళితాఖిల
ధాత్రీవరౌఘమధ్యమున రుక్మి
ణీకన్యకామణి చేకొని వచ్చిన
ప్పుడు తదగ్రజుఁడు విస్ఫూర్తి మెఱసి

గోపాల మాపాపఁ గొనిపోకు పోకు మ
టంచు రణారూఢుఁడై కవిసిన
నవ్వి యవ్వీరునిఁ జిక్క నొవ్వఁగఁ జేసి
తల మూతి గొరిగిన ధార్ష్ట్యశాలి
తే. నీమహాస్త్రరసంబు వర్ణింపఁ దరమె
వృషభధ్వజు శేషు వీరప్రవృద్ధగర్వ
కలనహిమపర్వరీక శ్రీకొలనుపాక... 95
సీ. ముఖమున కీలి రొమ్మున శూలి యుదుట బ్ర
హ్మ నిమగడల నింద్రయమపవనులను
వేరుల వాతార్కవిశ్వాశ్వినుల బాహు
ల బలార్జునుల నూరుల యదువృష్ణి
భోజాంధకతతి వీఁపున హరివరుణ భీ
ముల సశస్త్రులఁ గని భువనభీక
రకస తేజోవతారమున యారాయబా
రమున గురుపభగరంచినట్టి
తే. నీవిలాసము వర్ణింప నేర్తు నెట్లు
కురుసభావిశ్వరూపావసరవిరచిత
గోజగద్ధృద్ధరీక శ్రీకొలనుపాక... 96
సీ. అరదాలతోఁ దున్కలైన జోదులు వత్త
డులతోడఁ దెగినరౌతులు మతంగ
జాళితోఁ బడినగజారోహకులు బొంద
ళమ్ములతో శకలమ్ములైన

ణావిచక్షణత్వమునకు మేలు గావలె
శరణాగతత్రాణబిరుదమునకు
శ్వశ్రేయసంబు గావలె యార్తరక్షాప
రాయణత్వమునకు హాయి గావ
తే. లె నిఁక కొదవ యొకింతైన లేదు నీకు
కొదవ లేకుండినను మాకు గోపికాని
గూహనకళాప్రవేశ శ్రీకొలనుపాక... 101
సీ. వీనులలోపల వీణాపరీణాసు
ధాఝరీమాధురీతతి ధురీణ
మగు ననాహతనాద మతిరుచి మ్రోయఁగా
గన్నులనునుబాష్పకణము లొలుక
నానోట కృష్ణకృష్ణా యను నుడువు ల
డరఁగా నఖండదండాయమాన
మౌ తేజ మొకటి బాహ్యాంతరంబులఁ గను
పట్టఁగా నొకమేడపైని కూరు
తే. చుంటి నొంటిగనని కలగంటి నిన్న
రేయి యిదియేమొకాని గరిష్ఠసత్వ
గుణసమగ్రతాచ్ఛవివేక కొలనుపాక...
సీ. కడఁగి బంధత్రయక్రమమున నడుము ని
క్కించి చిక్కులు వాపి కేవలాఖ్య
కుంభకంబున సూక్ష్మకుండలి మేల్కొల్పి
నడిమిమార్గంబున నడిచి యట న

నాహతనాదజన్యానందమున దేలి
మరలి రవీంద్వగ్నిమండలాగ్ర
మున కోటిసూర్యులకును నధికంబైన
ఘనతరాపోజ్యోతి గంటి నిన్ను
తే. గంటి లోపలిమర్త్యంబుఁ గంటి దీక్ష
మైనస్వప్నంబులోన ననంతనిత్య
గుణగణాతీత నిర్లోక కొలనుపాక... 103
సీ. ఘనముగా హృత్పద్మకర్ణికాంతరమున
కోటిచంద్రులకంటెఁ గొమరుమిగిలి
బహుసూర్యమండలప్రభలకంటెను నెక్కు-
డై శుద్ధమై బుద్ధమై యనంత
మై సత్యమై నిత్యమై వెలిలోపల
నంతట నిండి యొండై యఖండ
మై వాగగోచరమై విలసిల్లు నా
జ్యోతిని గంటి లోఁజూడ్కి దీర్ఘ
తే. మైన కలలోన నిను భవహరణగతికి
హేతు విఁకగల్గె రక్తితాహీనసంస్కృ
తిలులితనతజనానీక కొలనుపాక... 104
సీ. నుతతటాకవనప్రభృతిసంతతిని మించి
తిని వీరనారాయణుని మహిమను
కృతిముఖంబునఁగాని కీర్తిజగద్విది
తముగాదు గాన సీసములచేత

సంజీవసుకవీంద్రశతక మొక్కటి నీవు
రచియించు వీరనారాయణునక
టంచు శ్రీగోపరాజాన్వయ రాయనా
మాత్యచంద్రుఁడు రత్నహాటకాంబ
తే. రాదితాంబూలసత్కృతి నాదరింప
శతకము రచించి యిచ్చితి స్వామి నీకు
కుటిలహృదయపినాక శ్రీకొలనుపాక... 105
సీ. గణబాణషట్చంద్రగణనతశాలివా
హనశకవర్షంబు లరుగ వర్త
మానవిరోధికృన్నార్గశీర్షాదిమ
పక్షతృతీయేదభానువార
మునకు సంపూర్ణమై తనరిన యీకృతి
యాచంద్రతారార్క మగుచు ధరణి
నలరె నీవీరనారాయణశతకంబు
జదివిన వ్రాసిన జనులు సిరియు
తే. నాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి
బరగుదురుగాన నీకృప భక్తహృదయ
కల్పితపదపర్వరీక శ్రీకొలనుపాక... 106
సీ. తతభరద్వాజగోత్ర పవిత్రపుణ్యచా
రిత్రాయ్యవార్యమంత్రిపుత్ర గోప
రాజాన్వయమహేంద్ర రంగదయాశసాంద్ర
రాయనామాత్యచంద్ర ప్రరుంద్ర

శాశ్వతైశ్వర్యసంజాతదాయక కృపా
రససుధాలహరి విరాజమాన
ఫుల్లారవిందసంపల్లలనావాస
భాసురశ్రవణాంతభాగభాగ
తే. రుణవిభాభాసమాన విలోలలోచ
నాంచలనిరీక్షణ పరంపరాభిషిక్త
గోపదిఙ్ముఖదిగనేక కొలనుపాక... 107
సీ. శ్రీకృష్ణపదయుగాశ్రితుఁడ సాంఖ్యాయన
గోత్రుఁడ రఘుపతి పౌత్రుఁడ గుర
వకవీంద్ర పెద్దమాంబాపుత్రుఁడ రఘునా
థునకుఁ బూర్వజుఁడ మృత్యుంజయున క
నుజుఁడ రావూరువంశజుఁడ ననుమకొండ
సౌంజ్ఞగల్గిన యాదిశాఖను వెల
సినవాఁడ జాతకసిద్ధాంతముఖకళా
చతురుఁడ నుభయభాషావిశేష
తే. రసగుణాలంకృతి కవిత్వరసికుఁడ విర
చించితి భవచ్ఛతకము సంజీవకవిని
కుంఠితాశ్రిత భవభూక కొలనుపాక... 108
సీ. కరుణాతరంగ మంగళము రంగద్యశో
గంగాతరంగ మంగళము విహగ
కాంతతురంగ మంగళము హృతాసుర
ఘనచతురంగ మంగళము సర్వ

గజ్యోతిరంగ మంగళము నృత్తమునిహృ
త్కమలసారంగ మంగళము పుషిత
కలితసారంగ మంగళము కవేరభూ
గర్భస్థరంగ మంగళము నీకు
తే. భృతభషకజాలజాలప్రవృద్ధగహన
దహనభయభరభాగ్భావిణి ధర్మకర్మ
కలుషిత విపద్గహారిణీక కొలనుపాక
వీరనారాయణ ముకుంద విశ్వకుంద. 109

# పీఠిక.

ఈసదానందయోగిశతకము సర్వవిధముల వేమనపద్యముల ననుకరించుచు దురాచారములను, కపటవృత్తులను, వృథాడంబరములను, కులీనులయవివేకమును ఖండించుచున్నది. ఇందలిపద్యములందుఁ బ్రాయికముగా వ్యాకరణదోషము లున్నను శైలి మాత్రము వేమనపద్యములకంటె జటిలముగ నుంటచే కవి యక్షరాస్యుఁడని తోఁచుచున్నది. కవికాలము నివాసాదికములు తెలుపు నాధారము లీశతకమునఁ గానరావు. స్థూలదృష్టిచే నీకవి వేమనయోగి కావలివాఁడని తలంపవచ్చును. ఇందలిపద్యములు రసవంతముగ నున్నవి.

ఇదివఱకు ప్రచురింపఁబడిన సదానందయోగిశతకమునందుఁ గవియభిప్రాయమునకు వ్యతిరిక్తము లగుపాఠము లుండుటవలనఁ బ్రత్యంతరసహాయమునఁ బూర్వలోపములు సవరించి ముఖ్యములగు పాఠాంతరము లుదాహరించి యీముద్రణమునఁ బుస్తకమును సవరించితిమి. తాళపత్త్రప్రతులతోఁ బోల్చిచూడ క్రొత్తపద్యము లైదు లభించెను. ఇంక

ను బ్రత్యంతరసహాయమునఁ బరిశీలింప నెన్నివిశేషాంశములు లభించునో తెలుపఁజాలము.

ఈకవినామము సదానంద వరదరాజయోగియని శతకకవిచరిత్రకారులు వ్రాసిరిగాని యీ శతకములో రెండుతావులలోఁగూడ సదానందయోగి నామమే గలదు నామాంతరము మృగ్యము. ఫణిభట్టకవి కద్వైతబోధనము సదానందయోగి గావించినటులఁ బరతత్త్వరసాయనమునఁ గలదు. ఫణిభట్టారకునికాలముగాని యతనిగురుఁడే శతకకర్త యనుట కాధారముగాని కానరాదు. ఈశతకలిఖితమాతృకలు నూఱుసంవత్సరములనాఁటివి కానవచ్చుచుంటవలనను వేమనశైలి ననుకరించుటవలనను బదునాఱు పదునేడు శతాబ్దములమధ్య నీకవి యుండెనని యూహసేయవచ్చును. ఈశతకమును బ్రత్యంతరసహాయమునఁ బరిశీలించుటయు నితరశతకములు కవికాలము పరిశోధించుటయు నావశ్యకము.

ఇట్లు

నందిగామ. }
1-1-24. }

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శ్రీ ర స్తు.

# సదానందయోగిశతకము.



శ్రీమహోన్నతవిజ్ఞానసిద్ధి నొసఁగు
సద్గురుస్వామిపాదాంబుజములు తలఁచి
సకలతత్త్వార్థసంగతుల్ సంగ్రహించి
గీతశతకంబు రచియింతుఁ గీర్తి వెలయ
నవ్యతరభోగి శ్రీసదానందయోగి. 1

ధరణిలోపలఁ దనరారుతత్త్వములకు
నవ్వలై యున్నతత్త్వంబు నెవ్వఁ డెఱుఁగు
శివుఁడు గురురూపమై వచ్చి చెప్పకున్న, నవ్య...2

పుట్టుచావులు రెండును బొరయనట్టి
నిర్మలజ్ఞానసంపన్ననిష్ఠ గలుగు
తెరువుఁ గల్పించునాతఁడె గురువరుండు, నవ్య...3

బట్టబయ లైనయీపరబ్రహ్మమహిమ
దేశికస్వామికృప లేక తెలియరాదు
యెన్నిచదువులు చదివిన నేమిఫలము, నవ్య... 4

సకలశాస్త్రంబులెల్లను జదువువారు
చదువుకొనట్టివారితో సమముగానె
గురుముఖంబున ననుభవం బెఱుఁగకున్న, నవ్య...5

దేవపూజలగూడ వేల తీర్థ మేల
చెలఁగి యష్టాంగయోగముల్ సేయ నేల
గురుముఖంబున క్షణములో గుఱియుగనిన, నవ్య...
తన్నుఁ దెలసిన మఱి వేఱె తనకు లేదు
తన్నుఁ దెలసిన బ్రహ్మమై తాను నిలుచు
తన్నుఁ దెలిపినసద్గురూత్తమునివలన, నవ్య... 7
సద్గురువు గల్గునటుమీఁదఁ జదువు లేల
నిజమెఱింగినపిమ్మట నిష్ఠ లేల
సర్వమును దానయై యున్న సరణి గాదె, నవ్య...8
తత్పదంబను నదియపో 'త్వం'పదంబు
అసిపదంబును నీ రెంటి కైక్యమగును
దెలియు శివయోగి మూఢుండు దెలియలేఁడు, నవ్య.
సకలనైష్ఠికములు గాదు శక్తి గాదు
జీవుఁడును గాదు పరము నై చెలఁగు బ్రహ్మ
మద్భుతానంద మైనట్టియనుభవమున, నవ్య... 10
రూపులకునెల్ల రూఢియౌ రూపు గాక
వెలుఁగులకునెల్ల వెలుఁగునై వెలుఁగుఁగాక
చెలఁగు ననుభవవేద్యమై చిద్ఘనంబు, నవ్య... 11
లోను జూడంగఁ జూడంగ లోనుగాదు
బయలు చూడంగఁ జూడంగ బట్టబయలు
బైటలోపలఁ బూర్ణుఁడై పరఁగుశివుఁడు, నవ్య...12

శివుఁడు జీవుండు రెండువస్తువు లటంచు
నిచ్చ నెంచిన సాయుజ్య మెట్లుకల్గు
శివశివా భేదమున్నది సేయరాదు, నవ్య... 13
నీట వెలసినలవణంబు నీటఁ గలయు
నీరు గాకుండ దారీతి నిశ్చయముగ
శివునిఁ గలసిన జీవుండు శివుఁడుగాఁడె, నవ్య...
సత్తు నెఱుఁగ దసత్తు దా జడముగాన
సత్తసత్తువు నెఱుఁగఁ బ్రసక్తి లేదు
అట్టిసదసత్తు లెఱిఁగెడి దాత్మసువ్వె, నవ్య... 15
సత్తుఁగూడినయపుడెల్ల సత్తెయౌను
సత్తు లోఁగూడ మఱితానె సత్తునౌను
గాన జీవుండు సదసత్తుగాఁడె తలఁప, నవ్య... 16
సూర్యదివసాదికంబులు చూచుకొన్న
నాస్పదంబును బుద్ధికి నాస్పదంబు
పెక్కుభ్రమలను నెందుకుఁ జిక్కినారు, నవ్య... 17
కలదు కల దన్నవారికి కలదు జగము
లేదు లే దనువారికి లేదు జగము
కలిమిలేములు మాయకుఁ గలగుణములు, నవ్య...
మతము లెన్నైనఁగలవు భూమండలమున
మతము లన్నియు సామాన్యమాయ సువ్వె
మతము విడిచినమతికి సమ్మతము గాదె, నవ్య...

తనకు దేహాభిమానంబు తఱఁగనేని
మాయసంసార మప్పుడే మాయమయ్యె
మాయరూపంబులే నష్టమాయె మాయ, నవ్య...
అతిరహస్యము మఱిబయ లనఁగ వినియుఁ
దెలియఁజాల రదేమొకో తేటపడఁగ
మాయ బలమైగదా యిట్లు మఱుఁగుచేసె, నవ్య...
మనసు మాయనితానును మచ్చికాయె
మనసు మాయఁగ నామాయ మాయమాయె
అందు నేమాయె సత్తె యానంద మాయె, నవ్య.
గాలి నిలిచినఁ గలదండ్రు కాయసిద్ధి
కాయమును గాలియును రెండు మాయగాదె
కాయసిద్ధాట తత్త్వంబుఁ గనుట కాదె, నవ్య...
కాయసిద్ధైనవారిని గన్నవారు
నున్నవారును గలరె యీయుర్విలోనఁ
గాయసిద్ధులు తొల్లింటికథలు సువ్వె, నవ్య... 24
తనువు గలుగుట ప్రారబ్ధ మనుభవింప
ననుభవము దీఱె నిశ్శేష మైనవెనుక
కాయసిద్ధికిఁ బడుపాటు గాలిఁబోదె, నవ్య... 25
గరికివేళ్లును నీళ్లును గాయకసరు
నాఁకటికిఁ దిన్నఁ గాయసిద్ధాటయెట్లు
మనుజు లిట్లుల వెఱ్ఱులై మరులుకొనిరి, నవ్య...

చెనఁటిమానవు లణిమాదిసిద్ధులందు
మోహ మొనరింతు రది కాదు ముక్తిపథము
పరమవిజ్ఞానపరు లిట్లు భ్రమలఁబడరు, నవ్య... 27
పుట్టగోఁచులు పెట్టి విభూతిఁ బూసి
జడలు ముడివెట్టి కడసము చంకఁ బెట్టి
గుహలఁ గూర్చుండి ప్రాణాలు కుడియఁబట్టి
తనువు పీడింపఁ దత్త్వంబుఁ గనుట యెట్లు, నవ్య...
కరకమండలమును బట్టి కావికోఁకఁ
బూనునంతనె ముక్తిని బొందుటెట్లు
సమయవర్ణాశ్రమాదులు భ్రమలుగావె, నవ్య...
సప్తకోటిమహామంత్రజాలమెల్లఁ
జిత్తవిభ్రమ మదిగాదు శివపదంబు
నభ్యసింపఁడు దాని మోక్షాధికారి, నవ్య... 30
హెచ్చుఁ:క గల్గి మానవుఁ డిహపరార్థ
ఫలము లాసింపకను బ్రహ్మపదముఁ గోరి
నిర్గుణాష్టాంగయోగంబె నెఱుఁగవలయు, నవ్య...
సగుణచింతన మణిమాదిసాధనంబు
నిర్గుణోపాస్తి కైవల్యమార్గ మిదియుఁ
గాన నిర్గుణయోగంబె పూనవలయు, నవ్య... 32
మంత్రలయహఠ మనియెడుమాయ విడిచి
రాజయోగంబు సద్గురురాజువలనఁ
దెలియ నేర్చినవాఁడెపో దివ్యయోగి, నవ్య... 33

ముక్కుబిగియించుకొని గాలి మూటగట్టి
పట్ట పసలేనివెనుబయల్ ప్రాఁకనేర్చి
యద్భుతానందమును బొందునతఁడె యోగి, నవ్య.
లోకదృష్టియు మఱియు నాలోకదృష్టి
గానరా దందు నీరెండుఁ గాననట్టి
భావదృష్టిని గలవాఁడె భవ్యయోగి, నవ్య... 35
వెలుఁగుకవ్వల వెలిఁగెడు వెలుఁగుఁ జేరి
బయలుఁ గొనిపోయి యచ్చట బయలుఁగలిపి
నిశ్చలత నున్నయతఁడెపో నిత్యయోగి, నవ్య...36
ఒక్కటే లేదు మఱి వేయి లెక్క లేదు
నొండు రెండును గాక దా నిండియుండు
నట్టితత్త్వంబుఁ దెలిసినయతఁడె యోగి, నవ్య...37
చూడకే చూచు జగమెల్లఁ జోద్యమంది
చావకే చచ్చు నత్యంతసరసలీల
చేయకే చేయుఁ గ్రియలెల్ల సిద్ధయోగి, నవ్య...
చూచువాఁడును మఱిచూపు చూడఁదగిన
వస్తువులు లేక సమరసత్వమునఁ దలఁపు
నిలుపనేర్చినవాఁడెపో నిత్యయోగి, నవ్య... 39
కర్త యైయుండియును మఱి కర్త గాఁడు
భోక్త యైయుండియును మఱి భోక్త గాఁడు
అట్టితత్త్వంబుఁ దెలిసినయతఁడె యోగి, నవ్య...

తలఁపు మఱి పనువస్తుద్వితయము విడిచి
శుద్ధమైన యవస్థందు సుస్థిరముగ
నిలిచి యనుభూతిఁ గనువాఁడె నిత్యయోగి, నవ్య.
మూఁడుత్రోవలలోపల ముఖ్యమైన
నడిమిత్రోవను జని లోన నాగకన్య
నారడించినవాఁడెపో యుచితయోగి, నవ్య... 42

ఎచట నేవంకఁ జూచిన నచటనెల్లఁ
దాఁ దరి చిన్మయలింగ మై తోఁచవల దె
యదిగదా యోగసిద్ధికి నాలయంబు, నవ్య... 43

చదువవచ్చును వేదశాస్త్రంబులెల్లఁ
బలుకవచ్చును తానెపో బ్రహ్మ మనుచు
ననుభవజ్ఞుఁడు గానేర్చు టదియె యరుదు, నవ్య.

వ్రాయవచ్చును బట్టెఁడుబూడిదైన
వేయవచ్చును రుద్రాక్ష వేలసంఖ్య
సేయఁగా రాదు మనసు సుస్థిరముగాను, నవ్య...

ఒక్కఁడే పోయి యడవుల నుండవచ్చు
నీరు ద్రావుచు బ్రాణము ల్నిలుపవచ్చు
రాజయోగంబు సేయంగరాదుగాక, నవ్య... 46

వనధి లోఁతని చెప్పఁగా వచ్చుఁగాక
మునుఁగవచ్చునె మేనెల్ల మున్గగాను
సోఽహ మనవచ్చుఁ దన్నుఁదాఁ జూచు టరుదు, నవ్య.

ఎవ్వారైనను బరమార్థ మిట్టిదనుచుఁ
దెలియనేర్తురె తమలోన తేటపడఁగ
నుత్తమజ్ఞాని శివయోగి యుండుఁగాక, నవ్వ...48
స్నాన మొల్లఁడు దేవతార్చనము సేయఁ
డమలవిజ్ఞానసంపన్నుఁ డైనయోగి
లోకులకుఁ దెల్పనే వానిలోనిగుట్టు, నవ్వ...49
తమనిజం బేమియెఱుఁగరు ధాత్రిజనులు
మృచ్ఛిలాకాష్ఠతామ్రనిర్మితము లైన
దేవతల గొల్చువాఁ డెట్లు దెలియనేర్చు, నవ్వ...
ఱాళ్లఁజేసిన వాకకొన్ని రాగి కొన్ని
మ్రాఁకఁజేసిన వాకకొన్ని మంటిఁ గొన్ని
యిట్టిదేవుళ్లు ముక్తియ నెట్లు నేర్చు, నవ్వ... 51
మండలాంతరదేదీప్యమాను శివుని
మూఁడునాలుగుపాతల ముడిచి ముడిచి
యఱుతఁ గట్టుదు రొకకొంద అల్పమతులు, నవ్వ.
కులము రూపును గుణమును గాలఁబెట్టు
నరుఁడు శివయోగివిద్యలు మరగెనేని
చెడ్డసంసార మైతేను చెప్ప నేల, నవ్వ... 53
బ్రహ్మవిద్యకుఁ దనయింటిప్రజలు చాల
సమ్మతించిన గృహమందె సలుపవలయు
వట్టిగాకున్న మఱి యింటియాస లేల, నవ్వ...

మనుజమాత్రుండె శివయోగి మహితకీర్తి
యఖిలజగములు తానైన యట్టివిధము
దృష్టముగఁ జూచు ననుభవదృష్టిచేత, న... 55

పరమసుజ్ఞాననిధిఁ జూచి పాపజనులు
దమకు సరియైనవారుగాఁ దలఁతు రెపుడు
వారు గన నేర రెట్టి నిర్వాణమహిమ, న... 56

కట్టఁగావచ్చు మృదువైన కావికోకఁ
బెట్టఁగావచ్చుఁ బాదుక లెట్టివైనఁ
బట్టఁగా రాదు మన సింత పాఱనీక, నవ్య... 57

కూడు దినరాదటంచును గొందఱయ్య
లేలకో వెళ్లిత్రోవల నెఱుఁగలేరు
కూడు విడిచిన విడుచునా కుటిలబుద్ధి, న... 58

పాలు నీరును నొక్కటై పరిణమించు
కరణి బ్రహ్మంబులో మాయ గలిసియుండు
చారు శివయోగి తెలియు హంసంబుపగిది, నవ్య...

నిత్యనైమిత్తికాదులు నెఱపకున్న
పాతకం బని వెఱచునే పరమయోగి
పోతురాజుకు నేల నీభూతశంక, నవ్య... 60

ఊరు మేలైన నుండును యోగివరుఁడు
తోడు మేలైన బోవును తోడుతోనె
వాని కెక్కడ లోకంబువారినడత, నవ్య... 61

తన్నుఁ దాఁ దెల్సి జగమెల్లఁ దానయైన
మర్మ మెఱుఁగంగఁజాల రీమందమతులు
గడవఁజాలరు సంసారఘనపయోధి, నవ్య... 62
ఏమి భుజియింపఁగోరిన నెచట నున్న
నెందుబోయినఁ దన కెందు నేమిఁ గొదవ
పూర్ణభావంబు తనయందుఁబొడమియున్న, నవ్య.
బుద్ధిజాడ్యులు తమలోనఁ బూర్ణమైన
నిండుబంగారమున వన్నె నిలచినట్లు
కఠినమై యున్న బ్రహ్మంబు గానలేరు, నవ్య... 64
చదువు లేఁటికి దేవతార్చనము లేల
నిత్యనైమిత్తికాదులనియమ మేల
స్వానుభూతిరసామృతాస్వాదనులకు, నవ్య... 65
పూజలును మంత్రకథలును బుస్తకములు
యంత్రజాలంబు యోగంబు తంత్రములును
కడఁగి బ్రహ్మానుభవవిఘ్నకరము లరయ, నవ్య...
అనుభవము చాల కొకకొంద ఱవనిలోన
సిద్ధయోగుల మనుకొంద్రు సిగ్గు లేక
తేటతెలివిగఁ దమ్మేమి తెలిసినారు, నవ్య... 67
స్మార్తకర్మంబుఁ గొందఱు సలుపలేక
*బ్రహ్మవేత్తల మనుకొంద్రు బైసిమాలి
అట్టిజనులకుఁ గైవల్య మెట్టుగలుగు, నవ్య... 68

* పరమయోగులు.

అనుభవముఁ దెల్పనేరనియతనిచేత
చారు సుజ్ఞానమును విన్నవారిప్రజ్ఞ
అంధకుఁడు చూపుతెరువున నరుగుకరణి, నవ్య...

విశ్వమున నూట వేయింట వెదకిచూడ
నొక్కశివయోగి దొరకుట యొక్క వరయ
కల్లయోగులకేమి పెక్కండ్రు గలరు, నవ్య... 70

బ్రాహ్మణు లటంచుఁ గొందఱు పలుకుటెట్లు
బ్రహ్మ నెఱుఁగంగనేరక బాఁపఁడగునె?
బ్రహ్మ నెఱిఁగినవాఁడె పో బ్రాహ్మణుండు, నవ్య...

వేషధారులఁ జూచి వివేకులైన
భ్రమయుచుందురు వేషంబుబలిమిఁ జూచి
తెల్లముగ లోనిగుట్టెల్ల దేవుఁ డెఱుఁగు, నవ్య...

వేదశాస్త్రపురాణాదివిద్యలెల్లఁ
జదివి పాండిత్యములు సేయుజనులకెల్ల
ననుభవజ్ఞాన మెక్కడి దరసి చూడ, నవ్య... 73

అనుభవజ్ఞాని యైనట్టియమలమూర్తి
తన్ను ప్రకటన సేయఁడు ధాత్రిలోన
నివురు నుముకయు నిండిననిప్పురీతి, నవ్య... 74

తాను నిర్మలుఁ డై యుండి తనకు లేని
యంటుఁ గల్పించుకొని తీర్థ మాడనేల
మనము పోయెడిపోకలు మాన్ప వశమె, నవ్య...

మనసు వెగటౌట యెఱిఁగినజనము లెల్లఁ
బాఱవిడి చూరకుందురు పట్టులేక
వెఱ్ఱివాఁడైన సంకెళ్లు వేయవలదె, నవ్య... 76

బ్రహ్మనిష్ఠాపరుం డైనపావనునకుఁ
దీర్థయాత్రల భూమెల్లఁ దిరుగనేల
తాను గలచోట సకలతీర్థములు గలవు, నవ్య...

*మాంసమును చీము నెత్తురు మలిన మైన
తోలుఁ గొనిపోయి నీళ్లలో దోఁచినపుడె
శుద్ధిగాదు మనఃపరిశుద్ధిగాని, నవ్య... 78

మఱియు సర్వేంద్రియములకు మనసు రాజు
మనసునకు రాజు తలఁపంగ మారుతంబు
మనసు మారుత మొకటైన మఱియు సుఖము, నవ్య.

మనసు నిల్పంగ నిలుచును మారుతంబు
చూపు నిలుపంగ నిలుపంగ సుఖము నిల్చు
స్థిరమనోదృష్టి నిల్పినఁ జేరు ముక్తి, నవ్య... 80

పాలు నీరును రుచియును బరగునట్టి
జీవుఁ డనుమాయశివుఁడును జేరియుండు
మొదల గడపట నిత్యుండు మూఁడువగల, నవ్య.

* కష్టమాంసంబు నెత్తురు గప్పుకొనిన, తోళ్లఁగొనిపోయి
ముంతురు నీళ్లలోన.

సత్త్వ మిది యని తెలిసియు జనులతోడఁ
జెనకి పలుమాఱు వాదము సేయఁబోక
మౌనవృత్తిని జరియింప నుచితనము, నవ్య...
ద్వైత మనుచును గొంద ఱద్వైత మనుచు
వాద మొనరింతు రెఱుఁగక వారు భువిని
కలిమిమై నట్టితత్త్వంబు గానలేరు, నవ్య... 83
మానవులు వారలెంత సజ్ఞాను లైనఁ
గడపఁజాలరు ప్రారబ్ధకర్మఫలము
లిందుకై కాదె తనువుల నెత్తవలసె, నవ్య... 84
*జనుఁడు దా నవివేకియై సాహసమునఁ
బట్టు దుర్దానములు మఱి పాపమనక
వాని ననసేల గతజన్మవాసన యది, నవ్య... 85
ఒడలు సర్వేంద్రియంబుల కునికి గాదె
యొడలు గలవానికిని గాదె యోగవిద్య
యొడలు చెడినట్టివానికి యోగమేల, నవ్య... 86
బంధ మెచ్చటనుండి సంప్రాప్తమయ్యె
ముక్తి యేవంకనుండియు మొలచివచ్చె
బంధముక్తులు రెండును భ్రమలు సూవె, నవ్య...
ఇహపరాపేక్షలును రెండు నెంచిచూడ
నినుము బంగారు సంకెలలే తలంపఁ
గోర రిట్టివి మోక్షాధికారు లెప్పుడు, నవ్య... 88

* శాస్త్రవిదుఁడయ్యు ననుకొందు.

గుహలఁ జొచ్చుక కొందఱు కూడు నీళ్లు
విడిచి తమ్మేమి కన్నారు వెత్తివారు
మూలఁ బెట్టిన దేహాలముక్తియెట్లు, నవ్య... 89
చేఱులుంగని నలికూనజీవు లెల్ల
విషయములఁ జిక్కుపడినట్టివిధము వినవె
పొంగి ఝషకము గాలము మ్రింగుకరణి, నవ్య.
దేహ మస్థిర మని యెంత తెలిసియుండు
మంచిగతి చూచుకోలేరు మాయఁ దగిలి
జీవు లజ్ఞాన మేమని చెప్పవచ్చు, నవ్య... 91
చాలుచాలును సంసారసంగ మనుచు
వేఁడి వెసలంటి గొబ్బున విడిచినట్లు
విడిచి మనుజుండు సద్గురు వెదకవలయు, నవ్య.
దేవదానవమానవతిర్యగాఖ్య
జీవు లింతల భ్రమలచేఁ జిక్కినారు
శక్తి బలవంత మీజగజ్జాలమునకు, నవ్య... 93
సుతుని నాలిని సంపదఁ జూచి చూచి
మోహితుండై నరుఁ డూరకే మోసపోవుఁ
దనకు నవి మీఁదఁ జేటని తలఁచుకొనఁడు, నవ్య.
ఆలుబిడ్డలు తన పని యాస సేయు
నందు నేమియు మేలు లే దరసి చూడ
వెంటవత్తురె తనువులు విడిచిపోతె, నవ్య... 95

ఆలు బిడ్డలు విడిచిన నందువలన
మోక్షమబ్బునె తనుఁ బట్టి ముంచుకొన్న
కల్మషము తీఱినప్పుడు గానఁ గలదె, నవ్య... 96
విషయముల రోసి నరుఁడు నిర్విషయుఁ డైనఁ
దనకు మోక్షంబు హస్తగతంబు కాదె
విషయములకన్న మఱిచేటు వేఱలేదు, నవ్య...97
వేడ్కనై యుండు ముందఱ విషయసుఖము
వెనుక బరువౌను సంసారవిషయసుఖము
కాదు సుఖ మిది మీసాలమీఁది తేనె, నవ్య...98
చుట్టములు తల్లితండ్రులు సుతులు హితులు
తాను పోయెడిగతులకుఁ దగిలి రారు
వార త్రోవంప వచ్చెడువారుగాని, నవ్య... 99
మొదల సంసారబద్ధుఁడై మోసపోయి
వెనుక చింతించు దేహంబు విడుచువేళ
నిట్టిజీవుండు దుదముట్ట నెట్లు నేర్చు, నవ్య... 100
తన్ను గట్టను మఱి త్రాళ్లు తానె తెచ్చి
కట్టుపడురీతి జనుఁడు సంకల్పమనెడు
పాశజాలంబుతో వాలబద్ధుఁడగును, నవ్య... 101
చేయుక్రియ లెల్ల శివుఁడైన సేయవలయు
తనకు కర్తృత్వ మెన్నఁడు తలఁపరాదు
మనుజుఁడపరోక్షమునుబొందుమార్గ మిదియ, నవ్య.

ఏమతంబున నుండిన నేమితప్పు
ముక్తిగనువారి కొక్కటి ముద్రపదము
తాను సంకల్పరహితుఁ డైతేను చాలు, నవ్య...
సకలయోగీంద్రహృద్యమై సారమమరు
వాక్యఫణితి సదానందవరుఁ డనియెడు
యోగివిరచితవైరాగ్యయోగశతక
మలరు నాచంద్రతారార్క మగుచు మహిని. 104

సదానందయోగిశతకము

సంపూర్ణము.

---

# పీఠిక.

---

పరమానందయతీంద్రుఁడు రచించినగ్రంథము
లలో శివముకుందశతకము సంపఁగిమన్నశతకము
ప్రకృతము ముద్రితములై యున్నవి. శివముకుంద
శతకము కవితాశైలినిబట్టిచూడఁ బ్రథమప్రయత్న
మేమో యని తోఁచును. వేదాంతాభ్యాసమునకుఁ
బ్రథమమునఁ జెప్పవలసిన సగుణనిర్గుణరూపములు
మాయ, ప్రకృతి లోనగునవి యిందును, ఉపాసన
యోగములు గురుసేవ లోనగునవి సంపఁగిమన్నశత
కమునందు నుంటవలన శివముకుందశతకము ప్రథ
మప్రయత్నమని తోఁచుచున్నది. శివముకుందశత
కము మృదుమధురశైలిలోఁ బఠనీయముగ సుబో
ధముగ నున్నది.

"ఏకోదేవః" యని శ్రుతులు చెప్పుటవలన
హరిహరరూప మగుబ్రహ్మస్వరూపమును నేకము
గా భావించి యీకవి హరునకు ముకుందునకు
నంకితముగ నీశతకము రచించెను. దీనివలన నీకవి
కాలము నిరూపింప నొకస్వల్ప మగునాధారము
చిక్కెను. ఇంకను బ్రబలాధారములు చిక్కువఱకు
దీనిని కవికాలనిరూపణముపట్ల నుపయోగించుకొన
నను వానేని పరిగ్రహింపనగును. ఈకవినిగూర్చి విశే
షాంశములు సంపఁగిమన్నశతకపీఠికలోఁ గలవు.

పంచతంత్రము హరిహరాంకితము గావించిన బైచరాజు వెంకటనాథకవి తనగ్రంథములో,

క. ఏ చనువు కలదు హరిహర
సాచివ్యము బొంద నితరజనులకు మది నా
లోచింపఁ దిక్కయజ్వకు
నాచనసోమునకు మఱియు నాకుం దక్కన్.

అనుపద్యము వ్రాయుచు హరిహరుల కంకిత మొసంగు స్వతంత్రత తిక్కనసోమయాజికి, నాచన సోమునకు, వెంకటనాథునకు (తనకు)ఁ గలదని తెలుపుటచే నీపరమానందయతి వెంకటనాథున కావలఁ బదునేఁడవశతాబ్దాంతమున నుండెనేమో యని తోఁచును. ఇది తురీయాశ్రమములోని నామమై యుండును. కవిజన్మనామము తెలియరాదు.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీ ర స్తు.

# శివముకుందశతకము.



క. శ్రీవరగిరిజానాయక
గోవింద లలాటనేత్ర గోకులతిలకా
భావజసంహార హరిహర
భావాత్మక శివముకుంద పరమానందా. 1

క. దైవము లిద్దఱు నేకో
దేవాది శ్రుతులవలనఁ దెలియఁగ నొకచో
భావించెద మిము నేకీ, భావంబుగ శివ... 2

క. భక్తులపరిపక్వములకు
వ్యక్తులు రెండౌటగాక వర్ణింపఁగ న
వ్యక్తం బని తెలియుట నిజ, భక్తి గదా శివ...

క. పరమానందయతీంద్రుఁడ
సురుచిరముగ మిమ్ము వాక్ప్రసూనంబులచేఁ
గరమర్థిఁ బూజచేసెద, పరమాత్మా శివ... 4

క. ఒకఁడై రెండై మూఁడై
సకలంబై యేమిగాని సహజము బయలై
యకలంకమతికిఁ దోఁచును, బ్రకటముగా శివ.

క. తనమహిమ తనకుఁ దెలిసినఁ
దనయందే తోఁచి యణఁగుఁ దత్త్వము లెల్లన్
దనమహిమ తెలియఁ దనకే, పనుపడవలె శివ...

క. తనుఁ దాఁ దెలిసెడిమార్గం
బనువుగ సద్గురులవలన నతిసులభంబౌ
తనయుక్తుల శాస్త్రంబులఁ, బనిగొన దది శివ...

క. గురువాక్యము శాస్త్రార్థము
గురుతుగఁ దనయనుభవంబుఁ గుదురుగ నొకటై
మఱి నిల్చునేని యదిగా, పరమార్థము శివ...

క. మితిమేరలేనిజన్మము
లతికష్టము లనుచు నెంచి యంతటఁ దత్త్వం
బతివిశదముగాఁ దెలియని, బ్రతు కేఁటికి శివ.

క. అలతత్త్వము గురుకృపచే
నలవడు నని నమ్మి మిగుల నాసక్తుండై
తలపడవలె గురుభజనకుఁ, బలుమాఱును శివ.

క. అల సద్గురుకృప లేకయె
తలపడి చదివితి నటంచుఁ దటవటసుద్దుల్
పలుకుచు తిరిగినఁ దెలివికి, ఫల మౌనా శివ...

క. కంటెసఁగఁ గర్మజాలము
లుంటే బంధంబు దీఱదో గురుపదముల్
కంటే మోక్షము చేరువ, పంటగదా శివ... 12

క. కొందఱు తత్త్వపుమాటల
సందడిఁ బడి తెలిసినట్లు సద్గురుకృప లే
కుందు రనుభూతిఁ గానని, పంకిలవలె శివ...

క. తాటాకులు ద్రిప్పుచుఁ బడి
కోటులు చదువంగనేమి గురువాక్యంబుల్
పాటించి తెలియ కది యే, ర్పాటౌనా శివ...

క. నిజమైనముక్తికొఱకై
సుజనుఁడు సద్గురుని వెదకి సుస్థిరమతి యై
భజియింపక గలదే గతి, ప్రజలకు నిఁక శివ...

క. గురుభజనఁ బాపములు చెడు
గురుభజనను గర్మ ముడుగుఁ గోరిక లుడుగుం
గురుభజన ముక్తికర మగు, పరమాత్మా శివ...

క. నాటినయాటిక విడిచి ప
టాటోపము లేక నమ్రుఁడై గురుభజనం
బాటింపక ననుభవ మే, ర్పాటౌనా శివ... 17

క. ఆకట గురుమతమున దే
హాదులఁ దొలఁగంగ నేర్చునాతనిమదిలో
పొడిఁక సహజానందము, పాదుకొనుఁగ శివ...

క. వినినప్పుడె కనవచ్చును
ననుభవి యాయోగివాక్య మాదరమునఁ దా
వినఁగూడనియహమిక చేఁ, బనుపడ దది శివ...

క. మాటల వినుకులఁ దగులదు
సూటిగ సద్గురుఁడు చూపఁ జూచినఁ గాకే
ర్పాటును గా దది కుజనులు, పాటింపరు శివ...

క. అతిచంచల మై తిరిగెడి
మతి మీఁదయవలన నిపుడు మట్టుకు వచ్చెన్
గతిచెడి తెక్కలు విఱిగిన, పతగమువలె శివ...

క. ఇలు వెడలి బయలుదేరక
గెలిచే దేలాగు మాయఁ గినియుచు రాఁగా
నిలు సొచ్చి తలుపు మూసిన, బలిమేదీ శివ...

క. భైలుగ మాయాభూతము
హేలాగతి నొప్పఁ గాక యేలా తొలఁగున్
జాల వివేకపుఁజబుకుల, పాలాడక శివ... 23

క. ఏయెడఁ బెద్దలసంగతి
సేయంగా నిత్యసుఖము చేకొనవచ్చున్
మాయాభూతము తొలఁగును,పాయం బిది శివ.

క. చాలం గర్మపుఁదొట్లన్
సోలంగా నుంచి మాయ జోలలు వాడున్
లాలీయని జీవులనే, బాలురఁ గని శివ... 25

క. తానే పరదైవంబని
కానక తనకన్న వేఱు గాఁ దలఁచేదే
యూనినమాయారూపము, భానునుతా శివ...

క. తను నే నెఱుఁగనిమును పే
తనయాటలు చెల్లెఁగాక తా మా యనఁగా
నను నే నెఱిఁగినపిమ్మటఁ, బనిగలదా శివ... 27

క. అంతా నే నై యుండఁగ
నింతైనన్ మాయ కునికి యెక్కడి దయ్యా
యంతటఁ దొలఁగక నాతోఁ, బంతంబా శివ...

క. కట్టిడిమాయ యనంగా
రట్టుకు లోనాయెఁగాక భ్రమ యది కాదా
పట్టఁ బసలేని దది యే, పట్టున నిఁక శివ... 29

క. ఔరౌర మాయకంటెను
నేరీతిని దనగుణంబు లెఱుఁగ రటం చా
నేరమి జీవులపై నిడి, పాఱెడి నిఁక శివ... 30

క. నలుదిశల నిక్కడక్కడఁ
దలచూపఁగ లేక మాయ డాఁగెను కంటే
యలపూర్ణుఁడ నేఁ గాఁగా, బల ముడిగెను శివ.

క. కడుదబ్బఱలకు నెల్లను
నొడిఁగట్టిన మాయగుట్టు లోఁగి నేఁ గనఁగాఁ
బొడచూప వెఱచి తానే, వడిపోయెను శివ...

క. ఇది కల్లర ఛీయన్నా!
వదలక యీమాయ కదియవచ్చిన నేమో
ముదిలంజెవలపు చాలును, పదివే లిఁక శివ...

క. అవిరళతత్త్వం బెఱిఁగెడు
సువిచారం బొకనిపాలిసొమ్మా మనుజుం
డెవఁడైననేమి తెలివికి, భవమోచన శివ... 34

క. ఏపాటు లేక తనలోఁ
జూపట్టుచు వెలుఁగుచుండు సూక్ష్మబ్రహ్మం
బేపారఁగఁ దెలియ రయో, పాపాత్ములు శివ. 35

క. శాంతంబై పూర్ణంబై
యెంతయు బ్రహ్మంబు తెలిపి కేర్పడ మాయా
క్రాంతముగా మదిఁ దలఁచుట, భ్రాంతిగదా శివ.

క. పోషించి తత్త్వరచనల
భాషించినఁ దెలియలేక పామరమతులై
దూషణ చేతురు కొందఱు, పాషండులు శివ...

క. మెండుకొనుతత్త్వవాసన
లుండదు పరిపక్వహృదయ మొగిఁ గాకుంటే
నెండినకసుగా రైయనది, పండౌనా శివ... 38

క. పుట్టించనిబుద్ధులు చెవిఁ
బెట్టిన నది లెస్సగాక పిమ్మట ధరలోఁ
బుట్టించెడిబుద్ధులఁ జెవిఁ, బట్టుదురా శివ... 39

క. వారక సంసారంబునఁ
బోరాడిన నేమి విరతిఁ బొందిన నేమీ
యారూఢయోగి కది వ్యా, పారంబో శివ. 40

క. ఘోరతరకర్మవాసన
లేరితిని జుట్టి పట్టి హీనులఁ జేయన్
మీఱిన యజ్ఞానుల కిపె, ఘోరంబో శివ... 41

క. వేషములవలన జనులఁ బ్ర
మోహించి మునీషివరుల మోసము జేసే
దూషకులఁ గూడి పెద్దలు, భాషింపరు శివ...

క. అచ్చట నచ్చట నేర్చిన
తచ్చన లోకు కొన్ని యటవి తత్త్వం బని తా
మెచ్చిన వేషము మాటల, నచ్చ ళ్లవి శివ...43

క. అలయంగ భూమి నుదధి
స్థలి కృష్ణనివాసమైన ద్వారకనమునన్
లలి. దనుఁ గను శివయోగియొ, బలవంతుఁడు శివ.

క. నెలప్రొద్దులోన గట్టిగ
నెలకొని చూడంగ వలయు నీలజ్యోతిన్
వెలి లోను గానిచూపున, బలిబంధన శివ...

క. పరకార్యపరులు లోకులు
పరమజ్ఞానులు స్వకార్యపరు లై భరలో
నిరతిశయసుఖముఁ గాంతురు, పరమాత్మా శివ.

క. మేలైన బ్రహ్మవిద్యకు
మూలై తగు రాజయోగసుస్థిరు లెచటన్
బూటకపుమంత్రవిద్యలఁ, బాటింపరు శివ... 47

క. నలుగురి నొక్కటిఁ జేసిన
నలుగురిలో బ్రతుకవచ్చు నాణెముగాఁ దా
నలుగురిపనులకుఁ దిరిగిన, ఫల మంటదు శివ...

క. నలుగురిలోఁ దలవంచుక
నలుగురిలోఁ గూడి మాడి నడువక వేత్రై
పలుపోకలఁ దిరుగును ఛీ !, బలహీనుఁడు శివ.

క. నలుగురికిం దా గుఱియై
మెలఁగిన నది ముక్తిగతికి మేలై రాదే
నలుగురితోఁ గూడనిదే, పలుచనయా శివ... 50

క. తనయింటం దా నుండినఁ
దనయిల్లే తనకుఁ జేటు దాఁ దెచ్చు నయా
తనయిల్లు కాలవేసిన, పనిమే లది శివ... 51

క. అద్దిర యనుభవ మెఱుఁగక
వద్దనువా రెవరు లేక వదరుచుఁ దిరిగే
పెద్దలసుద్దులు గిద్దులు, బద్దలునా శివ... 52

క. తలఁపు చెడఁ గర్మములు చెడుఁ
దలఁపుచెడక మాయచెడును దానసుట చెడుక
తలఁపు చెడినతఁడె ముక్తికి, బలవంతుఁడు శివ.

క. భావంబుఁ దలఁచుటెల్ల న
భావము తలఁ పుడుగుటెల్లఁ బన్నుగ భావా
భావాతీతము సహజము, పావన మది శివ...

క. అసమానరాజయోగా
భ్యాసనంబునఁ బడమటింటఁ బఱలుం డైతే
దోసఁ గేమిలేనిముక్తికిఁ, బస వట్టెది శివ... 55

క. కలసంత్రెండు పదాలును
నలువది రెండైనచోట నయముగ నొకటై
తెలివొందు వెరవుఁ గూడిన, ఫలసిద్ధా శివ...

క. ఇల బొమ్మరిండ్లలోపల
నలువుర మఱి చిన్నిపాప లాడుచు నుండే
సులు వెఱిఁగి యచటఁ దను గన, ఫలసిద్ధా శి.

క. మీఱిన దుర్వాసనలను
గూరిన మతి నణఁపనేర్చుఁ గుశలుఁడు ధరలో
నారూఢియోగవిద్యా, పారీణుఁడు శివ... 58

క. లో వెలి చూపులు రెండును
బో విడువఁ దదంతరమునఁ బొలుపగుతత్త్వం
బావిధ మెఱుఁగును నిర్గుణ, భావజ్ఞుఁడు శివ...

క. తలఁచినయది జడిమం బగు
తలఁ పుడిగిన శూన్యమగును దలఁచిన తలఁపే
పలలిత మగు చిద్బ్రహ్మము, బలిబంధన శివ...

క. కన్నుల ముందఱఁ దెలివై
కన్నది యది కాన్పటంచుఁ గన్న యతండే
పన్నుగ నిజవిద్యాసం, పన్నుఁ డగుఁ శి... 61

క. కను వెలుఁగున నే చూచినఁ
గనవచ్చును జీఁకటైనఁ గానఁగ వశమా
కను గంటనె తనుఁ గనవలెఁ, బనివడి తా శివ.

క. లో వెలిఁ జూచిన నొకటే
లో వెలిఁ గాకుండఁ జూడ లోనగు నొకటే
లో వెలిఁ దానై కనుఁబో, భావజ్ఞుఁడు శివ...

క. ఒకటే రెండై తోఁపఁగ
నొకటిని జెప్పంగ వలసె యొకటై యున్నన్
ఒకటి నొక టేల సేయను, బ్రకటముగా శివ.

క. తన్నెఱుఁగనిదియు నొకటే
తన్నెఱిఁగినయదియు నొకటె తా నన రెండై
యున్నది యొకటే సత్యము, పన్నుగ నిఁక శివ.

క. మఱచినయదియును నొకటే
మఱపున నెఱిఁగెడిది యొకటె మఱువని దొకటే
మఱ పెఱుకగాని దొకటే, పరమాత్మా శివ...

క. చూడఁగఁబడినది యొకటే
వేడుకఁ జూచెడిది యొకటె వీనికి వెలియై
చూడఁగవలసిన దొకటే, పాడి యిదే శివ...

క. కానఁగఁబడినది కాన్పును
మానుగఁ గనుఁగొన్నవాఁడు మఱివీనికి లోఁ
గానియతండును దానే, భానునుతా శివ... 63

క. ఇలఁ బసిఁడి లేక యేసొ
మ్ములు గలుగునె తాను లేక మునుకొని జగముల్
పొలుచునె యది తాఁ గాదా, బలిబంధన శివ.
క. జీవునకు గాక దేవుఁడు
దేవునికి స్వేత యొ[illegible] దేవుఁడు గలఁడే
దేవుఁడు తానే [illegible], [illegible]డు శివ...
క. మొదటను నిత్తే జగమై
యదియే లేకట్టు దాని కగునాధారం
బది దీనియందె నిలుచుచు, బహుళముగా శివ...
క. అతులితసుజ్ఞానముచే
తతిలోకల జీవులు ముక్తిఁ బొందఁ యుంటె
వెతగాదె తాను బ్రతికిన, బ్రతుకెల్లను శివ...
క. తనువెత్తఁ జేటు కింకా
తను వెత్తఁగఁ జూతురేమొ తామసులు ధరిఁ
దనువు చెడి ముక్తి దొరకే, పని బూనరు శివ.
క. తలఁపునఁ గలిగినబంధము
తలఁపున నూడంగఁగొట్టి తా [illegible]ంచవలెఁ
ములు మంటఁ బుచ్చుకొనుచున, బలిబంధన శివ.
క. యాగంబులు మంత్రంబులు
యోగంబులు నుడువ జన్మ మొసఁగును సకటా
యోగులకర్మము లుడుగఁగ, బాగాయెను శివ.
క. దానంబులు సత్క్రియలును

బూని మఱెన్నైనం జేయం బుట్టుక చెడునే
దానికి వైరి వివేకము, భానునుతా శివ... 76

క. చేయఁగవలసినపని విధి
సేయుటగా కనుచు నెంచి సేయుచుఁ జేసీ
జేయనియాపని యదియును, బాయరయా శివ.

క. సృష్టికిఁ గలిగినతను విది
నష్టం బని తొలఁగి తన్ను నయముగ నంత
ర్దృష్టిఁ గనలేనిమనుజుఁడు, భ్రష్టుఁ డయా శివ.

క. ఊనము జడమును విత్తును
గానిది చైతన్య మెట్లు గానేర్చునయా
తానే దానికి మూలము, భానునుతా శివ...

క. తా నెఱుఁగనిపని యైనన్
బూనఁగ మది కెట్టు లింపు పుట్టును జెపుమా
దానికి నేరం బే దిఁక, భానునుతా శివ... 80

క. అన్నియుఁ దానై యుండఁగ
నన్నియుఁ దాఁగాక తోఁచె నణఁగక వేఱా
యన్నియుఁ దనలో నైక్యము, పన్నగ నిఁశ శివ.

క. ఎఱిఁగెడి యెఱుకను గాని తా
నెఱుఁగుదుననువాఁడుజడుఁడు నెఱిఁగెడు నెఱుకన్
మఱచినయెఱుకే తా నగుఁ, బరమాత్మా! శివ.

క. ఒండెఱుఁగక తనుగంటే
పండినకాన్పగుచు సర్వపరిపూర్ణం బై

యుండును నదియే కన్నుల, పండు వయా శివ.
క. తెలియంగనయది జడిమంబగు
తెలుకవిడక శూన్య మగును తెలుకే తెలుకై
నిరతిశయానందం బగు, పరమాత్మా శివ... 84
క. కన్నది కన్నట్టే చనె
విన్నది విన్నట్టె యణఁగె వినకే కనకే
యున్నది యే నై యుంటిని, బన్నుగ నిఁక శివ.
క. కన్నది విన్నది గాకే
యున్నది తుదముట్టఁ గంటి నోహో! యిది నే
నెన్నఁడు నెఱుఁగనిదే పం, పన్నత యో శివ...
క. మాటల సందెడు నిడఁగను
దాటోటులు గాక దానఁ దత్త్వంబగునే
మాటలతత్త్వము లవి పరి, పాటిగదా! శివ...
క. మేదినిఁ గుజనులు ఘనులతో
వాదింతురు నిజముఁ గన్నవారింబలెనే
యేదైనను దూషణ సం, పాదింతురు శివ...88
క. కోటివగవిద్య లెల్లను
గూటికిఁ గా కాత్మవిద్యకును సరియగునే
బూటకము లనక కుజనులు, పాటింపరు శివ...
క. యోగంబందురు కొందఱు
యోగముగా జ్ఞానమందు రొగిఁ గొంద ఱిలన్
యోగజ్ఞానంబులు సమ, భాగంబులు శివ... 90

క. జ్ఞానం బన యోగం బనఁ
గానఁగవలె నొకటికొకటి కావడికుండల్
పూనిక [1]నొక్కట నిలుపదు, భానునుతా శివ.

క. ఈకంటఁ జూడ లేఁడట
యేకంటను జూచుటింక నెఱుఁగుట యేలా
గాకన్నే యీకన్నో, ప్రాకటముగ శివ... 92

క. ఈకనుచూ పాకనుచూ
పేకంబై నిండి నిండి హెచ్చిన సుఖమూ
వాకునఁ జెప్పఁగ వశమా, ప్రాకటముగ శివ...

క. దృశ్యము గూడిన తెలివి య
వశ్యము బంధంబుసుమ్ము వర్జింపంగా
దృశ్యముఁ బాసిన తెలివి సుమ్ము, పాస్యం బది శివ.

క. బంధములగు కర్మంబులు
సంధింపక దృశ్యములను జ్ఞానాగ్నికిఁ దా
నింధనములు సేయఁగవలె, బంధురగతి శివ...

క. చెన్నుగ దీపముఁ జూడఁగ
నెన్నఁగ వేఱొక్కదీప మేఁటికిఁ జెపుమా
తన్నుండే తనుఁ గనవలెఁ, బన్నుగ నిఁక శివ...

క. అజ్ఞాని యొకఁడు గల్గఁగ
సుజ్ఞానిఁగఁ జేయవలసె సుజ్ఞానైతే
సుజ్ఞాని నేల చేయను, ప్రాజ్ఞుఁడనా శివ... 97

---

1 యొక్కటి.

క. ధరలో విధియు నిషేధము
నెఱుఁగఁడు *తద్జ్ఞుండు నింటి కెగిరెడు తురగం
బెఱుఁగునె మిట్టయుఁ బల్లముఁ, బరమాత్మా శివ.
క. దూషణ యసూయకొఱకే
భాషాంతరముల వెల్ల బ్రతుకులకొఱకే
వేషము వంచనకొఱకే, పాషండము శివ... 99
క. పెంపొంగ లోకులవలెఁ దా
నింపుఁగ వలెఁ గోరకున్న నొక్కెడ మానై
యింపుఁగ నలరె శ్రీయగు, పండితునకు శివ...
క. ఇద్ధర నయ్యష్టవశా
సిద్ధులు వలె ననుచు భ్రాంతిఁ జెందుదు రేమో?
సిద్ధం బగుము ముక్తిఁ బ్రతి, బద్ధంబులు శివ...
క. అణిమాదిసిద్ధపురుషులు
గుణవంతులుగాఁగ జనులు గొనియాడుదు రా
గుణహీనులఁ బొగడుదురే, ఫణిశాయీ శివ.
క. ఒకతుచ్ఛసిద్ధిఁ జూపిన
సకలజనుల్ వానిఁ జూచి సన్మానముగా
సకలంకజ్ఞా నందురు, ప్రకటముగా శివ... 103
క. అణిమాదిసిద్ధు లెల్లను
గణుతింపఁగ మోక్షవిధము గా దెట్లంటే
నణిమాదులు సగుణంబులు, ఫణిశాయీ శివ.

* సజ్ఞుండు.

క. సిద్ధులు జ్ఞానం బగునా
సిద్ధియు దృశ్యంబు లవియుఁ జేపట్టుదురా
శుద్ధములు గానిసిద్ధు ల, బద్ధంబులు శివ.... 105

క. మహిమఁ గన లేరు లోకులు
మహిలో బోధం బపారమహిమ యదె గదా
మహిమవలె నందు రజ్ఞులు, బహుళముగా శివ.

క. ఇహమందలిమంత్రౌషధ
విహితము లీవిధులలో వివేకము లేకే
మహిమనిచూతురు మూఢులు, బహుమతిగా శి.

క. సుజ్ఞానమహిమ యెప్పుడు
సుజ్ఞానియె యెఱుఁగ నేర్చు సుస్థిరమతి యై
యజ్ఞాని తెలియ నేర్చునె, ప్రాజ్ఞునిగతి శివ...

క. పరమానందయతీశ్వర
విరచిత మీశతక మిలను విఖ్యాతముగాఁ
గరుణింపు త్రిజగదీశ్వర, పరమాత్మా శివ...

క. పరతత్త్వం బిది శతకము
పరమరహస్యంబు ముక్తిభాజన మిలలో
వరయోగివిలాసం బిది, పరమాత్మా శివ...110

క. హరిహర గిరిధర పురహర
గరుడధ్వజ నీలకంఠ కనకాంబర శం
కర మాధవ గౌరీధవ
పరమాత్మా శివ ముకుంద పరమానందా ! 111

# పీ ఠి క.

ఈ రామరామశతకము నూటాఱు చరణములు గల యొకగేయము. ఇది నారాయణశతకమువలెఁ బాడుట కనుకూలముగ సులభశైలిలో మనోహరముగా రచింపఁబడియున్నది. శతకరచయిత తోఁట నరసింహదాసు విఱుకలాంబలకుఁ గుమారుఁడగు వేంకటనరసింహకవి. ఇతనివాసము కుల్లూరనియు చిన్ననాగయ్యదాసుగారి శిష్యుఁడనియు నంత్యము గల చరణములవలనఁ దెలియును. కుల్లూరెటఁగల దో చిననాగయ్యదాసునిప్రశస్తి యెట్టిదో తెలిసికొనవలసియున్నది.

కవి యీశతకమును శుక్లసంవత్సరము మార్గశిర బహుళ గురువారమున వ్రాసితినని చెప్పికొనెను. శకాబ్దము తెలుపుకొనకపోవుటచే నే శుక్లమో గుఱుతింప వీలు గాకున్నది. తిథియు వారమును జెప్పికొనిన కవికాలము గ్రహింపఁ గొంతవఱకు వీల య్యెడిది. ఎటులఁజూచినను కవి అఱువదిసంవత్సరములకుఁ బైవాఁడనియు శతకగద్యమువలన మనము స్థూలదృష్టితో నిరూపింపవచ్చును.

ఇందలి శైలి మిగుల మృదుమధురముగా నుం టచే నిందుఁ బ్రతిపాదింపఁబడిన బళ్ళాపత్తాపవిషయ ములు పిండోత్పత్తివిధము పంచీకరణము ముద్రాది కములు యోగములు సామాన్యజనములకు నైత ము సుబోధముగా నున్నది.

ఈ శతకమున నారాయణశతకమునఁ జెప్పఁబడ నియంశములు పెక్కులు సాంఖ్యశాస్త్రము ననుస రించి కవి తెలిపెను. తోఁట వేంకటనరసింహాకవి యితరగ్రంథములు కానరావు. ఉత్తమోత్తమమగు నీశతకరాజమును బఠించి యాంధ్రులు పరమార్థము నొందుదురేని శతకకర్త సిద్ధసంకల్పుఁడగును.

ఇట్లు,

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీ ర స్తు.

# శ్రీ రామ రామ శతకము.



క. శ్రీరామా సీతా హృ
త్సారసరవి భానువంశ సాగరచంద్రా
భూరిదయారససాంద్రా
సారసపత్రాక్ష రామచంద్రనరేంద్రా!
శ్రీలక్ష్మీప్రాణలోలా
మౌనిజన చిత్తతామరస ఖేలా
ఫాలాక్ష వినుతశీలా
దయజూడు పరమాత్మ రామ రామ. 1

నిక్కమని సంసారము
మదినమ్మి నీస్మరణ చేయలేక
అక్కటా యమునికిపుడు
పిట్టవలెఁ జిక్కితిని... 2

తల్లిదండ్రాదులనియు
మఱి యన్నదమ్ములని నమ్ముకొనుచు
ఎల్లకాలంబు మదిని
నీభక్తి నేమఱితి... 3

మోసపోతినిగదయ్యా
ఇకముందు దోఁచ దేవుఁడు
నీచాత్ముఁడను గావున
లోనైతి నాసలకు... 4
పాపకర్ముండ నేను
అతిఘోర పాపములు జేసినాను
ఈపట్ల నీకన్నను
గృపజూడ నింక నెవరు... 5
మాయ చీఁకటి కోనలోఁ
గొన్నాళ్లు మార్గంబు గానరాక
యేయుపాయము గానక
జన్మముల నెత్తితిని... 6
ధనము సంపాదించుచు
నొకకాసు దానంబు సేయలేక
తినుటకును మనసోర్వక
తుదఁ జచ్చు దీనుఁడై... 7
గోఁచిమాత్రం బైనను
నొకగంత కొంచుబోవుటయు లేదు
నీచుఁడై యమునిపురికిఁ
బోవు తుద నిక్క మిది... 8
సంసారసాగరమున
ఎన్నాళ్లో జాలి జెందినను గాని

హింస నిశ్చయమె కాని
    కడతేరు హితవౌనె... 9
కులనింద జేసినాఁడ
    బహుదోష కులుఁడనై బుట్టినాఁడ
ఇలను నావంటివాని
    కృపజూడవలెనయ్య... 10
ఎండమావులయందున
    నుదకంబు నిండుగా నిలుచుండునే
బండసంసార మటుల
    భ్రాంతియై యుండుగద... 11
దారువందున పురుషుఁడు
    కనఁబడిన తీరుగా భ్రాంతివలన
గారడీసంసారము
    నిజముగాఁ గనఁబడును... 12
జీవుఁడే యీశ్వరుండు
    తలపోయ జీవుఁడే పరమాత్మయు
జీవుఁ డనుభ్రాంతి విడువ
    యఖిలంబు జీవుఁడౌ... 13
కుక్కనక్కలయందున
    నేను బహు పెక్కుజీవులయందున
అక్కటా బుట్టిగిట్టి
    యీజన్మ మెత్తితిని... 14

ఈజన్మమందైనను
నీపాద పూజసేయకయుండిన
సహజముగ నుందువలెనే
బహుజన్మ సంభవము... 15
జలముపై బుద్బుదంబు
దేహంబు కలరీతి యిది నిజంబు
నిలువ దిది నిశ్చయంబు
ప్రారబ్ధ ఫలముగద... 16
గాలిలోపల దీపము
ఈపట్టి కాయంబు నేవేళనో
కీలులూడిన బొమ్మయుఁ
బడునట్లు నేలఁబడు... 17
కాశితీర్థాలు మోసి
నీపాద కంజములు గానలేక
మోసపోపుటయె గాక
రొంటువలెను ముక్తుఁడౌ... 18
పంచతత్త్వంబులందు
భ్రాంతి నిర్జించి యారెంటియందుఁ
బంచాక్షరీమంత్రము
ధ్యానింప పరుఁడౌను... 19
విరూపు జూచినాను
నిక్కముగ నారూపు తానె యౌను

ధీరుఁడై యిటుదలఁచిన
    మోక్షాధికారుఁడౌ... 20
పూర్వజన్మంబునందు
    తాఁ జేయు పుణ్యపాపంబువలన
ఉర్విపై జననమునకు
    వచ్చుచునె యుండు శ్రీ... 21
సతిపతులు గూడినపుడు
    శుక్లంబు ఋతువైన కమలమందు
అతిశోణితమున గలసి
    బుద్బుదం బవును గద... 22
పదునైదు దినములకును
    నది గట్టిపడి పిండరూపమౌను
కదిసి యొకనెలకు శిరము
    ఏర్పడును గాదె శ్రీ... 23
రెండుమాసములలోను
    హస్తములు రెండు పూర్ణముగనుండు
దండిగా మూఁడునెలలకు
    సుందరంబై యుండు... 24
తలఁప నాలుగు నెలలకు
    పాదములు గలుగు మఱి యైదునెలలు
నిలిచినను నవయవములు
    సమముగాఁ గలుగు శ్రీరామరామ. 25

ఆఱునెలలై నయంత
నాళ్లన్ని జేరు మఱి యేడునెలలు
కూరిమిగ నిండగానె
జీవుండు కుదురుపడు... 26
ఎనిమిదవమాసమందుఁ
దెలివొందె మనసులోఁ జింతజెందు
తనపూర్వకర్మఫలము
తలపోసి నినుదలఁచు... 27
మఱి తొమ్మిదవమాసము
రాఁగానె మురికియాగర్భమందు
హరిహరీ నిలచియుండ
లేనంచు వెలిపొందు... 28
దిక్కు నా కెవ్వరనుచు
నీరోఁత దేహమున నుండననుచు
అక్కటా మున్ను జేయు
కర్మమిది యని యేడ్చు... 29
కులము నిందించునపుడు
పరసతులఁ గలసి భోగించునపుడు
తెలియలేనైతి ననుచు
బహుదుఃఖములఁ బొందు రామరామ. 30
తప్పుసాక్ష్యము బల్కితి
పెద్దలను నొప్పగా దూషించితి

అప్పుడే తెలియనైతి
    యాఫలం బనిఏడ్చు... 31
ఈమురికిగర్భ మిపుడు
    దాఁటినను నిఁక కర్మములు జేయను
స్వామి కడ తేర్చు మనుచు
    సుజ్ఞానివలె వేఁడు... 32
దశమమాసము వచ్చిన
    సమయమునఁ దగ నధోముఖముగాను
వసుధపై జన్మించియు
    మాయచే వర్ధిల్లు... 33
ముసరులును గింకరులును
    కిసరులును ముట్టుదోషంబులును
పొసఁగ నెలదోషములను
    ఏవేళ బొందుచును... 34
మలమూత్రముల ముసుఁగుచుఁ
    బలుమాఱు మంచముందునఁ బొర్లుచుఁ
దెలియరాని యవస్థను
    గొన్నాళ్లు దీనుఁడై... 35
బాలుఁడై కొన్నినాళ్లు
    యౌవన ప్రాయమునఁ గొన్నినాళ్లు
బాల కౌమారమునను
    నీభక్తి జేయకరయె రామరామ. 36

మగని పలుకులకు నెదురు
  బలుకుచును మగనితోఁ గలహించెడి
మగువ పెండ్లాడి భ్రమలఁ
  దగులుకొని మఱచితిని... 37
కామాతురుం డగుచును
  నీభక్తి గానకను రతుల మరగి
ప్రేమతోడను బిడ్డలఁ
  గని వారిఁ బెంచుచును... 38
కాల దన్ని ననుగాని
  బిడ్డలను జాలఁగా దీవించుచు
బాళిమీఱంగ మదిని
  ఆనందపడుచుండు... 39
ఈరీతి కొన్నినాళ్లు
  జరిగినను ఘోరదురవస్థయైన
మీఱి వృద్ధాప్యదశను
  మంచమునఁ జేరు శ్రీ... 40
కన్నులును గానలేక
  వీనులును మున్నువలెఁ దెలియరాక
తన్నుఁ దా నెఱుఁగలేక
  మేనెల్ల తడబడుచు రామరామ. 41
బహుదుఃఖములఁ బొందుచు
  మంచమునఁ బడి మలంబున దొర్లుచు

సహజ మగురోగములను
　　బడి కష్టశాలియగు... 42
కఫవాతపైత్యములును
　　శ్లేష్మములు విపరీతముగ నప్పుడు
అపరిమితమై కప్పఁగ
　　జిహ్వయును నాడకను... 43
కింకరు ల్వచ్చి నిలచి
　　రమ్మంచు జంకించి పిలువఁగానె
యింక నె ట్లనుచు నేడ్చి
　　ప్రాణము ల్విడుచుఁగద... 44
పెండ్లామున్ బిడ్డలున్
　　ఆమీఁదఁ బీనుఁగని యేడ్చుచుండ్రు
కండ్ల జూచెదరుగాని
　　బ్రతికింపఁగా లేరు... 45
కాటిలోఁ గాల్చివేయ
　　వలెఁగాని పాటించి నిలుపరయ్యా
యేటికీ పోరాటము
　　సంసారబూటకము... 46
మాయలోకం బంచును
　　మదినొచ్చి మాయకార్యములు రోసి
నీయెడను మదినిల్పినఁ
　　గడతేరు నెవఁడైన... 47

ధనము నిత్యంబుగాదు
తా నెంత దాఁచినను కూడరాదు
మనసు భ్రాంతియును బోదు
ఘనమాయ మహిమలను... 48
తిరుపతులు మొదలుగాను
యాత్రలను దిరిగి సేవించినాను
పరమాత్మ నెఱుఁగరాదు
గురుకృపను బడయకను... 49
వైరాగ్య భావమునను
గురుపాద వనజములు జేరి తాను
గురుఁడె దైవం బంచును
మది నిల్పి గుఱివిూఱ... 50
తలిదండ్రి గురుఁ డంచును
నమ్మికొని తప్పకను బూజసేసి
తెలియవలె సుజ్ఞానము
ఘనమైన తెలివిచే... 51
పంచభూతంబులాను
నొకటొకటి పంచవలె వేఱుగాను
పంచీకరణము దెలిసి
తెలియవలె భావంబు రామరామ. 52
ఆదికాలంబునందు
బ్రహ్మంబు అంబరాకారముగను

నేదియును నంటలేక
నిర్గుణంబై యుండు... 53
ఆనిర్గుణంబందున
జనియించె నవ్యక్త మనుమాయయుఁ
బూని యవ్యక్తమందు
మహాతత్త్వభూతంబు... 54
ఆమహాతత్త్వంబున
నుదయించె హంకారమును దానిచే
వేమఱును గలిగె మూఁడు
గుణములును వేడ్కతో... 55
మఱియు నీమూఁటియందుఁ
బంచతన్మాత్రలును బుట్టెననియు
నెఱుఁగంగ భూతసంజ్ఞ
ప్రఖ్యాతి నెగడె శ్రీ... 56
గగనంబులో సగంబు
జ్ఞాతరై కరమొప్పఁ దగ సగంబు
అగణితంబును నాల్గై
భూతముల యంశమున... 57
వాయువునఁ గలసి మనసు
నాయె ఘన వహ్నిలోఁ గలసి బుద్ధి
శ్రీయుతంబుగ నీటను
గలసియును చిత్తమా రామరామ 58

ముదమొప్ప ధరణి గలసి
అహంకారమును సయ్యె నివి యైదును
పదిలమగా నాకాశము
పంచకము పరగ శ్రీ... 59
గాలిలోపల సగంబు
ఉదానంబు గానయ్యె మఱిసగంబు
బాళి మీఱంగ నాలుగై
సంతతము భాసిల్లె... 60
నాకాశమునఁ గూడియు
సమానంబు నాయె మఱి నగ్ని యొకటి
ప్రాకటంబుగఁ గూడియు
వ్యానమై బరగె శ్రీ... 61
జలములో నొకభాగము
గూడుకొని యిల నపానంబాయెను
తలపంగఁ బృథివి గూడి
ప్రాణమై దనరు శ్రీ... 62
ఇది వాయుపంచకంబు
ఇఁకనగ్ని యింపుతోడుత సగంబు
ముదమొప్పఁ జతువగుచుఁ
జెలువొందె ముఖ్యముగ రామరామ 63
చక్కఁగా సగభాగము
నాలుగై చక్కఁగా నొకయంశము

మిక్కిలిగ మంటఁ గలసి
శ్రోత్రమై మెలఁగ శ్రీ... 64
మారుతంబందు నొకటి
గూడుకొని మఱిత్వక్కు యయ్యె నొకటి
భూరియుదకమునఁ గలసి
జిహ్వయై పొసఁగ శ్రీ... 65
వసుధలో నొకటి గలసి
ఘ్రాణమై వర్ధిల్లె నీరైదును
వెస నగ్నిపంచకంబు
మును లెన్న వేడుకను... 66
జలములో సగభాగము
రసమగుచు జెలఁగెనా సగమునాల్గు
తలఁప భాఁగంబులగుచు
భూతలము గలసె శ్రీ... 67
నాకసంబందు నొకటి
జేరియును నయ్యె శబ్దంబుగాను
ప్రాకటంబుగ నొక్కటి
గాలిలోపలఁ జేరి... 68
స్పర్శంబునయ్యె నొకటి
జలములోఁ జొచ్చి రూపంబునయ్యె
గరిమ నొక్కటి భూమిలోఁ
గలసియును గంధమా రామరామ. 69

జలపంచకంబు నిదియు
నిఁకమీఁద యిలలోన సగభాగము
తెలియఁగా వాయువయ్యె
ఆసగము తేటగా... 70
నాలుగై యొకటి గగన
మునచేరి నయమైనవాక్కునయ్యె
చాల వాయువున నొకటి
గలసియును సరగునను... 71
పాణియై మఱి యొక్కటి
అగ్నిలోఁ బడి పాదమయ్యె నొకటి
మానుగా జలముగలసి
గుహ్యమై గానఁబడె... 72
నిది భూమిపంచకంబు
నీరైదు ముదమొప్ప పంచకములు
పదిలముగ నిరువదైదు
తత్త్వములు బరగె శ్రీ... 73
ఇది స్థూలదేహ మయ్యె
సూక్ష్మంబు నిందులోఁ బదియేడును
గదిసి మూఁటిని మలినము
చేరినను గారణము రామరామ. 74
ఈమూఁడు తనువులకును
పై నొకటి యింపుతో చేరఁగాను

నేమఱక పరమాత్మర్యై
    యదియొప్పు వెలయ శ్రీ... 75
రక్తంబు శ్వేతకృష్ణ
    నీలంబు రమ్యమగు నీనాల్గును
ఉక్తవర్ణములమధ్య
    తేజమై యుండు శ్రీ... 76
కర్ణికాకార మగుచు
    వెల్గుచును వర్ణస్వరూప మగుచు
నిర్ణయంబుగఁ బురుషుఁడై
    శిఖయగుచు నెగడు శ్రీ... 77
ఇదె సర్వసాక్షి యగును
    జ్యోతియగు నిదె నివారకశూక్షము
ఇది మేరుశిఖర మగుచు
    సహస్రార మిదియగును... 78
వటబీజమంత యగుచుఁ
    గైలాస వైకుంఠలోకములకు
ఆట సత్త్వలోకాశ్రయ
    స్థానమై యమరు శ్రీ... 79
విమలమా యీ సాంఖ్యము
    సూత్రంబు క్రమముగా గురునివలన
భ్రమగుణంబులు రోసియు
    నెఱుఁగవలె బ్రహ్మమును రామరామ. 80

నీలమధ్యంబునందు
బిందువే నిలచినది గంగయగును
మేలైన యానీలమే
యమునయై మెలఁగె శ్రీ... 81
కడువేడ్కతోడ విద్యు
ల్లేఖయును ఘనసరస్వతిరూపము
విడువకను నీమూఁడును
నదులగుచు వెలయు శ్రీ... 82
మఱి నాద బిందు కళలు
తలపోయ మఱి అకార ఉకారము
వరుసతోడ మకారము
నీమూఁడు వర్ణములు... 83
రూపములు నేక మగుచు
ఓంకార రూపమే బ్రహ్మ మనుచు
ప్రాపైన మండలమున
పై వెల్గు బ్రహ్మమై... 84
అంగలింగాకారమై
యేకమై సంగమై యుప్పొంగుచు
మంగళంబగుచుఁ గళలఁ
జెలువొందు మహిమతో రామరామ. 85
పాపమై సూక్ష్మమగును
కారణము పై వెల్గు వస్తువగును

రేపుమాపును వెల్గును
    తారకము దీపమై... 86
ఆలుచక్రంబులందు
    మే లెఱిఁగి యభ్యాసమున హంసను
కూరిమిగ నిలిపి నిలిపి
    ప్రణవమునఁ గూడవలె... 87
ఇడ పింగళసునాడులన్
    నొకటిగా వేడుకను జేసి పైనఁ
జూడవలె నడిదారిలో
    మనసైన చోద్యములు... 88
గట్టిగా నాసికంబు
    నేత్రములు కరములను మూసి దృష్టి
దిట్టముగ బొమలనడుమ
    జూడవలె ధీరుఁడై... 89
జూడజూడంగ నచట
    చోద్యములు ఆడనాడను దోఁచును
వేడుకను నాదములును
    పది తాను వినవలెను... 90
దండి ఓంకారధ్వనియు
    విని మహా పండువెన్నెలబైటను
నుండుముద్దులబాలను
    కౌఁగిటను నుంచవలె రామరామ. 91

ఘనముగా నీ షణ్ముఖి
 ముద్రలో మనసు నిల్పినయోగికి
జననమరణంబు లేని
 నీరూపు గనుఁగొనును... 92
తుద ముక్కుపై దృష్టిని
 నిలిపియును ముదముతోఁ గుంభించియు
చెదరకను సమముగాను
 జూచినను మది నిల్చు... 93
రెండైన యక్షరముల
 కీలెఱిఁగి నిండుగా రతిచేయుచు
దండిగా రేచకంబు
 పూరకము దారియగు... 94
వాసిగా నగ్నిశిఖను
 మదినిల్పి జూచునది ఖేచరి యగు
భాసురంబుగను థార
 నరకంట పైఁజూడ... 95
భ్రూమధ్యమునకు దిగువఁ
 గనుఁగొన్న పున్నమయమవస చూపు
ప్రేమతోఁ జూడ నిదియు
 శాంభవికిఁ బ్రియమగును రామరామ. 96
ఎన్నిచూపులు జూచిన
 నీపాద చిన్నెలను మది నిల్పియుఁ

బన్నుగా ధ్యానించిన
　సుజ్ఞానభావ్రుఁడౌ... 97
ఆఱుమూఁడును మూసియు
　నాదముల అంతు తా నెఱిఁగి నిన్నుఁ
జేరి సర్వంబు మఱచి
　యుండవలె దీనుఁడై ... 98
ఈరేడు లోకములను
　దా ననుచు నింపుతో నెమ్మనమున
ఆరూఢిగాఁ దలఁచిన
　పరిపూర్ణ మదియె శ్రీ... 99
సర్వభూతంబులందుఁ
　దా ననుచు సమదృష్టితోఁ జూచుచు
నిర్వికల్పసమాధిని
　నిలుపవలె నిక్కముగ... 100
పూర్వజన్మంబునందుఁ
　దాఁ జేయు పుణ్యంబు లేకయున్న
సర్వకాలంబు గుఱిని
　మదినిల్పఁ జాలునే... 101
పరసతిని గన్నయపుడే
　తల్లిఁగా భావింపవలెఁ బెద్దలఁ
దరిసెనము జేయునపుడే
　బ్రహ్మమని దలఁచవలె రామరామ. 102

వసుధ కుల్లూరిలోను
శ్రీతోఁట వంశమున నరసింహాఖ్యుఁడు
పొసఁగ శ్రీయెఱుకలాంబ
ప్రఖ్యాతిఁ బొంది రిల... 103

ఆయిరువురకుఁ బుట్టితి
సుజ్ఞాన మందితిని భక్తజనుల
దయ జెలంగఁగ వేంకట
నరసింహాదాసుఁడను... 104

అందముగ చిననాగయ
దాస సన్మందిరంబున వెలసియు
పొందుగా భక్తజనుల
బ్రోచితివి భూరికృప... 105

ఈశతక మెవరు విన్నన్
జదివినను నింపుతోడను వ్రాసినన్
వాసిగను భాగ్యములును
నీదయను వర్ధిల్లు రామరామ. 106

గద్య. ఇది శుక్లనామసంవత్సర మార్గశిరబహుళ బుధవాసరంబున తోఁటవంశపయఃపారావార సుధాకర నరసింహపుత్త్ర సుజన విధేయ వేంకనరసింహప్రణీతంబైన శ్రీరామరామశతకంబునందు నీతిసంగ్రహంబును, పిండోత్పత్తిప్రకారంబును, సంసార పరిభ్రమణంబును, మహాభూతోత్పత్తిప్రకారంబును, పంచీకరణంబును, సాంఖ్య తారక అమనస్క పరిపూర్ణంబును, మూద్రాభ్యాసంబును గల శ్రీరామరామశతకము సంపూర్ణము.

# పీఠిక.

శతకవాఙ్మయములో వేదాంతశతకములు సుప్రసిద్ధములై యున్నవి. మతావేశపరవశులగు శైవకవులు మృదుమధురధారతో నద్వైతసిద్ధాంతరూపకము లగుశతకములు పెక్కులు రచించియున్నారు. అట్టివానిలో సోమనాథుఁడు, అన్నమయ్యంగారు లోనగుకవులు జూపిన కవితానైపుణ్యము శతకవాఙ్మయమున కమృతభిక్షపెట్టె ననుటలో సంశయము లేదు.

ప్రకృత సంపంగిమన్న శతకము సులభమగుశైలిలో నద్వైతమతసంప్రదాయము లెఱింగించుచు దురాచారముల ఖండించుచుఁ బామరులకు సహితము మతరహస్యము లెఱిఁగించుట కనుకూలముగ నున్నది. ఇందు హఠయోగము సాధకున కుచితముగాదనియు యోగాభ్యాసముముఖ్యమనియు ధూర్తగురువుల నాశ్రయింపఁదగదనియు వాదములు తగవులు ఆచారాదికములు వ్యర్థములనియుఁ గవి కంఠోక్తిగఁ జెప్పియున్నాఁడు. ఈశతకము వేదాంతవిషయముననేగాక కవితావిషయమునఁగూడ నాదర్శప్రాయమైయున్నది. ఈశతకము రచించినకవి పరమానందయతీంద్రుఁడు. ఇతనికి పరమానందతీర్థుఁ డనునామాంతరము శతకాంతమునఁ గానవచ్చుచున్నది. ఇతఁడు సంపఁగిమన్న శతకమునేగాక పరమానందశతక

ము, దత్తాత్రేయశతకము, శివజ్ఞానమంజరి(ద్విపద), ఉత్తరగీతవ్యాఖ్య రచించెను. పరమానందతీర్థుఁడు దత్తాత్రేయగురువర్యుని శిష్యుఁడు. ఉభయభాషాకవితావిభవముగలవాఁడు. ఈశతకమునందుఁ జెప్పఁబడిన సంపఁగిమన్నఁ డెవరో యాతని ప్రభావాదిక మెట్టిదో గుఱుతింప వీలుచిక్కదు. పరమానందయతికివలెనే పదునాఱవశతాబ్దమున నున్న తరిగొప్పుల మల్లనకవి దత్తాత్రేయుఁడు గురుఁడుగాన నీయిరువురు నొక శతాబ్దములోనివారె యని యూహసేయ వీలగుచున్నది. లక్షణగ్రంథములలో నీపరమానందయోగిశతకము లుదాహరింపఁబడకపోవుటచే నీకాలనిర్ణయ మెంతనిశ్చయమో తెలుప వీలులేదు. ఇందలిపద్యములు చక్కనిగమనికలతోఁ గూరుపుబింకములతోఁ గల్పనాచమత్కారములతో మిగులమనోహరముగ నున్నవి. వేదాంతవిషయగర్భితముగ నింత మృదుమధురధారలోఁ గవిత చెప్పుట సామాన్యముకాదు. పరమానందయోగి వేదాంత విషయిక విజ్ఞానమున నెంతవాఁడోగాని కవితాప్రగల్భతలో మాత్రము నేర్పరియనుటకు సందియములేదు. ఇందును వ్యాకరణస్ఖాలిత్యములు కొన్నిచోటులగలవు.

నందిగామ. }
1-1-25. }

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శ్రీసత్యానందసరస్వత్యైనమః.

# సంపఁగిమన్న శతకము.



క. ఏయభిలాషలఁ బొందక
కాయము నిజ మనక బాహ్యగత మెడలి మదిన్
స్వాయత్తజ్ఞానంబునఁ
బాయక చిత్తంబు గెలువు భానుకులేశా!.

క. శ్రీమానినీమనోహర!
సోమార్కవిశాలనేత్ర! సురనుతగాత్రా!
దామోదర నీలమణి
శ్యామా! ననుఁ బ్రోవు మన్న సంపఁగిమన్నా! 1

క. పరమానందయతీంద్రుఁడఁ
బరిపూర్ణుఁడ నైననీదుభక్తుఁడ నెలమిన్
విరచించెద నొకశతకము
శరణాగతసుప్రసన్న! సం... 2

క. నినుఁ జెప్ప నేర నైనను
ఘన మగునుతి గనుక కూరగాయకవిత్వం
బనక కృపామతిఁ గైకొను
సనకాదిమునిప్రసన్న! సం... 3

క. జిలిబిలిమాటలఁ బలికెడి
యలశిశువును దండ్రి ముద్దులాడెడుపగిదిన్
బలికెద నను మన్నింపుము
సలలితకాంతిప్రసన్న! సం... 4

క. తత్త్వజ్ఞానానందమ
హత్త్వము రచియింతు నీదయన్ భువిఁ గృతకృ
త్యత్త్వము నిత్యత్వముగా
సాత్త్వికపరయోగు లెన్న సం... 5

క. తత్త్వము దా రెఱుఁగక బ్ర
హ్మత్వము పచరించువారిమాటలు ధృతకో
శత్వములను నిలిచియు ని
స్సత్త్వము లగుఁ గన్న విన్న సం... 6

క. వినవలె సద్గురువులచేఁ
గనవలె నఱచేతియుసిరికాయయుఁబలెఁ దా
మనవలె బ్రహ్మము దానై
సనకాదిమునిప్రసన్న! సం... 7

క. తాటాకులలో వ్రాసిన
మాటలనా ముక్తి పాడిమర్మముఁ దెలియన్?
సూటి యగురాజమార్గము
సాటి యగునె యొచట నున్న సం... 8

క. సన్న్యాసుల మని శాస్త్రో
పన్యాసముసేయ నందు ఫలమేమి? మన

స్సన్న్యాసము దొరకనియా
సన్న్యాసము కూటికన్న సం... 9

క. గాముపలె సంచరించినఁ
బాముపలెఁ గుహల నున్న బంధము తెగునా?
దీ మెఱఁగి పరునిఁ గలసెడి
సామర్థ్యము గూడకున్న సం... 10

క. వాట మగురీతి ము క్తిక
వాటము భేదింప నెట్లు వశపడుఁ దనలో
నాటుకొనుమాయఁ దగ ను
చ్చాటన మొగిఁ జేయకున్న సం... 11

క. ఎక్కటిచదువులు బోధలు
మక్కువ ననుభవములేనిమాటలు వినఁగాఁ
బుక్కిటిపురాణములకై
జక్కులసంతోష మెన్న సం... 12

క. వాలాయము గురుకృపచే
శ్రీలీలల రాజయోగసిద్ధుఁడు గాఁగా
నేలా సంసారమునకు
జాలింబడ సుప్రసన్న! సం... 13

క. శ్రీరాజయోగవిద్యా
పారీణున కబ్బుఁ గాక పరమసుఖం బీ
ధారణి హఠలయమంత్రవి
చారుల కది దొరకదన్న సం... 14

క. మాయాయోగతపంబుల
నాయాసముతోడఁ జేయ నబ్బును దత్త్వం
బాయెన్ని కేలపెట్టన్
జాయలనా సుప్రసన్న! సం... 15

క. ఒండొరులఁ గూడి గొణుఁగుచు
దండము లిడికొనుచు బోడితలలుం దామున్
నిండిరి మహి తత్త్వము నహి
చండితనం బధికమన్న సం... 16

క. వానలు పస పైరుల కభి
మానము పస వనితలకును మఱి యోగులకున్
ధ్యానము పస యామీఁదట
జ్ఞానము పస సుప్రసన్న! సం... 17

క. మాయ యనఁగ వేఱై యొక
తోయము లే దయ్యె తన్నుఁ దోఁపనిచో నే
మాయ నిల రోసినను జా
చాయం జెడిపోవు నన్న సం... 18

క. తామరసాక్షునకైనన్
శ్రీమించినసురలకైన సిద్ధులకైనన్
నీమాయఁ దెలియ వశమా
సామాన్యమె! కఠిన మెన్న సం... 19

క. నిండికొను నిట్టిమాయ ప్ర
చండగతిం గప్పుకొన్న సజ్జనుల బుధుల్

ఖండింప నేల మతపా
షండులవాక్యములు విన్న సం... 20

క. మండితపూర్ణసుధాకర
మండలశతకోటికాంతిమహనీయుం డై
నిండి తనలోన యోగి ప్ర
చండగతి న్వెలుఁగు నన్న సం... 21

క. పేరుకొనుమంత్రవాదము
భారం బడి కుక్కనోటిప్రాఁతై రోఁతై
పోరై యారై దూరై
జాఱఁగవలె సుప్రసన్న! సం... 22

క. బూటకములు వేషంబులు
నాటకములు మంత్రతంత్రనటనలు మిథ్యా
పేటిక లవి యోగికి జం
జాటము లివి యేటికన్న సం... 23

క. చలపట్టియు హఠయోగముఁ
దలపెట్టిన వట్టిగొడ్డుతాఁక ట్టింతే
యలసిద్ధి దొరక దడియా
సలుగా కిం దేమియున్నె? సం... 24

క. సంతతయోగానందా
నంతసుఖాంభోధి నలరు నాతనిభాగ్యం
బింతింతనఁ దరమా ఘన
సంతోషము జగతి నెన్న సం... 25

క. నావ యగున్ భవజలధికిఁ
ద్రోవ యగున్ ముక్తికాంతతోఁ గూడుటకున్
గేవలనిజదేశిక ర
త్నావహ మగుయోగ మెన్న సం... 26

క. అభ్యుదయంబుగ నీయో
గాభ్యాసము సేయవలయు నతులితలీలన్
లభ్యుఁ డగుం బరమాత్ముఁడు
సభ్యుల కది మార్గమన్న సం... 27

క. వ్యక్తావ్యక్తపదం బఁట
ముక్తఁట గురుసేవ తనకు మును లేదఁట యే
యుక్తిని గనుఁగొనవచ్చు న
శక్తులకును సుప్రసన్న! సం... 28

క. భావమునం గననేరని
జీవుల కిది బీజకాయచిక్కగుఁ దెలియం
గా వశమే సద్గురు దీ
క్షావిధి యొనఁగూడకున్న సం... 29

క. బోధింపఁదగినగురువుల
శోధించి తదంఘ్రిఁ జేరి సుస్థిరమతి యై
యాధేయము నాధారము
సాధించిన ముక్తుఁ డౌను సం... 30

క. సాధింపఁగ నిరతులకున్
బోధింపఁగ నేర్పు గల్గుపుణ్యాత్ముల యా

యీధరఁ గల రోకకోందలు
సాధారణవిబుధు లెన్న సం... 31

క. అనుభవము లేనిగురుచే
వినునతనికి సంశయంబు వీడునె చిత్రా
ర్కునివలనఁ దమము వాయునె
సనకాదిముని ప్రసన్న! సం... 32

క. గురువఁట యెవరికి గురువో
హరిహరి తనుఁ దెలియలేనియాతఁడు గురువా?
గురువనఁగా సిగ్గుగదే
శరణాగతసు ప్రసన్న! సం... 33

క. నేరనిగురుబోధలు సం
సారము లై కూనలమ్మసంకీర్తన లై
దూరము లై ముక్తికి ని
స్సారము లై పోవు నన్న సం... 34

క. బూటకపుయోగి నెఱుఁగక
పాటింతురు డబ్బుఁ జూచి పస లేకున్నన్
డాటో టని జగ మెల్లను
జాటింతురు లోకు లెన్న సం... 35

క. కల్ల యగుజ్ఞాన మేలా
చెల్లనికా సెచట నైనఁ జెల్లనికాసే
తెల్లమిగఁ దెలుపునాతఁడు
సల్లలితజ్ఞాని యెన్న సం... 36

క. గాడిదవలె బూడిదఁ జె
ర్లాడుచుఁ గొక్కెరయుఁ బోలె ధ్యానము సేసీ
బేడిదపుఁగపటయోగుల
జాడలు ఘను లెంచరన్న సం... 37

క. కీ డొసఁగెడుగురుఁ డేలా
గాడిదవాలంబుఁ బట్టి ఘననదు లీఁదన్
గూడునె గుండెలు పగులఁగ
జాడింపదె యొమ్ముఁ దన్ని సం... 38

క. అంగం బెఱుఁగరు ముక్తికె
ఱం గెఱుఁగరు కపటధూర్తరావణవేషుల్
దొంగలగురువులు వారల
సంగతి దుర్బోధ లెన్న సం... 39

క. చేతోగతిఁ దము నెఱిఁగిన
యాతద్జ్ఞులు భువిని జనుల నందఱ సరిగాఁ
జూతు రసమరసభావనఁ
జాతుర్యధురీణు లెన్న సం... 40

క. వచ్చినవాసన వెంబడి
విచ్చలవిడి యోగివరుఁడు విహరించినవాఁ
డెచ్చట నేక్రియఁ జేసిన
సచ్చిన్మయు నంట దన్న సం... 41

క. విత్తమదమత్తు లాయత
చిత్తభ్రమ లెఱుఁగలేరు చిత్పురుషుని దా

ను త్తముఁ డితఁ డని సన్నుని
స త్తముఁ డై యెఱుఁగు నన్న సం... 42

క. తనవాసన యెట్లుండిన
ఘనయోగికి బంధవృ త్తి గానేరదు వాఁ
డనుభవముకతన నిర్వా
సనుఁ డై మఱి పుట్టఁ డన్న సం... 43

క. క్రమమున సుఖదుఃఖంబులు
కమలినుతి నింద లాదిగాఁ గలయవి యా
యమివర్యుఁ డన్నిక్రియలకా
సముఁడై వ ర్తించు నన్న సం... 44

క. తలకొని దుఃఖము రానీ
వలనొప్పఁగ నిత్యసుఖము వచ్చిన రానీ
నలఁకువను బడనిమనుజుఁడు
చలియింపఁడు బోధఁ గన్న సం... 45

క. చాలా లోకులు నగనీ
వాలాయము కీడు మేలు వచ్చిన రానీ
యేలా గైనను బురుషుఁడు
జాలిం బడఁ డాత్మఁ గన్న సం... 46

క. బాలుఁడు గానీ భోగ
స్త్రీలోలుఁడు గాని విషయశీలుఁడు గానీ
మేలైనబోధ గలిగినఁ
జాలదె ము క్తిని గనంగ సం... 47

క. విత్తపరాయణుఁ డయినన్
మత్తచకోరాక్షులందు మగ్నుం డైనన్
సూత్తమపురుషుఁడె గాఁడా
సత్తామాత్రంబు గనును సం... 48

క. పంచావస్థలఁ దగిలియుఁ
బంచావస్థలను గడచు ప్రాజ్ఞుండు జగ
ద్వంచకుఁ డై లోకులవలె
సంచారము సేయు నన్న సం... 49

క. పిప్పలర నాత్మసుఖముల
తెప్పం దేలేటియోగిఁ దెలియక తమలో
నప్పూరుషుం గని కర్మలు
చప్పనఁగాఁ జూతు రన్న సం... 50

క. నిత్యానిత్యము లెఱుఁగక
నిత్యముఁ జేపట్టుబుధుల నిందించినచో
మృత్యువుపాలౌ మర్త్యుఁడు
సత్యం బిది వినఁగదన్న సం... 51

క. వేసాలెల్లయు భువిలో
గ్రాసాలకె కాక ముక్తికాంక్షకు నేలా
వాసిగలుగుయోగి యథే
చ్ఛాసంచారుఁడుగదన్న సం... 52

క. ఊరెఱిఁగినబాఁపనికిని
వారక జన్నిదముఁ జూపవలెనా తద్జ్ఞుం

డేరీతి నున్న నిస్సం
సారిని ఘను లెంతు రన్న సం... 53

క. అద్వైతభావ మెఱుఁగక
విద్వాంసుల మనుచు నాత్మ వేత్తలమ లెనే
యద్వైతత్త్వము లాడుచు
సద్వర్తన మెంచరన్న సం... 54

క. వదలరు విషయము లెచటను
మెదలరు సజ్జనులకడను మిథ్యాజ్ఞానుల్
చదివితి మని యజ్ఞులతోఁ
జదువులు పచరింతు రన్న సం... 55

క. జడివాన కురిసినట్టులు
విడువక వాదింతు రాత్మ వేత్తల మనుచున్
గుడియొడ మెఱుఁగనిమాటల
జడమతు లిలఁ గొంద ఱన్న సం... 56

క. మన సనఁగా నెఱుఁగక తా
మనసునకును సాక్షి యనఁగ మఱి జే లనఁగా
ఘనతరశూన్యం బనఁగా
జనులకు నిది వాద మన్న సం... 57

క. కొందఱు యోగం బనఁగాఁ
గొందఱు జ్ఞానం బనంగఁ గొంద ఱఖండా
నందం బనంగ నందలి
సందేహము లెట్లు తీఱు సం... 58

క. తుద మొద లెఱుఁగక బ్రహ్మం
బిది యని యెఱుఁగంగ లేక యేర్పడ సభలన్
వదరుచుఁ దిరిగెడికొయ్యల
చదువులపస లెన్న సున్న సం... 59

క. చేతా వాతా గొట్టెడి
ఘాతుకు లవివేకు లనుచుఁ గని వారలతో
నీతిపరు లడ్డ మాడరు
చాతుర్యధురీణు లెన్న సం... 60

క. తనలో నెప్పుడు నుండెడు
తనుఁ దెలియఁగలేఁడు నిన్నుఁ దరమా తెలియం
దనుఁ దెలియుట నినుఁ దెలియుటె
సనకాదిమునిప్రసన్న సం... 61

క. దేహమె తా నై యున్నెడ
దేహముతోఁగూడఁ గాలితేనే నిజమా
దేహాత్మవాదిమాటలు
సాహసములు బొంకులన్న సం... 62

క. దండకమండలులు శిరో
ముండనము ధరించినంత మోక్షము గలదా ?
మెండుకొను లోనిపగతుర
చండిమఁ దెగటార్పకున్న సం... 63

క. సన్న్యాసుల మని శాస్త్రో
పన్యాసము చేయు టెంతపాపము కాదా

యన్యోన్యాశ్రయ ముండిన
సన్న్యాసము కూడదన్న సం... 64

క. వాదుల నడఁచెడిపెద్దలఁ
గా దనఁగా నేల వట్టికలహాం బింతే
ఖేదం బని చాలించిన
సాదరమతి జాణఁ డన్న సం... 65

క. వాదము ఖేదముకొఱ కౌ
మేదినిఁ గలవిద్య లెల్ల మెతుకులకొఱకౌఁ
గా దది ముక్తిపథం బని
సాదరమతిఁ దెలియ రన్న సం... 66

క. వాదము లనఁగా దాతృవి
వాదము మఱి యంత్రతంత్రవాదములును నీ
జూదము మేదిని మెత్తురె ?
సాదరమతు లెన్నరన్న సం... 67

క. ప్రేమమున నాత్మసుఖమం
దేమియుఁ బసలేక తత్త్వమెఱుఁగుదుమనుచున్
నేమములు విడిచి తిరిగెడు
సాముల నేమందు మన్న సం... 68

క. చేతోగతి నెఱిఁగినవా
రేతీరున విధినిషేధ మెఱుఁగక యున్నన్
జాతురు సమరసభావనఁ
జాతుర్యధురీణు లెన్న సం... 69

క. ఎప్పుడు కర్మముఁ జేసెడి
యప్పురుషుఁడు తన్నుఁ గన్న నది చాలించున్
జప్పిడి గాదా నోటికిఁ
జప్పనియాపిప్పిఁ దిన్న సం... 70

క. మునిఁగితి మందురు మునుఁగుట
మనసో పంచేంద్రియములో మఱి జీవుండో
మునుఁగుట యెవరో తెలియరు
సనకాదిమునిప్రసన్న సం... 71

క. తానైనం బరిశుద్ధుఁడు
మేనైన నట్టి బొంకి మేనో తానో
పూనికఁ జేసెడితీర్థ
స్నానం బిఁక నెవరికన్న సం... 72

క. సూతకము వచ్చె ననుచును
నాతలఁ బదినాళ్లు జరపినంతనె తెగునా ?
సూతకమే కాదా తన
జాతకము నెఱింగికొన్న సం.... 73

క. ముట్టనఁ దొలఁగుదు రేమో
ముట్టుననే తనువుగాక మునుఁగుదు రేమో
ముట్టుకు వెలియైతే యొక
చట్టా మఱిదేహ మెల్ల సం... 74

క. కలలో నొక్కఁడు పులిఁ గని
పులిచే నణఁగుటను దాను బొలియుట బొంకా

కలవలెనే జగమెల్లను
సలలితభక్తిప్రసన్న సం... 75

క. భ్రమ దృశ్యజాలమెల్లను
భ్రమ లోకములెల్ల మిగుల భ్రమ కర్మంబుల్
భ్రమమూలమె యీసర్వము
సమరసమౌఁ దత్త్వమెన్న సం... 76

క. వంశము తన కెక్కుడిది చి
దంశము లేఁ గాకయున్నఁ దగ జీవులకున్
సంశుద్ధి దొరక నేరదు
సంశయములు విడువకున్న సం... 77

క. తనమనసే తా నాయెను
తనమనసే తన్నుఁ దెలియుఁ దత్త్వం బయ్యెన్
మనసునకు సాక్షి మనసే
సనకాదిముని ప్రసన్న సం... 78

క. మనసే జీవుం డనఁగను
మనసే తనచేష్ట లుడిగి మఱి తత్త్వ మగున్
మనసుగలవాఁడె ముక్తుఁడు
సనకాదిమునిప్రసన్న సం... 79

క. పురుషునకుఁ బ్రకృతి వేఱా
సరిసమ మని తెలిసియుంట సహజము గాదా
పురుషవివర్తమె ప్రకృతియు
శరణాగతసుప్రసన్న సం... 80

క. స_త్తనఁ బరగును బురుషుఁడు
స_త్తనఁగాఁ బ్రకృతి తోఁచి సమసెడుకతనన్
స_త్తునకే నిత్యత్వ మ
సత్తున కది గాఁడదన్న సం... 81

క. సత్తును నెఱుఁగ దస త్తా
సత్తును నెఱుఁగంగ లే దసత్తును నీక నీ
సత్తాస_త్తలఁ దగ సద
స_త్తై కను జీవుఁ డన్న సం... 82

క. కనరా దన్నను శూన్యము
కనవచ్చు నటన్న జడము గా దది వెలిగా
ననుభవవేద్యము బ్రహ్మము
సనకాదిమునిప్రసన్న సం... 83

క. లక్షణ మెఱుఁగని యోగవి
లక్షణ మగు నతనిమాట లలి ప్రల్లదముల్
దక్షత నంతర్దృష్టివి
చక్షణుఁడా కాఁడు రన్న సం... 84

క. నష్టపదార్థం బగునీ
సృష్టిని నుపసంహరించి చిన్మయు నంత
ర్దృష్టిని గనవలె జనులకు
స్రష్ట తనం బేటి కన్న సం... 85

క. తోరంబై యోగీంద్రవి
హారంబై విమలచిన్మయాకారంబై

ధీరంబై చిద్రూపము
సారంబై వెలుఁగు నన్న సం... 86

క. చింతించి యోగి మోక్షా
నంతసుఖం బొదవఁ జక్షురగ్రంబునఁ దా
నంతర్దృష్టిని గనవలె
సంతతమును నాత్మఁ గన్న సం... 87

క. తన కనుభవంబు చదువుల
వినుకులనే కలుగు ననెడివెఱ్ఱియుఁ గలఁడే
యనుభవవేద్యము బ్రహ్మము
సనకాదిమునిప్రసన్న సం... 88

క. కడుధీరుండై యోగము
తొడిబడఁ ద న్నెవ్వరైన దూషించినఁ దా
నొడలికి నేపో టొదవిన
జడియక సాధించు నన్న సం... 89

క. తెలిచియుఁ దెలివనికన్నులు
మఱచియు మఱువనితలంపు మ్రాన్పడుమేనుఁ
బరమచిదాకాశస్థితిఁ
జరితార్థుఁడు నిలుచునన్న సం... 90

క. నలుగురు నడచెడుత్రోవను
బలిమిని లోకంబు నడచుఁ బ్రాజ్ఞుం డైనన్
నలువు రెఱుంగనిత్రోవలఁ
జలియింపక నడచు నన్న సం... 91

క. మన నెక్కడ మా యెక్కడ ?
తను వెక్కడ? ముప్పదాఱుతత్త్వము లెచటన్
ఘనరాజయోగ మెఱిఁగిన
జనునకు దా సుప్రసన్న సం... 92

క. వెలిచూపును లోచూపును
వెలిగాఁ దన్మధ్యమునను వెలిఁగెడితత్త్వం
బలవడఁ జూచినయతఁడే
సలలితుఁ డగుముక్తుఁ డన్న సం... 93

క. ఇద్దఱు నొకటైనను గడ
మిద్దఱుఁ దా మేకమగుచు నేకాంతముగా
నిద్దఱు నిద్దఱు నొకటై
స ద్దేమియు సేయ రన్న సం... 94

క. మిక్కిలి సంసారయినను
నెక్కడియోగము రుచించు నెక్కుడుశైత్యం
బెక్కినవోటికిఁ జేఁ దగుఁ
జక్కెరపాడిఁ దిన్న నెన్న సం... 95

క. నాలుగుత్రోవలనడుమను
శ్రీలీలను వ్రేలుచున్నచిహ్నంబులఁ దా
నాలోచించినబుద్ధి వి
శాలుం డౌ ముక్తుఁ డన్న సం... 96

క. పంద లగుచెనఁటిమనుజుల
కందంబుగ రాజయోగ మలవడ దేలా
పందలకును గాడిదలకుఁ
జందనగుణ మేఁటికన్న సం... 97

క. ఇప్పుడవు లందనేరని
మొప్పెలకుం దెలుప వశమె ముందఱగానే
తప్పులు పట్టుచు మఱి చేఁ
జప్పట్లిడి నగుదు రన్న సం... 98

క. కను జెదర మనసుఁ జెదరం
గను జెదరు న్సుఖము చెదరు గాలియుఁ జెదరుం
గనుఁ జెదరక తనుఁ గనవలె
సనకాదిమునిప్రసన్న సం... 99

క. పాళ్లను బంపును దొడవులు
నూళ్లను మును చన్నవారు నూర్జితులై రా
యో ళ్లరిగి? రోళ్ల వెంటనె
సాళ్లని ఘను లెన్న రన్న సం... 100

క. ముందు వెను కెఱుఁగ కాటల
సందడిఁ బడి మోక్షసుఖము సాధింపనియా
పందలబ్రతుకులు నిఁక నే
చందంబో యెఱుఁగ మన్న సం... 101

క. వెలిచూపును లోచూపును
గలయంగా నొక్కచూపుగాఁ జూచిన యా
నిలుకడ గలయోగీంద్రుఁడె
సలలితసుజ్ఞాని యన్న సం... 102

క. చిత్తమునం దమ్మెఱుఁగక
తెత్తురు తమచేటు నత్త తిత్తు న్మత్తుల్
మొత్తముగ నూఁడిపోయినఁ
సత్తులవా? సుప్రసన్న సం... 103

క. సంపద లెఱుఁగక తామే
సంపద గలవార మనుచు జడు లిలఁ దమలో
సంపదఁ గననేరక వెలి
సంపదలే చూతు రన్న సం... 104

క. నేరనిజనులను బట్టుక
పోరాడఁగ నేల పల్కుపోతారాటం
బేరీతిఁ దెల్ప గతికి వి
చారము మదిఁ బుట్టదన్న సం... 105

క. శోధింపరు తత్త్వజ్ఞులు
సీధరఁ దమతోడిసరికి సీదుర్మనుజుల్
మేధావంతులు పెద్దలు
సాధువు లని యెంతు రన్న సం... 106

క. పుత్త్రులు మిత్త్రులు బంధుక
శత్త్రములనువారు ముక్తిలలనకు నరునిఁ
బాత్త్రుని గానీయరు హిత
శత్త్రులుగా వార లెన్న సం... 107

క. సంకల్ప ముడిఁగి తా ని
స్సంకల్పుం డైనఁ జాలు సద్గతి తడవా
సంకల్పమె బంధము ని
స్సంకల్పమె మోక్ష మెన్న సం... 108

క. జనుఁడుం జిదమృతరసవా
ర్ధిని నెట్టనఁ గ్రీడ సల్పి తెప్పలఁ దేలున్
విను తుచ్ఛసుఖము లేలా
సనకాదిమునిప్రసన్న సం... 109

క. కీ లెఱిఁగి జీవపదముల
నోలిన్ సమరసము చేసి యోగానందుల్
బాలోన్మత్తపిశాచుల
చాలుగ వర్తింతు రన్న సం... 110

క. సర్వావస్థల నడఁచియు
సర్వావస్థల నెఱింగి సర్వసముం డై
సర్వముఁ దా నని తెలిసిన
సర్వోత్తముఁ డాతఁ డన్న సం... 111

క. తనవారి నెదటివారిని
దనవారిఁగఁ జూడనేర్చుధన్యులు చాలన్
ఘనకీర్తులచే మింతురు
సనకాదిమునిప్రసన్న సం... 112

క. నిత్యానిత్యవివేకము
సత్యనుపమశీలుఁ డెఱుఁగు నాతఁడు సుజన
స్తుత్యుఁడు జీవన్ముక్తుఁడు
సత్యం బిది వినఁగదన్న సం... 113

క. కూడదు గతి సంసారికి
బూడిదలో గచ్చకాయ పొరలినభంగిన్
వాఁడును వీఁడును జానై
జాడ యెఱిఁగి నడువరన్న సం ... 114

క. పాపపువాసనవిషయము
కాపాడుచు రాఁగ నరుఁడు గడవఁగఁగలఁడా?
యేపట్టున గుహ్యోదర
చాపల్యము మానకున్న సం... 115

క. సాధనచతుష్టయంబున
సాధారణలీలఁ దనరి సర్వేంద్రియముల్
శోధించి నిజసమాధిని
సాధించినముక్తుఁ డన్న సం... 116

క. ఉద్యోగంబునఁ బురుషుఁడు
సద్యోగముఁ జలుపవలయు సవిశేషముగా
విద్యానిధి యగునతఁడే
సద్యోముక్తుఁడు గదన్న సం... 117

క. బోధించినగురువులచే
సాధింపను నేర్పు గలిగి సన్నుతు లగుచుఁ
శ్రీధరుఁ గలియుదు రపుడే
సాధకమున బుధులు సుమ్ము సం... 118

క. ఆతురుఁడై తను నడిగిన
యాతనికిం దెలుపవలయు నన్యులు వింటే
నా తలవంపులును సుహృ
జ్జాతులకే యోగ మెన్న సం... 119

క. చూడక చెడు నని తెల్పిన
బూడిదలో వ్రేల్చుహోమములఁ బోలుఁ గదా
కూడదు అజ్ఞునకు వృథా
జాడలు గనఁ జెడుఁ గదన్న సం... 120

క. వెక్కసము లాడుమనుజుల
మక్కువతో బుద్ధి సెప్పి మాన్పంగలరా ?
కుక్కలతోఁకలఁ గట్టినఁ
జక్క నగునటన్న తీరి సం... 121

క. విను మృదువచనరచనములఁ
దనరఁగఁ గృతి నీకు సమ్మతంబుగ వెలయన్
ఘనయోగివరులు మెచ్చెడ
రనఁ బరమానందతీర్థయతి రచియించెన్. 122

క. మందేహామందామథ
మెందు న్సరిలేనిదైవ మిలలో సత్యా
నందంబు జయమునందు త
మందఱను సుఖంబు లంది యలరుద మెలమిన్.

ఇది శ్రీపరమానందయతీంద్ర విరచిత
సంపఁగిమన్న శతక మాచంద్రార్కంబు సత్యానంద
స్వరూపంబుగాఁ బ్రకాశించుఁ గాక.

శ్రీ సత్యానందార్పణ మస్తు.

---

# పీ ఠి క.

ఈశతకము వ్రాసినకవి దూపాటి వేంకటరత్న మాచార్యులు. వేంకటరంగాచార్యులకుమారుఁడు. లోహితసగోత్రుఁడు. ఆంధ్రవైష్ణవబ్రాహ్మణుఁడు. ఈ కవి చిన్నతనముననే సంస్కృతాంధ్రము లభ్యసించి ప్రబంధపఠనముతోఁ గాలముగడిపి యుత్తరవయస్సునఁ బద్యరచనమున కారంభించెను. పూర్వవయస్సున విశేషించి గేయములుమాత్రము రచించెను. కవితయందెగాక చిత్రలేఖనమునందునను, గానమందునను నీకవి కుశలుఁడు. "నాదెండ్లవాస" అను పద్యమువలన నీకవి ఈశతకమును నాదెండ్లలో నున్నపుడు రచింప నారంభించెను. అమరావతిలో నున్నపుడు 1-1-20 తేది శతకము పూర్తిచేసితినని కవి స్వయముగా వ్రాసికొనెను.

శతకకర్త యీకృష్ణశతకమును దనమాతాపితల కంకిత మొసంగి ధన్యుఁడయ్యెను. ఈయన శౌరీ, రామా యను కందశతకములు రామచంద్ర యను సీసపద్యమకుటశతకము రచించెను. అవి పరిశోధించి శుద్ధప్రతి వ్రాయవలసియున్నది.

భగవద్భక్తివిశేషమునఁ గవి మైమఱచి కేవల ధ్యానరూపముగ నీశతకమును గవి రచించెను. ధార నిర్దుష్టముగా మనోహరముగా నున్నదిగాని కవితలో భావసంపద మిక్కిలి కొఱవడియున్నది. ఈ వేంకట రత్నమాచార్యకవి మాకు జ్యేష్ఠభ్రాత. పసితనము నుండి తెలుఁగుభాషలో మాకభినివేశము గల్గించి మాపురోవృద్ధికి దీపించిన యీస్వర్గస్థకవియెడఁ గృత జ్ఞతాసూచకముగ నీశతకమును బ్రచురించితిమి. ఈకవి నాలుగు సంవత్సరముల క్రిందట పరలోక గతుఁడయ్యెను. తమశతకసంపుటములో నీశతక మును బ్రచురించి కవిప్రతిష్ఠ చిరస్థాయిగావించిన ప్రకాశకులగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి యెడఁ గృతజ్ఞులము.

ఇట్లు

నందిగామ.
1-6-26.

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శ్రీ ర స్తు.

# శ్రీకృష్ణశతకము.



క. శ్రీవక్షోంక భుజాంతర
సేవకమందారరాజశేఖరవినుతా
భావజజనకా సజ్జన
పావన రక్షింపు లోకపాలన కృష్ణా. 1

క. శ్రీవిష్ణుదాసదాసుఁడ
దేవస్తుత విమలభావ దివ్యచరిత్రా
సేవించెద భావించెద
కావించెద వందనములు గావఁగ కృష్ణా. 2

క. పలుకష్టంబులఁ బడిపడి
పలుమరు పిలచినను బలుక భార మదేరా
యిల నీవంటివదాన్యుఁడు
కలఁడా ముజ్జగములందుఁ గన శ్రీకృష్ణా. 3

క. పరదైవంబుల వేఁడను
నిరతము నిను నెమ్మనమున నెఱనమ్మిన నా
సిరు లిచ్చి మనుపవే నీ
కరుణకుఁ బాత్రుండ నంటి గనరా కృష్ణా. 4

క. భగవద్భాగవతాదుల
కోఁగి నపచారంబు సలుపుచుండెడిజడుఁడ__
దగ నెట్టులఁ బ్రోచెదవో
సుగతిఁ గృప నొసఁగి మనుపఁ జూడవె కృష్ణా.

క. దాశరథీ భక్తావన
శ్రీశా ప్రద్యుమ్న రాజశేఖరవినుతా
దాశార్హా శ్రీధరా స
ర్వేశా దోషాపహారణ యేలర కృష్ణా. 6

క. అగణితమణిగణభూషా
నిగమస్తుత సుప్రభావ నిరుపమవేషా
ఖగరాజగమన నరవర
మృగరూపా విగతపాప మృదుపద కృష్ణా. 7

క. ఎన్నెన్నో విధముల నా
పన్నుఁడనై సన్నుతింపఁ బన్నగశయనా
కన్నడసేయక రాగద
వన్నా ఘనసుప్రసన్న హరి శ్రీకృష్ణా. 8

క. మందస్మితాతిసురుచిర
సుందరవదనంబు మహితశోభితకృపతో
డెందం బానందంబిడ
మందరధర చూపుమా రమాధవ కృష్ణా. 9

క. వందారుసనందనసుర
మందారా సుందరాంగ మందరధర గో

విందా నందయశోదా
నందా వందనము లోకనాయక కృష్ణా. 10

క. మాధవ రాధాలోలా
సాధుజనావన యుపేంద్ర సదయుఁడవై నా
బాధ లెడఁబాపి బ్రోవర
శోధనజేయకుర నన్ను శుభకర కృష్ణా. 11

క. పాపాటవీకుఠారా
నీపాలం బడితి దేవ నిగమవినుత నన్
గాపాడ రావదేరా
గోపరిపాలక వినీలకుంతల కృష్ణా. 12

క. భానుశతకోటితేజా
మానవరూపా ముకుంద మధుమదదమనా
మానినుత సుగుణమహితా
దానవగణనాశ యీశ ధరధర కృష్ణా. 13

క. ఎందాఁక మొరలుపెట్టుదు
నెందాఁక సహింతు బాధ నెందుకు దయరా
దెందుల కేఁగితివో గో
విందా దయ మనుపుమయ్య విధినుత కృష్ణా. 14

క. దీనజనరక్షకా వర
ధీనుత సర్వేశ వరద ధీరశరణ్యా
దీనుని నన్ గావర సుగు
ణా నతసురనాథ సత్కృపాకర కృష్ణా. 15

క. బుద్ధావతార కృష్ణా
యుద్ధవసుతవిమలచరణ యోఘహరణా
యిద్ధచరిత శ్రీకర యని
రుద్ధా నిను సంస్మరింతు రూఢిగఁ గృష్ణా. 16

క. బృందారకవందిత మృదు
కందంబుల కుసుమమాల కానుకగా నే
వందనములతో నిచ్చెద
సుందరముగఁ దాల్పవయ్య సుఖకర కృష్ణా. 17

క. ముదిమిని మది కుదు రొదవదొ
సుదతీమణి లక్ష్మితోడ సుఖముగ నుంటే
మది నాటదొ నా ప్రార్థన
ముదితా నవమోహనాంగ బ్రోవర కృష్ణా. 18

క. గోవర్ధన ఖలమర్దన
భావజసంకాశరూప భవబంధహరా
నీవే దిక్కని నమ్మితి
శ్రీవల్లభ పద్మనాభ శ్రీహరి కృష్ణా. 19

క. సతతము నీపదయుగళము
గతిగా మతి నిల్పుటయును కలకాలము నీ
స్తుతిపై నాసక్తియు స
మ్మతిమై దయచేయవయ్య మాధవ కృష్ణా. 20

క. సేవకజనసంపత్ప్రద
శ్రీవిలసితదివ్యవేష రిపుసంశోషా

పావనమంజులభాషా
నీవేగతి బ్రోవుమయ్య నీచుఁడ కృష్ణా. 21

క. శ్రీరుక్మిణీమనోహర
కారుణ్యసుధాంబురాశి కమనీయగుణా
సారాచారనిధానా
భూరమణీమణికళత్ర బ్రోవర కృష్ణా. 22

క. వంచనసేయుట మేలా
పంచశరాకార రధీర పరమోదారా
కాంచనచేలా సరగున
సంచితములఁ దోలి బ్రోవఁ జాలవె కృష్ణా. 23

క. నీపాదభక్తి యుక్తియు
నీపాదార్చకులయందు నిక్కపుమతియున్
బాపుఁగార్యవిరక్తియు
గోపరిపాలక యొసంగఁ గోరితి కృష్ణా. 24

క. చక్రముచే రిపుచక్రము
విక్రమ మెసఁగన్ వధించి విభవాధికతన్
శక్రాదులకుం గూర్చిన
వక్రేతరశీల లోకపాలక కృష్ణా. 25

క. శ్రీద హృషీకేశ సదా
పాదాంబుజసేవఁజేతు భవభయహరణా
సాదరమునఁ బ్రోవర కా
కోదరశయనా ప్రశస్తగుణనిధి కృష్ణా. 26

క. రంగా భీకరపాపవి
భంగా కరుణాంతరంగ పతగతురంగా
శృంగారరూప యలమే
ల్మంగావర ధృతరథాంగ మాధవ కృష్ణా. 27

క. శరణాగతజనరక్షణ
సురవందిత వాసుదేవ సుగుణాకర స
ద్వరదాయక నీపదముల
నిరతము నెఱనమ్మినాఁడ నిజముగఁ గృష్ణా. 28

క. దామోదర సంకర్షణ
నామొఱ వినవేర నందనందన శౌరీ
కామితసురభూరుహ శ్రీ
స్వామీ సర్వేశ విబుధసన్నుత కృష్ణా. 29

క. పురుషోత్తమ కరివరదా
మురహర కరుణాలవాల మునినుతశీలా
వరకాంచనచేలా నిను
నిరతము స్మరియింతునయ్య నెమ్మది కృష్ణా. 30

క. ఆర్తార్తిహరణ నరసం
కీర్తితగుణధుర్య విబుధగేయ సుకార్యా
ధూర్తజనహరణ నిర్మల
కీర్తిఖనీ నిను స్మరింతు కేశవ కృష్ణా. 31

క. నాదెండ్లవాస శ్రీశా
భూదయితాప్రాణనాథ భోగిశయన నీ

పాదంబులె శరణంటిని
ఖేదం బుడుపవె మునీంద్రకీర్తిత కృష్ణా. 32

క. గోవర్ధనగిరిధర సం
సేవితసురయూథనాథ శేషశయానా
కావవె శౌరి జనార్దన
భూవనితాలోల పుణ్యపూరుష కృష్ణా. 33

క. ధర వేంకటరత్నాఖ్యుఁడ
విరచించితి పద్యరత్నవిశ్రుతహారం
బురుకరుణాకర దాల్పర
కలివారఁగఁ గాంతు భువనకల్పక కృష్ణా. 34

క. గోవింద యనెడినామము
భావం బలరంగఁ దలఁతు భావజజనకా
రావే కరుణింపఁగ నీ
సేవ లొనర్చెదను దాససేవిత కృష్ణా. 35

క. నరసింహాకృతి దానవు
సురలు వొగడఁ ద్రుంచి విమలసుగుణునిబాలున్
వరకృపచే రక్షించిన
గరుడధ్వజ విమలతేజ కావవె కృష్ణా. 36

క. వామనకోమలజలద
శ్యామా కరుణాభిరామ సలలితదామా
భామా మనోజసుగుణ
స్తోమా రణరంగభీమ శుభకర కృష్ణా. 37

క. వరపరశువుచే నృపతుల
శిరముల దునుమాడలేదె శితికంఠసుతా
ఖరకరవిస్ఫురదాస్యా
కరుణాంతఃకరణ మోక్షకారణ కృష్ణా. 38

క. జనకజను బెండ్లియై ముని
వనటలఁ బోఁగొట్టి యసురవర్యుల ననిలో
దునిమిన తావకరాఘవ
జననకథల్ సంస్మరింతు సతతము కృష్ణా. 39

క. అతిచంచలంబు నామతి
సతతము నీపాదసేవ సలుపఁగ వరముల్
శ్రితపక్షపాతి కోరితి
బ్రతికింపవె యాదరించి పావన కృష్ణా. 40

క. సృష్టిస్థితిలయకారణ
దుష్టాసురహరణ కలుషతోయధితరణా
స్రష్ట్రముఖదేవవందిత
కష్టములను బాపుమయ్య కడువడి కృష్ణా. 41

క. కరుణగలదొరవు నీవని
నిరతము నిను నెమ్మనమున నెరనమ్మితి నో
పరతత్త్వరూపనిరుపమ
వరరత్నకిరీటహారవక్షా కృష్ణా. 42

క. పూతనప్రాణాపహ నా
చేతఃకమలంబునంఁ జేరి యనవద్యా

స్ఫీతకరుణామరందం
బాతతముగ నించవే దయాకర కృష్ణా. 43

క. హృదయాధివాసివై స
త్పదవులు ముద మెసఁగ నొసఁగఁ బావనములునీ
పదముల నెద నెఱనమ్మితి
కదనజయావహ నృసింహ కావవె కృష్ణా. 44

క. నను బ్రోవ నీకు భరమా
మును దాసులఁ బ్రోవలేదె ముదమెద గదురన్
దనుజహరా వనజకరా
వినుతహరా విజయ వీర విక్రమ కృష్ణా. 45

క. ఆపదలం బెట్టకు నను
నీపదములె నమ్మినాఁడ నిరతము భవసం
తాపహరా భువనధరా
గోపవరా తే నమోస్తు గుణఖని కృష్ణా. 46

క. వరదాయక నిను నిరతము
మఱిమఱి నెఱనమ్మినాఁడ మహనీయగుణా
కర ధరధర పురహారనుత
చరణా కరుణామయాత్మ సదయా కృష్ణా. 47

క. వినియుంటి నీదుమహిమలు
గనఁగా మది గోరియుంటి కనికరమున నో
మునిమానసాబ్జసంస్థిత
నను ధన్యునిజేయ నిన్ను నమ్మితి కృష్ణా. 48

క. ధీరోదారా పుణ్యవి
చారా నవనీతచోర సారాచారా
మారాకారా నిగమవి
హారా రమణీయరత్నహారా కృష్ణా. 49

క. యమళార్జునభంజన భవ
కమలోద్భవవినుత పరమకారుణికవరా
కమలారమణీరమణా
కమలనయన గరుడగమన కావవె కృష్ణా. 50

క. శరణాగతభయహరణా
కరుణాపారీణ దాసకల్మషహరణా
అరవిందసదృశచరణా
ధరణీధర దైత్యదళన దయగను కృష్ణా. 51

క. ఎన్నెన్నో విధముల నా
పన్నుఁడనై భక్తిమీఱ భజియించితి నో
పన్నగశయనా వెన్నుఁడ
తిన్నగ దయచూడుమన్న ధీవర కృష్ణా. 52

క. రారా వసుదేవాత్మజ
రారా రమణీయగాత్ర రారా శౌరీ
రారా ప్రవిమలసద్యశ
రారా యదువంశవీర రారా కృష్ణా. 53

క. రాసక్రీడాలోలా
దాసావనపారిజాత తాపసవరదా

భాసురమణిమయహారా
వాసవనుతచరణ భువనవల్లభ కృష్ణా. 54

క. నవరత్నమయకిరీటా
ప్రవిమలయశ సుప్రకాశ ప్రణుతసురేశా
కవినుత శ్రీరమణీశా
భువనస్తుత దివ్యసుగుణభూషణ కృష్ణా. 55

క. దీనజనరక్షకా వర
ధీనుత సర్వేశ వరద దీపితతేజా
దీనుని నన్ గృపఁ గను మో
దానవసంహారణ లోకతారణ కృష్ణా. 56

క. అవ్యయ రూపవిభంజిత
క్రవ్యాదసమూహ విజయ రథచోదక నీ
భవ్యతరం బగురూపము
ప్రవ్యక్తము సేయు మిదియ ప్రార్థన కృష్ణా. 57

క. ఏమనుజుఁడు నీపదయుగ
మేమఱకయె భక్తిభావ మేర్పడ మదిలోఁ
గామించి కోరునాతఁడు
ధీమంతుం డతఁడె భూమిదేవుఁడు కృష్ణా. 58

క. నందయశోదాప్రియద స
నందన సంక్రందనాది నానార్థిజనా
నందంకర బృందావన
మందిరహస్తాగ్రనిహిత మందర కృష్ణా. 59

క. వ్యథ లుడుపగదే మ్రొక్కెద
మధుమథన సమస్తభక్తమానసపదవీ
పథికావతంస రాధా
మధురాధరపానతృప్తమానస కృష్ణా. 60

క. వాలగమై జలనిధిలోఁ
దేలుచు సోమకుని జంపి దేవత లలరన్
నాలుగువేదంబుల నొగి
మేలుగ విధి కిచ్చినట్టి మేటివి కృష్ణా. 61

క. సురనిచయకంజపుంజా
కరభాస్కర దనుజరాజకంఠవినిర్యత్
గురురక్తవాహినీగత
పరిషిక్తసుదర్శనప్రభాసుర కృష్ణా. 62

క. వల్లవతరుణీపల్లవ
సల్లలితాకార క్షీరసాగరశయనా
పల్లవసమమృదుచరణా
చల్లనికృపఁ జూడు నిఖిలజగముల గృష్ణా. 63

క. అక్షయకరుణారససం
రక్షిత పాండవప్రఫుల్లరాజీవాక్షా
శిక్షిత రక్షోధ్యక్షా
రక్షింపుమి సర్వలోకరక్షక కృష్ణా. 64

క. పరమదరిద్రనిపీడితు
ధరణీసురవరుఁ గుచేలుఁ దాపసుని మహా

త్తరలక్ష్మీయుతుఁ జేసిన
కరణిఁ నను గావరాదె కరుణను కృష్ణా. 65

క. భృత్యానందంకరకృత
కృత్యునిగాఁ జేయవయ్య కీర్తించెద ని
న్నత్యంతభక్తితోడుత
సత్యాహృదయాబ్జభృంగ శౌరి కృష్ణా. 66

క. కరుణాపూరితనేత్రా
దురితలతాదాత్ర లలితతోయదగాత్రా
పరమాద్భుతచారిత్రా
వరమిత్రపవిత్రగోత్రవర్ధన కృష్ణా. 67

క. శ్రీవిలసితవక్షస్థల
భావాతీతప్రభావ భవభయహరణా
భావజసమసౌందర్యా
సేవకజనపారిజాత శివకర కృష్ణా. 68

క. దురితవిదూరా శ్రీకర
పరమాద్భుతదివ్యచరిత పాలితలోకా
తరణిసుతాతటలీలా
చరదాభీరార్భకప్రసాదన కృష్ణా. 69

క. కరసంస్థితపంచాయుధ
సురుచిరధారానికృత్తసురవైరికులా
మురళీమనోజ్ఞగాన
స్మరణానంద ప్రపంచజాలక కృష్ణా. 70

క. ఆద్యంతరహిత యాగమ
వేద్యా ప్రద్యుమ్నవిజయ విక్రమ విష్ణా
మాద్యద్దానవహరణా
విద్యానిధి నన్ను గావవే శ్రీకృష్ణా. 71

క. నీమధురాకృతి గాంచఁగఁ
గామితమతి నైతిఁ గాన కారుణికవరా
ఏమో యని విడనాడక
గోమును జెల్లింపవయ్య కొల్చెద కృష్ణా. 72

క. యదుకులకలశాంబుధిశశి
సదమలయశ సుప్రకాశ సరసిజనయనా
మదనశతకోటిసుందర
కదనవిజయ నిగమగేయ ఘనగుణ కృష్ణా. 73

క. నీనామమధురసంబును
నానాలుకపైని నిల్ప నతు లొనరింతున్
దీనావన దీప్తానన
సూనాస్త్రసమానరూపశోభిత కృష్ణా. 74

క. ఏమనుజుఁడు నీపదయుగ
సామీప్యము జేరు నతని సమధికసుకృత
శ్రీమద్భాగ్యము నెన్నఁగ
సామర్థ్యం బున్నె భువనశాసన కృష్ణా. 75

క. తొలిజన్మపుఁగలుషంబులు
కలఁతలఁ బడఁదోఁచె నన్నుఁ గరుణాదృష్టిన్

దిలకింపర నాశ్రమలను
దొలఁగింపర నిన్ను వేఁడుదును శ్రీకృష్ణా. 76
క. పరులను వేఁడను నీస్మృదు
చరణాయుగము శరణమంచు స్వాంతమునందుఁ
బరిపరిరీతులఁ దలఁచెద
భర ముడిపి యనుగ్రహింపవా శ్రీకృష్ణా. 77
క. దీనాతిదీను నను విడె
దేని భవత్ప్రీతిభ తగ్గు నితరుల వేఁడఁ
కానబడనొక్కో నీకుం
దీనావన నేను చెందు తిప్పలు కృష్ణా. 78
క. గోపీగోపకగోర
తాపరతం గొండఁ గేల సంధించిన నీ
వ్యాపారము భక్తులయెడఁ
జూపింపక ప్రాలుమాలఁ జూతువె కృష్ణా. 79
క. కలికాలంబున మనుజులు
ఫలహీనుల రైనయట్లు పరమాత్ముండుఁ
ఫలహీనుఁ డయ్యె నందురు
లలి భక్తులఁ బ్రోవకున్న లాతులు కృష్ణా. 80
క. మొఱబెట్టిన ద్రౌపదిపైఁ
బరపిన కరుణార్ద్రదృష్టి భక్తులపైనిఁ
నెఱపుట భారమె కరుణా
భరణా నీబిరుదు వీటిపఱచెదె కృష్ణా. 81

క. సిరి కోరలేదు ధరణీ
శ్వరునిం గావింపు మంచుఁ బ్రార్థింపఁగ లే
దఱమర విడి రక్షింపఁగ
స్మరియించితి నాలకింపఁ జను శ్రీకృష్ణా. 82

క. నాకంటె దీనుఁ డుండెనె
నీకుఁ నీభక్తులందు నీవలె కరుణా
లోకనుఁడు నాకు దొరకునె
సాకవు నన్నేల కామజనకా కృష్ణా. 83

క. కరిమొఱ విని కంపమునఁ
బరుగెత్తిన నీకృపార్ద్రభావము నిలుపఁ
దరుణ మిది దీనరక్షక
బిరుదము రక్షించుకొనుట పేరిమి కృష్ణా. 84

క. వ్రజతరుణీరతికేళీ
భజనానందానుకూలపరవశమతివై
నిజభక్తుల దిలకింపవె
వృజినము సుమి దాసజనుల విడచుట కృష్ణా. 85

క. సంగరరంగంబున వెను
కంగ యిడినపార్థునకు సమగ్రముగా జ్ఞా
నాంగ మగుగీత దెల్పిన
మంగళవాక్కనివి నీవె మాధవ కృష్ణా. 68

క. లీలాశుకురసనపయిం
గాళియఫణిఫణములందుఁ గాలిందితటిఁ

లీలమెయిఁ విహరించిన
లాలితనాట్యం బెదఁ దలంచెద కృష్ణా. 87

క. వనజభవాదులు నిను గ
న్గొనఁజాలక వనట లొందఁ గొమరునిగా నిఁ
గని పెంచినదేవకి పా
వనతరపుణ్యంబు నెన్నవశమే కృష్ణా. 88

క. మరణించిన గురుతనయుల
త్వరితగతిం దెచ్చి గురునిపర్యంకమునఁ
కరుణమెయి నిల్పు నీదగు
గురుభక్తి స్మరింప వశమొకో శ్రీకృష్ణా. 89

క. గంగాతనయునిబాణము
లంగంబున నాటఁ గ్రీడి నదలించి మహా
సంగరము గోరు విక్రమ
సంగతు నిను సంస్మరింతు సతతము కృష్ణా. 90

క. మందరము నెత్తుటయు గో
బృందముతోఁ గలసి సంచరించుటయును నీ
యందు గలదైవమానుష
కందళితప్రతిభ దెల్పు గాదే కృష్ణా. 91

క. తల్లికి బ్రహ్మాండంబులు
మెల్లముగా నోటఁజూపి మోదంబుఁ సం
ధిల్లఁగఁజేసిన నీమహి
మోల్లసనము సన్నుతింతు నో శ్రీకృష్ణా. 92

క. ఘనతరయాగాంధులు గను
గొనఁజాలనినిన్ను వారికొమ్మ లెఱిఁగి భో
జనభాజనాదు లొసఁగియుఁ
దనియించిరిగాదె మున్ను తండ్రీ కృష్ణా. 93

క. హింసారతుండు పాపుఁ
గంసుఁడు నిను జంప నెంచి కడ కాతండే
ధ్వంసమయిపోయెఁ గరుణా
మాంసలు నిను దెగడి యెవఁడు మను శ్రీకృష్ణా.

క. పసినాఁడే శకటాసురుఁ
గసిమసఁగితి వంతఁ బోక గాలియసురునిన్
విసరిపడవేసితివి నీ
యసదృశవిక్రమము నెంతు హరి శ్రీకృష్ణా. 95

క. సర్వజగదంతరాత్ముని
గీర్వాణవతంసు నిన్నుఁ గిల్బిషహృదయుల్
సర్వశరణ్యుఁడ వంచును
గర్వంబునఁ దెలియరైరి గద శ్రీకృష్ణా. 96

క. ఏనెంత నీప్రభావము
గానం బొనరించు టెంత కరుణాదృష్టిన్
మానక బ్రోవుమి సాహసి
నైనందులకున్ సహింపవయ్యా కృష్ణా. 97

క. హృదయారవిందమున నీ
సదమలవిజ్ఞానరూపషట్పదమును స

ష్మదమున బంధించినచో
బ్రదికెద నఘముల తరించి బాగుగ కృష్ణా. 98
క. ఓరాజీవదళాక్షా
యోరాజితతారహార యోకరివరదా
యోరాజవరకుమారా
యోరామా మదనరూప యోశ్రీకృష్ణా. 99
క. ఓమందహాససుందర
యోమకుటాదికవిభూషణోజ్జ్వలదాస్యా
యోమధుమథనా శ్రీధర
యోమాధవ దనుజవిదళనోత్సుక కృష్ణా. 100
క. ఓదేవదేవ నీమృదు
పాదము లెద నమ్మినాఁడ భవసంతతులకా
గాదనక తొలఁగఁ ద్రోచి ప్ర
మోదము చేకూర్చవయ్య మునినుత కృష్ణా. 101
క. ఓకమనీయగుణాకర
లోకేశ్వర లోకవరద లోకశరణ్యా
నీకంటె నాకు దిక్కెవ
రేకాకిని బ్రోవ రాఁగదే శ్రీకృష్ణా. 102
క. ఓనారాయణ భవహర
పానందమయస్వరూప సర్వసురేశా
దీనావనబిరుదం బీ
దీనుని రక్షించి నిలుపు దృఢముగ కృష్ణా. 103

క. శ్రీవేంకటరంగార్య సు
ధీవరు సజ్జనకుగురుని ధీరోదారుణ్
భావాతీతగుణాకరు
సేవించెద స్వర్గవాసు శ్రీకర కృష్ణా. 104

క. బలరామానుజవిలస
త్సలిలజసంకాశనయన సద్గుణగేయా
సలలితమృదుతరకాయా
చల మేలర నన్నుఁ బ్రోవ సదయా కృష్ణా. 105

క. జననీజనకులు నిల స
జ్జనవందితు లగుట యొఱిఁగి జగదభినుతిమై
ఘను లగువారికి నీకృతి
వినతుండై యొసఁగినాఁడ వినరా కృష్ణా. 106

క. మంగళము హరిహయానుజ
మంగళము ఖగేంద్రగమన మధుదైత్యహరా
మంగళము నందనందన
మంగళకౌస్తుభవిభూష మాధవ కృష్ణా. 107

క. కమలారమణీరమణా
కమలాసనవినుతపాదకమలా విమలా
కమలదళోపమనయనా
కమలధరా కమలనాభ కావవె కృష్ణా. 108

---

# పీఠిక.

ఈలక్ష్మీశతకమును రచించినది పరవస్తు మునినాథకవి. ఈతఁడు సాతానివైష్ణవుఁడు. శతకములోని 7-8 పద్యములలోని ప్రశంసవలన నీకవి శేషమఠపీఠాధీశుఁ డగుజియ్యరుమహేంద్రుని కృపాకటాక్షమున అష్టావధానప్రజ్ఞయుఁ గవితానైపుణ్యమును బొందినటుల దెలియుచున్నది. ఈ కవిపుంగవుఁడు నిజాముద్రాష్ట్రనివాసి. ఏగ్రామవాస్తవ్యుఁడో యే కాలపువాఁడో నిరూపించుటకు వలయు నాధారము లీశతకమున గాన్పించుట లేదు. శతకవైఖరింబట్టి చూడ నీకవి ప్రబంధరచనాసమర్థుఁడనియును మిక్కిలి యాధునికకవియనియును దోఁచెడిని. రసజ్ఞుఁ డగు నీరచయితగ్రంథరత్నము లెన్ని కాలగర్భమున నిమిడి యున్నవో కదా! కవిసోదరుల పరిశోధనమువలన దక్కుంగలగ్రంథములు లభించునని యాశించియున్నాఁడ. శతకకవులచరిత్రగూడ నీకవితల్లజుని జేర్కొనియుండ లేదు.

ఇది యొకభక్తిరసస్ఫూరిత మగు నొకచిన్నిశతకరత్నము. దీనియందు నూటరెండుకందపద్యములు గలవు. కవి శతకాంతమునఁ దనను మత్తేభవృత్తమునఁ బ్రశంసించికొనియున్నాఁడు.

ఇందలికవిత్వము నిర్దుష్టముగ ద్రాక్షాపాకముతో నాతికాఠిన్యముగా నున్నది. పద్యములయందు శబ్దాలంకారములగు వృత్త్యనుప్రాసము, అంత్యప్రాసము లోనగునవి యుంటచేఁ జదువుటకును వినుటకును గూడ నింపుగానున్నవి. ఈకవిచే రచియింపఁబడిన మఱియొకశతకము "లలితాశతకము". దానిని విమర్శించితిమిగాని శతకరచయితం గూర్చి యింతకన్న నెక్కుడుగా దెలిసికొనుట కాధారము లేమియు నందు లభింపలేదు. అనర్గళమగు కవితాధారతో భావములను సైతము మించెడు చక్కనిపదగుంఫనలతో నీశతకరత్నమును రచించి యాంధ్రభాషాసరస్వతికి నూతనశోభను గలిగించిన యీ యష్టావధాని కడుస్తుతి పాత్రుఁడు.

ఈయముద్రిశతకమునకుఁ బ్రత్యంతరము వ్రాసియు నత్యవసరమగు మఱికొన్ని భాషావిషయికకార్యంబుల నుంటచే దయతో నాకు దీనికి బీఠికవ్రాయు నవకాశ మొసంగిన శ్రీమాన్ శేషాద్రిరమణకవులయొడను శతకసంపుటప్రకటనకర్తలగు బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారియొడనుగృతజ్ఞుఁడను.

నందిగామ
1-6-26.

భాషాసేవకుఁడు,
కొణతాలపల్లి సత్యనారాయణ.

శ్రీ ర స్తు.

# ల క్ష్మీ శ త క ము.



క. శ్రీమద్వేంకటవల్లభ
కామిని చేటీకృతేంద్రకామిని హంసీ
గామిని పక్షికులాధిప
గామిని సకలామరీశిఖామణి లక్ష్మీ. 1

క. న్యాయిని విష్ణుమనస్సం
స్థాయిని భుజగాధిరాజశాయిని శుభసం
ధాయిని పీతాంబరపరి
ధాయిని సకలార్థసిద్ధిదాయిని లక్ష్మీ. 2

క. చారుమునీంద్రమనస్సం
చారిణి భక్తసుమనోనుచారిణి వినమ
చ్చారిణి భువనాభిసుతా
చారిణి సంతతశుభదవిచారిణి లక్ష్మీ. 3

క. వృజినసమాజవిభంజని
నిజభక్తమనోబ్జరంజనీ నేత్రవిభా
విజితమదఖంజనీ స
ర్వజగద్రవ్యాంజనీ నిరంజని లక్ష్మీ. 4

క. ఘనతరదరిద్రశాసిని
వనజవనీవాసినీ సువాసిని సకలో

పనిమత్సభావిభాసిని
యనఘసుధాకుందమందహాసిని లక్ష్మీ. 5

క. కమలాక్షుదివ్యమహిషీ
కమలా పద్మా రమా జగజ్జననీ మా
కమలవనీనిలయామృత
కమలనిధిప్రియకుమారికా శ్రీలక్ష్మీ. 6

క. భువి శ్రీమచ్ఛేషమత ప
రవస్తు జియ్యరు శిరోగ్రరత్నకృపాపాం
గవిభావితాష్టఘంటా
కవితాద్రవిణాఢ్యుఁడను తగంగా లక్ష్మీ. 7

క. అనుపమకవితారచనా
ఘనప్రవీణుండ మదకుకవిమూర్ధ్నవిలుం
ఠనకుశలహస్తపల్లవుఁ
డను మునినాథాభిధానుఁడను శ్రీలక్ష్మీ. 8

క. మందారమంజరీమక
రందఝరీమాధురీధురాభరణవచో
బృందంబుల నీపేరిటఁ
గందంబులు చెప్పువాఁడఁ గైకొను లక్ష్మీ. 9

క. కందంబులు కవి మధురస
కుందంబులు సకలదీనకోకిలచయమా
కందంబులు భక్తజనా
నందంబులు శతకముగ నొనర్తును లక్ష్మీ. 10

క. సరసోక్తిసరణి సుందర
తరశతకందప్రసూనదామక మతిభ
క్తి రచించి సమర్పించెదఁ
గరుణం గైకొనుము సిరులు గ్రాలఁగ లక్ష్మీ. 11

క. ప్రణవాకారిణి విష్ణు
ప్రణయిని ప్రణతప్రజార్తిభంజననిపుణీ
ప్రణుతజన మందిరప్రాం
గణవిలసత్పారిజాతకద్రుమ లక్ష్మీ. 12

క. వైమానికమానవతీ
స్తోమార్పిత కల్పవృక్షసుమమాలామో
దామోదిత దివ్యాంగి
సామాగమగానరసపహసన్ముఖి లక్ష్మీ. 13

క. చారుచరణ సారసలా
క్షారససంలక్షితాంబుజాతేక్షణ వ
క్షోరత్ననికేతన మ
ధ్యారమ్యస్థలిని నతజనావని లక్ష్మీ. 14

క. మునిరాజరాజవదనా
జనసుమనఃపంకజాతసముదాలిని పా
వనశీలినీ మహాశో
భనశాలిని దీనజాలపాలిని లక్ష్మీ. 15

క. అమృతసఖి హిమకరబిం
బముఖి శరణాగతార్తిభరణోరుగుణా

భిముఖి గంధర్వసుధాం
శుముఖి మృదుమధురగానసుముఖి లక్ష్మీ. 16

క. సురకమలముఖి కోమల
కరపల్లవపీడ్యమానకమనీయపదాం
బురుహాయుగళీనిరర్గళ
కరుణారసభరితహృదయకమలా లక్ష్మీ. 17

క. జలజభవప్రముఖాఖిల
నిలింపలీలావతీమణీకరతలసం
చలితమణిచామరచయా
నిలనటదలకాళిలలితనిటలా లక్ష్మీ. 18

క. విరజాతరంగిణీక
ర్బురమయసైకతవితానముద్రితచరణాం
బురుహరథాంకుశహాలక
ల్పరథాంగదరాబ్జవజ్రలాంఛని లక్ష్మీ. 19

క. లలితాబ్ధ్యంతరిలామ
ధ్యలసద్వనకుసుమరసఝరావర్ధితక
ల్పలతావితానకలితో
జ్జ్వలచింతారత్నపీఠవాసిని లక్ష్మీ. 20

క. స్వారాట్ప్రముఖాఖిలబృం
దారకబృందోరుమౌళితటమాణిక్య
స్ఫారకిరణదీపావళి
నీరాజనరాజితాంఘ్రినీరజ లక్ష్మీ. 21

క. ఘనమాన్యవళశాంబర
మణినాదసభానిశాంతమకుటాదికమం
డనగోదంతావళవా
హానలీలోద్యానవనవిహారిణి లక్ష్మీ. 22

క. ఇందీవరమిత్రసుధా
స్యందనకౌస్తుభదిగంతసామజసామ్రా
ణ్మందారపుష్పవాటీ
బృందారకధేనుసోదరీమణి లక్ష్మీ. 23

క. శతమఖముఖనిఖిలహరి
త్పతిశతపత్రాననావితానకరసమ
ర్పితచంద్రశకలపేటీ
ధృతరత్న సువర్ణమయకిరీటీ లక్ష్మీ. 24

క. మధుకైటభవైరిప్రియ
మధురాధరి విలసమానమానాతీత
ప్రథితాసమానవైభవ
సుధామధురవాక్తరంగశోభిని లక్ష్మీ. 25

క. పరమపదావాసిని సో
మరసాస్వాదనవిలోలమంజులహేమాం
బరశోభిని భక్తప్రియ
వరదాయిని దాంతిబ్రహ్మవాదిని లక్ష్మీ. 26

క. భూరమణమకుటతటశో
భారత్నమరీచిజాలబాలాతపసు

స్మేరపదాంబుజ భువనా
ధారమణీ శంఖచక్రధారిణి లక్ష్మీ! 27

క. లలితనిజపీఠపార్శ్వ
స్థలసంస్థితవాగ్గిరీంద్రజారతిహస్తో
జ్జ్వలవీటికాకరండక
కళాచికారత్నపాదుకాయుగ లక్ష్మీ. 28

క. నిరుపమనిర్మలఖేలని
పరమేశ్వరి యాదిదేవి భక్తజనాళీ
పరతంత్రదివ్యసుఘన
స్సరసీరుహాపరమపురుషసహచరి లక్ష్మీ. 29

క. ఆపత్సఖిశుభకరిస
ర్వోపద్రవవారిణీ శుభోజ్జ్వలభక్తా
లీపారిజాతత్రిభువన
దీపాంకురమంగళాదిదేవత లక్ష్మీ. 30

క. నృపదృక్కమలావాసిని
నృపసింహాసననివాసినీ సకలమహా
నృపపాలినీ సుదుర్మద
నృపసంఘాతోగ్రశాసినీ శ్రీలక్ష్మీ. 31

క. యతిహృత్పంకజమధుకరి
పతగాధిపగమని పతితపావనిపరిర
క్షితనిర్జరి జగదుదయ
స్థితిసంహృతికరి యనంతధీనిధి లక్ష్మీ. 32

క. దిగిభవితానానీతం
బగుచల్లనినీట తేట నభిషేకం బా
డుగరితతలమానికమా
భగవతి లావణ్యవతి ప్రభావతి లక్ష్మీ. 33

క. పెనుపడగదారికవణం
బును దినెడివయాళి వార్వముపయిం బలుప్రా
మినుకుంగొనవీదులఁ బెం
పున వాహ్యాళిం జరించు ముద్దియ లక్ష్మీ. 34

క. నలువ నెలతాల్పు మొదలుం
గలవేలుపుతలిరుబోండ్లగములు ననుంగుం
జెలికత్తియలై కొలువం
జెలువారు త్రిలోకజనని శ్రీకరి లక్ష్మీ. 35

క. నలినాక్షునురఃపీఠిం
గొలువై కచ్ఛపముకుందకుందాదినిధుల్
గొలువ జగంబుల నెనరుం
దలిర్ప రక్షించు భువననాయకి లక్ష్మీ. 36

క. వినయము శాంతియు సత్యం
బును క్షమయును ధృతియు దానమును శ్రద్ధతపం
బును నీతియు ధర్మంబును
నను నిక్కల నాట్యమాడు నన్నువ లక్ష్మీ. 37

క. పలుకుఁజెలి మరుగరిత ప
జ్జలఁ గోడఱికము లొనర్పఁ జక్రధరుఁడు మో-

సలఁ గార్యభరము దీర్పఁగ
నెలమి జగంబుల భరించు నీశ్వరి లక్ష్మీ. 38

క. త్వదనుగ్రహపాత్రుండు జ
గదభినుతుం డధికభోగి ఘనయశుఁడు మణీ
సదనచరుండు ప్రబుద్ధియు
సదయుఁడు నృపమకుటఘటితచరణుఁడు లక్ష్మీ.

క. కమలాలయ త్వద్భ్రూవి
భ్రమభేదం బీశదాసవైషమ్యము లో
కము నిమ్నోన్నతము నొన
ర్చు మహైశ్వర్యము తలంచి చూడఁగ లక్ష్మీ. 40

క. నీనెనరు గొనం బింతని
జానుగఁ గొనియాడఁ దరమె చతురానన పం
చానన షడానన సహ
స్రాననులకు బహుఘృణాగుణాకరి లక్ష్మీ. 41

క. వరదాయిని సుఖకరి యిం
దిర శ్రీకరి మంగళాధిదేవత యఖిలే
శ్వరి భక్తావని జలధీ
శ్వరి కన్య యనంగ నీకు సంజ్ఞలు లక్ష్మీ. 42

క. నీవు గలచోటు సరసము
నీవును లేనట్టిచోటు నీరసము జగ
త్పావని పరిలసదనుకం
పావని రదవసనజితజపావని లక్ష్మీ. 43

క. కలుములపై దలి బలులే
ములసిలుగులు బాపుతల్లి ముజ్జగములఁ బెం
పలరఁ బ్రోచు యువతి త
మ్ముల నిమ్ముల నాడు ముద్దుముద్దియ లక్ష్మీ. 44

క. భవదనుకంపకు విను వెలి
యవ్వాఁడు జనావమతుఁడు నపయశుఁ డబలుం
డవినీతి కుమతి దారి
ద్ర్యవశుం డతిమూర్ఖుఁడును దురాశుఁడు లక్ష్మీ.

క. కోమరార నీవు కలిమి క
లిమి కమలా నీవు లేమి లేమి ధరిత్రిఁ
గమనీయకపోలముకుర
సమంచితమురారివదనసారస లక్ష్మీ. 46

క. అకటకట యరుదు నీకత
యొకని ధనాధీశుఁ జేసి యొకనిఁ జెఱచి వే
ఱొకని మురిపించి యిట్టులఁ
దకతక లాడింతు జగము తడఁబడ లక్ష్మీ. 47

క. హారమకుటకుండలకే
యూరాదిసమస్తభూషణోజ్జ్వలదివ్యా
కారిణి దారిద్ర్యప్రవి
దారిణి నిను దలఁచువారు ధన్యులు లక్ష్మీ. 48

క. గురుభక్తిరతులు పరధన
పరదారపరాఙ్ముఖులు సుభాషణులు ధరా

సురహితులు దానశీలురు
సరసాత్ములు త్వత్కృపార్హజనములు లక్ష్మీ. 49

క. వెలితమ్మిగద్దెఁ గొలువై
జలజభవాద్యమరవరులు స్వనిటలఘటితాం
జలులై కడు సేవింపఁగ
నెలమి జగం బేలు త్రిభువనేశ్వరి లక్ష్మీ. 50

క. బలి బిచ్చ మిడక ధర్మ మె
డలి కామక్రోధముల నడరి పరుషపువా
క్కులఁ గ్రూరు లగుచు గర్వము
గలవారలు మీకు మెప్పుగా రిల లక్ష్మీ. 51

క. పండితుఁ డతఁ డాతఁడు శ్లా
ఘ్యుం డతఁడు కులీనుఁ డతఁడు గుణియాతఁడు శూ
రుం డాతఁడు ధన్యుం డె
వ్వండు భవత్కరుణ గల్గువాఁ డిల లక్ష్మీ. 52

క. రమ! యౌవని మొగముపై నీ
బొమ గదలునో వాఁడు రత్నముకుటుఁ డయి గజేం
ద్రము నెక్కి ముత్తియపుగొడు
గమర నమ స్నృపులఁ జూడ కరుగును లక్ష్మీ.

క. సుమశరుతల్లి సుగుణౌ
ఘమతల్లి ప్రార్థితార్థకల్పకవల్లీ
యమరుజగంబులతల్లీ
విమలకృపారసపుపాలవెల్లి లక్ష్మీ. 54

క. సరససుమచందనాది సు
పరిమళవస్తుతతియందు భాసిలి యవియుం
ధరియించు ఘనులసంప
ద్భరితులఁ గావించు పరమపావని లక్ష్మీ. 55

క. శనిముఖు లష్టమగతి కె
క్కినవిధి కష్టదశ నొసట గీసిన నీప్రా
పునఁగల నరు నే మొనరుతు
రినపుషితాంబుజము దుహీన మేచునె లక్ష్మీ. 56

క. శ్రీయును భూమియు లక్ష్మియు
నా యభిదానంబులం దనర్చియు భక్త
శ్రేయోదాయిని వగు నిను
బాయక మదిలోఁ దలంతు భక్తిని లక్ష్మీ. 57

క. తలతొడవుగా ధరింతును
హాలకులిశాంకుశకుశేశయాడిశుభాంకో
జ్జ్వల మగుత్వత్పదకమలయు
గళ మస్మద్రక్షకై తగంగా లక్ష్మీ. 58

క. విను దిగ దచ్చిరువారెవ్వయి
కనులరొయోడయు లెట్టికన్నుఁగవ గోరుదు రా
వనజదళరుచిదళిత మై
పొనరెడి నీకన్నుగవకు మ్రొక్కుదు లక్ష్మీ. 59

క. వినఁ గనఁగ విచిత్రము నీ
నెనరుం గలచూడ్కి యెవ్వనిపయిఁ బొలుచువాఁ

డు నరేంద్రమకుటవిఘటిత
ఘనమణిఘృణిమండితాంఘ్రికములుఁడు లక్ష్మీ.

క. సిరి నీకు జోహారు పయ
శ్శరధిసుతా నీకు జోత సకలజగదధీ
శ్వరి నీకు మ్రొక్కు కనకాం
బురవాసిని నీకు గేలుమోడుపు లక్ష్మీ. 61

క. నరుఁడు నరపాలకుఁడు నీ
కరుణాపాంగములగములఁ గాఁడే యా నీ
కరుణారసముగదా రా
జ్యరమాకలితాభిషేకసలిలము లక్ష్మీ. 62

క. నీపాలఁ బడితి భక్తా
ళీపాలిని ఘనకృపాలలితశుభదృష్టిన్
మాపాల గలిగి బ్రోవుము
భూపాలార్చితమణీవిభూషణి లక్ష్మీ. 63

క. నానూతనని క్షేపమ
నానోఁచిన నోముపంట నాభాగ్యమ నా
యానందజలనిధీ నా
మానితమందారకల్పమా౽జమ లక్ష్మీ. 64

క. ననుఁ గన్నతల్లి నన్నే
లిన దైవము నాతపోలలితఫలమాన
న్మనుచు పదార్చన్నేయమల
నను నెనరునఁ బ్రోచు కలిమి నవలా లక్ష్మీ. 65

క. నీ వని నమ్మితిఁ ద్రిజగ
త్పావని విను నీవినా యితఃపర మెఱుఁగన్
రావే లోకైకేశ్వరి
కావవె భద్రాత్మికా సుఖప్రద లక్ష్మీ. 66

క. నినుఁదప్ప వెఱె యన్యులఁ
గొనియాడఁగఁ బోను జనని గొనకొనియుం బ్రో
చిన నీవే బ్రోవక యుం
డిన నీవే విను త్రిలోకనాయిక లక్ష్మీ. 67

క. ఓకమలపాణి యోంభుభవ
నైకజనని యోనమద్గృహాంగణదివిజా
నోకహా! రావే కృపఁ గన
వే కడు నార్తు నను బ్రోవవే వెస లక్ష్మీ. 68

క. ఘోరదరిద్రసముద్రవి
హారమహాబాడబానలాలింగనమున్
జారుకటాక్షసుధారస
పూరంబుల నార్చి నన్నుఁ బ్రోవుము లక్ష్మీ. 69

క. ఇమ్మా మదభీష్టంబులు
కొమ్మా మా మ్రొక్కులన్ ముకుందుననుంగుం
గొమ్మా వినవమ్మా మా
యమ్మా వలరాజు గన్నయమ్మా లక్ష్మీ. 70

క. నిరతము యుష్మచ్చరణాం
బురుహద్వయచింతనాప్రమోదాత్ముఁడ నై

కర ములరారు ననుం గని
గురుకృప రక్షణము సేయఁ గూడదె లక్ష్మీ. 71

క. విను మెన్నికష్టములు బె
ట్టినఁ బడి యోర్చితి నెదం గడిందిధృతిం బెం
పున రక్షింప మనంబున
నెనరించుక కలుగ దకట నీ కిఁక లక్ష్మీ. 72

క. విను మెటులఁ దప్పదు సుమీ
ఘనసంపద లిచ్చి నన్నుఁ గావక నీ వెం
దును భక్తజనంబులకుం
గనుఁగొన మూఁగొంగుపసిఁడి గావే లక్ష్మీ. 73

క. పరిభవపరిచితి మిక్కిలి
దురవస్థం బెట్టి తార్తి దోరయించితి వ
చ్చెరు వే నేయపరాధం
బురక యొనర్చితి వచింపు మున్నతి లక్ష్మీ. 74

క. చేసితి చేయంగలపనిఁ
బోసితి పరిభవపుధారఁ బొలియించితి వా
యాసంబుల నిఁకనైన మ
హాసంపద లిచ్చి కావుమా వెస లక్ష్మీ. 75

క. కనికరపుఁగడలివై నను
ఘనసంపద లిచ్చి యిపుడు కావుమి యటులై
నను నీలసత్కథావళి
గను విద్వత్సభలలోఁ బ్రకాశము లక్ష్మీ. 76

క. వింటిఁ ద్వదంచితచరితం
బంటి నను గరుణఁ బ్రోవు మని నిను నేఁడం
గంటి భవత్కారుణ్యముఁ
గంటి నిధానంబుఁ గంట గాదే లక్ష్మీ. 77

క. నొచ్చితి నవమతి నచ్చితి
పెచ్చు గదిరె నిచ్చఁ గచ్చువిచ్చై చ్ఛతి కటా
నచ్చి నిను జొచ్చి వచ్చితిఁ
బ్రచ్చర నిప్పుచ్చరంబు వ్రచ్చుము లక్ష్మీ. 78

క. కడుకష్టపెట్టి తిటు లె
క్కుడు గాసిలఁజేసి తొప్పఁ గుందించితి వా
రడి యింకనైన దీరిచి
గడలుకొనం బ్రోవరాదె గ్రక్కున లక్ష్మీ. 79

క. నను గృపఁ జూడుము దుస్థితు
లను దొలఁగింపుము శుభోజ్జ్వలశ్రీయుతుగా
నొనరింపుము భవదాశ్రిత
జను లాపద్రహితు లనవె చదువులు లక్ష్మీ. 80

క. నీచూపు లెచటి కేఁగునొ
యేచోటికి నరుగు గలుము లహామహామని నీ
యాచించుఁ గాదె నాదెస
నాచూపులఁ గను మొకించుకంతయు లక్ష్మీ. 81

క. నను గావు నను ధరింపుము
నను సత్కృప రక్షసేయు నను నేలుము వే
నను గలుము లొసఁగి ప్రోవుము
నను మన్నింపుమి యెడంద నమ్మితి లక్ష్మీ. 82

క. నిను వేఁడుదు నినుఁ బొగడుదు
నిను గొలుతు నినుం దలంతు నిను వర్ణింతున్
నిను సంప్రార్థింతు నినున్
వినుతింతున్ గోర్కు లొసఁగు వేగమె లక్ష్మీ. 83

క. విను తడవేల యొనర్చెదు
పెనుజిక్కులఁ జక్కఁజేసి పెనుపుము సిరులన్
దనివోవ నెనరుచూడ్కుల
నను గనుఁగొని భక్తజనమనఃప్రియ లక్ష్మీ. 84

క. మదిఁ దలఁచి యర్చనము లి
చ్చెద మ్రొక్కెదఁ గీర్తనంబుఁ జేసెద నిదె నీ
కొదవించు నన్నివిధులు శు
భదములు గావే త్రిలోకపావని లక్ష్మీ. 85

క. సరసిరుహానివాసిని శుభ
కరిపంకజహస్తపద్మగంధిని భూతే
శ్వరి పద్మిని త్రిభువనసుం
దరి నిన్నుఁ దలంతు లోకనాయిక లక్ష్మీ. 86

క. అమృతమయాత్మిక, సకలా
గమసన్నుత సుప్రసన్న కాంతప్రసాదా
భిముఖి నతార్తివినాశని
కమలా నిను గొల్తు గరుడగామిని లక్ష్మీ. 87

క. ధనధాన్యకరి శుభంకరి
వినమజ్జనసురసురభి ప్రవిమలాత్మకచం
దనశీతల త్రిభువనవ
ర్ధని దేవి, భజింతు నిన్ను దారిణి లక్ష్మీ. 88

క. సతతానందమయాత్మిక
శ్రుతిమౌళిమణిప్రభావిశోభిత శరణో
చతురాననాదిసేవిత
చతుర్భుజ దలంతు నిను యశస్విని లక్ష్మీ. 89

క. లలితాత్మిక భాస్కరి ని
ర్మలిని హిరణ్మయి సుపర్వమహిళాకర సం
చలచ్చామరమరుదంకుర
చలితాలక యెంతు నిను రసాసఖి లక్ష్మీ. 90

క. శివ శివకరి యవిభూతి
ప్రవిమర్దని పద్మనిలయ పద్మిని పద్మో
ద్భవ పద్మప్రియ పద్మక
ధ్రువఁ గొలుతు నినుఁ సువర్ణరూపిణి లక్ష్మీ. 91

క. త్రైలోక్యకుటుంబిని ప
ద్మాలయ పద్మమకరాదికానేకనిధీ
వ్యాలీఢపురస్థలి నత
పాలిని వినుతింతు నిను విభావరి లక్ష్మీ. 92

క. స్థితి సిద్ధి సరస్వతి రతి
ధృతి బుద్ధిం బ్రకృతి దితి నదితి మంగళదే
వత నమృతసుమతి దివ్యా
కృతి నిను గీర్తింతుఁ జిదచిదీశ్వరి లక్ష్మీ. 93

క. అనఘ వసుంధర వసుదా
యిని తేజస్విని మహేశ్వరేశ్వరి శుభహా
స్తిని నాథసంప్రబోధిని
ధనవాసిని దలఁతు నిను సుధాసఖి లక్ష్మీ. 94

క. శోకవినాశని సుఖద శు
భాకారిణి పద్మ త్రిజగదవనిహిరణ్య
ప్రాకారవినమదమరా
నోకహ నినుఁ గొల్తు హరి మనోహరి లక్ష్మీ. 95

క. విశ్వజనయిత్రి శాశ్వత
శశ్వత్సంపత్ప్రద ప్రశాంతి నఖిలలో
కేశ్వరి భక్తజనప్రియ
విశ్వాత్మిక దలఁతు నినుఁ బ్రమలివిని లక్ష్మీ. 96

క. సత్యాత్మిక వసుధారిణి
నిత్యానందస్వరూపిణిం ధాత్రి శతా
దిత్యప్రభ శుచి సభవా
దిత్యప్రణుతాంఘ్రి నిను నుతింతును లక్ష్మీ. 97

క. శతకోటిచంద్రశీతల
జతురానన మీనకేతుజనని విభూతిన్
సతి పద్మమాలికాధర
నతపోషణి గొలుతు నిను ధనప్రద లక్ష్మీ. 98

క దారిద్ర్యప్రవిదారిణి
నీరేజవనీవిహారిణిన్ బరమశుభా
కారిణి నతపరిభవసం
హారిణి నిను దలఁతుఁ గృతివిహారిణి లక్ష్మీ. 99

క. నారాయణి దుష్కృతసం
హారిణి సభయప్రదానహస్తాబ్జపయః
పారావారకుమారి ఘృ
ణారాశి తలంతు నిను సనాతని లక్ష్మీ. 100

క. జయజయ దరిద్రమర్దని
జయజయ భక్తార్తిశమని జయజయ దేవీ
జయజయ మునికవివరనుత
జయజయ నిజభక్తశుభద జయజయ లక్ష్మీ. 101

క. అలరుం గైతల నేరుపు
గలుగంగా నిన్నుఁ బొగడఁ గాంచితిఁ దలఁపఁగా
దొలిబాముల నోఁచిన నో
ములపంట ఫలించె సిరులఁ బొదలితి లక్ష్మీ. 102

మ. అనఘ శ్రీపరవస్తు శేషమతపీ
ఠాధీశజియ్యర్క హేం
ద్రనిరాఘాటకృపాకటాక్షరససం
ప్రాప్తాష్టఘంటాకవి
త్వనిధి శ్రీ శతపత్రసన్నరముని
స్వామి ప్రణీతంబు ధా
త్రిని లక్ష్మీశతకంబు భానుశశిభూ
భృత్తార మై శోభిలున్.



# పీఠిక.

రంగశాయిశతకము మిగుల ప్రౌఢముగ నిర్దుష్టముగ నున్నది. ఇందలిపద్యములు చాలచోటులఁ బ్రాతపఠనీయములుగ నున్నవి. ప్రతిపద్యమునందును నిరాఘాటమగుధారయు మనోహరమగు పదకల్పనము సరళమగుభావ ముంటచే నీశతకము ప్రశస్తతర మనుటలో సంశయము లేదు. ఉపలభ్యమగు నీశతక ప్రతియందు 101 పద్యములు మాత్ర ముంటవలనను సాధారణముగ 108 పద్యములతో శతకము లుంటవలనను కవివృత్తాంతము దెలుపుపద్యములు కానరాకపోవుటవలనను ఇంకను గొన్నిపద్యములు లభింపవలసియుండునని తలంచుచున్నారము. వ్రాఁతప్రతులున్నవారు మిగిలినపద్యములకై ప్రయత్నించిరేని శతకము సంపూర్ణము కాఁగలదు.

కవిజీవితము దెలుపుపద్యములను వ్రాసికొనక కథాంశములను వ్రాసికొను నాచారము లేఖకులందును ముద్రణకర్తలయందుఁ గలదు. అందుచే

నమూల్యములగు గ్రంథములకుఁ గవిజీవితము కాలము నెఱుంగ వీలు కలుగకున్నది. కేవల యశఃకాములై గ్రంథరచన మొనరించినకవులరయుడఁ గృతఘ్నులమై వారివృత్తములఁ దెలుపుపద్యముల విడచుట కవులకు భాషకుఁగూడ నింత యనరాని ద్రోహ మొనరించుట యని మాతలంపు.

రంగశాయిశతకము రచించినకవి యెవఁడో యే కాలముననుండెనో తెలిసికొననగు నాధారములు లేవు. ధారాసౌష్ఠవము భావవిస్ఫూర్తిఁ బట్టిచూడఁ గవి నూటయేబదిసంవత్సరముల కీవలివాఁడు గాఁడని తోఁచును. ఇందులకు ఈశతకపుఁ బ్రాచీనలిఖితప్రతులు సాక్ష్యముగాఁ గలవు. కవి పుణ్యనదులఁ బేర్కొనుచు మలాపహారిణిని బేర్కొనెను. ఇది గుడివాడతాలూకాలోని కాలువ గాన నాప్రాంతవాసి యని దేశోద్ధారకులు వ్రాసిరిగాని మలాపహారిణి "పాపనాశని" యని మాతలంపు. ఇది తిరుపతిలోని యొకజలపాతము. సుప్రసిద్ధము లగుపుణ్యనదుల నెన్నింటినో పేర్కొనుచు వ్యాప్తిలేని యొక చిన్నకాలువను బ్రశంసించెననుట పొసఁగదు. ఛంద

ప్రతిబంధకముచేఁ బాపనాశనిని మలాపహారిణి యని కవి వాకొని యుండును. మిక్కిలి వ్యాప్తిగలయీ శతకము రచించినకవిచరిత్రాదు లెఱుంగ నవకాశములు లేమి మిగుల సంతాపకరము. సుప్రసిద్ధగ్రంథములు కొన్ని కర్తృనామము లేకే వ్యాప్తిలోనున్నవి.

ఈశతకకర్త శ్రీవైష్ణవుఁడై యుండును. శ్రీభగవద్రామానుజుని నివాసస్థలమగుటవలనను వైష్ణవమతప్రచారమునకుఁ బ్రధానస్థానమగుటవలన శ్రీరంగమునెడ రంగనాయకునియెడ వైష్ణవులకు భక్తిప్రపత్తులు మెండు. చోళులకాలమున శ్రీరంగము మిగుల సంపదలతోఁ దులతూఁగెను. రంగనాయకులు విప్రనారాయణ యనుతొండరడిపొడియాళ్వారు (భక్తాంఘ్రిరేణువు)నకు మోక్షమొసంగిన కథాంశము శతకమునందలి ८८ వ పద్యమునందుఁ గలదు. ఈశతకము ప్రతిపద్యమునందును భక్తిభావమును బ్రకటించుచున్నది. దీనినిబట్టిచూచినను శతకకర్త వైష్ణవుఁడని విశ్వసింపవచ్చును.

కవి యీశతకమును బ్రౌఢవయస్సులో వ్రాసి యుండును. కావనే యమకము అంత్యనియమము.

ముక్తపదగ్రస్తము లోనగు శబ్దాలంకారము లుప
యోగించినను ధార సారళ్యముగ నున్నది. శైలి
సంస్కృతాంధ్రపదములు సమముగాఁ గలిగి పఠన
యోగ్యముగా నున్నది. శతకసంపుటముల కీశతక
మమూల్య మగు నలంకార మనుటకు సంశ
యింపము.

ఇట్లు

నందిగామ, 1-6-26. } శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

# రంగశాయిశతకము.



ఉ. శ్రీమహిళావరుండు సరసీరుహసంభవముఖ్యదేవ
తాస్తోమనుతప్రభావుఁడు విశుద్ధయశుండు కృ
పాకటాక్షవీక్షామృతభక్తరక్షణుఁడు హారవిభూ
షణభూషితాంగశోభామణి రంగశాయి మన
పాలఁ గలండు విచార మేటికిన్. 1

ఉ. శ్రీలలనాకుచస్థలపరిస్ఫుటకుంకుమగంధసారజం,
బాలవిశాలవక్షుఁడు కృపాలలితాక్షుఁడు భక్త
వత్సలుం, డోలి సమస్తభాగ్యమహిమోన్నతుఁ
డంచితపుణ్యమూర్తి గో,పాలుఁడు రంగ... 2

ఉ. శ్రీయువతీకళత్రుఁడు నృసింహకిశోరకమూర్తి
యాదినా,రాయణుఁ డాదిపూరుషుఁ డనంతుఁ
డనంతకళావతంసుఁ డా,త్రేయుఁ డజేయుఁడా శ్రి
తవిధేయుఁడు భక్తజనాదిగణంబులం, బాయని
రంగ... 3

ఉ. శ్రీమహిళామణీవిమలచిత్తచకోరకసోముఁడంబు
ద, శ్యాముఁడు మోక్షధాముఁ డురు సం
గరభీముఁడు కుంజరావనో, ద్దాముఁడు కోటి

సూర్యనిభధాముఁడు భక్తహృదంతరస్ఫుర,
ద్ధ్యామణి రంగ... 4

ఉ. శ్రీరమణుండు దేవకులశేఖరుఁ డాశ్రితపారి
జాత మం,భోరుహపత్రనేత్రుఁడు విభుండు
సమస్తజగత్కుటుంబి వం,దారునిలింపధేనువు
సనాతనుఁ డాదిమమూర్తి లోకసం, భారుఁడు
రంగ... 5

ఉ. ముంగిటివేల్పు లోకములఁ బ్రోచినప్రోడ ఘృ
ణాంతరంగుఁడుఁ, రంగదభంగసాగరతరంగ
ములం బవళించురాజు కా,ళింగమదాపహారి
కడలిం జనియించినసాధ్వినాథుఁ డా, బంగరు
రంగ... 6

ఉ. అంగభవాదిదేవతలకన్నను జక్కనివాఁడు స
ర్వదా, ముంగిటిపెన్నిధానము నమో యని
మ్రొక్కెడువారిఁ గాచు శ్రీ, రంగపురీశ్వరుండు
రవిరాజవిలోచనుఁ డుల్లసత్కృపా,పాంగుఁడు
రంగ... 7

చ. యతులతపఃఫలంబు విబుధావళికెల్లను రక్ష
గోపికా, సతులకు నోముపంట భవసాగరపో
తము దివ్యవిగ్రహుం, డతులమహానుభా
వుఁడు సహస్రఫణాహిపశాయి భూరమా, పతి
యగు రంగ... 8

చ. కలువలరాజు తమ్ములవికాసముజేసిన వేల్పు
కన్నులుం, జిలువ వజీరుపానుపు విచిత్రసువర్ణ
దుకూలము న్మహా, జ్వలతరకుండలంబులును
బాగుగఁ దాల్చినదేవుఁ డుజ్జ్వల, ద్బలుఁ డగు
రంగ... 9

ఉ. కొంగున నున్నమానికము కోరిక లిచ్చుసురద్రు
మంబు సా, రంగసుతాంఘ్రిపంకజుఁడు రాజస
తామససాత్త్వికాది మూ, ర్త్యంగములన్ ధరించి
జగమంతయుఁ బ్రోచుఘనుండు సత్కృపా,
పాంగుఁడు రంగ... 10

ఉ. క్రొన్నెలవంకనామమును గొప్పగు కౌస్తుభదివ్య
రత్నముల్, వెన్నెలఁ గాయునెమ్మొగము విప్పగు
కన్నులమందహాసముఁ, జెన్నగుచుండు మాని
సురసేవ్యపదాబ్జుఁడు భోగభాగ్యసం, పన్నుఁడు
రంగ... 11

ఉ. దానవనాథుసంతతి సుదర్శనధారను నుగ్గునుగ్గు
గాఁ, బూనికఁ జేసినట్టిసురపుంగవుఁ డింద్రవనంబు
లోనిసం, తానము నింటఁదోఁటగను నాఁటినధీ
రుఁడు మానిహృత్తమో, భానుఁడు రంగ...

చ. గరుడుఁడు వాహనంబు శితికంఠుఁడు నెచ్చెలి
కాఁడు భూ రమా, సరసిజలోచనల్ సతులు
సారసగర్భుఁడు మన్మథుండు సు, స్థిరతనయుల్

చెలంగ నతసీకుసుమాభశరీరశోభతోఁ, బర
గెడు రంగ... 13

ఉ. మౌళిమయూరపింఛమును మన్మథకోటివిలాస
రూపమున్, బాలరసాలపల్లవము భాతిఁ జెలం
గెడి మోవి వేణువున్, దాలతమాలకానన
వితానవిహారము గల్గియున్న గో, పాలుఁడు
రంగ... 14

చ. క్షితిని ననేకమార్గములఁ జెందక మర్త్యుఁ డెఱిం
గి నీవె నా, గతియని పాదపంకజయుగంబును
జిత్తములోన నిల్పి సం, తతమును నాశ్రయింప
నతిధన్యునిగా నొనరించు నా రమా, పతియగు
రంగశాయి... 15

ఉ. భీతయు వీతవస్త్రయును భిన్నవచస్విని యైన
ద్రౌపదిన్, జేతులు మోడ్చి మ్రొక్కఁగను శీఘ్ర
మ మానధనంబు నిల్పుచున్, భ్రాతయుఁ దల్లి
దండ్రియును దైవము తానయి యొట్టుగా చె
నా, భాతిగ రంగ... 16

ఉ. వేలుపుఱేఁడు వచ్చి వనవీథుల దూడలఁ బిన్నపా
పలన్, మేలుగ నున్నఁజూచి బలిమిన్ హరియిం
చినఁ గాంచి దూడలుం, బాలుఁడునై నటించిన
కృపాళుఁడు వల్లవతల్లజుండు గో, పాలుఁడు
రంగ... 17

ఉ. ఆలమునందు నిల్చి నరకాసురు రూపఱఁజేసి
గోపికా, స్త్రీలఁ బదాఱువేలను వరించి మహో
న్నతిఁ గాంచి యార్జిత, శ్రీలను భాగ్యసంపదఁ
గుచేలునకుం గృపసేసినట్టి గో, పాలుఁడు
రంగ... 18

ఉ. నీలపయోదసన్నిభవినిర్మలమూర్తిని దాల్చి దై
త్యాలిం, దోలి యణంచి సాధుల మనోరథముల్
తనివార నిచ్చి హే,రాళపుఁగీర్తి దిక్కులఁ
దిరంబుగ నిల్పిన రామనామభూ, పాలుఁడు
రంగ... 19

ఉ. గంగఁ బదంబునందుఁ బొసఁగం గనినట్టి మహా
నుభావుఁ డ,య్యంగజు నెగ్గు లెన్నఁదగు నంచిత
రూపమువాఁడు లోనఁ జే,గంగను పట్టువాఁడు
పరగఁ విలసిల్లుఘనుండు సత్కృపా, పాంగుఁ
డు రంగ... 20

చ. ఇరవుగ మత్స్య కచ్ఛప కిటీంద్ర నృసింహ వటు
త్రిరామ భాసు,ర వర బుద్ధ కల్కి ఘనశోభన
రూపములందు నిల్చి సు,స్థిరముగ భక్తకోటుల
నశేషము ప్రోచినయట్టి కౌస్తుభా, భరణుఁడు
రంగ... 21

చ. శరచరరూపధారియయి సాగర ముద్ధతిఁ జొచ్చి
సోమకా, సురుని వధించి వేదములు చోద్య మెల

ర్పఁగఁ దెచ్చి శారదా, వరునకు నిచ్చి ముజ్జగము
వారలఁ బ్రోచినయట్టి కౌస్తుభా,భరణుఁడు రంగ.

చ. ఉరవడి దేవదైత్యులు పయోనిధిఁ ద్రచ్చఁగ
మందరాచలం, బరిదిగఁ గ్రుంగ దానిఁ గమ
ఠాకృతి మీఁదికి నెత్తి కూర్మితో, నరయఁగ దేవ
పంక్తి కమృతాన్నముఁ బెట్టినయట్టి కౌస్తుభా,
భరణుఁడు రంగ... 23

చ. ధరణిని జుట్టి చంక నిడి దాఁగినయట్టి హిరణ్య
నేత్రునిం, గిరివరమూర్తియై వెదకి గీటడఁగించి
ధరిత్రిఁ గొమ్మునన్, బరగ ధరించి తొంటక్రియఁ
బట్టుగ నిల్పినయట్టి దిట్ట భూ, భరణుఁడు రంగ.

ఉ. పొంగుచు నాహిరణ్యకశిపున్ నఖపంక్తిని జీలి
వానిసూ,నుం గరుణించి కాచినఘనుండు ప్ర
శాంతుఁడు శ్రీనృసింహమూ,ర్త్యంగుఁడు భక్త
కోటిఁ గృప నారసి ప్రోచు ఘనుండు సత్కృపా,
పాంగుఁడు రంగ... 25

ఉ. గోలతనంబునం బలిని గోరినయట్టి పదత్రయంబు
నా, పాలికి ముజ్జగంబులని ప్రస్తుతిసేయుచు వచ్చి
చయ్యనన్, మేలుగ ధారఁ బట్టి బలి మెట్టిన
దిట్టగునట్టిపొట్టి యశా, బాలుఁడు రంగ... 26

చ. పరువడిఁ గార్తవీర్యపరిపంథినృపాలు సహస్ర
బాహువుల్, తిరముగఁ ద్రుంచి క్షత్రియులఁ

దీవ్రత నిర్వదియొక్కమారు వే,సరక వధించి
రాముఁ డన సంస్తుతికెక్కినబాహుశాలి స, ద్వర
దుఁడు రంగ... 27

ఉ. వాలిని దాటకం దునిమి యాగముఁ గాచి యహ
ల్యఁ బ్రోచి సీ,తాలలన న్వరించి రణదర్పిత
రావణకుంభకర్ణదై,త్యాలిని ద్రుంచి రాజ్యము
నయంబుగ నేలిన రామచంద్ర భూ,పాలుఁడు
రంగ... 28

చ. చలమున రాసభాసురునిఁ జంపి ప్రలంబుని నొం
చి మర్కటుల్, ఖలుఁ బోరియించి శత్రునృప
గర్వ మణంచి దురాత్ము రుక్మినిన్, నలినలిచేసి
నాఁగటను నాగపురిన్ బెకలించినట్టి స, త్ఫల
దుఁడు రంగ... 29

ఉ వృద్ధమునీంద్ర వేషమును వేసుక దండకమండ
లంబు చే, బుద్ధయుగానఁ బూని పురుబోణుల
మెల్లనఁజేరి వారి స, ద్బుద్ధులు సాగఁబుచ్చిన ప్ర
బుద్ధుఁడు యోగిజనౌఘమానసో, ద్బుద్ధుఁడు
రంగ... 30

చ. అరయుచు లోకముల్ కలియుగాంతమునందు
సమ స్తపాతకో, త్కరనరులన్ ఖురాగ్రముల
ఖండితదేహులఁ జేసి డాసి భీ, కరగతిఁ గల్కి

రూపముఁ దగఁ ధరియించి కలిప్రహారుఁడై
పరగెడు రంగ... 31

ఉ. కంధి సుకన్యకాహృదయకంజదివాకరుఁ డార్త
లోకసం, బంధి వదాన్యశేఖరుఁ డపారకృపాపరి
పూర్ణనేత్రుఁడుఁ, సింధురరాజరక్షణుఁ డశేష
గుణాఢ్యుఁడు దైత్యవైరి ము, ద్బంధుఁడు రంగ.

ఉ. ధీరుఁడు కౌస్తుభాది వరదివ్యవిభూషణశంఖచక్ర
శృం, గారుఁడు కుంభకర్ణదశకంఠవిరాధముఖా
సురేంద్రసం, హారుఁడు నిత్యశోభనవిహారుఁడు
దుగ్ధపయోధిజామహీ, భారుఁడు రంగ... 33

ఉ. వ్యాసశుకాంబరీషసనకార్జును లాది మునీంద్ర
సంఘముల్, వాసవవీతిహోత్రయమవాయువు
లాదిగఁ గల్గు దేవతల్, భాసురరీతి నెవ్వని ప్ర
భావము లెంచెద రట్టి చిన్మయో, ద్భాసుఁడు రం.

ఉ. రాక్షసవైరి హాటకధరాధరధీరుఁ డనేకకోటిహా
ర్యక్షసమానవిక్రమ సమన్వితుఁ డక్షయచారు
మూర్తికం, జాతుఁడు వంద్యమాన గుణహా
రుఁడు నారదముఖ్యభక్తస, త్పతుఁడు రంగ...

ఉ. శ్రీలుఁడు దివ్యహేమమయచేలుఁడు పుణ్యఫల
ప్రదానదృ, గ్జాలుఁడు నందబాలుఁడు సుసాంద్ర
మునీంద్రఫణీంద్రరాడ్వచో, హేలుఁడు సత్కృ

పాలుఁడు సురేశ్వరభ క్తవిలోలుఁ డాదిగో,
పాలుఁడు రంగ... 36

చ. ధరణి రథంబు భాస్కరసుధాకరు లందు రథాం
గముల్ చతుర్వరనిగమంబు లశ్వములు వారిజ
సంభవుఁ డందు సూతుఁడుఁ, సురగిరి విల్లు శేష
ఫణి సొంపగునారి మహేశుఁ డందు వే, మరు
దధికారిగాఁగ శరమార్గమునఁ పురముల్
జయించు నా, పరముఁడు రంగ... 37

ఉ. కేశవుఁ డార్తరక్షకుఁడు కృష్ణుఁడు జిష్ణుఁడు
కోటిసూర్యసం, కాశుఁ డజేయుఁ డుత్తముఁ డ
గణ్యుఁడు వారిజనేత్రుఁ డాదిల, శ్రీశుఁడు
కీర్తిహారుఁడు మునీంద్రసమంచితదృక్చకోరశో,
భాశశి రంగ... 38

ఉ. మానిసితిండుల న్వెదకి మాపినయట్టివజీరు చిల్వ
మ,న్నీని వెడందపాన్పునను నిద్దురబోయెడుసామి
దేవతా,మతానుల నార్తులఁ దయను మించినవే
లుపు జెట్టి సత్ప్రభా, భానుఁడు రంగ... 39

చ. కలుములబోటి రాణి చలిగాడ్పులదిండిరొ దండి
పాన్పు వేల్పులదొర తోఁడు బమ్మయునుఁబూవి
లుతుండు ననుంగుఁగుఱ్ఱలై, చెలఁగు మహాను
భావుఁడు ప్రసిద్ధచరిత్రుఁడు భక్తలోకసత్ఫలదుఁ
డు రంగ... 40

ఉ. తజ్జ్ఞమనోబ్జషట్పదము దాసులపాలిటివేల్పుటా
వు స, ర్వజ్ఞుఁడు సంతతప్రమద వర్ణితనిర్మలదివ్య
నామభా, వజ్ఞుఁడు నారదాదిమునివంద్య మహా
మహిమానుభావనా, ప్రాజ్ఞుఁడు రంగ... 41

ఉ. వెన్నుఁడు శౌర్యధైర్యపటువిక్రమనక్రమహో
గ్రపీడనా, పన్ననిఁ దద్గజేంద్రుఁ బ్రతిభామతిఁ
బ్రోచిన దుష్టదైత్యవి, చ్ఛిన్నుఁడు వాక్ప్రసిద్ధ
ఘనశేషవిశేషనుతప్రభావసం, పన్నుఁడు రంగ.

చ. బిసరుహసంభవాండము గభీరమహత్త్వవిశేష
వైఖరి౯, విసువక సృష్టిచేసి మఱి వేడ్కఁ బ్రవ
ర్ధిలఁ జేయువేళలం, దసదృశజన్మపోషణాలయ త్రి
గుణప్రవణప్రవర్తనా, భ్యసనుఁడు రంగ... 43

చ. కలికియొయారి పాల్కడలి గాంచిన యొప్పుల
కుప్ప చంద్రు నె, చ్చెలియలు ముద్దుగుల్క
వెనుచిల్కల తేర్గలమారుఁ గన్న య, వ్వెలఁదుక
పేరురంబుపయి వేడ్క ఘటిల్ల వసించు నమ్మహా,
బలుఁడగు రంగ... 44

ఉ. కిన్నరసిద్ధకింపురుష ఖేచర సాధ్య పిశాచ గుహ్య
కుల్, పన్నగయక్షరాక్షససుపర్వమునీశ్వరు లష్ట
దిక్పతుల్, సన్నుతిఁ జేయనేర రనఁజాలిన లీల
జరించు రక్షితా, పన్నుఁడు రంగ... 45

ఉ. చైత్రుఁడు నైజభక్తజనజాలమహీజమహావనాలి
కిన్, మిత్రుఁడు ధర్మజాదిధరణీధవముఖ్యుల కెల్ల
నెయ్యపుం, బుత్రుఁడు దేవకీపరమపుణ్యసతీమణి
కయ్యజార్చ్యకున్, బాత్రుఁడు రంగ... 46

ఉ. అంగజుఁ గన్నతండ్రి కలశాంబుధి నిద్దురఁ జొ
క్కుసామి సా, రంగధరార్చితుం డఖిలరాక్షస
లోకలయాంతకుండు శ్రీ, రంగవిభుండు దాస
జనరక్షణుఁ డక్షయమూర్తి సత్కృపా, పాం
గుఁడు రంగ... 47

ఉ. రంగదనేకదివ్యశరజాలుఁ డుదారకృపాంబురాశి
సా, రంగమదాభిషిక్తుఁ డభిరాముఁడు భక్తఫల
ప్రదాయి శ్రీ, రంగపురీశ్వరుండు కరిరాజును
బ్రోచినవేల్పు సత్కృపా, పాంగుఁడు రంగ.

ఉ. వారణదారుణారి మదవారణకారణుఁ డుగ్రదై
త్యసం, హారణభద్రసద్వనవిహారధురీణుఁడు శిష్ట
భక్తని,స్తారణుఁ డెన్నఁడున్ స్మరణ ధారణయో
గ్యుఁడు భవ్యకీర్తిసం, భారుఁడు రం... 49

చ. ఘనుఁడు ఘనోపమాననవకాళిమవర్ణుఁడు మాన
నీయగో, ధనుఁడు ధనాధినాథ సఖదార సదా
జపితుండు మానిరా, డ్వినుతగుణాకరుండు కర
విశ్రుతచక్రపయోజనిత్యశో, భనుఁడగు రంగ.

ఉ. గోప్యముగా నిశాటభటకోటులు కాపుగ నుం
డ నగ్నిసా, మీప్యమునన్ వసించిన సమిద్ధరసా
తలహోమనైష్ఠికున్, జప్యపరున్ పులస్త్యభవు
సర్వమనోరథభగ్నుఁ జేయుస, త్రిప్పుఁడు
రంగ... 51

ఉ. రంగనికేతనాంతరనిరంతర శేషసుఖోపవిష్టుఁడై,
యంగనతో సిరంగపురమం దొగి నిల్వఁగఁ గోరి
స్వర్ణర, త్నాంగదముఖ్యభూషణము లార్యుల
కున్ గృపసేయు భృత్యభీ, భంగుఁడు రంగ...

చ. శ్రుతిచతురార్థవేద్యుఁడు యశోధనుఁ డాదిమ
శేషశాయి భా, రతిదయితాభినందితుఁడు రావ
ణభీషణకోపవాక్యకం, పితకపురస్సమాగతవిభీ
షణభీహరణుండు సత్యవా, క్ప్రతిభుఁడు రంగ.

ఉ. బంగరుకొండ చాపముగఁ బట్టినయోధకుఁ గూ
ర్మిమామయై, బంగరుకంటిరక్కసునిఁ బట్టి వధిం
చిన మేటిసూరుఁడై, బంగరుచేలఁ గట్టుకొని
బంగరుబొజ్జను గన్న సంతతా, భంగుఁడు రంగ.

చ. అబలల వేలసంఖ్యల మహామహిమ న్వరియించి
ద్వారకన్, సొబఁగున నున్నకాలమునఁ జొక్క
పుటింతి నొకర్తుఁ గోరు స, ద్విబుధమునీంద్రు
మానసము వెల్వెలఁ బాఱఁగఁజేసె నెవ్వఁ డా,
ప్రబలుఁడు రంగ... 55

ఉ ఆద్రుహిణేందుశేఖరుల కైన నగోచరుఁ డద్రి
జాంగనా, భద్రగజేంద్రరక్షణ కృపాలుఁడు
పాదసదాభివందనా, క్షుద్రభవప్రహర్తగుణ
శోభితుఁ డాదిమతత్త్వబోధవహృ, ద్భద్రుఁడు
రంగ... 56

ఉ. ఆనళినోద్భవామరభయంకరనిత్యవిహారదుష్టలం,
కానగరినిశాటపటుగర్వవిమోచనుఁ డాగమా
ర్థసం, తానవనైకలోలుఁడు బుధప్రకరస్తుతుఁ
డాత్మదీప్తిచి, జ్ఞానుఁడు రంగ... 57

ఉ. నల్లనిమేనిచాయయును నల్లనికంఠము గల్గు
నల్లుఁడున్, నల్లనికల్వరేకులను నవ్వు కనుంగవఁ
జూచు భార్యయున్, నల్లనిచేలదేవర ఘనంబుగఁ
దోడయియున్న దైత్యహృ,ద్భల్లుఁడు రంగ...

చ. చదువులప్రోడఁ గన్న యలచక్కనితండ్రి కృ
పాంబురాశి క్షు,ద్రదనుజసంహారుండు వెలిదా
మరక్రొవ్విరియందు గండుతు, మ్మైదక్రియ క్షీరవా
రినిధి మీఁద వసించినవేల్పు శ్రీశుభ, ప్రదుఁ
డగు రంగ... 59

చ. అమరఁగఁ గాశికాపురి ప్రయాగ సిరంగము
కాంచి చక్రతీ,ర్థము తులసీవనంబు మధురానగ
రేంద్రము శేషశైలవ,ర్యము పురుషోత్తమంబు

మొదలైన శుభస్థలులందు వైభవం, బమరెడు
రంగ... 60

ఉ. దీప్తి ననేకభాస్కరుల తేజము నంది ప్రసిద్ధమం
త్రభూ, గుప్తవిలాసవైఖరి నకుంఠితలీల మెలం
గుచుండి యా,సప్తమహార్షులం గరుణ సంశ్రితప
క్షతఁ బ్రోచు భావుక, ప్రాప్తుఁడు రంగ... 61

చ. శమనసహోదరీసలిలచారువిహార వినోదకేళికా
ప్రమదుఁడు కాళియోరగకృపాపరిరక్షణశీలుఁడై
ల్లెడన్, మమతను వీడు నాదివరమానిహృదంబు
జపుష్పమాలకున్, భ్రమరము రంగ... 62

ఉ. కామసుధేనువు న్విమలకల్ప మహీరుహపంచ
కంబుఁ జిం,తామణియు న్నిరూఢిఁ బ్రమదంబున
నెంతయు నీప్సితార్థముల్, వేమఱు నిచ్చున ట్లొ
సఁగి వేగమె భక్తులఁదృప్తిదీర్చు శ్రీ,భామణిరంగ.

చ. ఘనతరసూర్యవంశమునఁ గల్గి ముదంబునఁ దండ్రి
పంపునన్, మునిపతిఁ గాంచి యాఘను ననుజ్ఞను
దాటకఁ ద్రుంచి యాగ మిం,పొనరఁగ నుద్ధరించి
విభవోన్నతి శంభునివిల్లు ద్రుంచి యా,జనకతనూ
భవన్ గడువిచక్షణలీల వరించి మించు శ్రీ, భన
మతి రంగ... 64

ఉ. కోరి తదీయనాము మొనఁగూర్చి జపించెడువారి
కెల్ల భా,గీరథి వేణి స్వర్ణముఖి కృష్ణ సముద్ర

ము తుంగభద్ర కా,వేరి మలాపహారిణియు వేత్ర
వతీనది పెన్న గౌతమీ, తీరములందు స్నాన
ములు దీర్చిన పుణ్యఫలంబు లిచ్చు భూ,భా
రుఁడు రంగ... 65
ఉ. బంధుకథాను సింధురకబంధనటత్పరిసంధిరాట్ప్రి
జా, కంధరసుందరాదిగణకప్రతిమానసమానసం
ధిసం, బంధకథా ప్రబంధగతి పాంథరమావసుం
డాపదంధవార్త,ద్బంధుఁడు రంగ... 66
ఉ. దక్షుఁడు ధేను కాక బకదానవశిక్షుఁడు సర్వయో
గషా, ధ్యక్షుఁడు దుగ్ధవారిధిసుతాయుతవక్షుఁ
డు ద్రౌపదీసతీ, రక్షుఁడు నీరజాక్షుఁడు సురప్రవ
రాదిసమస్తదేవతా, పక్షుఁడు రంగ... 67
ఉ. వీరుఁడు మేరుధీరుఁడు వివేకవిచారుఁడు కోటి
మన్మథా, కారుఁడు కీర్తిహారుఁ డవికారుఁడు
శూరుఁడు దేవలోకసం,చారుఁడు పాపభూరు
హానిశాతకుఠారుఁడు పద్మజాండసం, భారుఁడు
రంగ... 68
ఉ. సంగరరంగనిర్దళితశత్రుశుభా భ్రపతంగుఁ డంగనా,
-స్వంగుఁడు వాహనీకృతవిహంగుఁడు ధర్మగు
ణానుషంగుఁడు, త్తుంగదయాంతరంగుఁడు చతు
ర్ముఖగర్వవిపాటనక్రియా,భంగుఁడు రంగ...69
ఉ. ఆయతచక్రనిర్జితనిశాటనికాయుఁడు నీలనీరద,

చ్ఛాయుఁడు దివ్యకాయుఁడు విశాలపయోజ
భవాండభాండధా, రేయుఁడు నిత్యశోభనచరి
త్రవిధేయుఁడు భక్తరక్షణో, పాయుఁడు
రంగ... 70

చ. శరనిధికన్యకామణి కుచద్వయచందన గంధలేప
వి, స్తరణుఁడు నారదాదిమునిసత్తమహృజ్జలజా
తనిత్యసం, చరణుఁడు భక్తపాలనవిశాలదయా
చరణుండు కౌస్తుభా,భరణుఁడు రంగ.... 71

ఉ. మానితవాక్యసూనుఁడు సమంచితదానుఁడు రా
జవంశ్యస, న్మానుఁడు ధీనిదానుఁ డసమానుఁడు
భాగవతోత్తమాంతర, ధ్యానుఁడు స్వర్ణవస్త్రప
రిధానుఁడు నేత్రితపూర్ణశీతరు,గ్భానుఁడు రంగ.

ఉ. రుద్రసదృక్సుధీజనమరుద్రుమఁడు సత్కరుణా స
ముద్రుఁడుఁగ, క్షుద్రనిశాచరప్రకరకుంజరరుద్రుఁ
డు దీనరక్షణో,న్నిద్రుఁడు జంభజిత్ప్రముఖనిర్జ
రభద్రుఁడు సుందరీమనో, భద్రుఁడు రంగ...73

ఉ. కాళియభోగిమస్తకని కాయసముజ్జ్వలతాండవ
క్రియా,లోలుఁడు హవ్యవాహనవిలోచనశాప
విచాలుఁ డంబుభృ,న్నీలుఁడు శాంతధర్మగుణని
ర్మలశీలుఁడు నందబాలగో, పాలుఁడు రంగ...74

ఉ. రంగదనంతభోగిపతి రమ్యశయానుఁడు భక్తిసా
రసా, రంగకులాగ్రగణ్యుఁ డతిరక్షణశీలుఁడు కీ

ర్తిశాలి శ్రీ,రంగపురీనివాసుఁడు తరంగితసత్క
రుణుండు నీరదా, భాంగుఁడు రంగ... 75

ఉ. వెన్నుఁ డపాంగవీక్షణనవీనదయామృత పూర
తోషితా,పన్నుఁడు ఖిన్నభక్తపరిపాలనలోలక
థానిరంతరో,త్పన్నుఁ డతిప్రపన్నజనతావినుతా
ఖిలసద్గుణౌఘసం,పన్నుఁడు రంగ... 76

ఉ. పుణ్యుఁ డగణ్యపుణ్యమునిపుంజనికుంజకుటీరర
క్షితా,రణ్యుఁ డరాతిరాక్షసనిరంతరబాధితవా
సవాదికా, రుణ్యుఁడు రావణాభిధవిరోధిశిరోధి
సహస్రమృష్టకా, ర్పణ్యుఁడు రంగ... 77

చ. కలువల నేలు డాలు తెరగంటిదొరన్ భరి
యించు మేలు దా, సుల వెఱఁబాపు కేలు బలు
సోఁకుడుమూఁకలఁ దోలువాలు పాం, దళుకుల
సాలు చొక్కపుటెదం బెడవాయని యాలు గ
ల్గు స, త్ఫలదుఁడు రంగ... 78

చ. సిరి వెదచల్లుచూపు మదిఁ జిక్కఁగ దూరెడు
రూపు మార్తురం,బర పెడుతూపు పాఁపదొరపైఁ
బవళించినపేఁపు సజ్జనో,త్కరముల యింటికాపు
త్రిజగంబుల మోపును గల్గు కౌస్తుభా, భర
ణుఁడు రంగ... 79

చ. కనుఁగొనలేనిసోరు వెనుగాల జనించిననీరు భ
క్తులన్, వెనుకొని ప్రోచుతీరు తొలివేలుపుమూఁ

కలఘోరు పాపము, న్నెనరునఁ దన్ను పేరు సిరి
నెయ్యముఁ బాయని పేరు గల్గు శో,భనమతి రం.

ఉ. వేలుపుతేనిఁ గన్నయరవిందముపొక్కిటఁ జెన్ను
మీఱఁగా,శ్రీలలనాథ రాసతులు చేరి పదాంబు
జయుగ్మ మొత్తె జే,జే లిరువంకల న్వినుతి సేయఁ
గ నుండెడువిష్ణుమూర్తి గో,పాలుఁడు రంగ...

చ. ఇనశశిభౌమసౌమ్యవిబుధేజ్య సురాహితమంత్రి
సౌరులున్,నలిగొని రాహుకేతువులు నల్వయుఁ
జిల్వలఱాల్పు పాకశా, సనసనకాదులున్ నిజవ
శంవదులై పనిదీర్ప నిత్యశో, భనమతి రంగ...

ఉ. సింధురరక్షణుండు దనుఁ జిత్తములోనఁ దలం
చువారికిన్, బంధురకామితార్థము లపారముగా
నొసఁగూర్చుదాత యా, సైంధవపద్మగర్భదివిష
ద్గణసన్నుతమూర్తి భక్తస, ద్బంధుఁడు రంగ...

చ. తనువు చరంబు పుత్రవసుదారధనాదుల నమ్మ
రాదు న్నెమ్మనమున నంతకుండు దయమాలినవాఁ
డిదె మెలెఱింగి భూ, జనవరులార మీహృద
యసారసమధ్యమునందు నిల్పుఁడీ, పనివడి రం.

చ. గరుడునిఁ గన్నసర్పములకైవడి భానుమహోద
యంబునం, బరువులువెట్టు చీకటులభాతిని నె
వ్విభు నామధేయముల్, స్మరణ యొనర్పఁ బా

యుఁ గలుషంబులు నవ్విభుఁ డుల్లసత్కృపా,ప
రుఁడగు రంగ... 85

చ. వలపులఁ జిక్కి లోనయినవాఁ డొకవారవధూ
టి కొరఁ గో,వెలఁ గల పైఁడిగిన్నెఁ గొని వే
డుక నిచ్చినవారి నిద్దఱన్, దలవరు లాఁగిపట్టుకొ
న ధర్మసభన్ దగ నేఁగి సాక్షిగాఁ, బలికిన రం.

చ. శరనిధి దాఁటి రావణు నిశాటుల నాజిని ద్రుం
చి మానిశే,ఖరులకు నిర్భయం బొసఁగి గౌతమ
భార్య శిలావతారమై, పరగిన దివ్యరూపవతి బా
గుగఁ జేసిన దక్షుఁడుం దయా, పరుఁడగు రంగ.

ఉ. వెన్నెలపుల్గు పారణపువేలుపు ముఖ్యులకెల్ల
ముఖ్యుఁడై, యున్నకుమారునిన్ మణిమయూ
ఖసహస్ర విభూషణంబులం, గన్నియ లిద్దఱం గ
నకకల్పితవస్త్రముఁ బూనియున్నసం, పన్నుఁడు
రంగ.... 88

చ. హారినివహాంబుభాతి విశదాండజమండలిలీల దే
వతా, కరగతి నుగ్రశైలములకై వడి పన్నగరా
జాచంద ము,ద్ధరతరతారకావలివిధంబునఁ గీర్తిఁ
జెలంగు సర్వభూ, భరణుఁడు రంగ... 89

చ. మదనుఁడు పద్మగర్భుఁడు కుమారులుగాఁ గమలా,
ధరాసతుల్, సుదతులుగా ఖగేశ్వరుఁడు సొంప
గువారువమై చెలంగఁగా, గదయును శంఖచక్ర

ములు కంజము హస్తములందుఁ గల్గు సంపద
గల రంగ... 90

చ. నరవర భీమభీమ హరి నందన నందన రాజరాజ
రాట్, శరశర జన్మ సన్మఘవ సామజ సామజ
గర్భ గర్భ హా, సరస సరస్సరోజ ఘనసారస సార
సుకీర్తిమండలా, భరణుఁడు రంగ... 91

ఉ. సంగరరంగనిర్దళితశాత్రవుఁ డార్తజనైకరక్షణా,
సంగుఁడు భక్తలోకజలజాతపతంగుఁడు పద్మనా
భుఁ డు, త్తుంగదయాంతరంగుఁడు చతుర్ముఖగర్వ
విపాటనక్రియా, భంగుఁడు రంగ... 92

చ. తిరముగ శంఖచక్రములు దిర్మణియుక్ దిరు
చూర్ణముక్ హరి,స్మరణము పుణ్యభాగవతమా
నితభక్తియు నిత్యకృత్యమై, పరగఁగఁ బూర్ణగోష్ఠి
యును బాగుగఁ గల్గఁగఁ జేయు నాజగ,ద్భరితుఁ
డు రంగ... 93

ఉ. చారుతరోరుబాహుయుగ సంభృతశంఖసుచక్ర
శోభనా, కారుఁడు నిత్యసత్యనరకల్ప కల్పుఁడు
సర్వదాసమం, దారుఁడు శత్రుదైత్యకులదర్ప
విదారుఁ డపాస్తభూమిదు, ర్భారుఁడు రంగ...

ఉ. కన్నులపండుగై మృదువు గల్గిన మంచిమనోర
థాన్నముల్, జున్నులు పాయసాన్నములు జో
క్కఁపుబా లమృతంపుభక్ష్యముల్, వెన్నెలవంటి

మేల్ పెరుఁగు వేడుక దాసులకిచ్చు నిత్యసం,
పన్నుఁడు రంగ... 95

చ. ఉభయకవేరజాంబువుల నొయ్యనఁ దోఁగుచుఁ
జూతమంజుకుం, జభరితసైకతస్థలులఁ జాల విహా
రముఁ జేసి పుష్పశా, రభములు గ్రోలి క్రోలి
సుచిరంబుగ వేడుకలందు శ్రీశుభ, ప్రభు వల
రంగ... 96

చ. కొలుచును జాలఁబాడియును గోఁకలు మేల్గల
యాలు రూకలున్, వెలివలువల్ తటాకములు
వెల్లువలున్ మడిమాన్యభూములున్, గలుగఁగఁ
జేసి భక్తుల కఖండితభాగ్యములిచ్చు మన్ననః,
ఫలదుఁడు రంగ... 97

చ. చతురవివేకభక్తి నతిసంభ్రమ మొప్పఁగ నోరు
నొవ్వ నీ, శతకము నిత్యముం జదువ సామజ
ఘోటకధేనుధాన్యముల్, సుతులును ముక్తి
యుం గలుగు శుంభదపారపుశ్రీఘటించు శ్రీ,
పతియగు రంగ... 98

ఉ. సింగపుమోమువాఁడు తులసీదళదామమువాఁ
డు కామినీ, రంగదురంబువాఁడు వలరాయని
గాంచినవాఁడు భక్తి కు, ప్పొంగెడువాఁడు
దానవుల పొంక మడంచినవాఁడు వీఁడె మా,
బంగరురంగ... 99

చ. కరిపతిఁ గావఁడో దశముఖానుజు లంకకు రాజుఁ
జేయఁడో, పరమదయాసమేతుఁ డయి ప్రాణము
లియ్యఁడో నాఁ డహల్యకున్, మఱువక నీవె
దిక్కనిన మానిని ద్రౌపదిఁ బ్రోవఁడో దయా,
పరుఁడగు రంగ... 100

ఉ. ఆలికి నల్లుఁడై పిదప నల్లునికిం దగఁ దానె
యల్లుఁడై, యాలికిం దండ్రియై మనుమరాలికిఁ
బెండ్లికుమారుఁడై సదా, యాలి మఱంది చెల్లె
లికి నై పతిలోకముఁ బ్రోచునట్టి గో, పాలుఁడు
రంగశాయి మనపాలఁ గలండు విచార మేటికిన్.

రంగశాయిశతకము

సంపూర్ణము.

# పీఠిక.

ఈ కాళహస్తిశతకము రచించినకవి విశ్వకర్మకులప్రదీపకుఁడును భద్రయపుత్త్రుఁడును సనాతనగోత్రుఁడునగు బాణాలవీరశరభయ్య. ఈశతకకర్త తాను కవీంద్రుఁడనని చెప్పికొనినాఁడు. కాళహస్తీశ్వరుని గూర్చి సుప్రసిద్ధకవులలో నొకఁడగు ధూర్జటిగూడ నొకశతకము వ్రాసియున్నాఁడు. ఈ రెండు శతకము లేకవిషయప్రతిపాదితములైనను గుణదోషనిర్ణయమున నీరెంటిని బోల్చుట కెంతమాత్రమవకాశము లేదు.

ప్రకృతశతకకర్త యగు వీరశరభకవి భాషాస్వరూపము గాని యర్థజ్ఞానము గాని పాటించి కవిత వ్రాయువాఁడు కాఁడు. ఇతనిపద్యములు చదువుటకు ననుకూలమగు గణనియమము మాత్రము కలిగియుండును. అర్థసందర్భముగల పద్యములుగాని భావబోధకములగు సమాసములు గాని విషయవంతములగు సల్లికలుగాని యీశతకమున లేవు.

ఇందలిపద్యములు కొన్ని దాశరథీ శతకములోని పద్యములకుఁ జాలవఱ కనుకరణములై యున్నను అర్థసందర్భముగాని భావముగాని లేకుంట విచారణీయము. భాషాస్వరూపము రసవేత్తృత లేని పామర జనులీ శతకమును మిగులభక్తి విశ్వాసములతోఁ బఠించుచున్నారు. భాషాజ్ఞానము లేనివారికి మాత్ర మిందలిపద్యముల గమనిక యాగ్రహణ పాత్రముగ నుండును. కవితయెటులున్నను కవిమాత్రము కేవలము భక్తిభావ పరవశుఁడై పద్యరచనము గావించెఁగాన నాతనిప్రయత్నము ప్రశంసనీయము.

ఈ శతకకర్త భావముగాని సందర్భమును గాని యతిప్రాసాది ఛందోనియమములఁగాని పాటింపకున్నను కాళహస్తీశ్వరానుగ్రహమున నీశతకము భాషాప్రపంచమున గాకున్నను భక్తప్రపంచము నందేని సజీవముగ నుండుట యొకవిశేషము.

ఇట్లు
శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

నందిగామ,
1-1-25.

శ్రీకాళహస్తీశ్వరాయనమః.

# కాళహస్తిశతకము.



ఉ. శ్రీజలధాత్రహైమవతి చిత్తసుధారసపానదంష్ట్ర
యు,గ్రాజగవంధసుర్జ్వరహారాననహాసధరాధరా
ర్చితా, రాజకిరీట పంచముఖ రంజితశుభ్ర శరీర
బంధురాం, భోజభవానుతాంఘ్రి ఫణిభూషణ
చంద్రహుతాశనార్కగో, రాజిత కాళహస్తి
మణిగోపుర సాంబశివా మహాప్రభో. 1

ఉ. మూలము విశ్వకర్మకులభూషణ భద్రయపుత్త్ర
రత్న బా, ణాలవవంశదీపక సనాతనగోత్ర ప్రశ
స్తభూప్రతీ, పాలకుఁ డైన వీరశరభేంద్రకవీం
ద్రుఁడు నిత్యకోటిలిం, గాలను బూజచేసి శత
కంబు రచించె గ్రహించవయ్య నా, పాలిటికాళ
హస్తి పరమాత్ముఁడ... 2

చ. వరపురికాళహస్తివిభవంబులు చూడనికన్ను లేల
సు,స్థిరముగ మిమ్ము నాత్మలో వచింపనిపాపపుజి
హ్వయేల యో, పురహార మిమ్ము పువ్వులను
బూజలు సేయనిచేతు లేల సద్గురుకరుణాకటాక్ష

ములు గోరనిమానవజన్మ మేల యీ, ధరణిని
కాళహస్తి మహారుద్రుఁడ... 3

ఉ. దక్షిణకాశి గంగ యరుదైన సువర్ణముఖీమహా
నదిగా, ఇక్షుసుధారసాబ్ధి యని యక్షులుతుంబు
రునారదాదులుగా, దక్షులె రైరి సిద్ధులు కృతా
ర్థులు నైనమహాస్థలంబు పం, చాక్షరిమంత్రపూ
రితరసామృతపాత్రులదివ్యక్షేత్ర మో, దక్షిణ
కాళహస్తి ధరణీశ్వర... 4

ఉ. దక్షిణకాశిముఖ్యనది దక్షిణస్వర్గము పుణ్యక్షే
త్రమై, మోక్షము లేనిదీనులకు మోక్షము
లిచ్చి తరింపఁజేయ నీ, దక్షిణకాశి కేవలము
దగ్గఱ నున్నది కంటిమయ్య ప్రత్యక్షము దేవ
లోక మని యేర్పడ నేఁటికి మళ్లి పుట్టె ఫాలా
క్షుఁడ కాళహస్తి పరమాత్ముఁడ... 5

ఉ. భూమిని నీసువర్ణముఖి పుట్టెను రెండవవారణా
శియై, పామరబద్ధపాశభవపాపవిమోచన పుణ్య
క్షేత్రమై, క్షేమము నిచ్చుకర్మములఁ జెంది
యవస్థలఁ గొట్టి వేగ మీ, నామసుధారసామృ
తము నమ్మితి మమ్ములఁ బ్రోవవయ్య మీ, ప్రేమ
ను కాళహస్తి మహారుద్రుఁడ... 6

చ. పురహరకుంజరాననసుపుత్త్ర పవిత్రపితామహార్చి
తా, వరద పరంపరాత్పర దివాకరసన్నిభ నాగ

కుండలాభరణ శశాంకబింబ కళభాసితవిభ్రమ
మేరుతారకా, పురజితభస్మలేపనవసుందరసన్నుత
నీవెగాక సద్గురుఁడవు కాళహస్తి పరమేశ్వర. 7

చ. ధరధర మేరుచాప ప్రమథాధిప రుద్ర యుపేం
ద్రతాడనా, గరళగళ త్రినేత్ర ఫణికంకణ
శంభుకృశానురేత యో, హరహర శూలపాణి
హరిహంస తురంగమ మౌళిరత్న ని, ర్జరనుత
మూలబ్రహ్మ దనుజాంతక శాంభవిచిత్తచోర
శ్రీపురహర కాళహస్తి త్రిపురాంతక... 8

చ. కలఁ గని మేలుకొన్నగతి గౌరవమాయప్రపంచ
కంబులోఁ, గలిసి సమస్తభాగ్యములు గల్గిన నేమి
ఫలంబు సంపదల్, నిలువవు దేహమోహములు
నీరుమలంబులు మట్టుగుంటలో, మొలచిన నీరు
బుగ్గ యిది మోసముజేయును నమ్మరాదు ని, శ్చ
లముగ కాళహస్తి నిటలాక్షుఁడ... 9

ఉ. కాశిపురీశగర్భనవఖండధరిత్రిపతిత్వ మబ్బినా,
యాశకు మట్టు లేదు కనకాద్రిసమానధనంబు
గల్గినన్, లేశము వెంట రాదు మది కింపుగఁ
జేసిన పుణ్యపాపముల్, ద్రోసినఁ బోదు నీకరుణ
తోయజము ల్వికసించినంతటన్, బాసును కాళ
హస్తి కళకంఠుఁడ... 10

ఉ. నిల్వవు రొట్టికాయములు నిల్వవు గోవులు

మాయసంపద, ల్నిల్వవు భోగ భాగ్యములు
నిల్వవు సొమ్ములు నిండ్లు మేడలుఁ, నిల్వవు
ఊహాపోషణాలు నిల్వవు కష్టసుఖాలు నంశలుఁ,
నిల్వవు, మోహపాశములు నిల్వవు వాంఛలు
పాఁడి పంటలుఁ,నిల్వవు కాళహస్తినిటలాక్షుఁడ.

ఉ. తావక పుత్ర దారతలిదండ్రులు నన్నలు తమ్ములు
న్జైలులో, బావలు చుట్టము ల్సఖులు బంధువు
లెవ్వరు వెంటరారు యీా, జీవము కాస్త పోతె
మఱిచేరరు దగ్గఱ నెంతప్రాణసం, జీవ ప్రియాప్తు
లైన హరిమించరు శీఘ్రము పట్టుమందు రో,
దేవుఁడ కాళహస్తి జగదీశ్వర... 12

ఉ. ప్రాణికి బొంది కేమి ప్రతిబాధ్యత యెప్పుడో
యేతుణానసో, ప్రాణము భంగపెట్టి సుతపత్ని
పితామహు దుఃఖపెట్టి నా, ప్రాణము తల్లడిస్తు
తనబాటనె యెక్కడ నేస్థళానసో, ప్రాణము
వెళ్లిపోతె తనబాధ్యత లంతటఁ దీఱిపోవు నా,
ప్రాణికి కాళహస్తి పరమాత్ముఁడ... 13

ఉ. ప్రాణము లుండఁగానె నినుఁ బ్రార్థనచేసి నటిం
చ రాదు నీ, ప్రాణము లెంత మట్టుకు నిబంధన
యున్నదొ యంతమట్టుకే, ప్రాణము నిల్వ దాక
డను బాధ్యత దీఱితె దాని కేల నీ, ప్రాణము

లేనిబొంది నినుఁ బ్రార్థనజేసున మళ్లి వచ్చునా,
ప్రాణము కాళహస్తి పరమాత్ముఁడ... 14

ఉ. ప్రాణము బొందిలోనిలిచి పాపము పుణ్యము
రెండు జేసి యా, ప్రాణము లేచిపోయి యమ
బాధలఁజెందితె బొందిపోయి యీ, ప్రాణిసహా
యమహా నవల బంధబుఋణాదులు దీఱునంతె యా,
ప్రాణము లేచి రాదు ఉపకారమె యొక్కటి
వచ్చుఁ దోడుగాఁ, బ్రాణికిఁ గాళహస్తి పర
మాత్ముఁడ... 15

ఉ. ఎట్టిఘుటంబు లుండినది యిందుకు నెక్కడ నేస్థ
ళానవో, పుట్టినచోటనో బ్రతుకఁబోయినచోట
నో యున్నచోటనో, గుట్టనో త్రోవనో గుహానో
గుంటనో చావు నిజంబు బొందికిఁ, గట్టిగ కాళ
హస్తి గణనాయక... 16

ఉ. పుట్టుక యేడనో సకలభూములఁ ద్రొక్కి చరిం
చు టేడనో, పట్టణ మేడనో యుదకపానము
యేడనో మట్టి యేడనో, గిట్టడ మేడనో మఱి
సుఖించుట యేడనో యుండు టేడనో; గట్టిగ
నీ వెలుంగుదువు గాకయితర్లకుఁజెంది చిక్కునా,
వట్టిది కాళహస్తిపతి రుద్రుఁడ... 17

ఉ. ఎన్నిమహాస్థలంబు లని యెక్కడ చూడను చూ
తునే భవ, ధ్యానము సేయ కెన్నఁటికి దైవము

నెక్కడ తాను వేదసం, పన్నగుణాఢ్యుఁ డై
తనతపస్సు ఫలించితె ఉన్నచోటనే, యున్నది
మోహనామృతము ఊటి కెభూమిఁ జరింపఁగానె
రే, మున్నది కాళహస్తి మునివందిత... 18

ఉ. వేరుకు నన్ని యాత్రలు ఫలించెననంగను పుణ్యుఁ
డాయెనా, కారము మానెనా సకలకర్మనివారణ
సిద్ధుఁ డాయెనా, ఊటికె పోయి రావడము
ఒక్కటె యెందుసమస్తయాత్రలుకా, దీటెన దీటి
కున్న గురుతీర్థప్రసాదధురీణుఁ డాయెనా, శూ
రుఁడ కాళహస్తి శివశోభన... 19

ఉ. ఇత్తడి హేమమానె యది యెన్నిపుటంబులు
వేసి చూచినకా, ఇత్తడియిత్తడేను నిధి యెక్కు
వసొమ్ముకు నష్టిచేటు నా, యిత్తడి పైఁడియానె
యిది యన్యమెఱుంగక రిత్తవేల్పులకా, సత్తుగఁ
బూజచేసినను సద్గురుపాదము నమ్మకుండినా,
ఉత్తది కాళహస్తి వృషభేశ్వర... 20

ఉ. జీవుఁడు జీవుఁ డంచును భజించిన నాత్మకు నాత్మ
దేవుఁడే, జీవుఁడు జీవుఁడే గురుఁడు జీవుఁడు
దేవుఁడు నీవదేవ నీ, త్రోవను నీవు పోతె పెడ
త్రోవకు బోందికి యాత్ర గల్గు ని, ర్జివి ఘటంబు
శీఘ్రముగఁ జేరువగాఁ బడి రుద్రభూమికికా,
జీవము కాళహస్తి గిరిజాపతి... 21

ఉ. జీవుఁడు వచ్చిపోవుక్రియ చిక్కఁగ నీయక చ
చ్చి పుట్ట నీ, లాగున నిట్టిజన్మములు లక్షలు
కోట్లన విందు నందు నా, దేవుఁడ యేమిసార్థ
కము మానసమందున నిన్ను నమ్మినన్, కేవల
మున్ను మోక్షపురి కెత్తుకపోయి తరింపఁజేతు
వో, ధీరుఁడ కాళహస్తి జగదీశ్వర... 22

ఉ. ఏమికుటుంబు ఏమి బ్రతు కేమిశరీరము ఏమిదేహ
ముఁన్, ఏమిసుఖంబు ఏమి యిది యెన్నఁటికైన
నను చావు సిద్ధ మిా, భూమిని ఇట్టిజన్మములు
పుట్టిన గిట్టిన మోక్ష మేమి నా, స్వామికథాసు
ధామృతరసజ్ఞతఁ జెందిన ముక్తి గల్గు నే, దీనుఁ
డ కాళహస్తి జగదీశ్వర... 23

ఉ. ఎక్కడి చుట్టపక్కములు నెక్కడిపుత్రులు తల్లి
దండ్రులున్, ఎక్కడిసంతపట్టునది యెక్కడనైన
ఫలించి యుండెనా, ఎక్కడ దేశదేశములు నం
డజము ల్లత ప్రొద్దుగ్రుంకితే, ఎక్కడిపక్షు లక్క
డనె యెవ్వరిబాటలు వారివారికే, నిక్కము
కాళహస్తి నిటలాక్షుఁడ... 24

చ. పులివలె యీకుటుంబు పడిపోయినపిమ్మట గాలి
గాలిలో, పలను ఋణానుబంధప్రతిబాధ్యత
నున్నకళేబరంబులో, నిలుచునటన్న స్వగృహ
ము నీడను బాసితె ఆఁకటింటిలో, నిలిచినహంస

కైన కని నీవు రొయుంగనిమాయయున్న దా,
వెలుపల కాళహస్తి యతివందిత... 25

చ. మనుజులలోని గర్భకసుమాలవు డొక్కలయం
దు మల్లి హా, ననుఁ బడఁ ద్రోయవద్దు యొక
నాఁటికినైన మహాత్మ యీవు౯, గ్జనవము చాలు
సద్గతికిఁ జేర్చర యీశ్వర యేసివేళ నే, నిను
నెడఁబాయకుందు ధరణీశ్వర యంచును మ్రొ
క్కుచుంటి నా, మనసున కాళహస్తి మహా
రుద్రుఁడ... 26

ఉ. ముట్టునఁ బుట్టి రక్తమలమూత్రములందున దో
షకారినై, పుట్టిన యెన్నిజన్మములు భూమిని
మల్లి యనేకచోట్ల నే, బుట్టితె నేమి కద్దు నర
పుట్టుక నా కిఁక వద్దు నన్ను నీ, పట్టున నిల్పి
మోక్షక్రియ మార్గము జూపి తరింపనీయరా,
గట్టిగ కాళహస్తి గణనాయక... 27

చ. పిడికిట పుష్యరాగమణిఁ బెట్టుక వ్యర్థులు రాళ్ల
కోసమై, యడవిఁ జరింప నేల మీము నాత్మ
నెఱుంగక సంతజోగులై, పుడమి చరింప నేల
శివపూజక్రమంబులు మాన నేల నా, కడపట
పొర్లనేల నుదకంబులు లేక నశించ నేల యా,
గడములు కాళహస్తి యజవందిత... 28

ఉ. కాశికిఁ బోవ నేల నుదకంబులు మోసుక రాన

దేల నా, కాశి మహాప్రవాహజలకాలువలై ప్రవ
హించుతోయ మూ, కాశిజలంబు గాదె శివకాశి
భవుండవు నీవెకావె యూ, కాశికిఁ బోవ నా సక
లకర్మజముల్ బెడఁబాసి పోనె భూ, తేశుఁడ
కాళహస్తి భువనేశ్వర... 29

ఉ. బట్టలు పిండి కట్టుకొని భక్తిగ సంధ్యల నెంత
వార్చినన్, బట్టెఁడు చేతిలోన నొకభక్తుని కైన
నతీతభిక్షముల్, పెట్టక ముక్తి లేదు మును పేమి
యునైనను పెట్టి పుట్టితే, పుట్టికి నూలుపుట్లు
శివపూజలు నూటికి కోటివేలు నీ, దట్టము కా
ళహస్తి భువనేశ్వర... 30

చ. తెలివిగనున్నవాఁడె యుపదేశముఁబొంది శివా
శివా యనున్, పలుకులు సంగ్రహించుకొని భావ
మునందున ముక్తికాంతతోఁ, గలసి సుఖింపలేక
నరకంబునఁ బాపపుకశ్మలంబులో, బలిమిగ దూ
ఱిపోయి యమబాధల కోపిరి కష్టజీవులై, సల
లితకాళహస్తి బుధశంకర... 31

ఉ. హా పరమాత్మ యంచు చతురక్షరిప్రాణప్రతిష్ఠ
మంత్రని, క్షేపము మాకు కావలయుఁ గేవల
మున్న సదాశివాయనే, యాపదబాంధవుండ
త్రిపురాంతక రుద్రునినామకీర్తనల్, పాపవిమో

చనంబు లని ప్రార్థనజేసెద పాదపద్మముల్, జూ
పుమి కాళహస్తి సురసేవిత... 32

ఉ. కాయఁగ రావణాసురునికన్న ధనాఢ్యులు లేరు
భూమిలో, మాయలయందు సర్వఘనమంత్ర
ములందును ధైర్యమందునున్, బ్రాయమునందు
నున్ బలపరాక్రమమందును భక్తియందునున్,
గాయము నందు గా తుదకు కాలము జెల్లిన
యంతనే హతుం, డాయెను కాళహస్తి యమ
రార్చిత... 33

ఉ. నీమము బట్టి రావణుఁడు నిత్యము భోజనకాల
మందు హా, కోమలి సన్నుతాంఘ్రి నవకోటికి
సర్థుల పూజజేసి ర, త్నామణి యేమి మోక్షసిరి
సంపదనొంది తరించు పైఁగ శ్రీ, రాములచేతఁ
జచ్చె త్రిపురాంతక చూడుమి భక్తి లేకనా?
భూమిని కాళహస్తి భువనేశ్వర... 34

చ. జలధర లోకరక్షకుఁడు సర్వము రుద్రమయం
జగత్తుగాఁ, బలికిన వేదశాస్త్రములు బాగఁ జె
లంగె మదాంధులై దురా, త్ములు పతనంబుచేత
శివదూషణ చేసి యనేకయేండ్లు బా, ధలఁబడి
నోరు పుచ్చి సిరి దప్పి యఘోరపుదుఃఖజీవులై,
నిలచిరి కాళహస్తి నిటలాక్షుఁడ... 35

చ. జలధర నీవు మాకు సిరిసంపద లిచ్చిన మేలు

వార్తగా, కలగని మేలుకొన్న యటు గాక
మహేశ్వర యేదివేళ నీ, కొలువున నుండి య
న్యులను గోరి వచింపను నోరురాదయా, వలిత
ఫణీంద్రనాకినిటలాక్ష సదాశివ శంభుమూర్తికే,
వలముఁను కాళహస్తికఱకంఠుఁడ... 36

ఉ. హీనులు ఎన్నివిద్యలు గ్రహించిన యప్పటిపొట్ట
కూటికే, కాని తరింపు గాదె! యధికారమునం
దును ముక్తి యున్నదే, వీనికి ముక్తికాంతస్థల
మెక్కడిదో యుని కేడనో మహా, జ్ఞానచరా
చరంబులు మహాత్ముఁడ నిన్నది చాల నెప్పుడున్,
గానరు కాళహస్తికఱకంఠుఁడ... 37

ఉ. హీనపుజాతిదుర్గుణుని కెన్నివిధంబుల బోధ చేసి
నన్, వానియసద్గుణంబులు నివారణ మొందునె
భోగి వాసుకీ, కూనకు పాలు తేనె దధి గుజ్జు
రసంబుల, నెంతబోసినన్, దానివిషంబు బోనె
మృతితప్పునె క్రూరముఁ మానునే కనన్, మానరు
కాళహస్తిబుధమాన్యుఁడ... 38

ఉ. నిండు సమస్తలోకముల నీలసుకంధర రుద్రమూ
ర్తికిన్, రెండవసాటి వేల్పు లిఁక లే రని వాఁ
కిట ఘంట గట్టి వే, దండము నెక్కి యంతటను
దంథణదంథణ భేరి వేసి బ్ర, హ్మాండము దండ

నిండుకొని యద్భుతమైన మహాస్వరూపుఁడై,
యుండవె కాళహస్తి త్రిదశోన్నత... 39
చ. విపులరథంబు హేమగిరి విల్లు నుపేంద్రుఁడు
గాండ మర్కుఁబు, ఋపతులు బండికండ్లు విధి
సారథి శేషుఁడు నారి వేదముల్, నృపుఁడుగుఱా
లుజేసికొని నృత్యము ద్రొక్కుచుతోలినేర్పుగా,
త్రిపురసురారిఁ గూల్చితివి ధీరత నెవ్వరు నీకు
మించిరో, కృపగల కాళహస్తి గనకేశుఁడ...
చ. సరసురవంద్యుఁడీశ్వరుఁడు నాయకుఁడొక్కఁడె
గాని వేఱెతగ, పరము నెఱుంగ మంధకవిపక్షు
యటంచు సహస్రశీరుషా, పురుష యటంచు
దేవతలు పూజ యొనర్చి తరించినారు నా, తరమె
భవత్స్వరూపములత్రాణ యెఱింగి నుతింప నాత్మ
సు, స్థిరముగ కాళహస్తిసురసేవిత... 41
ఉ. ఒక్కఁడెలోకరక్షకుఁడు ఒక్కఁడె దైవము ఎం
దుఁజూచినన్, మిక్కుటమైనరూపములు మింటికి
మంటికి సూత్రధారుఁడై, తక్కు సమస్తలోక
ములఁ దాండవ మాడుచునున్నవాఁడు తా,
నొక్కఁడెగాక యీశ్వరుఁడు ఒక్కనిమించి యి
తరపరుండు ఇం, కెక్కడ కాళహస్తి గిరిజేశ్వర.
ఉ.తత్తర నన్ను గన్నతలిదండ్రులు ఎత్తుక ముద్దులాడి
నీ, పొత్తున డించి యీశ్వరుఁడు పోషణజేయు

నటంచు గట్టిగా, దత్తము జేసినారు గురు దైవ
ము నిద్దఱు నాకు నీవె సా, త్మాత్తునిజస్వరూప
మును కన్నులఁజూపుము కాంక్షదీర నన్, రక్షక
కాళహస్తిబుధరంజక... 43

చ. కొడుకులు లేక లేక యొకకోకిలవాణి సుపుత్రు
మాఱుగా, నుడుతను దెచ్చి పెంచుకొని యుగ్రుని
పేరిటఁ బిల్చి రార యో, కొడుకని ముద్దులాడఁ
గను గొమ్మకు నప్పుడు గర్భచిహ్నమై, కడుపు
ఫలించె సంపదలు కన్నులఁ జూపె సమస్తకర్మ
ముల్, విడిచెను కాళహస్తివృషభేశ్వర... 44

చ. స్థిరముగ నీదుదర్శనము జేసిననాఁడె యనేకపాప
ముల్, పరిహారమాయె కర్మములు పాఱఁదోలంగె
దరిద్రదుఃఖముల్, దరికొని కాలసాగె రజతా
ద్రికనుంగొనఁ ద్రోవ జిక్కె యో, పరమశివుండ
మోక్షమనుపర్వతమెక్కితినయ్య యో హరా,
హరహర కాళహస్తిహరివందిత... 45

చ. పొదలెడినాదరిద్రములు పోయెను మిమ్ములఁ జూ
డఁగా నహో, కుదిరెను మామనస్సు వృషఘో
టక భీష్మభవాంధకారముల్, వదలెను నేఁటి
తోను మనవాంఛను వచ్చిన కాలకింకరుల్, ఒది
గిరి మూలమూల నిఁక నూఱక శంభునినామ
కీర్తనల్, చదివెద కాళహస్తిత్రిపురాంతక...46

చ. కమలవుబాలికిన్ హరికి గట్టిగ స్నేహ మటంచు
నందు రా, కమలము లేడనైన నుదకంబులు లేని
స్థలంబునందునా, కమలసఖోగ్రతిగ్మఖర కాంతు
లకు న్మతి తాళరా దె యా, కమలము వాడిపోక
నుదకంబులు బాసిన చావదా భవ, త్కమలము
కాళహస్తికఱకంఠుఁడ... 47

ఉ. ముప్పునఁ గాలకింకరులు ముంగిట జేరుక కాల
పాశముల్, తెప్పున గట్టి ప్రాణములు తీసెడు
వేళల మాయచీఁకటిన్, గప్పిననాఁడు మీస్మరణ
కల్గునో కల్గదో యందు కిప్పుడే, తప్పక చేతు
మీస్మరణ త్ర్యంబక నేను తరించుకోసమై,
యప్పని కాళహస్తినిటలాక్షుఁడ... 48

చ. నెరయ దరిద్రదోషమున నిత్యము జానెఁడుపొట్ట
కోసమై, నరుల నుతించి మానుషము దప్పి య
సత్యము లాడలేక నీ, మఱుఁగునఁ జేరి రిక్తు
లము మమ్మును బ్రోవు మటంచు మ్రొక్కినన్,
గఱుఁగదు నీమనంబు శితికంధర యింతపరాకదేల
రా, యొఱఁగియు కాళహస్తివృషభేశ్వర... 49

ఉ. నెత్తిన గంగ యుండ శిఖినేత్రమునం దనిలుండు
నుండ నీ, యొత్తున ధాన్యముండ మఱియొత్తుగఁ
జేతను పాత్రయుండ నీ, వొత్తునఁగూడువండు
కొనిచోద్యముగా భుజియింపరాదె యా, పిత్త

మదేమి జోగివలె భిక్షకుఁ బోవఁగ నేమి వట్టిదే,
దిట్టవు కాళహస్తినుత దిక్పతి... 50

ఉ. తాండవలింగ నీమతి వితండము లేమొ యనాథ
లోభిపా, షండుల కీవు భాగ్యయుత సంపద
లిత్తువు సత్యసద్గుణో, ద్దండనిధానమంత్రజప
తత్త్వప్రసంగతపఃప్రభూతస, త్పండితు లైనవా
రికి విపత్తుల నిత్తు వదేమి వారి కా, దండన కాళ
హస్తిపురధారణ... 51

ఉ. బారుగ నాటలాడి శివభక్తులతో సరియైననీకు
శృం, గారము లేల దారువనకాంతలు నేల భవా
ని యేల భా, గీరథి యేల సర్పభుజకీర్తులు నేల
ధరించుకొన్న దే, వేరులయొక్కముద్దుమురి
పెంబుల నెవ్వరు జూడనయ్య మీ, వారిలో
కాళహస్తిసురవందిత... 52

ఉ. పన్నగభూష నీవు చెయి బట్టిన చాపము పైఁడి
కొండ నీ, వున్నది వెండికొండ తలనున్నదియంత
హిరణ్యనీరు నీ, కన్న ధనాఢ్యు లేరి జగమందున
యేవగ నెంచిచూచినఁ, దిన్నగ భిక్షమెత్తుకొన
దీనుఁడవా దరిలేనివాఁడవా, యెన్నఁగఁ గాళ
హస్తివృషభేశ్వర... 53

ఉ. ప్రేమతో నీవు గన్నయొకబిడ్డఁడు గుజ్జయి కూటి
కేడ్చెనా, వామప్రియాత్మజుం డన వివాహము

లేక తపించుచుండ నీ, ధూమసుతుండు పైకి
నొకదుప్పటి యిమ్మని యంగలార్చె నీ, కేమిప
రాకొ పుత్రులకు నివ్వనివాఁడవు మాకు నిత్తువే,
భూమిని కాళహస్తిఫణిభూషణ... 54

ఉ. భీమ మహేశ్వరా పిలువ పేరును నీవె ధరించు
కొందు నీ, భామకు రాగిసొమ్ముల నపారముగా
ధరియించినావు చి, న్నామెకు జీరె యివ్వక
ననాథనుగా నొగిఁ జేసినావు నీ, కేమి దరిద్ర
మొందె యపకీర్తి రెుఱుంగక చేసి యట్టులీ,
భూమిని కాళహస్తిసురపూజిత... 55

చ. కరివరదాంఘ్రిజా నగహితాత్మజ దారువనాంగ
నామణీ, తరుణులఁ బాసి యుగ్రజపతర్పణహో
మము నిల్పి పోదినా, హార్యము?మించి యీాడి
గెవధూమణితోఁ జని కల్లుకుండలోఁ, జొరఁబడి
యూపిరాడక యసూ రని నీవె తపించి తంత
గా, విరహాతురయ్యె కంచిపృథివీశ్వర... 56

ఉ. పండితసన్నుతాంఘ్రి యొకభక్తుఁడు పుత్త్రినిఁ
జంపి కూరగా, వండి భుజింపఁజేసె మఱి యొక్క
మహాత్ముఁడు నీకుభృత్యుఁడై, యుండికళత్రమిచ్చె
ననువారఁగ జూచి మఱొక్కభక్తుఁడుఁ, మెం
డుగ ఱాల్ల రువ్వె పరమేశ్వర భక్తులజాడ రెుుం
తయు, ద్దండమొ కాళహస్తి యతివందిత... 57

ఉ. భాసురపంచవక్త్రి యొకభక్తుఁడు యెంగిలిపండ్లు
గిన్నెలోఁ, దీసుకవచ్చి పెట్టినను దిగ్గున లేచి భు
జించి మెచ్చి కై, లాసము నిచ్చినావు కఱకంఠుఁ
డ నీభ్రమ యేమిచెప్ప నో, వాసవపూజితాంఘ్రి
మునివందిత మమ్ములఁ బ్రోవవయ్య నీ, దాసుఁడ
కాళహస్తి నిటలాక్షుఁడ... 58

ఉ. మానకబోయఁడెన్నఁడుసమస్తమృగంబులఁ జంపి
దొన్నెతో, మాంసము దెచ్చిపెట్టి తినుమంటె
భుజిస్తివి ఎగ్గులేక నీ, తాపమదేమొ నీ వింకను
దగ్గఱ రాకు మటంచు పార్వతీ, హింసల నిన్ను
బెట్టితె సహిస్తివి యప్పుడు శాంతమూర్తి వై,
పురహర కాళహస్తి త్రిపురాంతక... 59

చ. అతులితకాలకూటవిష మప్పుడు ముప్పదిమూఁడు
కోటిదే, వతలు ననేకబాధ పడి వచ్చి భయం
బున నోహా పార్వతీపతి యని నీవు దిక్కు యని
పశులువోలెను తల్లడించుచున్, గతి చెడి వస్తె
యందఱిని గాచి విషంబు హరించినావు స, మ్మత
ముగ కాళహస్తి సురవందిత... 60

చ. గరళముమ్రింగికంఠమునఁగప్పి హరించి జయించి
మాయఁగా, సురతనునీవుమూర్ఛగొనిస్రుక్కెను
ఆపదమూఁడుజాములున్, సురమునిభూతసిద్ధయ
తిసూర్యసుధాంశుఉపేంద్రయింద్రగం, ధరువు

లు భక్తిచేత తమదాపున జేరుక సేవజేయుచుర్ణ,
తిరిగిరి కాళహస్తి త్రిపురాంతక... 61

చ. అరమర లేక నేను శివరాత్రిమహోత్సవకాల
మందు జా, గరణము జేసి గొప్పఁగ నఖండము
బెట్టుక మేలుకొంటి హా, మరి పదుమూఁడుజా
ములును వరానుల మంచును నిద్రహారము,
ల్మఱచి తదేకధ్యానమున మర్వక మిమ్ము భజింపఁ
జేయు మీ;తిరుగిరి కాళహస్తి త్రిపురాంతక...

ఉ. దుర్గుణయాగశిక్ష సురధూర్జటి దుందుభిదుందుభీ
సుతా, భర్గ భవాభవాంతక ప్రభాకర వర్ణ య
పర్ణ పార్వతీ, దుర్గమృడానిచండిక వధూమణి
మానస పద్మబంభరా, భార్గవశిష్యవర్గ సురవం
దిత... 63

ఉ. వాదుకుబోకమాకు భగవంతుఁడెదిక్కుగదా య
టంచుమీా, పాదము నమ్ముకొన్న శివభక్తుల కేమి
వ్రతంబు లంచు నే, కాదశులంచు నోరువడి గ
ట్టుక యుండి నశించనేల యీా, బాధ లవేల వట్టి
యుదకంబులు పిండి భుజింపనేల నా, వేదన కా
ళహస్తినిటలాక్షుఁడ... 64

ఉ. నీవె సమస్తరూప ధరణీశ్వరమండలజ్యోతిరూప
ముర్ణ, నీవె జగద్గురు ప్రముఖ నిత్యమహోత్సవ
శక్తిరూపముర్ణ, నీవె పరంపరాత్పరిముఖ నిగ్ర

హావిగ్రహామంత్రరూపముగా, నీవె జయంజయా
సుగుణ నిర్గవిచారమహాస్వరూపముగా, నీవెగ
కాళహస్తినిటలాక్షుఁడ... 65

ఉ. నంది తురంగ సుందరపినాక ప్రియాంబక స్పష్ట
సారథీ, నందసుతాగ్ని భక్తశరణాగతపోష నమ
శ్శివాయ యో, సుందరమూర్తి ఖండపరశూర
జతాద్రిపతీ ధనంజయా, వందిత నాగభూషణ
భవానికళత్ర సుభక్తిసంగమా, నందము కాళ
హస్తియజవందిత... 66

ఉ. దేవ మహానుభావ జగదీశ్వర ధూర్జటి యీశ్వ
రా మహా,దేవ హరా మృడానిజప దేవత భర్గఫ
ణీంద్రహార హా, రావళి నీలలోహిత పురాజిత
బ్రహ్మకపాలహస్త యో, పావనమూర్తి సద్గురుఁ
డ పాలిత మౌనిసురేంద్ర మోక్షబృం, దావన
కాళహస్తిభువనేశ్వర... 67

ఉ. అంగజవైరి భక్తహృదయాంబుజభృంగ కురంగ
పాణి శుభ్రాంగ శుభాంగ లింగ భవభంగ
ప్రసంగదయాతరంగ మా, తంగభుజంగపుంగ
వసితాంగలతాంగవముక్తికామభ, స్మాంగ విభూ
షితాంగ వృషసంగ కృపాతిమిరాంగ భంగస,
ర్వాంగమ కాళహస్తివృషభేశ్వర...

ఉ. భూతపతీ కపాలభృతు భావృతవక్షసరోరుహాం

ఘ్రిసం, భూతనుతాగ్నికేశ శివపూజమహా
త్మ్యము భక్తవత్సలా, మాతపితాసహోదరులు
మాకిఁక నెవ్వరు మీకు మించ నో, శ్వేతకళత్ర
పూర్ణశశిశేఖర యిక్కడ మాకు నీవె సం,భూ
తము కాళహస్తివృషభేశ్వర... 69

చ. పరశివ యాదిబ్రహ్మ వృషభధ్వజ మద్గురు షణ్ము
ఖాపితా, సురగురువాక్యమ కేశ వరసుందర యీ
శ్వర యప్రమేయ యో, కరివరదాసుతాంఘ్రి
శితికంఠ గిరీశ మహేశ్వరా జరా, సురహర
ఖడ్గపాణి జయశూలి భవాని శివా పితామహా,
పురహర కాళహస్తిత్రిపురాంతక... 70

చ. పరమరహస్యమంత్ర క్రియభాసుర పక్వఫలా
మృతామృతా, ధర రుచిగొన్న భక్తగణదత్త
మహాత్ములపాదధూళి నా, శిరమునఁ జేరి యొన్న
టికి సిద్ధుల మాదుమొగాక నేను నీ, మఱుఁ
గునఁ జేరినాను అభిమానము నుంచి తరింపఁజే
యవే, గుఱుతుగ కాళహస్తిగిరిజాధిప... 71

ఉ. మాతృపితానుతాంఘ్రి శివమంత్రము నోట ప
ఠించకున్నయా, నోరు వృథానిరర్థకము నోరనరా
దది పాడుబొంద ఓం, కారమహాత్వభక్త సిరి
కాంచన బ్రహ్మకపాలహస్త ఓం, కారవిభూతి

దాయక సుకంధర గంధశరీరదేహాకం, తీరవ
కాళహస్తి కళికంఠుఁడ... 72
ఉ. మానవజన్మమెత్తిశివమంత్రలసద్గతిముక్తి సత్క్రి
యా, హీనుఁడు ఎన్నివిద్యలు గ్రహించిన నేమి
ఫలంబు ఈశ్వర, ధ్యానము చేసి మోక్షమును
గన్గొన కెప్పుడు సంచరించునే, మానవుఁడైనఁ
గాని శివమందిరమందు నటించనేర్చునా,మా
నవ కాళహస్తిమహారుద్రుఁడ... 73
ఉ. వాసవపూజితాంఘ్రిమునివందిత దేవ పరాకు
ఈశ్వరా,భాసుర కృద్విహాసవిరుపాక్ష మృగాంక
మృగాంకశోభితా, వాసుకి యాదిభక్తగణవ
త్సల చారుత్రిమూర్తి మూలసిం, హాసన
జ్యోతిరూప పరహంస విరాడ్గురుదక్షిణాశక్తై,
లాసము కాళహస్తికళికంఠుఁడ... 74
చ. నెఱి నిను నమ్మి కొల్చునరు నేత్రసరోరుహాపూ
జితాంఘ్రినే, నిరతము మంత్రపుష్పములనేఁ
జేటనుఁపట నిన్ను చిత్తుగా, గుఱుతుగఁ బూజ
చేసి యమద్వారము గట్టిగఁ బాడుజేతుగా,బిరు
దుశరాయుజూడు వృషభేశ్వర భూరిజటాకలాప
యోపురహార కాళహస్తిత్రిపురాంతక... 75
చ. పురహార తొల్లి విష్ణువును చూడవె నేత్రసరో
రుహాంబుతో, మురియుచుపూజచేసిమది మోక్ష

ములందితరించె నిప్పుడుఁగా, మఱిమఱి నోరుక్రొవ్వి
శివమంత్రము నోట పఠించకున్న యీా, నరులకు
ఏమొ కాని వరనందన సత్కళ కాంతిలేకనే, జర
గిరి కాళహస్తిజగదీశ్వర... 76

ఉ. రక్తకళత్ర యీాశ్వరుఁడు రాజితనామ గిరీశ
వైభవా, భక్తులు తొల్లి యిక్కడ తరించెద
మంచును వచ్చి యాత్మలో, రక్తము చేతనిన్నుఁ
గనినప్పుడె సుస్థిరమూలజీవులై, భక్తి ఫలించె
నింద్రునియూహాస్తిబలంబుచ ధన్యులైరి నీ,భక్త
లుకాళహస్తిభువనేశ్వర... 77

ఉ. నీరజటాకలాప పరమేశ్వర నిన్ను నుతింప దేవ
బృం,దారకులైనఁ జాలరు యథాస్థితిగా నినుఁ
గాంచి నిన్నుఁగ్రై, వారము జేసి సద్గురుఁడ వర్ణసే
యను నాతరంబె యో, మేరువశార్ఙ్గపాణి పర
మేశ్వర పూరితధర్మసత్య సంకారణ కాళహస్తి
పరమేశ్వర... 78

చ. శరణని నిన్ను వేఁడితిని చక్కనితండ్రి పతీతపా
వనా, బిరుదులు గట్టినావు యట పేరు వహించి
తరింపఁజేసి నా,పరమసుఖంబు భక్తులకు పాపట
బొట్టు కిరీటరత్న మిా, పురము సమస్తజీవు
లకుఁ బుణ్యము లిత్తువటంచు వస్తి మిా, మఱుఁ
గుకు కాళహస్తిమహారుద్రుఁడ... 79

ఉ. ధాత్రి సమస్తభక్తులు కృతార్థులు నైనమహా
స్థలంబు నీ, క్షేత్రమహాత్త్వ మేమి యని
చెప్పుదు మోక్షనదీగయాకురు, క్షేత్రప్రయాగ
దీపఋషిసిద్ధులు పుట్టినజన్మభూమి యీ, క్షే
త్రము దివ్యక్షేత్రమనఁ జాలఁ బ్రసిద్ధము నమ్మి
యీమహా, క్షేత్రముకాళహస్తిశితికంఠుఁడ...
ఉ. గోత్రకళత్రమిత్ర మదగోధ్వజగాత్ర శరీరదా
నగో, త్పాత్ర ప్రతిష్ఠప్రాణపరిపాలకసద్గుణ దేవ
రత్న గా, యత్రినుతాంఘ్రిభక్తులకు ఏమి
ప్రధానము కేవలం శివ, స్తోత్రము జీవనౌష
ధము జిహ్వకు కర్మవిమోచనంబు ఈ, క్షేత్రము
కాళహస్తి శశిశేఖర... 81
ఉ. హా సుర హాగజాసురుని హామిక నిల్వ ధరించలేక
హా,నీసరిసాటిదేవతలు నిన్ను భజించుచు వచ్చి
మూఁతిపై ,మీసము లేదు మాకుఁ బరమేశ్వర
మమ్ములఁ బ్రోవవయ్య మీ,దాసుల మంచు
మ్రొక్కినఁ బ్రతాపము చాలును మాకు శ్రీగిరీ,
వాసుఁడ కాళహస్తిమహారుద్రుఁడ... 82
చ. పరమసఖుండ భక్తసుకర వ్రజనుగ్రహాజాగ్రతస్థ
ళా, ల్దొలుకదు యింతకన్నను చతుర్దశలోకము
లెంచిచూడ నీ, కరుణకటాక్షవీక్షణము గట్టిగ
నుంచుమి నమ్మినాను నీ, చరణము సేవ భక్తులకు

సర్వము నీవె మహానుభావ శ్రీ, ధరనుత కాళ
హాస్తిజగదీశ్వర... 83

ఉ మన్మథవైరి మాకు పరమామృతపానము సేయకు
న్న యా, జన్మమదేల సద్గురునిచెంతను జేరి త
దేకనిష్ఠతో, చిన్మయలింగ మంత్రము ప్రసిద్ధిగ
నోట పఠించితే పున, ర్జన్మము లేదు భక్తులకు
క్షేమము ఇంద్రునిసన్నిధానమే, జన్మము కాళ
హాస్తిజగదీశ్వర... 84

చ. హరహర యిష్టలింగ సురహాస ముఖాబ్జ నమో
నమోపురం, దరనుత కాలకంధర కృతార్థులజే
యు మటంచు నాత్మలో, సిరి గలవాని దేవుని
భజింపనిపాపదుష్టులైన యీ, నరులను ఘో
రమైనయమదండనఁ బెట్టిరి చూడవయ్య యో,
పురహర కాళహస్తి త్రిపురాంతక... 85

చ. పుడమిని భక్తి గల్గి శివపూజ సుధామృతపూర్ణ
సద్బుధా, ముడివిడఁ గోసి లోపలను మూలవి
రాటునిమోక్షకన్యకా, కుడిభుజ మెక్కి తాం
డవము కుల్కఁగ గాని యనేకపాపము, ల్విడు
దల గావు కర్మములు పీడవు ఎంతటివారికైన రు,
ద్రుఁడ విను కాళహస్తి మహారుద్రుఁడ... 86

చ. ఎఱుఁగక చేసి పాపములు ఎంత తపించిన వ్యర్థ
బోవునా, వరయమధర్మరాజుపరిపాలన నాఁటికి

వచ్చు నీమహా, గరువమదాంధకారమునఁగానక
చేసినపుణ్యపాపముల్, తలుముకవచ్చు వెంటఁ
బడి తప్పక యెక్కడఁ దాఁగియున్నవో, పుర
హార కాళహస్తిత్రిపురాంతక... 87

ఉ. ఇక్షుసుధాంఘ్రి యీశ్వరుఁడ యెన్నఁడు మిమ్ము
లఁజూడ మయ్య ప్ర, త్యక్షము జేసికోవలసి తె
ప్పున మానసపూజ చేత ఘా, లాక్షుఁడ ముక్తి
కాంత నుపలాలనజేసి సుఖించితే మహా, మోక్ష
ము గద్దు భక్తులకు మూలము నీవె మహానుభావ
శ్రీ, లక్షణ కాళహస్తి మహారుద్రుఁడ... 88

ఉ. నిండుదయాబ్ధి మోక్షజిత నిండుఘటాబ్ధిహిరణ్య
శైల కో, దండ ధరిత్రిదాత భవదద్భుతనిర్మల
యోగపూరితా, తాండవలింగ నాయెదుటఁ
దాండవనృత్తవినోదలీల ను, ద్దండము గుల్కఁ
జూడవలెదాత నుతాంఘ్రిముకుందబాంధ వా,
మండిత కాళహస్తిమహారుద్రుఁడ... 89

చ. పురహర శంభుమూర్తి శివపూజమహత్త్వముఁ
జూచి యా, త్మలో, పరుషముచేత మాయగను
నంచెలు మువ్వలు నాడఁ జూచి యో, వరగురు
ధర్మభిక్షయని వచ్చి నిలంబడి తొల్లి యాత్మ
లో, సరళిగ మెచ్చి భక్తిగఁబ్రసన్నము నై దరిఁ

జేర్పరా విరా, ట్పురుషుఁడ కాళహస్తివృషభే
శ్వర... 90

ఉ. కాలము దప్పకుండ దశకంధరబంధురవందితత్రి
శూ, లాలను బూజచేసి నిటలాక్షుఁడ యేమి
భజింతునయ్యరో, మూలవిరాట్టు సద్గుణుఁడ
ముద్దులతండ్రి శశాంకమౌళి నా, పాలిటిలింగ
మూర్తి విరుపాక్షుఁడ దైత్యమదాపహార భూ,
పాలక కాళహస్తిమహారుద్రుఁడ... 91

ఉ. నిత్యము రుద్రమంత్రజపనిష్ఠఁ దపోబలమోక్షసి
ద్ధుఁడై, సత్త్వగుణాభిరామ నిను సన్నుతిఁజే
య ననేకకోట్ల బ్ర, హ్మాత్యలు పాఱిపోను మద
హస్తముఖోద్భవ యేది వేళ నీ, సౌఖ్యము సర్వ
మోక్షసిరిసంపద లిచ్చును మాకు మందరా, కృ
త్యము కాళహస్తిమహారుద్రుఁడ... 92

ఉ. ఈశ్వర శంభుమూర్తి జగదీశ్వర కావవె యప్ర
మేయ కా, మేశ్వర సాంబమూర్తి పరమేశ్వర
శాంతదయాబ్ధి దేవ నం, దీశ్వర లింగమూర్తి వ
సుధేశ్వర భక్తసుధామయార్ధనా, రీశ్వర నన్నుఁ
బ్రోవు పరమాత్ముఁడ శంకరయప్రమేయనా, రీ
శ్వరకాళహస్తివృషభేశ్వర... 93

ఉ. నారొయొడఁ బ్రేమ గల్గి శివధామసుధామృతమంత్ర
వేద పా, రాయణ మాకు భోజనము రాజితస

ద్గుణనిత్యసత్యమే, యాయువు గాన ధర్మములు
నక్షయమైనధనంబు మాకు నా,దాయము రుద్ర
మూర్తి భవదంఘ్రుల నమ్మితి భక్తజీవనో, పా
యము కాళహస్తిపరమాత్ముఁడ... 94

ఉ. మంత్రము మంత్ర మందురు సమస్తమునీంద్రు
లు సప్తకోటి యా, మంత్రము లెల్ల పామరు
లు మాయజపాలకుఁ జేయునట్టి దీ, తంత్రము
గాక భక్తులకుఁ దారక మాశివనామమంత్ర
మే, మంత్రము గాక యన్నియును మంత్రము
లంచు జపించ వచ్చునా, యంత్రము కాళహ
స్తియతివందిత... 95

ఉ. నిన్నుఁదలంతు నన్ను గరుణించు మటంచుఁ ద
లంచి యా త్మలో, నెన్నఁటికైన ప్రాప్తమున నీ
శ్వరరూపముఁ జూడఁ గల్గునో, కన్నులగాంతు
దీఱఁగఱకంఠుఁడ నామము శబ్దవాక్యముల్,
విన్న ఫలంబుగల్గునని వేదము లెప్పుడు నార్భటిం
చుచున్, ఉన్నవి కాళహస్తివృషభేశ్వర... 96

ఉ. మేలుగ నాదమూర్తి పరమేశ్వర నామసుధారస
సంబు నా, నాలుకమీఁద నెన్నఁటికి నాట్యము
గల్గునొ నాఁడు జన్మజ, న్మాల తరించుచుండు నని
మానసమందు నుతింతు భక్తవా, చాలక మైన

జేర్పరా విరా, ట్పురుషుఁడ కాళహస్తివృషభే
శ్వర... 90

ఉ. కాలము దప్పకుండ దశకంధరబంధురవందితత్రి
శూ, లాలను బూజచేసి నిటలాక్షుఁడ యేమి
భజింతునయ్యరో, మూలవిరాట్టు సద్గుణుఁడ
ముద్దులతండ్రి శశాంకమౌళి నా, పాలిటిలింగ
మూర్తి విరుపాక్షుఁడ దైత్యమదాపహార భూ,
పాలక కాళహస్తిమహారుద్రుఁడ... 91

ఉ. నిత్యము రుద్రమంత్రజపనిష్ఠఁ దపోబలమోక్షసి
ద్ధుఁ డై, సత్త్వగుణాభిరామ నిను సన్నుతిఁజే
య ననేకకోట్ల బ్ర, హ్మహత్యలు పాఱిపోను మద
హాస్తముఖోద్భవ యేది వేళ నీ, సౌఖ్యము సర్వ
మోక్షసిరిసంపద లిచ్చును మాకు మందరా, కృ
త్యము కాళహస్తిమహారుద్రుఁడ... 92

ఉ. ఈశ్వర శంభుమూర్తి జగదీశ్వర కావవె యప్ర
మేయ కా, మేశ్వర సాంబమూర్తి పరమేశ్వర
శాంతదయాబ్ధి దేవ నం, దీశ్వర లింగమూర్తి వ
సుధేశ్వర భక్తసుధామయార్ధనా, రీశ్వర నన్నుఁ
బ్రోవు పరమాత్ముఁడ శంకరయప్రమేయనా, రీ
శ్వరకాళహస్తివృషభేశ్వర... 93

ఉ. నారదుడఁ బ్రేమ గల్గి శివధామసుధామృతమంత్ర
వేద పా, రాయణ మాకు భోజనము రాజితస

ద్గుణనిత్యసత్యమే, యాయువు గాన ధర్మములు
నక్షయమైనధనంబు మాకు నా,దాయము రుద్ర
మూర్తి భవదంఘ్రుల నమ్మితి భక్తజీవనో, పా
యము కాళహస్తిపరమాత్మ్కుఁడ... 94

ఉ. మంత్రము మంత్ర మందురు సమస్తమునీంద్రు
లు సప్తకోటి యా, మంత్రము లెల్ల పామరు
లు మాయజపాలకుఁ జేయునట్టి దీ, తంత్రము
గాక భక్తులకుఁ దారక మాళివనామమంత్ర
మే, మంత్రము గాక యన్నియును మంత్రము
లంచు జపించ వచ్చునా, యంత్రము కాళహ
స్తియతివందిత... 95

ఉ. నిన్నుఁదలంతు నన్ను గరుణించు మటంచుఁ ద
లంచి యాత్మలో, నెన్నఁటికైన ప్రాప్తమున నీ
శ్వరరూపముఁ జూడఁ గల్గునో, కన్నులగాంతు
దీఱఁగఱకంఠుఁడ నామము శబ్దవాక్యముల్,
విన్న ఫలంబుగల్గునని వేదము లెప్పుడు నార్భటిం
చుచుణ్, ఉన్నవి కాళహస్తివృషభేశ్వర... 96

ఉ. మేలుగ నాదమూర్తి పరమేశ్వర నామసుధార
సంబు నా, నాలుకమీఁద నెన్నఁటికి నాట్యము
గల్గునొ నాఁడు జన్మజ, న్మాల తరించుచుందు నని
మానసమందు నుతింతు భక్తవా, ఛాలక మైన

రుద్రుని ప్రసంగము నెప్పుడు నోట నూనితే,
చాలును కాళహస్తి సకలేశ్వర... 97

చ. క్షితినుతపద్మగంధమునిసిద్ధగణాత్ములు జన్మభూమి
దే, వతలకు స్వర్గలోకమున నంబుధి రాసులమీఁ
ది మేదినీ, పక్షులకు పార్శ్వవేది శివభక్తిమహా
త్ములనోరఁగల్గ నా, పతులకు గండ్రకత్తెర జపాం
తకృతార్థులజ్ఞానబోధ స, న్నుతులకు కాళహస్తి
పరమాత్ముఁడ... 98

చ. క్షమధర కౌస్తుభామణిసుగంధగజధ్వజపారిభద్ర
నా, గమునకు రక్షరేకు క్షమ కాంతి శిరోమణి
చుక్కబొట్టు వే, దములకుఁ బట్టుకొమ్మ రిపుదా
నవతస్కరరుద్రభూమి పా, పములకు హోమ
గుండము శుభస్కరపాత్రులకన్నపూర్ణ తే, మ
ములకు కాళహస్తి పరమాత్ముఁడ... 99

ఉ. ప్రాణము నమ్మరాదు ఇఁక ప్రాపుగ నమ్మి ఘటంబు
లోన నీ, ప్రాణము లుండఁగానె నిను బ్రార్థనఁజేసి
నటింప రాదయా, ప్రాణ మనిత్య మంతరునప్రాణ
ము జూచిన బుద్ధి వెంటనే, ప్రాణము గానరాదు
ఉపకారము ఒక్కటి వచ్చు తోఁడుగా, ప్రాణికి
కాళహస్తి విరుపాక్షుఁడ... 100

ఉ. పాండుకళాధురీణుఁ డెడఁబాయక సర్వజగత్కి
రీటివై, డండ డడాండ డాండ డడడాండ య

టంచు నుతింతు నిన్ను నే, తాండవమూర్తి సర్వ
భవతారక బ్రహ్మపిపీలికాది బ్ర, హ్మాండమునిండ
నిండుకొని యద్భుతమైనమహాస్వరూపమై, యుం
డవె కాళహస్తి జగదీశ్వర... 101

ఉ. పండితపామరుల్ సకలపాపవిమోచనదండదండ
నో, ద్దండభవాండమండితపదాండనఖండలమండ
లాద్రికో, దండప్రచండపిండభవదండలఖండిత
కుందపాండురా, పాండవవీరరుద్రపరిమండితభా
ర్గవపాండవాగ్ని రు, ద్రాండజ కాళహస్తి మహా
రుద్రుఁడ... 102

ఉ. కుంభిని సర్వదేవతలు కోరిన నేమిఫలంబు వారి
కిఁక, శంభుఁడె తల్లిదండ్రి గురుశంభుఁడె దిక్కు
జగత్తుకెల్ల నా, శంభుఁడె రక్షకర్త యని సంత
తముఁ బ్రస్మరియింతునే జయ, స్తంభము వేసి
నాఁటెదను సాహసకార్యపరాక్రమక్రమో,
జ్జృంభణ కాళహస్తి శశిశేఖర... 103

ఉ. వారిధిఁ గట్టవచ్చు భగవంతునిఁ గన్నులఁ జూడ
వచ్చు వా, పారము సేయవచ్చు బడబాగ్నిక
ణంబుల మ్రింగవచ్చు నా, తారము లెత్తవచ్చు
యమదండనహింసకుఁ దాళవచ్చు సం, సారము
నీఁదరాదు హరిసాక్షిగ నా కొకత్రోవఁ జూపవే,
ధారుణి కాళహస్తి ధరణీశ్వర... 104

చ. అమరగణార్చితా తమకు నాశ్రితులైనయనేక
భక్తులకా, శ్రమలెడఁబాపి ఘల్లున భృశంబుగ
గజ్జలమ్రోఁత బుట్టఁగా, భ్రమమున నందివాహన
ముపైన నిలంబడి భక్తులిండ్లనుకా, ధిమిధిమినా
ట్యమాడుచును దీనులఁబ్రోవవె మోక్షమిచ్చినం,
భ్రమముగ కాళహస్తినిటలాక్షుఁడ... 105

ఉ. నే శరణన్నవాని కరుణింతువు చక్కఁగ మెచ్చి
యర్ధనా, రీశ్వర నిన్ను నిష్ఠ దెదిరించినవారిసమ
స్తలోకసం,కాశనపక్ష భీష్మసురగర్వ దృఢాంచి
తవజ్రదైత్య వ,జ్రాసిపితాపితామహులచాఁటునఁ
బోయిన సంహరించవా, చూచితె కాళహస్తి
శివసుందర... 106

ఉ. శంకలు దీర్చి భక్తుల నిజంబుగఁ బ్రోతువటంచుఁ
బల్కితే, బొంకకు మాడితప్పకు మబద్ధము
లాడకుము క్తిలేని నిఃశ్శంకపరీతఖండ హారమాగత
మోహారి బాయకుండుటల్, జంకుదువా శివా
ర్చకుల చెంతకు దూతలఁ జేరనిత్తువా, శంకర
కాళహస్తి నిటలాక్షుఁడ సాంబశివా మహా
ప్రభో.

# పీ ఠి క.



ఈశతకమును జూలూరి లక్ష్మణకవి రచించెను. ఈయన మధ్వబ్రాహ్మణుఁడు. సుబ్బనార్యుఁడు శేష మలకుమారుఁడు. ఆంధ్రభాషకు నన్నయభట్టారకుని వలెఁ బ్రమాణుఁడగు అప్పయార్యుని మనుమఁడు. కవినిగూర్చిన చరిత్రాంశ మీశతకములోనిపద్యము వలన నింతవఱకు మాత్రమె తెలియును. పూర్వ ముద్రితప్రతిపై గ్రంథకర్త జూలూరి లక్ష్మీనరసు గ్రంథకర్త యని కలదు. వీనినాధారపఱచుకొని కవి జీవితమును గ్రహింపవలసియున్నది.

శతకకర్తయగు లక్ష్మణకవికి లక్ష్మీనరసు అనునా మాంతరము గలదు. ఈకవి బ్రౌనుదొరవారియాద రణమున క్రీ. శ 1800 ప్రాంతమున ననేకగ్రంథము లకు వ్యాఖ్యలు వ్రాసియు నిఘంటురచనమునఁ గేలూఁత నొసంగియు మాతృభాషాసేవ గావించి సుప్రసిద్ధుఁడైన జూలూరిఅప్పయశాస్త్రిగారికి మను మఁడు. అప్పయ్యశాస్త్రిగారు కొన్నిశతకములను రచించిరి. ముకుందరాఘవశతకకర్తయగు లక్ష్మణకవి శాస్త్రిగారికి మనుమఁడు. లక్ష్మణకవిజీవితము శతక

కవులచరిత్రమునందు వివరింపఁబడలేదు. ఈకవిజీవిత కాలము నెఱుంగుట కాధారములు తెలియకున్నను బూర్వముద్రణప్రతి నాధారపఱచికొని నిరూపింతము. ఈకవి పితామహుఁడు 1820 ప్రాంతములలో నుండెను. మనుమఁడగు లక్ష్మణకవి ప్రాంతములలో సుప్రసిద్ధుఁడై యుండును. పూర్వముద్రిత శతకము దుర్మతిసంవత్సర ఆశ్వయుజ 30 న ముద్రిత మైనట్లు ముఖపత్రమునందుఁ గలదు. ఇది మొన్నటిదుర్మతిగాక యంతకు వెనుకదిగాన పూర్వముద్రణము జరిగి యిప్పటికి అఱువదినాలుగుసంవత్సరములునిండినవి. కావున కవియు ముద్రణకాలమునాఁటివాఁడై యనియు నలువదిసంవత్సరముల క్రింద కీర్తిశేషుఁడై యుండుననియుఁ దోఁచెడిని. కవినివాసాదికము ఇతర గ్రంథములనుగూర్చిన వివరము లేరేని పత్రికాముఖమునఁ బ్రచురించినఁ జరిత్రములలోఁ జేర్ప వీలు కలుగును.

ముకుందరాఘవశతకము నిర్దుష్టముగాఁ బ్రౌఢముగా మనోహరముగా నుండి పఠనయోగ్యముగా నలరారుచున్నది. ఇందు రామాయణకథయంతయు ముఖ్యాంశము లేమాత్రము విడువక రసవత్తరముగా నిముడ్పఁబడియున్నవి. ఆయాఘట్టములలో నంత్యనియమము వృత్త్యనుప్రాసాదిసముచితాలం

కారములతో వ్రాయఁబడినపద్యములుగూడఁ గలవు. ఆధునికశతకసంచయమునం దింతటిప్రౌఢశతకములు లభించుట యరిది. శైలి సులలితముగా ద్రాక్షాపాకమునం దున్నది. భావములు మనోహరముగా నున్నవి. శతకమంతయుఁ జంపకోత్పలమాలికలతో నొప్పియున్నది. ఇతరశతకములవలెఁ గాక యీశతకము వాల్మీకిరామాయణకథానుసారముగా వ్రాయఁబడియుండుటచే బాలరామాయణమువలె సకృత్పఠనయోగ్యమునై యైహికాముష్మికప్రదమై యొప్పుచున్నది.

ఈశతకము తొలిముద్రణము అంటిన విరిగిపోవు సన్నని పెళుసు కాగితములపై మద్రాసు ఆదివిద్యా నిలయముద్రణాలయమున దుర్మతిసంవత్సరమున ముద్రింపబడెను. పూర్వముద్రణమునఁ గవియభిప్రాయమునకు భిన్నము లగుదోషము లెన్నియో పడినవి. వ్యాకరణదోషములగు పరుష సరళద్రుతాద్యాదేశములు చాలవఱకు దుష్టములై వికారముగ నుంటచే యథామతి పూర్వగ్రంథానుసారముగా శుద్ధప్రతి వ్రాయించి సంస్కరించి యిప్పటికిఁ బరిశుద్ధముగా ముద్రింప నవకాశము గలిగినది. శ్రీరామభక్తులకు నాంధ్రసారస్వతరసవిదులగు రసికు

లకు నీశతకము సంతోషపాత్ర మనుటకు సంశయము లేదు.

ఆంధ్రవాఙ్మయసేవాధురంధరులగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి సత్ప్రయత్నములలో శతకసంపుట ప్రచురణ మొకటి. ఈనూత్నశతకసంపుటహారమున శ్రీముకుందరాఘవశతకము నాయకమణి యనఁదగి యున్నదని మాయభిప్రాయము.

ఇట్లు,

నందిగామ,
1-5-26.

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

# శ్రీ ముకుంద రాఘవ శతకము.

## బా ల కాం డ ము



ఉ. శ్రీవసుధాత్మజామృదులచిత్తసరోజమిళిందనిత్య
సం, భావితవిశ్వతుంద పరిభావితచంద్రముఖార
విందభా, షావర శంకరేంద్రనుత సద్గుణబృంద
సుకీర్తికంద సం, సేవకచాతకప్రకరమేచకకంద
ముకుందరాఘవా. 1

ఉ. శ్రీమణికాంచనాంచిత విచిత్రవిభూషణధామ
ఘోరసం, గ్రామనిశాటభీమ దశకంఠవిరామ
దినేంద్రకోటిరు, గ్ధాముగుణాభిరామ భవతార
కనామ తమాలవారిద, శ్యామ దినేశవంశకల
శార్ణవసోమ ము... 2

ఉ. శ్రీరఘువంశవీర ఘనచిన్మయదివ్యశరీర దీనమం,
దార దురాత్మరాక్షసవిదార మునీంద్రహృదంత
రాళసం, చారలసద్విహార ఘనసంసరణాంబుధి
మగ్నమానవో, ద్ధార యశేషకల్మషవితాన
విదూర ము... 3

ఉ. అంగజకోటి విభ్రమపదాంగ నికృత్తవిచిత్రకూ
టసా, రంగ పతంగపుంగవతురంగ మతంగజపో
షణాదరో, త్తుంగకృపాంతరంగ పరితోషితభక్త
జనాంతరంగ జ, న్యాంగణ శత్రుభీషణకరాత్త
రథాంగ ము... 4

చ. స్థిరమతి వాణినెంచి కవిశేఖరుల న్వినుతించి
యాంధ్రవా, గ్గరిమకు నన్నపార్యుఁ డనఁగాఁ
జను జాలురియప్పయార్యు మ,ద్గురుని బిరామ
మూలంగొలిచి కూర్చెద రామ భవత్కథావళి,
న్వరుసగఁ జిత్తగింపుముకృపామతితోడ ము...

ఉ. హాయిగ సజ్జనుల్వొగడ సార్ధశతద్వయవృత్త
సంఖ్యరా, మాయణసత్కథ న్వరుస నంద
ముగా విరచించి జానకీ, నాయక భక్తినిచ్చెద
ఘృణామతిఁ గైకొను చంపకోత్పల, శ్రీయుత
మాలికాతతిగఁ బ్రీతివహించి ము... 6

చ. సకలగుణాకరుండు నృపసత్తమవీరుఁడు యా
చకాళిక, ల్పకుఁడు భవద్గురుత్వ పరిలబ్ధికిఁ
బాత్రుఁ డగణ్యపుణ్యజా, తకలితగాత్రుఁడౌ
దశరథక్షితినేత జెలంగఁడే యయో,ధ్యకు విభుఁ
డై యశోజితసుధాకరుఁ డౌచు... 7

చ. తనయులు లేమి నద్దశరథక్షితినాథుఁ డెదంద
లంచి యిం,పెనయ సుమంత్రమంత్రివచియించిన

పద్ధతి ఋశ్యశృంగమహా, నిని దగదోడితెచ్చి
యవనిఁ హయమేధ మొనర్పఁడే మహా,
మునుల యనుజ్ఞ మంత్రవిధి పూతము
గాఁగ ము... 8

చ. బలిమి దశాస్యుచే నొదవుబాధలఁ దెల్పుచు
వేల్పులెల్ల రో, జలరుహనాభ దేవరిపు జంపు
టకై భువి మానుషాకృతి, న్వెలయ జనింపవే
యనుచు వేఁడిన నట్లనె యంచు భ క్తవ,త్సలత
వహించి తొ సురలు సంతసమంద ము... 9

చ. క్రతువు సమాప్తినొందినఁ గరస్థసపాయసరుక్మ
పాత్రుఁ డా, తతఘనవర్ణుఁ డొక్కరుఁడు తత్క్రి
తువహ్ని జనించి పుత్రసం, తతిభవకారణంబగు
నుదారపుఁ బాయసభ క్త మియ్యఁడే, క్షితిపతి
కాత్మసమ్మతము చేకురునట్లు ము... 10

చ. సగమది కోసలేంద్రతనుజాతకు నిచ్చి సుమిత్ర
కందులో,సగమొనగూర్చి యందుఁదగ సామును
గైక కొసంగి వెండి యా, సగము సుమిత్ర
కిచ్చి నృపచంద్రుఁడు తత్పరమాన్నకల్పితం, బగు
సుతలాభ మొందెఁగద యాసతులందు ము...

ఉ. క్రన్నన యాగభాగములు గైకొని దేవత లబ్జ
గర్భవా, క్యోన్నతి నుర్వి కాననచరో త్తము
లై జనియింపరే జగ, త్సన్నుత రావణాద్యసుర

సంతతిపై భుజవిక్రమంబుఁ దా, రెన్నివిధంబు
లన్ సలుప నిచ్చెఁ దలంచి ము... 12

చ. దురమున దుష్టదానవులఁ ద్రుంచి జగన్ముద మా
చరింప బంధురతరనీలమేఘరుచితోఁ దనువా
ప్పఁగఁ గోపలక్ష్మమా, వరతన యోదరోల్ల
సితవార్ధి సుధానిధి వై జనించి తా, సురవరు
లెల్ల సంతసిల శోభనశీల ము... 13

చ. హరినిజరూప మీ వురగపాంశము లక్ష్మణుఁడున్
రథాంగ మా, భరతుఁడు కంజ లక్ష్మణుని
భార్తయుగా పరిచారిసాధన, స్ఫురితుఁడవై
సురప్రతతిఁ బ్రోవ జనించితిగాక భూమియం, దర
య మనుష్యమాత్రుఁడవె యర్యమ తేజ ము...

చ. సతతము జాతినామములసంగతి నొందని సుప్ర
సిద్ధిచే, నతులగతిం జెలంగెడు మహాత్ముఁడవీవు
వసిష్ఠముఖ్యులు, న్నతిఁదగ జాతనామకరణక్రి
యలొప్పఁగఁ దీర్చఁ బౌరుల, ద్భుతగతి దీవనల్బ
లుకఁ బొల్చితిగాదె ము... 15

ఉ. అంచితపుణ్యుఁ డాదశరథాధిపుఁ డెట్టితపం
బొనర్చెనో, యించుకమాత్రలో జగములెల్ల
సృజించు విరించిఁ గన్నయ, భవ్యంచితకీర్తి నిన్ను
సుతుఁడంచు ముదంబున గారవింపఁగా, మించి
నటించితో కృప నమేయచరిత్ర ము... 16

చ. గురువులకెల్ల నొజ్జవయి కోరినవిద్య లొసంగు
చుండు నీ, వరుదుగ శిష్యభావమున సంచిత
భక్తి వసిష్ఠుఁ గొల్చి వే, సరసకళావిచిత్రము
లజాడలెఱింగితివొ భవద్విలా, సరుచిరభావ మే
రికి వశంబు గణింప ము... 17

చ. అరయ భవత్పరాక్రమవిహార మదెట్టిదొ తండ్రి
యాజ్ఞ సో, దరసహితుండవై సముచితంబుగఁ
గౌశికు వెంటనంటి దు, స్తరతర ఘోరరాక్షస
వితానము నుక్కడగింతునంచు ని,బ్బరముగ
నేఁగితొ చిఱుతప్రాయమునందు ము... 18

చ. అలఘుకళాప్రపంచనిధి వయ్యును నాసరయూన
దీతటిం, జెలఁగుచు గాధినందనునిచేత బలాతిబ
లాఖ్యలైన వి, ద్యల నుపదేశమై కడుముదం
బున నాఁకలి నీరువట్టులన్, సొలయక నేఁగితొ
రిపునిషూదనవాంఛ ము... 19

ఉ. సంగతిమీరు కౌశిక లసన్ముఖనిర్గత వాక్ప్రపం
చమున్, రంగుగవించు వాయుహతి రంగద
భంగతరంగ సంగతో, త్తుంగవిహంగపుంగవరు
తుల్ శ్రుతి కింపొదవింప గంగ ను,ప్పొంగుచు
దాటితొర మునిపుంగవుతోడ ము... 20

చ. అటవులజాడఁజేరి పథికావలినొంచుచు ఘోర
మూర్తియై, కుటిలగతిం దనర్చు మదకుంభిసహ

ప్రబలాఢ్య తాటకా, పటుకుధరంబు నేకసిత
బాణపవి న్వ్రదలించి తా భవ,త్పు ఫ్కటరణకృత్య
ముల్ దలఁపఁ జోద్యముగాదె ము... 21

ఉ. సమ్మతి నంత వాసవుఁడొసంగిన పూజలను గ్ర
హించి సా, రమ్మగుబాణసంతతి తిరంబుగఁ గౌశి
కునొద్దమంత్రయు, క్తమ్ముగ సంగ్రహించి యు
చితస్థితిఁ గాంచితి వంచితాఖిలా, స్త్రమ్ముల కిమ్మ
వై యొకధరావరులీల ము... 22

చ. మునిపతి దెల్పు వామనుని పూర్వనివాసకథ
ల్కుతూహలం, బెనయఁగ వించు మంజుతర
వృక్షచయంబగు తద్వనంబునం, దనరుచునుండు
సంయమికదంబము నెయ్యముతో నెదుర్కొనం,
జని యటనిల్చితౌ కుశికసంభవుతోడ ము...23

ఉ. సంతతనిష్ఠ మౌని విలసన్మఖదీక్షవహింపఁజూచి
దు,ర్దాంతగతి న్నిశాచరులు దంభవిజృంభణలీల
నల్ల వే, ద్యంతము నించినం గని శరావళి
మాయనడంచితౌ మహా, ధ్వాంతము నంశుల
న్వనజబంధుఁడు వోలె ము... 24

ఉ. ఏచి కడంగి యస్త్రయుగ మేయఁగ నందు మరు
చ్ఛరంబు మా, రీచునిఁబట్టి త్రిప్పి వడిద్రెళ్లఁగ
నంబుధి వైచె నంతలో, నీచు సుబాహు పావ

కము నీకొనరించె నిటుల్ విరోధులం, ద్రోచి
చెలంగితౌ తబిసి తోషమునొంద ము... 25

చ. ఉరుతరమైన యజ్ఞఫల మొయ్యన మౌనికొసంగి
తన్మునీ, శ్వరుఁడు హితోక్తినివ్వటిలఁ బల్కినప
ల్కుల నాలకించుచున్, సరసపదాబ్జలీల ముని
సంయుతు సంయమిఁ గొల్చి యేఁగితౌ, కరమును
రక్తితోడ జనకక్రతుఁ జూడ ము... 26

చ. హలకులిశాంకుశధ్వజదరాంబుజ రేఖల నొప్పు
పాదముల్, దలకొన భూతధాత్రి శుభలక్షణ
మొంద నలంకరించుచున్, బొలుపుగ నేఁగి
శోణనదిప్రాంత మునీంద్రులతో వసించితౌ, జలరు
హాబాంధవుం డపరసాగరమంద ము... 27

చ. సదమలచిత్తవృత్తి మునిసంతతి గొల్వఁగఁ దార
కాళితోఁ, జదలనెసంగు కల్వచెలిచాయ వసించి
మునీంద్రచంద్రుఁ డిం, పొదవగఁ దెల్పు తత్కు
లభవోన్నతి వించును బ్రొద్దు బుచ్చితౌ, ముద
ముదలిర్ప శోణతటిప్రాంత వసించి ము... 28

చ. చతురవచఃప్రవీణతను సంయమివర్యుఁడు దెల్పు
లోకవి, శ్రుతమగు జాహ్నవీతటిని రూఢసము
ద్భవమున్ భగీరథ, క్షితిపతివంశవర్తనవిశేషకథల్
దగవించు నేఁగితౌ, పతగతురంగ మాహృదయ
పంకజభృంగ ము... 29

చ. సతతవిమోహవిభ్రమత శక్రునిఁ గూడి నిజాధి
నాథుఁ డుద్ధతి శపియింప గ్రావగతిఁ దాల్చి
వసించు నహల్యఁగాంచి యంచిత కృప నాత్మ
పాదసరసీరుహరేణువాసంగి శాపసం, గతి నిర
సించితో తపసికాంత నుతింప ము... 30

చ. కరము భవత్కటాక్షమును గైకొని చెంగట
మంగళాంగవి, స్ఫురణము గల్గి నిల్చిన సముజ్జ్వ
లకాంతి నహల్యఁజూచి సాదరమతి గౌతమవ్ర
తికిఁ దత్సతిఁ గూర్చి నమస్కరించి సత్వరముగ
నేఁగవే పరమతాపసుఁ గొల్చి ము... 31

చ. అనుపమలీలనొప్పు మణిహాటకనిర్మిత హర్మ్య
పఙ్క్తులం, దనరి మఖోచిత క్రమసమన్వితయూ
పవనాళితోడ సొం, పెనసి తనర్చు నమ్మిథిల నింపు
దలిర్పఁ బ్రవేశమందితో, జనకుఁ డెదుర్కొనఁగ
గుశికసంతతితోడ ము... 32

చ. అడరుచుఁ దాఁకి గాధిసుతుఁ డాత్మబలంబు వసి
ష్ఠమౌనిచే, నుడివడ రాజధర్మము ననూయ
మతిన్నిరసించి బ్రాహ్మ్యముఁ, బడయఁ దపంబు సే
యుట క్రమంబుగ గౌతమసూతి దెల్పినం, గడు
మది నాలకింపవె తగఁ గరుణించి ము... 33

చ. పటుభుజశక్తి మై నృపులు బల్విడి పట్టి కదల్ప
లేక ప్రస్ఫుటమగుసిగ్గుచేఁ జనఁగఁ బొల్చిన రుద్ర

శరాసనంబు ను, త్కటకలభంబు తమ్మికి క్రియ
గ్రక్కున లీలఁ దెమల్చి త్రుంచితో, చటులరవం
బుచే జగము సారె జలింప ము... 34

ఉ. అంబురుహాక్షు దండ్రికిఁ బ్రియంబగునట్లు సరా
లునర్ప మహీ, జాంబుజగంధి సిగ్గుపొలయంగ
ముదంబున సర్వసౌఖ్యమూ, లంబగు హేమ
మాలిక గళంబుననుంచి వరించినర్ప గటా, క్షంబున
నవ్వ్రజాపాలయఁ గాంచితి గాదె ము... 35

ఉ. సంతసమొప్ప బంధుజనసంతతితోడ వివాహకృ
త్య మ, త్యంతము వేడ్కఁ దీర్చ మిథిలాధిపు
పంపున సద్గృహాంబునం, దెంతయుఁబోల్చుతం
డ్రికి మునీశ్వరునాజ్ఞను మ్రొక్కి తో మహీ,
కాంతుఁడు సంభ్రమంబెనసి కౌఁగిలిఁజేర్చ ము.

చ. తతభవదన్వయక్రమముఁ దా విని యామిథి
లేంద్రుఁ డార్యస, న్నుతమతి నాత్మసోదరతనూ
భవల న్నిజపుత్రిమూర్మిళం, జతగానఁగూర్చి నీయ
నుజసంతతి కీదలఁపర్ప భవద్గురుం, డతిముదమందఁ
గూర్చె వెదయామతినట్లు ము... 37

ఉ. క్రంతలుగొంచు పౌరజనకాంతలు రా మురజాది
రావముల్, చెంతల మ్రోయ వారసరసీరుహానే
త్రలు నాట్యమాడఁ జో, దంతి వసించి నింద్రు

గతి దంత్యధిరూఢత బంధుకోటితోఁ, సంతస
మొప్ప నేఁగవె రసాసుత నేల ము... 38

ఉ. పొంగుచుఁ జంచలాక్షు లతిముగ్ధకటాక్షనిరీ
క్షలన్ భవన్మంగళ విగ్రహద్యుతి సమాజసుధా
రసమాని మత్తలై, మంగళలీల నారతులు
మాటికొసంగఁగ నేఁగితొ మదిం, బొంగు విదే
హనాథగృహముం దరియంగ ము... 39

చ. ఘనమణి విస్ఫురచ్ఛుభదకాంచనతోరణమై తన
ర్చు, జనకగృహంబు సొచ్చి విలసన్మణిదీపితపీఠ
పఙ్క్తికో, భననినదమ్ము గ్రందుకొని పాటిలఁ
దమ్ములతో వసించి తొ, యనుపమవైభవోన్నతి
బుధావలియాజ్ఞ ము... 40

ఉ. అమ్మిథిలేంద్రుఁ డయ్యవనిజాదికకన్యకలన్ సహో
మభూ,షమ్ముగఁ దానొసంగ బలశాసనుఁ డాళ
చిలీల ధర్మయు, క్తమ్ముగ జానకిం గొనియుఁ
దమ్ములకున్ సరసీరుహాక్షులన్, సమ్మతిఁగాంచు
వైభవ మొసంగితి గాదె ము... 41

చ. సలలితధర్మయుక్తి ననుజన్ములతోడ రసాసుతా
దిక, న్యల వరుసన్ వరించి శుచి కంత ప్రదక్షిణ
మాచరించి య, ర్థుల నొగి నెల్లవస్తువులతోఁ
దనియించి నివాళి గొంచు స,భ్యలొసఁగు దీవ
నల్ జెలఁగఁ బొల్చితిగాదె ము... 42

ఉ. మంగళకృత్యమెల్ల నసమాన మహావిభవంబు
తోడ నొప్పంగను పండువై మది కభంగమ
నోరథపూరణంబు సేయం గడువేడ్కతో నలరి
యక్కుశికాత్మజుం డేగెఁ గాదె రాఁ, ట్ఠంగవ
సత్కృతుల్ గని తపోవనికంత ము... 43

చ. అనుపమదివ్యవస్త్రమణి హాటకభూష లొసంగి
యంపినం, జనకునియాజ్ఞ గొంచు ననుజత్రితయం
బును బంధుకోటియుం, జనువునరాఁగ నేగవె
రసాసుతతోడ నయోధ్య కిందిరాం, గన మును
బెండ్లియై చనుజగత్పతిలీల ము... 44

చ. హితముగ నాదునామము వహింపఁగఁజెల్లునె
యంచు రాముఁడు, ద్ధతి ప్రళయానిలంబుగతిఁ
దాఁకినఁ గాంచి భయంబునొంది సం, స్తుతు
లొనరించు తండ్రినటు ద్రోచి పదంపడి రోషభీ
షణో, ద్ధతి నెదురించితా జగము తల్ల
డమంద ము... 45

చ. పురహరుజీర్ణచాపము సముద్ధతి ద్రుంచినబంట
వౌదువే, ధరధరుదివ్యచాపమిది తక్కక నెక్కి
డుమన్న దాని స, త్వరగతి నాత్మశక్తిసహితంబు
గఁజేకొని యెక్కువెట్టి తా, సరసత జామదగ్ని
నిజసత్యము నెన్న ము... 46

చ. శరమును వింటఁ గూర్చి పదసంధులు ద్రుంపఁ

దలంప భీతిఁ జె, చ్చ్రెరఁ దనస్వర్గమార్గముల
చెంత నిగుడ్పఁగ వేఁడు భార్గవుం, గరుణను
గాచి యట్లనె తగంగ నొనర్చి మునీంద్రుఁ బంపి
భాసురముగ నేఁగవే సుగుణశోభితచిత్తము.

ఉ. అంచితరత్నసౌధవిపులాంగణ మంగళతోరణం
బునై, మించు నయోధ్యసొచ్చి యొలమిన్ బుర
కాంతలు లాజలోలి సొ,ధాంచలవృత్తిఁ జల్ల
మురజాదిరవంబు ఘటిల్ల నారతుల్, గొంచు
ముదంబునంజనవె కోమలిఁ గూడి ము... 48

ఉ. చెంతలనుండు సంగనలు చిప్పన నారతులియ్యఁ
గొంచు న,భ్యంతరమందిరం బనుగతాత్మతసొచ్చి
బుధాళికిన్ సము,తాన్వితముతో వధూజనయు
తమ్ముగ దమ్ములతోడ మ్రొక్కవే, సంతసమంది
దీవన లొసంగుచునుండ ము... 49

చ. ఖరమతి తాటకందునిమి కౌశికుజన్నము గాచి
వైరిదు,స్తర భుజశక్తి మారరిపుచాపము
ద్రుంచి రసాతనూభవం, బరిణయమంది యంత
నిజపట్టణ మొంది మనోజసౌఖ్యసా, గరమున
దేలితా జనకకన్యకఁ గూడి ము... 50

## అయోధ్యాకాండము.

ఉ. ఎల్లజగంబు లోలి సృజియింపఁగఁ గావఁగ నైన
నిన్నుఁ దా,నుల్లసదిచ్ఛ పఙ్క్తిరథుఁ డుర్విభరం
బు వహింపుమన్న నీ, వల్లన మానవేంద్రుగతి
నౌనని నేమముఁ జెంది తౌ జగ,ద్వల్లభ శాంబ
రీమనుజతంత్రివి గావె ము... 51

చ. సరిగనలేని మీవిభుత సైఁపక కైక వరచ్ఛలం
బునన్, భరతుని రాజుఁ జేసి వనవాటికి రామునిఁ
బంపుమన్న భూ,వరుఁడు కలంగి దత్తవరభం
గము నోర్వక ఖేద మందఁడే, కరినుత స్త్రీలదం
భములు గాన వశంబె ము... 52

చ. అలికులవేణితో జలకమాడి విభూషల మేనఁ
దాల్చి యిం, పలరఁడె మిమ్ముఁ బిల్వఁ దగనంపిన
సొంపుగ కైక యింటికి, వలరుచు నేఁగి తౌ వర
శతాంగము నెక్కి శుభాస్పదధ్వనుల్, జెలఁ
గఁగ భూసుతానుజులుఁ జేరి భజింప... 53

ఉ. రంగుగ నేఁగి కైకగృహరాజముసొచ్చి విపత్తిఁ
దూలు దం,డ్రిం గని భీతి తద్వ్యసనరీతి వచింపు
మనా యథాత్మయా,చుం గృపమాలి కైక పతి
సుద్ది వచించి మిమువ్వనాలి కే, గంగను బల్కదే
జనులు కంపమునొంద ము... 54

చ. పరమగుణాఢ్య నీదుపితృవాక్యము దీర్పఁ జతు
ర్దశాబ్దములన్, కరము వనాళి కేఁగుమని కైక
యనం జెలువంది మోము భాస్కరరుచిసోకు
పంకజముచందము నొందఁగ నేఁగఁ బూని తా ధ
రణిసుతాము ఖేందురుచి దైన్యమునొంద ము...

చ. ఇనకులనాథ నీవు వని కేఁగఁ దలంచుతలం పెఱిం
గి భూతనయయు నార్తి మై యిచట దవ్వగ
నొంటి వసింపఁజాల నో వన దళాక్ష నీవెనుక
వచ్చెద నాఁ గరుణించి తా జగ, జ్జనసుత విప్ర
లంభము వశంబె భరింప ము... 56

ఉ. చండతరోగ్రకోపమున సయ్యన లక్ష్మణుఁ డేచి
యీనరేంద్రుం డవివేకియై వనిత రోయక నిన్ని
టుఁ జేసెనంచు నుద్దండతఁ జూప నవ్వి యుచిత
ప్రశమోక్తులఁ దేర్పఁ గూర్మి నాతం డెడ బా
యలేక వెనుదాలఁడె నిన్ను ము... 57

చ. చలపరియైనకైక కనుసన్న నొకన్నువ దెచ్చు వ
ల్కలంబులు ధరియించి ఖేదమున మూర్ఛ
వహించిన తండ్రి నూరడం, బలుకుచు మ్రొక్కి
కైకకు నమస్కృతి జేసి నిజాంబమందిరం, బోల
యఁగ నేఁగి తా యనుజు నుర్విజఁగూడి ము...

ఉ. ఉల్లము ఝల్లనం గని వనోర్వికిఁ బోవు టెఱింగి
మూర్ఛలన్, మల్లడిగొంచు హా! ప్రియకుమారక

నీకిటు కైకచేతఁ గీ, డెల్ల ఘటించెనే యనుచు
నేడ్చెడుతల్లి నూరడించు చీ, వల్లన మ్రొక్కవే
రఘులాభరణంబ ము... 59

ఉ. అంత సుమిత్రఁ గాంచి వినయంబున మ్రొక్కి
నిజాధివాసస, ద్ధాంతరమందిరత్నకనకాదుల
భూసురకోటి కిచ్చి తే, చింతయు లేక కానన
ముచెంతఁ జరింపఁదలంచి తౌ నిజ, స్వాంతమునం
గురూక్తి పరిపాలనసేయ ము... 60

చ. అనుపమధన్వి వై జనకుఁ డంపుశతాంగము
నెక్కి పౌరు లా,య్యన గురుబాయుచందమున
హాసుగుణాకర మమ్ము డించి డి,గ్గన వనికేఁగెదే
యనుచు కైకను దూరుచు వెంటనంట న, వ్వేన
యుచు నేఁగవే సుజనభృద్వరశీల ము... 61

ఉ. శాంతగుణాఢ్య నీవటుల సాగినఁ దత్పురల
క్ష్మియు న్నిశా, కాంతునిఁ బాయురాత్రిగతి
కాంతివిహీనత నొందెఁ బ్రాణు ల,త్యంతము చిం
తలం బొగుల నార్తరవంబు ఘటిల్లె నెందు సు,
స్వాంతుఁడ వైన నిన్విడువఁజాలుదురయ్య ము.

ఉ. పూనిక నాజనంబు మదిబుట్టినయార్తి భవత్ప
దాంబుజ, ధ్యానవశంబునన్ మఱచి తద్దయు
రా సరయూనదీతటిన్, యానము నిల్పి యందు

జలమాని నిశీథిని బర్ణశయ్యఁ స్నానము సేయవే
మృదులతల్పమునోజ ము... 63

ఉ. పౌరులు వాయ నీదగునుపాయపుజాడ సుమం
త్రుఁడానిశన్, దేరటఁ దానయోధ్యదెసఁ దెచ్చి
యు వే తమసాతరంగిణీ, తీరముకై మరల్పఁ జని
తేకువతో నదులెల్ల దాఁటి గం,గారమణీయకూ
లమును గాంచితి గాదె ము... 64

ఉ. పాపవినాశ దాశపతి భక్తి నొసంగిన కాన్క
లంది వే, తాపసవృత్తిమై జటలుదాల్చి సుమం
త్రుని బంపి యంత దే,వాపగ నుత్తరించి శ్రమ
మానని త్రోవ గుహుండు జూప నా, రోపిత
చాపతం జనవె రూఢిదలిర్ప ము... 65

చ. ఘనకుచభారద్రైయు యసదుగౌ నసియాడఁగఁ గోమ
లాంఘ్రిల్, గ్లనఁ దడబాటునొంద నడలన్ గడు
దూలి కలంగు జానకి, న్మనమెరియంగఁ జూచి
పలుమారును నిల్పులదేర్చు చేఁగవే, యనుపమ
ధైర్య దుర్గమవనాంతరమందు ము... 66

చ. అగణితమైన సర్వదురితౌఘము దూలఁగఁజే
యఁజాలు స్వర్గగనధునీప్రవాహయుత కాండ
కళిందకుమారిచెంత నిం, పుగఁజనుచోఁ బ్రయా
గవటముం గని యందుఁ దపస్విసత్కృతుల్,
దగఁ గరుణించి యేఁగవె సధర్మవిచార ము...

చ. అట యమునానదిం గడచి యంతట మాల్యవ
తీనదీలస, త్తటతరువాటముం బహుళతాపస
కూటము విస్ఫురన్మణీ, కటకచర్చత్స్వరాధిగత
కాంచనకూటము చిత్రకూటమా, దటఁ గని
యందు నిల్వ మతి దాల్చితిగాదె ము... 68

చ. అకలుషనిర్జరప్రకర మల్లనఁ జూచుచు మౌని
కోటిచెం, తకుఁ జని మ్రొక్కి సత్కృతి విధా
నముఁ జెంది నగాగ్రభూమి కొం, కక తపమా
చరించుచుఁ దగంగ వసింపవె పర్ణశాలఁ ద, త్స
కలసుఖంబులన్ మఱచి సన్మునిగోష్ఠి ము... 69

చ. కనుఁగొని సీతనేచు నలకాకముపై తృణమేయ
నస్త్రమై, కనలుచు వెంటనంటఁ ద్రిజగంబులఁ
గ్రుమ్మరి దిక్కులేక భీ, తిని నది యాకృపావననిధీ
కరుణించుము నాఁగఁ బ్రోచి తౌ, జనకసుతేశ నీ
కెవరు సాటి గణింప ము... 70

ఉ. ఇమ్ముగ గంగదాఁటి వని కేఁగెను రాముఁడు
నాసుమంత్రువా, క్యమ్మును వించు హా సుగుణ
హా కులదీపక హా కుమార యం, చమ్మను జేం
ద్రుఁడుం దగనియార్తి మనోవ్యథఁ జెందె నయ్యె
యో, యమ్మెయి నీవియోగము సహింపఁగ
నేర్చు ము... 71

చ. ఉరుగతి వేటలాడుతఱి నొందిన శాపము నగ్ర,

భార్యతో, నరుడుగఁ బల్కి పక్షిరథుఁ డంత
భవద్విరహార్తిమీఱఁ ద,త్పరతను రామరామ
యని పల్కుచు మేనుఁ బొఱంగె నోమహీ
వరభువి మానిశాప మది వమ్మగునయ్య ము...
చ. పతి మృతి యంతటం దెలిసి పంకజనేత్రలు హానృ
పాల సూ,నృతపరిపాల యంచలత నేడ్వఁగ నంత
వసిష్ఠుఁ డప్పు డా,తతమతి తత్కళేబరము తైల
సుపక్వముజేసి పీఠసం, గత మొనరింపఁ జేసెఁ
గద గౌరవమొప్ప ము... 73
ఉ. దూతను బంప వచ్చి భరతుండు భవద్వనయాన
వార్తయు, న్మాత వచింప మూర్ఛిలుచు మాకెడ
జేసితె రామచంద్రు నో, ఘాతుకురాల నీకతనఁ
గల్గెగదా యిటులంచు దూరఁడే, భూతనయేశ
రాజ్యసుఖము న్నిరసించి ము... 74
చ. భరతుఁడు తండ్రిఁ జూచి బహుభంగుల ఖేద
ముఁ జెంది పిమ్మటన్, గురువచనంబుఁ గైకొని య
కుంఠితవైదికరీతి తత్కళే, బరము వహించి యం
తక్రమభంగి తిలోదకదాన మిచ్చి యు,త్తరక్రి
తులెల్ల సల్పెఁగద తమ్మునితోడ ము... 75
ఉ. పొందినరాజ్యసంపదలఁ బూనుట నొల్లక రామ
చంద్ర యే, చందమునైనఁ దెచ్చి మిము సర్వ
ధరిత్రి భరింపఁజేయువాం, ఛం దగుసైన్యముం

గొని వెసఁ భరతుం డరుదెంచఁడే జగ,ద్వందిత
నీపదాబ్జములు భక్తిని గొల్వ ము... 76
ఉ. ఓజను రామచంద్రు నిట నూరికిఁ దేరఁగఁ
బోదు నా సము, ద్భ్రాజితచిత్తుఁ డై గుహుఁ
డుదారత మార్గముఁజూప నాభర,ద్వాజమునీం
ద్రునాజ్ఞగొని తమ్మునితో భరతుండు నీపదాం,
భోజయుగంబు గొల్తు ననుపూనికె రాఁడె ము.
చ. నినుఁ గనఁ జిత్రకూటము ననిందితుఁడౌ భర
తుండు చేరఁగాఁ, గని త్వరతోఁ దదాశయము
గానక లక్ష్మణుఁ డాడునిష్ఠురో, క్తిని విని స్నేప
కాతని నతిక్రుధతో నదలించి కైకయీ, తన
యునిభక్తి దెల్పవె యుదార మటంచు ము...
ఉ. సైనికకోటి నిల్పుచు వెసఁ భరతుండరుదెంచి
మేడల, స్నానుగఁ గ్రీడసల్పు సుకుమారుఁడు
నేఁడిటుఁ బర్ణశాల సఁ, మానిగతిన్వసించె నని
మాటికిఁ గుందుచు సాగి మ్రొక్కఁడే,సానుజుఁడై
శిరంబు భవదంఘ్రులు సోఁక ము... 79
ఉ. తమ్ముల గారవించి మఱి తండ్రివినాశ మెఱింగి
మూర్ఛపైఁ, గ్రమ్మిన వ్రాలి లేచి మది ప్రాకృతు
భంగి కలంగి బంధులో, కమ్మొగి వెంటరా ద్రిపథ
గామిని కేఁగవె రామచంద్ర లో,కమ్మునవారు
వోలె పితృకార్యముఁ దీర్ప ము... 80

ఉ. ఆనది చెంతఁ దండ్రికిఁ దిలాంబువు లిచ్చి యథోచి
తక్రియల్, జానుఁగ జేసి నిన్నెడయ నైఁపక
నెమ్మదిఁ గుందు మాతల, న్మానుగ గారవించి
యసమానపువైఖరి కొల్వుఁ దీర్చవే, మానిజ
నంబు కిన్నరసమాజము గొల్వ ము... 81

ఉ. ఆసభలోపల న్భరతుఁ డంజలి మోడ్చి సమస్త
వైభవో, ద్భాసితమైనరాజ్యరమఁ దాల్పు నయో
ధ్యకు నేఁగుదెంచు మో,భాసురకీర్తి యొండని
నఁ బట్టణమేఁ జొరనొల్లనంచుఁ ద,ద్భాసనమందు
నిల్చెఁ గద ప్రాణము వాయ ము... 82

ఉ. అక్కట యింత తెంపు తగునయ్య తగఁ పితృ
వాక్య మేనె పెం,పెక్కఁగ దీర్పకున్న నగరే
జగతిఁ కులధర్మమే మదిం, జక్కఁగఁ జూడు
మోభరత సత్యము దీరిచి వత్తునంచుఁ బె,న్మక్కుఁ
వ బల్కె తో మునిగణం బలరంగ ము... 83

చ. గురువచనంబుఁ గైకొనుచుఁ గూరిమి మీరొసఁ
గంగఁ బాదుకల్, శిరమునఁ దాల్చి భద్రగజశీ
ర్షమునం దిడి చామరద్వయం, బిరుదెస నేయు
చేఁగి భరింయిపఁడె రాజ్యరమాభరం బొగిఁ,
భరతుఁడు పాదుకాముఖమునంబురినుండె ము.

చ. వరనిజరాజ్యవైభవవిపర్యయమంది పితృప్రయు
క్తి మై, నరుగుచుఁ జిత్రకూటనగమం దను

జన్మని కంఘ్రిపాదుకల్, కరుణ నొసంగి సీతఁ
గొని కానకు నేఁగవె రామచంద్ర యా, భర
తుఁడు భక్తిమై మఱల వచ్చునటంచు ము...

---

## ఆరణ్యకాండము.

ఉ. పుణ్యచరిత్ర యత్రిమునిపుంగవు వీడ్కొని
ఘోరదానవా, గణ్యము సుప్రసిద్ధమునికాండ
శరణ్యము నైన దండకా, రణ్యము సొచ్చి
యందు మునిరాజవిరోధు విరాధు వీతదా,తీ
ణ్యునిఁ గాంచవే నగముచెల్వునఁ గ్రాల ము...

ఉ. చండకఠోరశూలమును సయ్యన పైనడరింప
దాని కో,దండకళాఢ్యతఁ దునిమి దార్కొని
వజ్రనిభాసిచే సురేం,ద్రుండు నగంబు వోలె
యవరోధనిరోధు విరాధుఁ ద్రుంచి తా,తం
డలఖేచరత్వమును దాల్చి నుతింప ము... ౮౭

చ. ఇరుదెస దేవతల్గొలువ, నింద్రుఁడు వచ్చి తపంబు
మెచ్చి చె,చ్చెర దివి కేఁగు దెంచు మని చీరినఁబో
వక జన్మవార్ధి సం,తరణము గోరినం గనిన తచ్ఛ
రభంగుఁ డొసంగు నర్ఘ్యముల్, గదుణ గ్రహిం
పవే భువనగణ్యచరిత్ర ము... ౮౮

ఉ. పూని సుతీక్ష్ణముఖ్యముని ముఖ్యులఁ గొల్చి

తదాజ్ఞతోడుతఁ, దానవులన్వధించుచు సదా
సుఖకేళిని గల్పవృక్షసం,తాన సమంజసమ్ముల
వనమ్ముల గ్రుమ్మరుచుం బదేఁడు ల,క్కాన వసిం
పవే జనకకన్యకఁ గూడి ము... 89

ఉ. తాపసవృత్తి నిల్వలుఁడు దా మునికోటికి మేష
మైనవా, తాపిని వండిపెట్టఁగ నతండు నజీర్ణత
వారిఁ జంప ని,శ్లేపుననున్న తద్భటుల నిద్దఱిఁ
ద్రుంచిన యాయగస్త్యు ని,ష్పాపునిఁ జేరి మ్రొక్క
వె కృపాపరిపూర్ణ ము... 90

ఉ. సమ్మతి నాయగస్త్యమునిచంద్రుఁ డొసంగిన దివ్యఖ
డ్గయు,గ్మమున మోఘసాయకసమాజము నక్షయ
తూణముల్ సుభ,వ్యమ్మగు హేమవైష్ణవశరాస
నముఁ గొని పొల్చితౌర రే,ద్రిమ్మరిమూఁకపా
లిటిపరేతపులీల ము... 91

చ. కలశజునాజ్ఞఁ గొంచు ఘనకాయు జటాయుని
గౌరవించి మం,జులతటకుంజపుంజ పరిశోభితగౌ
తమివాహినీ లస,జ్జలజసుగంధభార మిళితంబగు
పంచవటీస్థలి న్వైరా, జిలుచు వసింపవే మునులు
జేరి భజింప ము... 92

చ. స్ఫురితతమాల నీలరుచిశోభిత మంగళగాత్ర
విస్ఫుర,త్సరసిజపత్ర నేత్ర విలసద్భవదాకృతిచుప్ప
నాతి యు,ట్లలచుచు వచ్చి చూచి వలపందుచుఁ

గోరిన నవ్వి లక్ష్మణుం, బరమహీతోక్తిఁ జేరుమని
బంపవె రామ ము... 93

వ. అట చని వేఁడఁగా నతఁడు నయ్యయొ నేర్పరి
రాముఁ బాసి యి, చ్చటి కరుదెంతురే యబల
సాగుమన న్నగుచుండుసీత నా, దటఁ గని చుప్ప
నాతి బెడిదంబుగఁ బైఁజన నీదుతమ్ముఁ డు,త్క
టత విరూపఁ జేయఁడె తగన్ భవదాజ్ఞ ము.ని

ఉ. ముక్కును గర్ణము ల్దెగిన మ్రోఁగుచు వేఁ జ
చుప్పనాతి దా, వెక్కుచు దెల్పినన్ ఖరుఁడు
వే పదునల్వురఁ బంపఁ దెంపుమై, స్రుక్కక
తాఁకినన్ గినిసి రూక్షశరాలి నిగుడ్పఁ గూల
రే,గ్రక్కున వజ్రభిన్నకుధరంబు లనంగ ము...

ఉ. అంతట నాఖరుండు చతురంగబలంబులతో రణ
క్రియా, త్యంతనిరూఢిఁ దాఁక వెసఁ దమ్ముని
సీతకుఁ గాపుఁబెట్టి నీ, వెంతయు మించి నారి
మొరయించుచుఁ గ్రోధధురీణశోణనే, త్రాంతుఁ
డ వౌచుఁ దాఁకవె లయాంతకుభంగి ము...

చ. మసలక నొక్కవ్రేల్మిడిని మార్కొని యాపదు
నాల్గువేలర, క్కసులను మంటమీఁది మశకంబు
లపోల్కి నడంచినట్టి నీ,యసదృశశౌర్య మెన్నఁ
దరమా విధికైన బలారికైన రా, క్షసవనవీతి
హోత్ర నవసారసనేత్ర ము... 97

చ. పరువున నేఁగి శూర్పణఖ బన్నము నన్నకుఁ
జెప్పుచుఁ గా మనో, హరరుచిరాంగి నీలకుటిలా
లక చంద్రనిభాస్య సీతయం, చరుదుగఁ దెల్పఁ
బొంగుచు దశాస్యుఁడు గైకొనఁ జూచె మత్తుఁ
డై, గరళము మ్రింగఁగోరుటయ గాదె
తలంప ము... 98

ఉ. వేచని రావణుండు పృథివీసుతఁ దేఁ జనుదెమ్ము
నాభయం, బై చలనంబు నొందుచు దశాస్యుని
యుక్తిఁ దొలంగ లేమి మా, రీచుఁడు వంచనా
మతిఁ జరింపఁగ బంగరు లేడి యై వెసఁ గా, మీచ
రియించుచోటికిని మెల్కువ రాఁడె ము... 99

ఉ. వింతగ మేనికాంతి వినువీథి వెలుంగ మనోహ
రాకృతిఁ గా, గంతులు వైచుచుం జనకకన్యకచ
క్కటి కేఁగ వేఁడి వి,భ్రాంతిగఁ జూచి నాథ
మురిపం బొనరించెడు తేఁగదే కృపా, స్వాంత
యటన్న నౌ ననవె వాంఛదలిర్ప ము... 100

చ. కనకపు లేడి యిజ్జగతి గల్గునె చూడ నిశాటు
మాయగాఁ, దనరెడుఁ బట్టఁబోలదని తమ్ముఁడు
దెల్పిన సీత సమ్మదం, బెనసెడిఁ గాన సంశయ
ము దేలను కృత్రిమమైనఁ ద్రుంచెదం, గనుమని
లేడికై చనవె కార్ముక మూని ము... 101

ఉ. గోచరమౌచు చిక్కకను గ్రుంకులు వెట్టు చరణ్య

సీమకుఁ, వే చన మాయలేడె యని వెన్కొని
కిన్కను బాణమేయ మ్మారీచుఁడు "లక్ష్మణా"
యనుచు రివ్వన గూలఁడె కొండభంగి సీ, తా
చపలాక్షిమానసము తాలిమి దూల ము...

ఉ. ఆనినదంబు వించు జనకాత్మజ కుందుచు లక్ష్మ
ణా మహీ, జానికిఁ గీడుదోఁచె నటుసయ్యనఁ
బోమ్మన నామహాత్మునిం, దైనభయంబు జెందఁ
డసహాయపరాక్రమశాలి ఖేదము, న్మానుమ
టించుఁ బల్కెఁ గద మానినిఁ జూచి ము...

చ. అటు జనకున్నఁ గిన్క వడి "యగ్రజు చేటుఁ
దలంచి కాచితే,కుటిలుఁడ నాకునై" యనుచుఁ
గోమలి పల్కిన నొచ్చి తల్లినే, నటు జన నీకు
కీడు దొరయంగఁ దలంచు సుమిత్రపుత్రుఁ డ,
చ్చోటు వెసఁ బాసి నీదెసకు స్రుక్కుచు
రాఁడె ము... 104

ఉ. కోరిక నంత వృద్ధమునికుంజరుఁడై దశకంఠుఁ డు
ర్వీజం, జేరి నిజస్వరూప మెదఁ జేస్పడఁ జూపి
భయంబునొందు సీ, తారమణీమణిం గొని రథం
బున నుంచుక యేఁగఁడే వెసఁ, హా రఘునాథ
కావుమని యాసతి యేడ్వ ము... 105

ఉ. ఆననమెత్తి "యే దశరథాధిపుకోడల రాముభా
ర్యజం, డోసరులార కావఁ జనుఁ డోసుర

లార" యటంచు సీత బల్దినత నేడ్వఁగా విని
యెదిర్చి జటాయువు దాఁకఁడే కృపాహీనుఁడ
పోకు పోకు మని యేచి దశాస్యు ము... 106

ఉ. బిట్టుగఁ దాఁకు గృధ్రపతి బీరముదూల రణం
బొనర్చి యా, దిట్టను గూలనేసి యతితీవ్రత
రావణుఁ డేఁగ నొక్కపెన్గట్టున సీత వానరులఁ
గన్గొని సొమ్ములు వుచ్చివైవదే, నెట్టన మీఁకుఁ
దెల్పఁగు నేర్పు దలిర్ప ము... 107

చ. చెలఁగుచు రావణుండు పురిఁ జేరి యశోకవని
న్నిశాటకాంతలఁ బరిరక్షితో నునుప ధారుణి
కన్యక "హా నృపేంద్ర యు, జ్జ్వలగుణసాంద్ర
రామ" యని పల్మరుఁ బల్కుచు నీదురాకడం,
దలఁచుచు నుండదే భయదదానవవీట ము...

చ. అటులరుదెంచి లక్ష్మణుఁ డిలాత్మజపల్కులు
చెల్ప నులికి యక్కట సతి నొక్కతె న్విడిచి
గ్రక్కున వత్తురె మోసపోతిమిం, కెటు లగునో
యటంచు మనుజేశ్వరమాత్రుఁడవోలె కుంది
యు, చ్చటి కరుదెంచవే జనకజన్వెదు
కంగ ము... 109

చ. వెసఁ జని పర్ణశాల బృథివీసుత గానక భీతిమై
మనో, వ్యసనముఁ జెంది కొండల గుహానివహం
బుల సర్వదిక్కుల, న్విసువక చూచి కానకయ

వేసట నొందవె రామచంద్ర ని, ర్వ్యసనుఁడ
వయ్యు నమ్మనుజభావముబట్టియు... 110

ఉ. సారసగంధి పెంచు మృగశాబకముల్ జను
త్రోవ నేఁగి శృం, గారపుసొమ్ము లొక్కెడను
గాంచి కలంగుచు నట్టిజాడ న, ద్ధారుణిఁ బోయి
పోయి వసుధంబడియున్న జటాయుఁ జూచి
బల్, క్రూరతఁ జూపవే ఖగవరుండు త
లంక ము... 111

ఉ. ఓరఘునాథ సీతఁగొని యుగ్రత రావణుఁడేఁగఁ
దాఁకి త,ద్ఘోరరణంబునంబడితి ద్రోహిని గానని
సీతజాడ నీ, వూరటఁజెందఁ జెప్పి మృతినొందినఁ
గుందుచుఁ బక్షి కగ్నిసం, స్కార మొనర్పవే
జనకుచాడ్పున నెంచి ము... 112

చ. చని చని యొక్కెడన్ ఘననిశాచరబంధు
కబంధుఁ డుగ్రుఁడై, తన యిరుచేతులం బొదు
వదక్షత బాహులు ద్రుంచి ఘోరమై, తనరెడు
తత్కబంధమును దగ్ధ మొనర్చి తదీయ శాప
మోచన మొనరించితీవెగద సద్గుణసాంద్ర ము.

ఉ. ఆమనుజాశి దివ్యుఁడయి యంబరవీథిని నిల్చి
యోఘున, శ్యామ భవత్సమవ్యసనుఁడౌ నినపు
త్రుఁడు ఋశ్యమూకమున్, భూమిధరంబునం

గలఁడు పొమ్మట మంగళ మౌనటంచు నెంతే
ముదమంద బల్కుచుఁ జనెంగద ము... 114

చ. వివులు దినేశసూనుఁ గనువేడుకఁ బోయి
మతంగమౌనియా, శ్రమమునఁ బ్రీతిమై శబరి
సత్కృతిఁ గాంచి ఫలంబులంది మో, దమునఁ
బ్రఫుల్లకంజములతావుల నింపగు పంపచెంత
నొం, పమర వసింపవే యనుజుఁ డర్మిలిఁ
గొల్వ ము... 115

ఉ. చెంగట దండకాటవినిఁ జేరి చరించు సువర్ణ
దంభసా, రంగము కిన్కఁద్రుంచి నిజరామను
గోల్పడి పక్షిజాడఁదె, ల్పంగనుచేఁగి పంపయను
భవ్యసరోవరమందు ధన్వివై, రంగుగ నిల్చి
తౌర మృగరాజి కలంగ ము... 116



## కిష్కింధాకాండము.

ఉ. మారుతపుత్త్రుఁ డర్కసుతమంత్రి కరంబులు
మోడ్చి యోజగ, ద్వీర నృపేంద్రులార మునివే
షముతో నిట సంచరింపఁగాఁ, గారణ మేమి
యొవ్వరో తగన్విసఁ గోరెదఁ దెల్పుఁడంచు నా,
ధీరుఁడు వేఁడఁడే రఘుపతీ మిముఁ గూర్చి ము.

చ. ఇనజుఁడు వాలిచే యువతిహీనత నొంది
గృశించుచుం భవద్ఘనతరమైత్రి గల్గిన సదా
ముద మానని పంచె వాయునం, దనుఁడను
కామరూపి ననిన న్నది విస్మయమంది తమ్మునిం,
గనుఁగొని తెల్పుమంచనవె కార్యముఁ రీతి ము.

చ. దశరథ రాజనందనుఁ డుదారుఁడు రాముఁడు
తండ్రిపల్కుచే, భృశగతి కానకేఁగి తనయింతినిఁ
గోల్పడి తత్కబంధువా, గ్వశమున నివ్వనంబు
నకు వచ్చెను భానుజుఁ జూడ నిమ్మహా, యశుఁ
డని పల్కఁడే యనుజుఁ డాకపితోడ ము...

ఉ. ఈరఘురాముసోదరుఁడ నేను తదంఘ్రులఁ
గొల్చి వచ్చితిం, దారకనాముఁ డాశ్రితనిధా
నము జానకికై కపీంద్రునిం, పారఁగ వేఁడఁగావ
లనె హాయని బాష్పము లొల్కనున్న నో, దా
రిచెఁగాదె లక్ష్మణు సదాగతిసూతి ము... 120

చ. ఇనవరనందనుం డతఁడు నే మినవంశ్యుల మట్లు
గాన మా, కనయము సఖ్య మై యొసఁగ నర్హ
ముగాదె కపీంద్ర యంచు నా, ననిలసుతుండు
నాత్మముదమందుచుఁ బొంగఁడె రామహాత్మ నీ,
యనుగతిఁ జూడ నేరికిని హర్షముగాదె ము.

ఉ. ఆవల ఋశ్యమూకగిరి కాకపితోఁ జని యగ్గి
చెంత సుగ్రీవునితోడ సఖ్య మొనరించి యతం

డట కేఁగి తెచ్చి సీ, తావిమలాంగి భూషణవి
తానము జూచి కలంగి యాదశ, గ్రీవు వధిం
తునంచనవె కిన్కదలిర్ప ము... 122

చ అతిబలుఁ డైనవాలి తనయాలిని గైకొని బ్రోచు
టెల్ల వి,శ్రుతముగఁ జెప్పి చెప్పి రవిపుత్రుఁడు
కుందినఁ దేర్చుచు న్మదో, ద్ధతుఁడగు వాలి
ద్రుంప శపథం బొనరించితి వొ బలాఢ్యయా,
శ్రితజనపోషణాప్రవణశీలివి గావె ము... 123

చ. అవనిధరోపమానమగు నచ్చటి దుందుభికాయ
మంఘ్రిచే, భువిఁబడఁ జిమ్మి లీలగతి భోరునఁ
దాళము లేడుఁ ద్రుంప నా, రవిజుఁడు వింతచే
బొదలి ప్రాంజలి యై వినుతింపఁడే మహా, హావజ
య నీదుశ_క్తిఁ దెలియంగఁ దరంబె ము... 124

ఉ. శ్రీవర నీయనుజ్ఞఁ గొని చివ్వునఁ దాఁకిన వాలి
యుగ్రుఁడై, చేవ యడంగ మోది పడఁజిమ్మఁగ
స్రుక్కుచు వచ్చి "యో త్రిలో, కావనశీల నీకు
దగునయ్య యుపేక్ష" యటంచు వేఁడ సు,గ్రీ
వుని నాదరింపవె సఖిత్వము మీఱ ము...125

ఉ. మెండగు పూలదండ నిడి మిత్రసుతుండు ధరించి
మించి బ్ర,హ్మాండము నిండ నార్చుచు రయం
బునఁ బిల్చిన వచ్చి వాలి యు, ద్దండతఁ దాఁక

నొండొరు లుదగ్రతకొండలభంగిఁ బోరరే,భం
డనభీము లౌచు రుచిభాస్కరు లౌచు ము...
ఉ. అత్తఱి వేఁటకానిగతి నాదట పొంచి కఠోర
బాణ మా, యత్తముఁ జేసి వజ్రమున నద్రి
సురేంద్రుఁడు గూల్చుమాడ్కి ను, ద్వృత్తిఁ
జరించు వాలిఁ బృథివింబడఁ గూల్చితి వౌ రమే
శదు, శ్చిత్తవధంబు నీసహజశీలమె గాదె ము.
చ. పటుశరవేదనంబునను వాలి కడున్మిము దూరి
దూరి పి, మ్మట భవదీయధర్మయుతమార్గవచో
మృతసేవనంబునన్, గుటిలతఁ బాసి నిన్ దలఁచి
గొబ్బున స్వర్గము జెందఁడే మదో, త్కటరిపు
నాశ భక్తభవతాపవినాశ ము... 128
చ. ఇలఁ బడియున్న వాలిమొద నేడ్చెడు తారఁ
దోలంగఁ బుచ్చి ని,ర్మలమగుతచ్ఛరీరము సుమం
త్రముగా దహనంబొనర్చి య,వ్వలఁ దగుకృత్య
ముల్ సలిపి వాలితనూజుఁడు భానుజుండు
ని,న్నెలమి భజింప రారె విబుధేశ్వరవంద్యము.
చ. ఇనజుఁడు నీదుపంపునఁ గపీశ్వరరాజ్యముఁ
గాంచి వాలినం,దను యువరాజుఁ జేసి వనితార
తుఁడై సుఖియై మహావిభూ, తిని సురరాజు
మించె నరుదే తలఁపన్ రఘునాథ నీదుప్రా,పున
దృణమైన మేరువయి పొల్చదె రామ ము 130

ఉ. ఆగిరిగహ్వరంబున రసాత్మజుఁ జేర్కొని మోహ
మంది వ,ర్షాగమవేళ మానవుక్రియ న్విలపించి
తదీయకాల మ,ట్లేఁగఁగ నంత లక్ష్మణు దినేశ
సుతుఁ బిలువంగఁబంప వే,వేగ నతండు రాకు
నికి వేపటనొంది ము... 131

ఉ. చండత లక్ష్మణుండు గురుచాపభుజార్గళుఁడై ల
యాంతకో,ద్దండత వాఁకిటన్నిలువఁ దారలతో
రతికేళి సల్పు మా, ర్తాండసుతుండు భీతిఁ
గాని తానెదురేఁగఁడె నమ్ముఁడై లస,త్కాండ
జనేత్ర నీవిజయధాటికి నోడి ము... 132

చ. కొరకొర జూచి "రాముఁ డెదఁ గుందుచు
నుంటఁ దలంప కిట్లుసుం, దిరమునఁ గేళిమై మఱ
చితే యకృతజ్ఞుఁడ! వాలికైన నా,శరమది యొక్క
పోదు నినుఁ జంపఁగఁ జాలు" నటంచు లక్ష్మ
ణుం, డురుగతిఁ బల్కఁడే రవిజుఁ డుల్కి
పడంగ ము... 133

ఉ. ఈరవిజుండు మాన్యుఁడు మహిం గృతకృత్యుఁ
డు వానరావలిఁ, దేరఁగఁ బంచినాఁడు నలుది
క్కుల కిట్టిసుహృద్వతంసు ని, ష్కారణ మిట్లనం
జనునె నైఁపకయంచు సుమిత్రపుత్రుతోఁ, దార
వచింపదే సరసతం దగురీతిము... 134

చ. తరణిసుతుండు శాంతలపితంబుల లక్ష్మణు కోప

మార్చి వే, తరుచరకోటిఁ గూర్చుకొని ధైర్య
ముతోఁ బవనాత్మజాదివా,నరనివహంబుఁగొల్వఁ
గరుణారసపూర్ణపయోధివైన మీ, చరణముఁ
గొల్వ రాఁడె కపిజాతి నుతింప ము... 135

చ. రవిజుఁడు నీదుమన్ననల రంజిలుచున్ భవ
దాజ్ఞ మిత్రసైం, ధవనిభ వేగు లోకపులు నల్ల
డలం జని సీతఁ జూచియున్, జవమున రాఁగఁ
బంపఁడె లసద్రవిదీప్తిజరించుదాఁక శై,లవనసరి
త్పయోధ్యవధులం దగఁ దెల్పి ము... 136

ఉ. సాహసవృత్తి నిశ్చలత సద్గుణజాలము సర్వకా
ర్యని, ర్వాహకశక్తిభక్తియుఁ దిరంబుగఁ జూచి
యొసంగవే నృపేం, ద్రా! హనుమంతుచేతికి
ధరాసుతకై నిజనామముద్రయు, త్సాహముతో
నతండు తలదాల్చి చెలంగ ము... 137

చ. తరుచరవీరు లట్లరిగి దర్పముతోడుతఁ బూర్వప
శ్చిమో, త్తరదిశలందుఁ బర్వతవితానములం బు
రదావపంకజా, కరముల నెల్లచోటులను గన్గొని
జానకి జాడ గానకే, మర లిటు రారె నీదెసను
మానసములోన ము... 138

చ. అనిలతనూజముఖ్యులు రయంబున దక్షిణదిక్కుఁ
జెంది యో, పినగతి నెల్లెడన్వెదకి వింధ్యబిలం
బునఁ జూచి జానకిన్, గనుఁగొనలేక ఖిన్ను

లయి కాయమును బాయఁగ దర్భలందు స్వయ్య
వ బవళింపరే రవిజు నాజ్ఞకు నోడి ము... 139

ఉ. వాతసుతాంగదాదికపివర్యులు తమ్ము గ్రసింపఁ
జూచుసంపాతికి నెల్లవార్త వినఁబల్కఁగ నాఖ
గమాత్మదృష్టిమై, సీతను లంకఁ గంటి నని
చెప్పినవెంటనె పోవరే మహీజాతను గాంచ
నాకపులు,సంద్రముచాయ ము... 140

చ. జలకణచుంబితాభ్రమగు సాగరముం గని భీతి
నంగదా, దులు నిజశక్తు లెన్నుచును దోయధి
దాఁటఁగలేమిఁ జూచి కౌశలమున జాంబవంతుఁ
డతిసాధువచస్స్థితి నాంజనేయుదో, ర్బలము
నుతింపసాగెఁ గద వార్థి తరింప ము... 141

చ. బలజవశాలివయ్యుఁ జనఁ బొల్పడ కిట్లు తొలంగి
యుంటివా, జలధి తరింప మాకిఁక వశంబె
మరుత్సుత సీతఁ జూచి యు, జ్జ్వలగతి రమ్ము పొ
మ్మనుచు భల్లుకనాథుఁడు వేడఁ బొంగు చాయ
లఘుఁడు బోఁదలంపఁడె ఘనాంబుధిదాఁటి ము.

ఉ. ఖ్యాతిగ వాలిఁ జంపి సఖుఁడౌ రవిసూతికి గీశరా
జ్యస్వద్ఖ్యాతి నొసంగి యంత నిజముద్రిక మారు
తికిచ్చి పంప సం, పాతి వచించుజాడఁ జను
వాంఛ నతండును బోఁదలంపఁడే, సీతను
గాంచ సాగరము చిప్పన దాటి ము... 143

## సుందరకాండము.

---

చ. పదయుగళంబు చక్క నిడి వార్ధికి మ్రొక్కి భవ
త్పదాబ్జముల్, హృదయమునందు నిల్పుచు
మహేంద్ర నగేంద్రము గ్రుంగ దాఁటఁడే, చద
లికి మారుతాత్మజుఁడు శైలకుజంబులు పెల్ల
గిల్లనం, బుదములు దూల దోర్జవసముజ్జ్వలుఁ
డౌచు ము... 144

చ. చలిమలపట్టికిం బ్రియము సల్పి వెసన్ సురసన్
మరల్చి వే, రలుకను సింహికం దునిమి యబ్ధి
తరించి భవత్ప్రియు క్షమై, పొలసిన చిచ్చు
రమ్మనఁగఁ బోయి మరుత్సుతుఁ డాసువేలమున్,
బలుగిరి నిల్వఁడే తరణి బానెడుదాఁక ము...

చ. అనుపమసౌధగోపురసమంచిత మై వెలుగొందు
లంక నొ,య్యనఁ గని తద్విచిత్రతకు నచ్చెరువం
దుచు సూక్ష్మగాత్రుఁడై, చనునెడ లంక నాఁజను
నిశాచరి దాఁకిన గెల్చి యంత నే, ర్పునఁ జనఁడే
మరుత్సుతుఁడు భూసుతఁ జూడ ము... 146

ఉ. ఆరజనీచరేంద్రపురి నాలయమంటప సౌధవీథు
లన్, భూరివిమానరాజమునఁ బోలఁగఁ గన్గొని
సీతఁ గాన క,మ్మారుతి చింతనొంది మఱి మంజు

లతాంతలసద్వనాళి కి,చ్చారతి నేఁగఁడే యచట
జానకిఁ జూడ ము... 147

ఉ. చెక్కిటఁ జెయ్యి జేర్చి బలుచింతలఁ దూలుచు
దీనవక్త్రయై, దిక్కట నొండు లేక ఘనతీక్ష్ణమృ
గాళిఁ గురంగి వోలె నా, రక్కసిమూఁకలో
భయభరంబునఁ గుందెడుసీతఁ జూడఁడే, యొ
క్కెడ వాయుజుండు మది కుబ్బు జనింప ము.

ఉ. క్రమ్మరఁ జూచి యావనిత కాంచనగాత్రకళావి
భూతి భా,వమ్మున నెంచి నీపలుకు వైఖరి నుండు
టఁగాంచి సీతగా, నెమ్మది నిశ్చయించుచు వనే
చరుఁ డంత నశోకవృక్షప, ర్ణమ్ముల నుండఁడే
తమము గ్రమ్మెడుదాఁక ము...... 149

ఉ. రావణుఁ డానిశీథిని ధరాసుతపైఁ గడుమోహా
మంది భూ, పావలి దాల్చి స్త్రీలు గుముల్లై
గొలువ న్సఖి కేలు బట్టుచుఁ, ఠీవిగ రాఁడె
మత్తకరిణీయుతదిక్కరిభంగి భీతిమై, యావసు
ధాకుమారి హృదయంబు చలింప ము... 150

చ. కని వసుధాతనూజ చనుగట్టులు చేతులమాటి
పెన్నెరుల్, దనువునఁ గప్పికొంచుఁ గనుదమ్ముల
నశ్రులు రాల నున్న స, య్యెన ననుఁ జూచి
మానిని నిజాంగము డాపఁగ నేల నన్నుఁ జే,
కొను మని బల్కఁడే దశముఖుండు మదించిము.

చ. అలరెడుజవ్వనం బిటుల నారడివోవఁగఁ గుంద
నేల నేఁ, గలుగఁగ నెల్లసంపదలఁ గైకొని సమ్మతి
నాదుసుందరుల్, గొలువ ముదంబుమీఱ ననుఁ
గూడి సుఖించుము సుందరాంగి నీ, వలసినరీతి
యం చనఁడె ప క్షికేముఖుండు ము... 152
చ. అటవులనాకలంబు దినునల్పుని రాముని గోరె
దీవు వాఁ, డిట కెటు వచ్చు వచ్చినను నేగతి
గెల్చు వృథాశ లేల ను, త్కటపటువిక్రముండ
నను దారోకేన నేరికి శక్య మంచు వా, క్పటు
గతిఁ బ్రేలఁడే చెలఁగి ప క్షికేశిరుండు ము...
చ. అన విని సీత కుంది తన కడ్డముగాఁ దృణఖండ
మూని యే,జనకతనూజ సూర్యకులస త్తముకో
డల రామచంద్రు భా, ర్యను నను గూడు కాంక్ష
విడు మందనిపండ్లకుఁ జేయిఁ జాతురే, చెనటి
యటంచు వానికి వచింపదె రామ ము... 154
ఉ. వంచన నన్నుఁ దెచ్చి చెడుపల్కుల నాడెదు
బంటనంచు న, క్తంచర దుర్మతీ పతి శిత
ప్రదరంబులు నీదుకంఠముల్, ద్రెంచి కులం
బుతో నిను వధింపక మానునె ప్రేలెదేల పొ,
మ్మంచును సీత బల్కదె దశాననుఁ గిన్క ము.
చ. ఇనకులమౌళి కీవు నను నిచ్చి వినమ్రుఁడ వైన
నాథుఁ డొం, డనకను గాచిపుచ్చు శరణాగతర

తుఁడు డాకృపాళువు, న్ననఁగను మొందుగాఁ
దలఁచిన న్నిను నీకులముల్ వధించుఁ జో, మ్మను
చును సీతపల్కెదె దశాస్యునితోడ ము...156

చ. సుదతులఁ జంపఁగూడదనిచూఁచిన నీవిపు డోట
లేక యా,డెద విటులంచు సీత నదలించి దశా
ననుఁ డీధరాసుతల్, గొందగొని రెండుమాసము
లకు న్ననుఁ గైకొనకున్నఁ జంపుఁడీ, యదయత
నంచుఁ బల్కెఁడె నిశాటలతోడ ము... 157

చ. కనలుచు దుష్టదైత్య నిను గ్రద్ధన జావ శపింప
జాలు దై, నను విభునాజ్ఞ లేమికతన న్నపియిం
పఁగ నోప నిప్పు డా, జని నిశితోగ్ర భల్లములచే
నృపచంద్రుఁడె నిన్ను ద్రుంచని, మ్మని మఱిసీత
పల్కెదె దశాస్యునిఁ గూర్చి ము... 158

చ. ఉడుకుచు రావణుండు భయదోగ్రత ఖడ్గము
దాల్చి సీతపై, కడరఁగ ధాన్యమాలిని యహా
సతిఁ జంపుట పాడియే భళా,యుడుగుము నన్నుఁ
గూడి సుఖ మొందెదు రమ్మన నవ్వి రాక్షసేం,
ద్రుఁడు రతిలోలతంజనఁడె తొయ్యలితోడ ము

చ. వెస నసురాంగనల్ దివిరి పీఁక ధరాసుత చుట్టు
ముట్టి రా, తుసపతి నేల యొల్లవని గర్జనసేయు
చు ఖడ్గపాణులై, కసరుచుఁ ద్రుంతుమంచుఁ

గినుకఁ ఝళిపింపరె యాలతాంగిహృ, ద్వ్యస
నముఁ జెంది కుందుచుమహాభయమంద ము...

ఉ. చేరువఁ గూర్కు నా త్రిజట చెచ్చెర మేల్కని
రామమూర్తికిన్, జారుశుభంబు రాక్షసవిషా
దము నా కలగంటినంచు ద, న్నారుల కాకలం
దెలుప నమ్రత వారలు గొల్చి యుండరే, ధా
రుణి కన్య కామణిని దర్పము వీడి ము... 161

చ. సమయముఁ జూచి పావని వెసన్ మిముఁజే
ర్కొని సీతఁ గాంచి నే, మము లడుగంగ రావ
ణునిమాయగ నాసతి భ్రాంతిజెంది త, ద్విమల
చరిత్ర లెల్ల వినుపించిన నమ్మెద రాముదూతగా,
నమలత నంచుఁ బల్కెదె వనాటునితోడము...

ఉ. రాముఁడు దుష్టదానవవిరాముఁడు ధీరుఁడు
మేచకాంబుద, శ్యాముఁడు శుభ్రకీర్తిజితచం
ద్రుఁడు సద్గుణుఁ డాశ్రితైకచిం, తామణి శోభ
నుండు కరుణారససాగరుఁ డమ్మయంచు నా, రా
మచరుండు పల్కెఁడె ధరాసుతతోడ ము...

చ. ధరణిని సత్యసంధుఁడును దర్పకరూపుఁడు బ్ర
హ్మచర్యత, త్పరుఁడు త్రిలోకపూజ్యుఁడు కృపా
ళుఁడు విష్ణుఁడు సీత నీమనో, హరునకు సాటి
లేదు భువనాళిని నమ్ముము రాముదూత నే,
నరమర లేదు లేదనఁడె యావనచారి ము...164

చ. కమలదళాక్షి లక్ష్మణుఁడు కాంచనవర్ణుఁడు గాని
రామభూ,రమణసమానసద్గుణవిరాజితుఁ డంచు
మరుత్సుతుండు శీ,ఘ్రమె మణిముద్ర నిచ్చిన
ధరాసుత యక్కునఁ జక్కఁ జేర్చి మో,దము
ముదినించెఁగాదె మిముఁ దార్కొనుమాడ్కి ము.

ఉ. ఆమహీపుత్రి మీకుశల మారసి వెండి యనర్ఘ
రత్నచూ, డామణి యానవాలిడి బలంబులతో
హనుమంత వేగ శ్రీ,రాములఁ దోడితెమ్మన
సరాలున మ్రొక్కి యతండు మించి యా,రా
మము దుల్చి పుచ్చఁడె పరాక్రమలీల ము...

ఉ. చండత నక్షముఖ్యదనుజచ్ఛట రావణునాజ్ఞఁ
దాఁకి యు, ద్దండబలంబుఁ జూప బెడిదంబుగ
వాలముఁద్రిప్పికొట్టిదో,ర్దండపదంబులం బొడిచి
తన్ని నఖంబులఁ జీరిత్రుంచఁడే, మెండగుతద్బలం
బును సమీరసుతుండు ము... 167

ఉ. మండుచు మేఘనాదుఁడసమానబలంబునఁదాఁకి
విశ్వసృ, ట్కాండము వింటఁ గూర్చి గినుకం
బరగించినఁ జిక్కె వాయుపు, త్రుండు చలించి
యబ్బిరుసుతూపునకౌ ఖగరాజకాండయు, క్కాం
డజగర్భమాట వృథ గాఁదగునయ్య ము...

ఉ. గ్రక్కునన్ గట్టి తేరఁ గని రావణుఁ డిందుల
కేమి వచ్చెనో, యెక్కడి వాఁడొ వీఁడనఁగ నే

హానుమంతుఁడ రాముదూత రా,నిక్కము సీతఁ
జూడఁగనునే నిట వచ్చితి వచ్చితిన్ని ను,న్మక్కువ
జూడ నిట్లనఁడె మారుతసూతి ము... 169

ఉ. వంచన భూమిపుత్త్రిఁ గొనివచ్చిన తుచ్ఛుఁడ
రాము నల్పుగా, నెంచితివో పయోధుల రహి
న్నినుమించిన వాలిఁ ద్రుంచె ఖం,డించె ఖరాది
దైత్యులను లీలగ నాఘనుతోడి వైరము,న్మం
చిది గాదటం చనఁడె మారుతి మీఁజీ ము...

ఉ. ఆవిధి నీకు మున్నొసఁగినట్టివరంబు మనుష్యకో
టిచేఁ, జావకయుండఁ గాదు నరజన్ముఁడు రా
ముఁడు గాన యోదశ, గ్రీవుఁడ భూతనూజ
కయి కిన్కరణంబున సంహరించు ని, న్నావసుధే
శుఁడంచనఁడె యావనచారి ము... 171

ఉ. ప్రాణముఁ గోరితేని జనకాత్మజ రామున కిచ్చి
యాజగ,త్ప్రాణుని ప్రాపుఁ గైకొనుము రావణ
తక్కినఁ జత్తువన్న న, తీణతరోగ్రకోపమును
జెంది వధింపఁ దలంచఁడే జగ, త్ప్రాణకుమారు
నాదనుజపాలకుఁ డేచి ము... 172

ఉ. దూత యవధ్యుఁ డంచుఁ దనతో ననుజన్ముఁడు
జెప్ప వించు నా, వాతతనూజుదీర్ఘతరవాలము
నూనియనాను వస్త్రసం,ఘాతముతోడఁ గూర్చి

తగఁ గాలిచి తత్పురిఁ ద్రిప్పఁ బంపఁడే, క్రోఁతిని
రావణుం డసురకోటులతోఁడ ము... 173

ఉ. కట్టినకట్లు దెంచి దశకంఠబలంబుల నుక్కడంచి
తా, నెట్టన యింటియింటిపయి నిద్దపుమంటఁ దగి
ల్చి దాఁటుచుం, గట్టులుకం బురంబు వెసఁ
గాల్పఁడె మారుతి రాక్షసుల్ మదిం, దొట్టిన
భీతి నెవ్వగలఁ దూలి కలంగ ము.... 174

ఉ. అంతట వాల మంబునిధి నార్పి మహీసుతఁ
గాంచి తల్లి నీ, కాంతుని వేగఁ దెత్తు దశకంఠు
వధింపఁగ సంశయంబు లే, చింతయు నుండు
నెమ్మదిగ నే నటఁ బోయెదనంచు వాయుజుం,
డెంతయు మ్రొక్కి రాఁ దలఁచఁడే మిముఁ
జూడ ము... 175

ఉ. అంబుధి లీల దాఁటి వెస నంగదముఖ్యులఁ గూడి
యన్యదూ, రంబగు శౌరి కాననమరందఫలంబులఁ
దృప్తుఁడౌచు మో, దంబున వచ్చి మ్రొక్కి గుణ
ధాముఁడ చూచితినయ్య సీత నే, మంబున నున్న
దంచనఁడె మారుతసూతి ము... 176

చ. అవనిజ లంకనుండువిధ మంతయుఁ దద్వచ
నంబు పొందుగాఁ, బవనసుతుండు దెల్పి సుర
పాలకవైరి వధించి భూమిసం, భవ వెసఁ దేరఁ

బోవలె నృపా యని రత్న మొసంగ లోచనో,
త్సవము వహింపవే జనకజం గనురీతి ము...

చ. వననిధి లీలమై గడచి వాయుతనూజుఁడు లంక
జొచ్చి సీ, తను గని తద్విధంబెఱిఁగి దైత్యులు
దాఁకినఁ ద్రుంచి మించి గ్ర,క్కున పురిఁ గాల్చి
వెండి యల కోమలిఁ గన్గొని వచ్చి తెల్ప స,
య్యన నటు వోఁదలంపవె దశాస్య వధింపము.

---

యుద్ధకాండము.

---

ఉ. నిండుమనంబుతోఁ గపు లనేకులు గొల్వఁగ
శార్ఙ్గతుల్య కో,దండము దాల్చి పూర్వవసుధా
ధరదీపితరుక్ప్రచండ మా,ర్తాండునిభంగి మారు
తసుతస్థితిఁ బొల్చుచు లంక కేఁగవే, చండనిశా
చరాంధతమసంబు హరింప ము... 179

ఉ. ధారుణి గ్రుంగ దిక్కరులు దల్లడమందఁగ మా
ర్గఘోరకాం,తారము నుగ్గుగా నడచుఁ దక్కపి
సైన్యముతోడఁ బోయి దు,ర్వారతరంగభీషణా
రవంబగు సంద్రముచెంత నిల్పవే, వారధికుద్ధి
రైయె నెగడు వానరసేన ము... 180

ఉ. ఇంతయు రావణుం డెఱిఁగి యింతకు మున్నొక
క్రోఁతి వచ్చి యెం, తెంతలో జేసి పోయె నిపు

డేపున రాముఁడు వానరాళితో, నెంతయు మీఱి వచ్చెను నీకెట్లు జయింతమొ మంత్రులార సు,స్వాంతముతో వచింపుఁ డని బల్కెఁడె వాఁడు ము.... 181

చ. కసలి కుబేరపుష్పకముఁ గైకొని దిక్పతులన్ జయించి కుం,భిని నరనాథులం గెలిచి పెంపు వహించిన నీకు సాటియే, మనుజకపీంద్రు లెంత యని మంత్రులు పంతము లాడరే దశా,ననుని మనంబు సంతసమున న్వికసింప ము... 182

చ. కుటిలత నింద్రజిన్ముఖులు గొల్వనఁ గ్రోధవిలోకనప్రభా,పటలము గ్రమ్మఁ గన్గొనుచుఁ బంతము లాడుచు ఖడ్గపాణులై, పటుగతి వారిఁ ద్రుంచెదము బంపు సురారి విచార మేల నీ, కిటు లని పల్కరే రణవిజృంభణలీల ము... 183

చ. భళి భళి చాలు పంతములు వానరుఁ డొక్కఁడు వచ్చి యిప్పురం, బలుక దహించునప్డు మన మందఱ మిరొయ్యెడ లేమె యింతటం,దలఁకిరె వైరు లేటికి వృథాశపథంబులు దైత్యులార యం, చలిగి విభీషణుండు తెగనాడెను గాదె ము...

ఉ. ఆ రఘురాముబాహుబల మల్పమె చూడ ఖరాదుల న్మహో,దారతఁ ద్రుంపఁడే ప్రబల తాటకఁ జంపఁడె వైర మేల దే,వారిమహేంద్ర రా

మున శిలాత్మజ నిచ్చి కులంబు గావు నే, ర్వార
నటంచుఁ బల్కెఁ గద యాతఁడెఁ బ్రోల ము...

ఉ. రాముఁ డనంగ నెవ్వఁ డమరప్రభుఁడో వరు
ణుండొ కాలుఁడో, యేమని చెప్పె దీవు వెఱ
పేమి మహీజ నొసంగ నేను సం,గ్రామ మొనర్తు
నంచనఁడె రావణుఁ డౌ మృతికాల మయ్యె
నిం,కేమనబోలు నాపలుకు లిష్టము లౌనె ము...

చ. వలదు మహాద్విరోధ మనివార్యబలాఢ్యుఁ డ
తండు నీబలం, బలుక దహించుఁ దప్పదు దశా
స్య మహీసుత నిచ్చి కావు మీ, కులమని తెల్ప
నుగ్రతరకోపమునం బడ దన్ని లంకకున్, వెలిగ
వసింపఁ బల్కఁడె విభీషణు నల్గి ము... 187

చ. జననియనుజ్ఞ వచ్చి మిము సర్వశరణ్యు నుతిం
చి వేఁడ మైత్రిని దగ నాదరించి కడుప్రేమ వి
భీషణు ప్రాభవోక్తిమై, నొసర ననుగ్రహింపవె
రఘూద్వహా నీకృప యెట్టిదో పరుం,డను విచికి
త్స దోఁచ దిసుమంతయుఁ జూడ ము... 188

చ. ఉదధినిమిత్తమై నియతినుండి నినుం గనకున్న
నల్గి దు,ర్మదమణగింతు నం చజశరంబు జగంబు
జలింప భూతలం,బదురుఁగ వింటఁ గూర్పవె మ
హాత్మ పయోధి వడంకుచున్ భవ, త్పదయుగ
మాశ్రయింపఁ దగవచ్చి నుతింప ము... 189

చ. నలు నియమింపు సేతువు నొనర్ప రఘూద్వహా
నిల్చునంచుఁ ద, జ్జలధి వచించి యుత్తరదిశ౯ బ
రగించు మజాస్త్రమన్న ను, జ్జ్వలగతి వేసి తా
యసురసంఘము మ్రందఁగ దృక్కుల్యమ౯, సలి
లపుఁగుండ మింక నలసాయకమప్పు ము... 190
చ. కపులు కడంక మైఁ గుధరకాండము వృక్షచ
యంబు బేర్చి తో,రపుగతి బాహుసంధుల శిరం
బులఁ బల్మరుఁదేర నంది నే,రుపున నలుండు వా
రధినిరోధము గాఁదగు కట్టవైవఁడే, నృపవర
నీయనుజ్ఞ నమరేంద్రుఁడు మెచ్చ ము...
ఉ. వీచులవెల్లుచేఁ బుడమి వెల్లువలం బచరించు
వార్ధిగాఁ, దోఁచుచు మేఘముల్ చెదర తోఁక
లు ద్రిప్పుచు లీల వచ్చు శా,ఖాచరసేనతో
నుదధిఁ గ్రక్కున నొక్కట దాఁటి యాసువే,
లాచలమందు నిల్చె వనాటబలంబు ము...
ఉ. చారులచే నెఱింగి సురశత్రుఁడు భీతిలి రత్న
కాంతివి, స్ఫారితసౌధ మెక్కి శుకసారణు లక్క
పికోటి బాహువి,స్తారబలంబులు న్బవదుదార ప
రాక్రమము న్వచించి నే,ర్పారఁగఁ జూపఁ జూ
డఁడె వనాటబలంబు ము... 193
ఉ. సంగరదోహాలు ల్కపు లసాధ్యులు రాముఁడు
దుర్జయుండు త,త్సంగరకేళి నిల్వ విధి జాలఁడు

జూడ దశాస్య వేగ సీ,తాంగన నిచ్చుటర్హమని
యాభటు లన్నఁ దలంకి మంత్రికో,టిం గని యో
ప్పజెప్పు మనఁడే దివిజారి ము ... 194

చ. ఖరఖరవంశసంభవుఁ డఖండపరాక్రముఁడుఁ
బ్రతాపభా,స్కరుఁడును ధర్మవర్ధనుఁడు గాన జ
యంబు ఘటించు నాఁడి నిర్జరులు నుతింప రావ
ణా! రసాసుత నిచ్చుట మేలటంచు సు,స్థిరమతి
మాల్యవంతుఁడు వచించెను గాదె ము...195

ఉ. నాకును జూడ చక్రి భువనంబులు బ్రోవఁగ రా
మమూర్తియై, లోకమునం జనించె బుధలోలత
సందియ మేని సంద్రమీ, లోకులు గట్టువారె
మదిలోఁ గనుమంచును మాల్యవంతుఁ డ,స్తోక
తఁ బల్కఁడే విభునితోఁ దగురీతి ము... 196

చ. కనుఁగవ నిప్పు లుప్పతిలఁ గన్గొని కిన్క నరాధ
ముల్ నరా,శనుల జయించువారె యిఁకఁజాలు
ను భూసుత నిత్తునే బలే, యని యని నిశ్చయిం
చి నిఖిలాశలఁ గాపులు వెట్టఁ దా దశా,ననుఁ
డును లంకఁ గావఁడె ధనప్రభుదిక్కు ము...

ఉ. మీరును దద్విధం బెఱిఁగి మేలని యుద్ధమె
నిశ్చయించి దు,ర్వారబలాఢ్యు శౌకవుల వారికి
దీటునమర్చి తత్పుర,ద్వారములందుఁ జుట్టు వన

వాసుల నిల్పుచు మీరు నుత్తర, ద్వారమున
న్వసించితి గదా రఘునాథ ము... 198

ఉ. రావణునాజ్ఞచే నిశిచరప్రకరంబు శరాసతూణ
బా,ణావలి దాల్చి కుంజరరథాశ్వభటోత్థితరౌ
ద్రభీకరా, రావము మిన్నుముట్టఁగఁ గరంబు
రణోత్సవలీల వచ్చి యు,ద్ధావని నిల్వదే సుర
చయంబు చలింప ము... 199

చ. తలపడి యామినీచరు లుదగ్రశరాసవిముక్తసా
యకా, వళుల గదాప్రహారముల వానరులం
దెరలించి బాహుసం,ధులు విదళించి ముష్టిహతిఁ
దూలఁగఁ జేసి జయాశ పైఁబయిం, దలకొనఁ
బోరరే ప్రళయదారుణభంగి ము... 200

ఉ. వానరు లుగ్రులై కడఁగి వాలములం బడమోఁది
శైలసం,తానముచేఁ దెరల్చి కఠినంబగుముష్టిని
నుక్కడంచి యు,ద్ధానవసైన్యమీఁగతి హతం
బొనరించుచు మాఱులేని పెం, బూనికెపోరొ
నర్పరె కపుల్ జయకాంక్ష ము... 201

చ. నిశను కడంకఁ దాఁకి రజనీచరు లుగ్రత వాన
రాలిదు,ర్దశలను బొందఁ జేసి మిముఁ దాఁకిన
వారిధనుఃప్రసారితో, ద్విశిఖ పరంపరాహతిని
భీతులఁజేసి మరల్చి తద్బలం, బశనిశరాలిఁ గూ
ల్చవె లయాంతకుభంగి ము... 202

చ. చటులమఖాగ్ని జాతరథసాయకముల్ గొని మేఘ
నాదుఁ డా,దట దివినుండి తోఁచక యుదగ్రశ
రాలి నిగుడ్చి వానర, చ్ఛటఁ దెరలించి కూల్చు
చును సర్పశరంబునఁ గట్టిన న్విశం,కటబల కట్టు
లూనవె జగన్నరుమాడ్కి ము... 203

చ. త్రిజట దశాస్యునాజ్ఞఁ దను దెచ్చినఁ జూచి
మహీజ హాజగ, ద్విజయబలాఢ్య కన్గొఱఁగితే
రణశయ్యనటంచు నేడ్వ నా,త్రిజట భయంబు
లేదు గురుతేజులు వీరని వంతమాన్పి యం, బు
జదళనేత్రఁ దోఁకొనుచుఁ బోవదె రామ.ము...

ఉ. నారదసూక్తిచేఁ దలఁచినం బరతెంచు ఖగేంద్ర
పక్షుదు, ర్వారమహానిలప్రహాతి బంధము లూడి
నఁదొంటికంటె సొం,పారి చెలంగి రా ఖగకులా
ధిపుసోఁకున దేవవానరుల్, సారెకు నార్పుచు
న్మదిని సంతసమంద ము... 205

చ. సతిహితవాక్యముల్వినక సైన్యవధంబుఁ దలంచి
పేర్చి యు,గ్రత నిజసేనతో నడరి రావణుఁడేచి
నిశాతసాయక, ప్రతతి నిగుడ్చి తన్నెదురుభాను
సుతాదుల మూర్ఛనుంచి మ్రా,రుతి తనుదాఁక
ముష్టిహతి గ్రుమ్మఁడె వాఁడు ము... 206

ఉ. దండధరాలయంబున కుదగ్రత బంచెనునా నతం
డుదో,ర్దండపటిష్ఠముష్టిహతి దాచిన మూర్ఛిలి

లేచిపఙ్క్తివక్త్రుండును సమ్మరుత్సుతునిఁ దూలిచి
నీలుని నొంచి మత్తవే, దండము వోలె లక్ష్మ
ణునిఁ దారొ్కనెఁ గాదె ము... 207

ఉ. తాఁకి శరంబు లేసిన శితప్రదరంబుల వానిఁ
ద్రుంచి బ,లీవ్రకను జేతివిల్ దునిమి బిట్టు నురం
బును గాడనేయ మూ,ర్ఛాకులుఁడై దశా
స్యుఁడు రయంబున లేచి కడంక నేయఁడే,
భీకరశక్తి లక్ష్మణుఁడు బిమ్మటువోవ ము... 208

చ. తలఁకక పట్టి లక్ష్మణుఁ గదల్పఁగ లేక శివాద్రి
నెత్తుచే, తులగమి మెండు బెండుపడఁ దూఁగి
పెనంగెడుపఙ్క్తికంఠు బి, ట్టలయఁగ మొత్తి
మారుతి మహారిపుదుర్ధరశక్తియుక్త నా, య
లఘునిఁ దేడె నీదెస కహస్కరతేజ ము...209

ఉ. క్రూరత మిమ్ముఁ దాఁకిన మరుత్సుతు నెక్కి
గుణంబు మీటుచుం, ఘోరశరాళి సారథినిఁ
గూల్చి హయంబులఁజంపి వెంటనే, తేరునుజగ్గుఁ
జేసి శరతీవ్రతఁ జూపిన పఙ్క్తివక్త్రుఁ డ,ధారుణి
నిల్వఁడే తనువు దాఁ జలియింప ము... 210

చ. అలయిక పుచ్చి రమ్మనిన నంతియమేలని పఙ్క్తి
వక్త్రుఁ డే,కలముగ నొందు యానమును గైకొని
వేల్పులు నవ్వ లంకకుం, దలఁకుచుఁ బోయి
చింతిలుచు దైత్యులు లేపుడు కుంభకర్ణునిఁ,

గలనికటంచుఁ బల్కెఁ గద కార్పడి-
వారు ము... 211

ఉ. దండనిశాటులెల్ల బెడిదంబుగ మొత్తియుఁ గర్ణ
వీథులన్, మెండుగ వేఁడిత్రైల మది మెట్టియు
బల్ రొద జేసి మత్తవే, దండతతిన్ బయింబఱపి
యార్చిన లేచి భుజించి కుంభకర్ణుండట కేఁగఁడే
తరుచరుల్ బెదరంగ ము... 212

ఉ. అన్నకు మ్రొక్కి దా హితవులాడి యతండును
గోపగింపఁ దత్సన్నిధిఁ బాసి వానరులఁ దాఁకి
కలంచుచు మ్రింగుచు న్మహాపన్నులఁ జేసి
మూర్ఛిలిన భానుజుఁ గైకొని కుంభకర్ణుఁ డత్యు
న్నతి లంక కేఁగఁడె జయోత్సవలీల ము...213

చ. ఇనజుఁ డెఱింగి ముక్కు పొలియించి చెవుల్విద
ళింప గైకసీ, తనయుఁడు సిగ్గుచే మఱలి దాఁకి
బలంబుల నేచి మ్రింగుచుం, జనునెడఁ దన్నుఁ
దాఁకుననుజన్ముఁ దొలంగుము నిల్చెదీవురా,ముని
కృపనంచుఁ దాఁకఁడె మిమున్వడి మీఱ ము...

ఉ. జృంభణ మొప్ప నారి మొరయించి మహాస్త్రచ
యంబు నించి దో, స్తంభపదంబు లూడ్చి మఱి
దార్కొనఁ ద్రుంపవె వేగ గైకసీ,సంభవు మూ
ర్ధ మబ్ధిఁ బడ సైన్యము లుబ్బఁగఁ దక్కబం

ధముం,గుంభిని ద్రెళ్లఁ జూచి సురకోటి నుతిం
ప ము... 215

చ. వడి నతికాయుఁడేచి శరపఙ్క్తిని వృక్షశరాళిఁ
దోలి పై, కడరి శితాస్త్రము ల్గురియ నల్కను
మారొనరించి మించి వెం,బడి తలద్రుంపఁడే కినిసి
బ్రహ్మశరంబున లక్ష్మణుండు సం,దడిగ సురల్ను
తింప వెస దైత్యులు బేర ము... 216

ఉ. హోమగతాబ్జజాతశర మూనుచు రావణి మిం
టనంటి సం,గ్రామమున న్వనేచరనికాయము గూ
లిచి తచ్ఛరంబు ను,ద్దామగతిన్ బయింబఱప
దానికి లోఁబడి యుండవే మహా,త్మా! మహానీ
యమహాట నది మన్ననఁ జేసి ము... 217

చ. విధితనయుండు దెల్పుగతి వేగ మరుత్తనయుండు
మిట్టి తా, నధికతరత్వరం జని మహౌషధులన్
మును గాంచి కానక,క్కుధరము బెల్లగించి తను
క్రూరతఁ దాఁకు సురాళిఁ దోలి య,వ్యధగతిఁ
దెచ్చి తేర్పఁడె వనాటబలంబు ము... 218

ఉ. శైలచరుల్ త్వదాజ్ఞను నిశాచరుపీటికిఁ బోయి
చిచ్చు లా,భీలగతిం దగిల్చి పురి పెంపును సొంపుఁ
దూలంగఁ గాల్చి దై,త్యాలిని మ్రందఁజేసి ఘను
లై రొయిదిరించిన వారలన్ ధరం,గాలిచి మించరే
దశముఖుం డెదఁగుంద ము... 219

చ. హరిహయజిత్తు దంభవసుధాత్మజ మారుతి జూ
డఁ ద్రుంచిచె,చ్చెర నిజమంచు నందఱును జింతి
లఁదా దివి కేఁగి నిష్ఠ న,ధ్వర మొనరింపఁగా నె
ఱిఁగి వచ్చి విభీషణుఁ డంతఁ దెల్ప నా,పరుని వ
ధింప లక్ష్మణునిఁ బంపవె రామ ము... 220

చ. వెసఁ జని దాశకంఠి మఖవిఘ్న మొనర్చి మెయి
న్నైలుంగు నా,రసముల గ్రుచ్చి దీపితశరంబున మా
యలప్రోడలైన ర,క్కసుతల ద్రుంపఁడే ప్రతినఁ
గైకొని లక్ష్మణుఁ డప్సరస్స్తుతుల్, కుసుమసువృష్టి
నింప సురకోటి నుతింప ము... 221

చ. అపరపయోధిఁ గ్రుంకు జలజాప్తుబలెన్ రణభూ
మి వ్రాలె ను,గ్రపుఁగరదీప్తిఁ జూపి తుది రావ
ణ నీసుతుఁడన్న వా,ర్తకుం, గుపితమనస్కుఁడై
యసురకోటులఁ బంపిన వారు దాఁకరే, ద్విపి
నెదురించు లేళ్లగతి తెంపున మిమ్ము ము...222

చ. గనగనమండు నగ్నినిభకాండపరంపర లేసి కాల
రు,ద్రునిగతిఁ దాఁకి గాడ్పులచి త్రుంచుచు నొం
చుచు నెందు నీవ యై,యనికి నెదిర్చి సేన నిమి
షార్ధములోఁ బొలియించి తౌ మహా,వని నెరి
యించు చిచ్చుగతి బంధురతేజ ము... 223

చ. పురజనులాడునాడికను బూని దశాస్యుఁడు వి
క్రమించి వా,నరతతి నొంచి ద్రుంచెదుమనంబున

దమ్ముని శక్తివైవ స్వాదరమున లక్ష్మణుం డెదిరి
దానను మూర్ఛిలఁ జూచి పఙ్క్తికం,ధరు నదలిం
చి తాఁకితి గదా వధియింప ము... 224

ఉ. సంశయమింత లేదు నిలు చక్కఁగఁ ద్రుంతు న
టంచుఁ గిన్క నా,వింశతిబాహుఁ దాఁకి శరవే
గముఁ జూపిన నిల్వలేక పై,యంశుకమూడఁ గే
శతతి యంసములం బడఁబాఱి వాఁడు శు,భ్రాం
శుధరుఙ్ భజింపఁడె జయాప్తిని గోరి ము...

ఉ. భూవర నీయనుజ్ఞ మదిఁ బొందుచుఁ జెంగున
మింట దాఁటి య,ప్పావనిపోయి త్రోవ సురభా
మకు శాపవిముక్తిఁ జేసి మా,యావిని కాలనే
మిఁ దునుమాడి పదంపడి లీల నోషధి, గ్రావముఁ
జేరఁ బోఁడె కుతుకంబుదలిర్ప ము... 226

ఉ. మందులకొండఁ గొంచుఁ బవమానరయంబున
రానెఱింగి త్రోవం దలపడ్డరక్కసులఁ బాపి వి
భాకరతుల్యరత్నభా,స్పంది ధరంబుఁ దెచ్చి య
నుజన్మునిఁ దేర్చి చెలంగఁడే మరు,న్నందనుఁ డు
బ్బి వానరు లుదారత నెంచ ము... 227

చ. వనచరకోటిచేఁ గ్రతువు పమ్మయినం దశకంఠుఁ
డుగ్రుఁడై, యనికి కడంగఁ దానెఱిఁగి యారఘు
రాముఁడు విష్ణుదేవుఁ డా, తనిఁ జెనకంగరాదు

వసుధాసుత నిచ్చి మనంగనోపునం, చు నతనిభా
ర్య పల్కెడె వచోఽమృతలీల ము... 228

చ. ఎఱుఁగుదు రామమూ ర్తి జలజేక్షణుఁ డౌట
నెఱుంగు దిందిరా, తరుణి మహీజ యౌట సఖి
తద్రణభూమిని వ్రాలి ముక్తి కే, నరుగఁగ నింత
జేసితి శుభాహతి నుండు మటంచు పక్షికం, ధ
రుఁడు గడంగఁడే యనికి దైత్యులతోడ ము...

చ. తలఁపఁడు నగ్నిరోమముఖ దైత్యుల దారుణకాం
డప క్షిచేఁ, గలన వధింపఁ గాంచి దశకంఠుఁడు
క్రోధధురీణుఁడౌచు జేరలుకను దాఁకఁడే మిము
మృగాధిపుఁడాఁకెడు హ స్తివోలె ని, శ్చలమతి
యై జయాశ మది సంధిలుచుండ ము... 230

చ. సురపతి పంపుతేరుపయి శోభిలి సింహమువోలె
రావణ, ద్విరదముఁ దాఁకి శస్త్రనిహతిఁ సొల
యించుచుఁ దచ్ఛరావళి, న్నరుకుచు నస్త్రనైపుణ
మున న్విహరింపవె లీలమై సురో, త్కరము ను
తింప శాత్రవులు తల్లడమంద ము... 231

చ. అలయక నిద్రనొందక మహాశని ఘోరశిలీము
ఖప్రభా, జ్వలిత దిగంతరుండ వయి సప్తదినంబు
లు పక్షికంఠుతోఁ, గలన యొనర్పవే త్రిదశ
కాండము జేరొక్కన యాతుధానులుం, గలఁగఁ
గపీంద్రు లద్భుతముగాఁ గనుచుండ ము...232

చ. కడకను పక్షికంఠుకరకంఠము లొక్కటఁ ద్రుం
చి తొంటికై, వడి మొలవంగ వింతపడి వానిని
ద్రుంచిన తోఁజనింప వెం,బడినవి ద్రుంచు చిట్టు
రవిమండలమం టెడు రాశిఁజేసి తొ, తడయక
నుంట వెల్లి బెడిదంబుగనించి ము... 233

ఉ. చేతులు మస్తకంబు వెడఁజెందమి కుల్కుటఁ
గాంచి పద్మసం,భూతవరంబుచే నమృతపూరము
నాభిని నుంటఁజేసి యి, ట్లీతఁడు జిక్కఁడయ్యె
మనుజేంద్ర హరింపు మటంచు రావణ,భ్రాత
వచింపఁడే విమలభావముతోడ ము... 234

ఉ. గ్రక్కున పావకాస్త్రమున రావణునాభిసుధన్
హరించి పెం, పెక్క మహాశరాలి నసురేంద్రు
తల ల్వీదళించి పుచ్చి తొ, నొక్కటిదక్క వజ్ర
నిహతోజ్జ్వలధాతుధరీధరాకృతి, న్నొక్కన
మేన రక్తములు నిండి స్రవింప ము... 235

ఉ. పావకకోటి తిగ్మరుచి భాస్వదజాస్త్రముచేత లో
కవిద్రావణు రావణున్ బ్రధనధారుణిఁ గూల్చితి
వౌజగంబులం, దావకకీర్తి యుల్లసిల దైవత
కోటి జెలంగ సర్వభూ,తావలి సంతసింపఁ గవు
లార్చి నుతింప ము... 236

చ. సురల నదల్చి దిక్పతుల స్రుక్కఁగఁ జేసియుఁ
బుష్పమత్తులం, గెరలఁగఁజేసి గుహ్యకుల గెల్చి

జగద్విజయైకవీరుఁ డై, పరగిన రావణుండు నొక
భల్లముచేఁ బడె నట్టివారికిఁ, ధరణిని దైవనిర్ణ
యము తప్పునె రామ ము... 237

చ. శిరములు మోఁదుకొంచుఁ గనుచిప్పల నశ్రులు
రాల నేడ్చు సుం,దరులను బుజ్జగించుచును దద్ద
శకంఠున కప్డు డగ్నిసం, స్కరణముఖాదికృత్య
ములు సర్వము దీర్పఁడె నీయనుజ్ఞచే, నరిగి
విభీషణుండు దనుజావలితోడ ము... 238

ఉ. ప్రేమదలిర్ప లంకకు విభీషణు నాథుగఁ జేసి
బ్రహ్మము, ఖ్యాపరసన్నుతుండ వయి యగ్ని
ముఖంబున సచ్చరిత్ర సీ,తామహిళం గ్రహించి
యట దండ్రిని గన్గొని దేర్పవే మృతా, రామచ
రాలి నింద్రునివరంబు గ్రహించి ము... 239

ఉ. బంగరుతళ్కు నల్గడల బారుకుబేరకపుష్పకంబు
పేరంగుగ నెక్కి దైత్యకపిరాజి చెలంగఁ బ్రవా
సభూమి సీ, తాంగన కర్థిఁ జూపుచు రసాధిప
చంద్ర యయోధ్యఁ జేరవే, పొంగి ప్రజాము
దంబు లొగి పొల్పెసఁగంగ ము... 240

చ. అలుకులు రంగవల్లికలు హర్మ్యపుఁజిత్తరువుల్
సుదోరణం, బులు మణికేతనప్రభలు పొల్పె
సఁగన్ శుభసూచకధ్వనుల్, గలిగి బుధప్రకీర్ణ

మయి కాంతత నొప్పదె త్వత్పురంబు హే,
లల నభిషేకవైభవములం దివిబోలి ము...241

ఉ. చారుమణీరుచిస్ఫురితసౌధవిరాజితసింహపీఠి గ్రా,
క్కారు మెఱుంగుతళ్కుగల కార్మొగులో యన
సీతతోడ శో,భారమచేఁ బ్రకాశిలి శుభస్థికల
గ్నమునందు రాజ్యభూ, భారముఁ దాల్చి తా
ప్రజశుభస్థితి నొంద ము... 242

ఉ. చారుశుభాంగి యై సురభిచందనచర్చిత యై విశే
షశృం,గారిణి యై రమామహిమఁ గాంచి
మెలంగెడు సీతతోడ సం,సారిబలేఁ భువిన్మదన
సౌఖ్యముఁ గాంచుచు నేలవే జగ,త్కారణ
రూపధారుణి సుధర్మ మెసంగ ము... 243

చ. స్థిరయు సమస్తసస్యములచేఁ బొలుపొందఁగ
మానవుల్ శుభం, కరు లయి పుణ్యవర్తనలు
గల్గి జరింపఁగ ఖేచరుల్ క్రతూ,త్కరములఁ
దృప్తులై చెలఁగ ధర్మముగాఁ బదకొండువేలవ,
త్సరములు గాచితౌ జగతిశాసనమొప్ప ము...

ఉ. రామకథామృతంబు రుచిఁ ద్రావి భవంబు
దొరంగి మానవ, స్తోమము ముక్తిఁజెందఁ గృప
తో నిటుజేసితి గాక వార్ధిని, చ్ఛామతి దాఁటు
టెంత దనుజచ్ఛటఁ ద్రుంచుట యెంత నీదులీ,
లామహిమంబు చిత్రము దలంప? ము... 245

ఉ. మంగళ ముర్విజాపతికి మంగళ మర్కకులేంద్ర
మౌళికి, న్మంగళ ముర్విభద్రనగమండనవర్తికి
రామమూర్తికి, న్మంగళ మర్థిలక్షణమనఃకమ
లైకవిలాసవర్తికి, న్మంగళమెప్డుఁ గావలయు
మాధవ మీకు ము... 246

ఉ. వందన మాచరించెదఁ గృపాజలరాశికి బ్రహ్మరు
ద్రసం, క్రందనపూజితాంఘ్రికి నఖండపరాక్రమ
శాలికిఁ దశ, స్యందననందనాగ్రణికి నబ్జసుధాధ
రకీర్తికిఁ జగ, త్సుందరమూర్తి వైనరఘు
సూనుఁడ మీకు ము... 247

ఉ. శ్రీరమ భూమినందనయు శేషుఁడు లక్ష్మణుఁ
డావికుంతమి, ద్ధారుణి భద్రశైలమన దాసులఁ
బ్రోవ వసించినట్టి సు,శ్రీరఘురామ చక్రి మిము
జేరితి ధన్యుఁడనైతి నోశుభా, కార తనూవి
లాసజితకంధరబృంద ము... 243

ఉ. రామకథాప్రపంచమును వ్రాసినఁ జెప్పిన సంస్మ
రించినఁ, భూమసుఖాప్తులై జనులు మోక్ష
ముఁ జెందుదు రంతమందు శ్రీ,రామయటంచు
నొక్కపరి రక్తిఁ దలంచిన ముక్తి గల్గుఁగా, నే
మిట గల్గబోదు రుచి నెప్డు బఠింప ము... 249

చ. అనఘచరిత్ర జూలురికులాబ్ధిసుధానిధి రైన
సుబ్బనా, ర్యునికి సుసాధ్వి శేషమకు నుద్భవమం
దితి లక్ష్మణాఖ్యుఁడ, ఘనమతి మీకు నంకిత
ముగా రఘునాథచరిత్ర సూక్ష్మమై, తనరుగృతిఁ
రచించితిని దాసుఁడ నీకు ము... 250

—

# పీఠిక.

రసికులారా!

ఈశతకమును పదునేనుసంవత్సరముల క్రిందట నారంభించి కొలఁదిదినములకు ఎనుబది పద్యముల వఱకుఁ బూర్తిచేసితిమి. పిదప నాలుగేండ్లకు మిగిలినపద్యములు పూర్తిచేసితిమి. అనంతపురములో నున్న ఎ. పి. కవిగారు తమబాలభారతిలోఁ బ్రచురించుకొనుట కీశతకమును దీసికొని యేబదిపద్యములు దాదాపుగఁ బత్రికలోఁ బ్రచురించి పిమ్మట పత్రిక నాపివేసిరి. ఎన్నిమాఱులు కోరినను మిగిలినపద్యములను బంపరైరి. ముద్రితమైన యేబది పద్యములు మాత్రము పత్రికనుండితీసి జాగ్రత్త చేసితిమి. ప్రత్యంతరము లేకపోవుటచే మిగిలినపద్యములు క్రొత్తగాఁ బూర్తిచేయవలసివచ్చినది. పనిలోఁబనిగఁ బూర్వపద్యములు చాలవఱకు మార్చితిమి.

మొత్తముమీఁద నీశతకమున నీతివిషయిక పద్యము లెక్కువగను భక్తివిషయికపద్యములు కొలఁదిగ నున్నవి. ఇందలిభావములు చాలవఱకు

మాజీవితమునకు సంబంధించినవి యైనను ప్రపంచమునకు సంబంధించినవిగా స్ఫురించునటుల వ్రాసియున్నారము. అక్రమవర్తనలు కపటాచారులదుశ్చేష్టలు పరోపకారుల మనువారిదుండగములు సంస్కర్తలసాహసకార్యములు కొన్నియెడలఁ బేర్కొంటిమి. ఏపద్యము గాని ప్రత్యేకవ్యక్తుల దృక్పథమునం దుంచికొని వ్రాసియుండము. దాదాపుగా నీశతకము కామేశ్వరీశతకము కాళహస్తీశ్వరశతకము (కొంతవఱకు) వేణుగోపాలశతకము తెగలోఁ జేరఁదగినది. భక్తికి నీతి కీశతకమునఁ గలయిక గలదు. శతకసంపుటములో నీశతకమును చేర్చి మమ్ము ప్రోత్సహించిన బ్రహ్మశ్రీ వావిళ్ల. వేంకటేశ్వరశాస్త్రిగారియెడఁ గృతజ్ఞులము.

ఇట్లు,

శేషాద్రిరమణకవులు,

శతావధానులు.

నందిగామ,
1-12-8.

శ్రీ ర స్తు.

# సర్వలోకేశ్వరశతకము.



శా. శ్రీరమ్యాత్మక! నిర్వికల్పమయమూర్తీ సచ్చి
దానందశ్రీం, గారాకార ప్రసన్నదృగ్రుచిలస
త్కారుణ్యభావాకర, స్మేరాంకూరముఖాం
బుజాత! భువనక్షేమంకర ప్రక్రియా, పారీణా
త్మక నీకు మ్రొక్కెదను దేవా! సర్వలో
కేశ్వరా. 1

శా. ఓనిర్వ్యాజదయాభిరామసుకృతీ యోదీనసంర
క్షణా, దీనస్వాంతపయోజ! యోత్రిభువనక్షేమ
ప్రసన్నాత్మ! ఓ,హో నీరేజభవాండభాండ
భరణా! యుగ్రారిషట్కావృతుఁ, దీనుఁ
నన్ను సముద్ధరింప నగుఁగాదే సర్వ... 2

మ. ధనధాన్యంబులఁ గోర్కిలేదు, పరవిత్తద్రోహ
దుష్కర్మసం, జనితానందము నొల్ల నెల్లపుడు
నీసారళ్య కారుణ్య మొం,ద నపేక్షించితి నయ్య
మత్కలుషసంతానంబుఁ బోకార్చి న, న్ననురా
గంబున నేలుకోనగుఁ గదయ్యా సర్వ... 3

మ.దురహంకారజనావృతం బయిన యీదుష్టప్రపం
చంబులో, నరజన్మంబున నన్ను నెక్కొలిపి
యానందించుచున్నాఁడవా?, పరసేవాజనితవ్య
థాభరపరిభ్రష్టాత్మునిన్ నన్ను నీ, కరుణాసాగర
మగ్నుఁ జేయు మతిలోకా సర్వ... 4
శా.సూరిస్తుత్యగుణాలవాల! సుయశశ్శోభాయ
మానాత్మ; నీ,కారుణ్యంబున సర్వలోకములు
సౌఖ్యంబందు నీయాదర, స్మేరాంకూరరసంబు
చేత జగముల్ చెన్నొందు నీప్రాభవం,బేరైనం
గానియాడనేరుతురె తండ్రీ సర్వ... 5
శా.దీనత్రాణపరాయణాత్మక! భవద్దివ్యప్రభావంబు
చి,త్తానందప్రదమంచు నైహికగతవ్యామోహ
విధ్వంసనా, ధీనప్రాభవభాసురం బనుచు నర్థిం
గోరి సేవించుచు, న్నానీభక్తుఁ దరింపఁజేయవె
యనన్యా సర్వ... 6
శా.మానంబూని యరణ్యసీమలను దుంపల్ పండ్లు
భక్షించి యా,శానీకంబు జయించి దివ్యపరమా
ర్థాపేక్ష వర్తించుస,న్మానుల్ నిన్గనకే తపింతు
రన దుర్మానవ్యథాఖిన్నక, ర్మానుష్ఠానుఁడ నెట్లు
నిన్ గనెద దేవా! సర్వ... 7
శా.కల్లల్పల్కుచుఁ బొట్టకూటి కయి దుర్గర్వాన్వి
తపాపాంతులన్, సల్లాలిత్యమనోహరాంధ్రకవితా

సర్వంకషవ్యాప్తిచే, నుల్లాసంబునఁ దన్పినన్
బ్రతిఫలం బొందంగ లేనైతి ని, న్నుల్లంబందుఁ
దలంతుఁ బ్రోవవె దయాళూ! సర్వ... 8

మ. వివృతస్వర్గపురీకవాట మగుచుం బెంపొందు
త్యాగంబు నా, కవలంబింపఁగఁ జేతఁగాదు
పరిణామానందసంధాయకం, బవు శాంతవ్రతధ
ర్మనిష్ఠయొ యసాధ్యం బిట్టిదీనాత్ము న,న్నవలో
కించి కృతార్థుఁ జేయు ముచితజ్ఞా సర్వ... 9

మ. సిరినిం గూర్పక కార్యనిర్వహణసుశ్రీదక్షుఁ
గావింపఁ బో,క రసాభాసదరిద్రముద్రితునిగాఁ
గష్టాత్ముఁగాఁ జేసి న,న్నరయన్ మానితి వేల
తండ్రి పరమార్థాపేక్షయో నీపద, స్మరణంబో
దయచేసి నన్ మనుప రమ్మా సర్వ... 10

మ. తనయుల్ బందుగు లన్నసమ్మదము, గాంతా
వ్రాత మన్నన్ బ్రియం, బును ద్రవ్యంబన
నాస స్వైరమున సమ్మోహంబుఁ, జేకూర్చి క,ష్టని
దానంబుగ నాదుజీవితము రాజద్వారసంవాస
సం,జనితక్షోభల కేల లోఁబరుతు వీశా సర్వ.

మ. పొగరా పోదు; ధనాశయో చనదు; పూవుం
బోండ్లకౌఁగిండ్లపై, వగపా తగ్గదు; మానసంబో
స్థిరభావం బొంద దేమందు నీ, జగదుద్బంధము

నెట్లు త్రెంతు నెటు లీక్ష్యా మోహాసంబంధముల్,
పగులంగొట్టుదు తోఁచ దేవెఱవు దేవా సర్వ.
మ. తనగర్భస్థితరక్తమాంసములచేతన్ బిడ్డలంగాంచి
తీ,రని మోహాంబునఁ బెంచి పెద్దల నొనర్పన్
మాతృసేవావ్రతం, బన నేమో తనయుల్
గ్రహింపక పశుప్రాయంబుగా నున్నచో, జననీ
దుఃఖము మాన్పశక్యమె మహేశా సర్వ...
మ. నవమాసంబుల మోసి తల్లి కడువంతల్ బొం
దుచుం బెంచి మా,నవధర్మంబులు దెల్పి
యోగ్యయగు కన్యన్ బెండ్లి గావింపఁగా, దివ్వ
రన్ జూచును సర్వరీతులను మాతృద్రో
హమ్ముం జేయఁగా, నవురా పుత్త్రుఁడు వాని
శత్రుఁ డనరాదా సర్వ... 14
మ. తనకామంబున కాస్పదంబయి నికాంతారత్న
ముం గొల్వ సి,గ్గు నెదం జెందఁడు నిత్య మా
పె కడునెగ్గుల్ పల్కినన్ లెక్కఁగాఁ, గొనఁ
డంతఃకరణాతిరేకమున లగ్గుం గూర్చు ధన్యాత్మ
యా, జననిం జూచిన పాపి కోపి యగు నీశా
సర్వ... 15
మ. తనకంఠంబునఁ దాళిగట్టినధవున్ దైవంబుగా
నెంచుచే, వనితాధర్మము తా వరించినసతిన్
వామాంగ మంచున్ మనం,బున భావించుట

మ_ర్త్య ధర్మ మిది యేవో భారతీయప్రశ,_స్తిని
తాంతంబున కాదిసూత్రము దయాబ్ధీ సర్వ...
శా. కారుణ్యంబునఁ బెంచి యన్న మిడి లోకజ్ఞానవి
ద్యాదులం, దారూఢాత్ము నొనర్చినట్టి జనకుం
డత్యంతదూష్యుండుగా, మూఱుగా నేఁటివివేకి
స_త్తముల కీమూన్యాత్ము లెట్లుందురో,తా రింపా
రఁగఁ గన్నబిడ్డలకు నిత్యా సర్వ... 17
మ.లలితానూనఫలాభిరామములు లీలాలోలశైవా
లినీ, విలసద్దేశము లైనఁ గాననములన్ విశ్రాం
తినొందంగఁ ద్రావులు పెక్కుండ ధనావలి_ప్త
విచరద్భూపాలకాస్థానభూ, ములలోఁ బండితు
లుండ నానాకా స్వయంభూ సర్వ... 18
శా.చంచద్రత్నసువర్ణకంకణములున్ సర్వాంకషంబై
నపీ,నాంచద్రూపము గల్గుమానవుఁడు విద్యా
వైభవోదగ్రుఁడై, వంచించుం జగమెల్ల సంత
తము; విద్వద్గేయ విద్యానటీ, కాంచీభూషణు
లెట్టు లోర్తురో రసజ్ఞా సర్వ... 19
మ. ధనమున్నప్పుడు వందిమాగధులు కాంతారత్న
ముల్ పండితుల్, తనయుల్ బంధులు వెంట
నుందురు దరిద్రత్వోభ మెంతైనచో, తననీడైనను
తన్ను వీడి తొలఁగున్ ద్రవ్యంబునం దున్నశ,
_క్తిని గు_ర్తింప వశంబె జీవికి గుణాబ్ధీ సర్వ...

శా. బాలక్రీడలు కొన్నినాళ్లు సుకళాభ్యాసంగ
ముల్ కొన్ని నా, ళ్లాలోలేక్షణు లైనకామినుల
భోగావేక్ష గొన్నాళ్లు కొ,న్నాళుల్ దుస్తర
రోగసంజనితచింతాదంతురక్షోభలం, గాలం
బెట్టులో పుచ్చు జీవి సుగుణాంకా సర్వ...

మ. చలదంభోరుహపత్త్రవాఃకణగతిన్ స్థైర్యంబు లే
కున్న మే,నులు నిక్కంబు లటంచు మత్తులయి
మానుష్యుల్ గూఢసర్వజ్ఞతా, ఫలముం బూడిద
లోనఁ గల్పి విఫలప్రాయంపుఁ బ్రాయంపుఁగాం,
తలకౌఁగిండ్ల మెలంగు టేల గుణగణ్యా సర్వ.

శా. సారోక్తి ప్రథమానకావ్యగతయోగాజాలశ్రీం
గారగా,ధారంగంబులలోనఁ దృప్తుఁ డగుచో
దారుణ్యపుంబొంగు చ,ల్లారుం జీవికి స్వైరసంచ
రణలీలాలోల కాంతారతే, చ్ఛారూఢాత్మున
కిందునందుఁ గతి కద్దా! సర్వ... 23

మ. పగులం గేలధరింప పీల్పడని మృత్పాత్రంబు చేఁ
బట్టి జీర్ణగుణప్రావృత పూతిగంధమయవస్త్రం
బెట్లో మైదాల్చి య,ధ్వగరంగస్థలు లైనసత్త్ర
ములచెంతం జేరుమర్త్యుల్ నినున్, నిగమజ్ఞే
యుఁ దలంప రేమనెదఁ దండ్రీ సర్వ... 24

శా. క్రూరుల్ గొందఱు సత్యమూర్తులకుఁ జిక్కుల్

గూర్చి యాత్మీయదు, శ్చారిత్రంబును వెల్లడిం
తురు; క్షమాసర్వస్వవిభాజిత, స్వైరాస్యంబున
వారు సైచినను గాసింగూర్చి కాలుండు తద్ఘో
రాఘంబున కొంపఁడే విబుధబంధూ సర్వ...25

శా. గంగాస్నాన మొనర్పవచ్చు జనలోకంబెల్ల గొం
డాడఁగా, సంగీతంబు లొనర్పవచ్చు పరభాషా
వేషసాంగత్యముల్, సాంగంబుం దొలఁగింప
వచ్చు భవదీయాంఘ్రిద్వయీసేలువచే,తం గా
వ్య మడంప శక్యమె యనింద్యా సర్వ... 26

మ. శ్రమయంచుఁ సుఖమంచు సంసరణకష్టంబే
భరింపంగఁజా, ల మటంచుం దమి నిచ్చ కాల్బ
లుకుకూళల్ వీడఁగా నేర్తురే, రమణీచారుతరో
న్నమత్కుచయుగప్రాదుర్భవన్మోహావి,క్రముముల్
చండగభస్తితేజ! కృతలోకా సర్వ... 27

మ. కలుషస్థావర మన్యకామినులసంగంబంచు బాజా
రుమి,ట్టలపైఁ జేరి ప్రసంగముల్ సలువుదుష్ట
స్వాంతులే తత్పథం, బుల వర్తింతురు రేఁబవళ్లో
బలిరే బోధాక్రమప్రాప్తి యీ, కలికాలంబున
నుండె నిట్టు లకలంకా సర్వ... 28

శా. బారల్ సాచుచు దేహిదేహి యనుచుం
బ్రార్థించుపేదఁ క్షమా, కారుణ్యోజ్జ్వలదృష్టి
తోడుత కనంగాఁ బోవఁ డెవ్వాఁడు దు,ర్వార

శా. బాలక్రీడలు గొన్నినాళ్లు సుకళావ్యాసంగ
ముల్ గొన్నినా, ళ్లాలోలేక్షణ లైనకామినుల
భోగాపేక్ష గొన్నాళ్లు గొ,న్నాళ్ళఖల్ దుస్తర
రోగసంజనితచింతాదంతురక్షోభలం, గాలం
బెట్టులో పుచ్చు జీవి సుగుణాంకా సర్వ...

మ. చలదంభోరుహపత్రవాఃకణగతిఁ స్థైర్యంబు లే
కున్న మే,నులు నిక్కంబు లటంచు మత్తులయి
మాన్యుల్ గూఢసర్వజ్ఞతా, ఫలముం బూడిద
లోనఁ గల్పి విఫలప్రాయంపుఁ బ్రాయంపుఁగాం,
తలకౌఁగిండ్ల మెలంగు తేల గుణగణాఢ్యా సర్వ.

శా. సారోక్తిప్రథమానకావ్యగతయోగాజాలశృం
గార గా,థారంగంబులలోనఁ దృప్తుఁ డగుచో
దారుణ్యపుంబొంగు చ,ల్లారుం జీవికి స్వైరసంచ
రణలీలాలోల కాంతారతే, చ్ఛారూఢాత్మున
కిందునందుఁ గతి కద్దా! సర్వ... 23

మ. పగులం గేలధరింప వీల్పడని మృత్పాత్రంబు చేఁ
బట్టి జీర్ణగుణప్రావృత పూతిగంధమయవస్త్రం
బెట్లో మైదాల్చి య,ధ్వగరంగస్థలు లైనసత్త్ర
ములచెంతం జేరుమర్త్యుల్ నినుఁ, నిగమజ్ఞే
యుఁ దలంప రేమునెదఁ దండ్రీ సర్వ... 24

శా. క్రూరుల్ గొందలు సత్యమూర్తులకుఁ జిక్కుల్

గూర్చి యాత్మీయదు, శ్చారిత్రంబును వెల్లడిం
తురు; క్షమాసర్వస్వవిభాసిజిత, స్మేరాస్యంబున
వారు సైచినను గాసింగూర్చి కాలుండు త,ద్ఘో
రాఘుంబున కొంపఁడే విబుధబంధూ సర్వ...25

శా. గంగాస్నాన మొనర్పవచ్చు జనలోకంబెల్ల గొం
డాడఁగా, సంగీతంబు లొనర్పవచ్చు పరభాషా
వేషసాంగత్యముల్, సాంగంబుం దొలఁగింప
వచ్చు భవదీయాంఘ్రిద్వయీసేలువచే,తం గా
వ్య మడంప శక్యమె యనింద్యా సర్వ... 26

మ. శ్రమయించుక సుఖమంచు సంసరణకష్టంబే
భరింపంగఁజా, ల మటంచుం దమి నిచ్చ కాల్బ
లుకుకూళల్ వీడఁగా నేర్తురే, రమణీచారుతరో
న్నమత్కుచయుగప్రాదుర్భవన్మోహావి,క్రమముల్
చండగభస్తితేజ! కృతలోకా సర్వ... 27

మ. కలుషస్థావర మన్యకామినులసంగంబంచు బాజా
రుమి,ట్టలపైఁ జేరి ప్రసంగముల్ సలుపుదుష్ట
స్వాంతులే తత్పథం,బుల వర్తింతురు లేఁబవళ్లు
బలిరే బోధాక్రమప్రాప్తి యీ, కలికాలంబున
నుండె నిట్టు లకలంకా సర్వ... 28

శా. బారల్ సాచుచు దేహిదేహి యనుచుం
బ్రార్థించుపేదన్ క్షమా, కారుణ్యోజ్జ్వలదృష్టి
తోడుత కనంగాఁ బోవఁ డెవ్వాఁడు దు,ర్వార

క్రోధమయాంతరంగుఁ డగుభూపాలుండొ చో
రుండో చే, జారక లోభి యొసంగు సర్వ ముఖ
లేశా సర్వలోకేశ్వ రా. 29

మ. ధనమార్జించుటె గాని కాసయిన సార్థంబందు
వెచ్చింపఁ డెవ్వనినైనఁ జెడఁగొట్టుగాని విహి
తవ్యాపారముల్ నేరఁడే, మన నేమున్నది లోభి
మానవుల పాపాచారదుశ్చర్య; వారిని నీవే
టికి సృష్టిచేసితివి తండ్రీ సర్వ... 30

మ. కలుముల్ మిక్కుటమైనచోఁ గలుషముల్
గావింపఁ బ్రాల్మాలఁ డా,శలు మెండైనకొలంది
దుష్క్రియల కుత్సాహంబు గోల్పోవఁ డీ,
చలచిత్తుం డగులోభి పీనిని దయాసౌజన్య
సౌశీల్య నిశ్చలు గావించు. దరిద్ర మొక్కటె
మహేశా సర్వలోకేశ్వరా. 31

మ. ధనగర్వంబునఁ బుట్టురోగములు సాంతం బొందు
దారిద్ర్యమం,దున దారిద్ర్యమునందు రోగచయ
మెందుం బుట్టదొక్కప్డు పుట్టినచోఁ గాంచుఁ
దనంత నాశనము పాటింపంగఁ బోర్వానిరో,
గినిగా సర్వజనుల్ ప్రశస్తు లనురక్తిక సర్వ.32

మ. జనులక మోస మొనర్చియైనఁ గలుపాచారం
బుచే నైన దుర్జనసంపర్కముచేత నైన ధనమే
జాల్మిండు చేకూర్చునో, ఘనుఁ డాతండు హితుం

డతండు జనలోకస్తుత్యవిజ్ఞానధీ,ఖని యాతం
డని పేర్వడున్ విగతపంకా సర్వ... 33

మ. ధనమే ప్రాణమె ప్రాణమే ధనముగాఁ దర్కిం
చులోభుల్ పరా,సును దూషించినఁ గోపమం
దరు జనుల్ క్షోభాతిరేకాత్ములై, తను బ్రార్థిం
చిన జాలినొందఁ డతిలుబ్ధస్వాంతులన్ ధర్మభా,జ
నులం జేయఁగ నీకశక్యము పరేశా సర్వ...

చ. చనుచోఁ గొండొక గ్రుడ్డిగవ్వఁ గొనిపో
శక్తుండు కానట్టి దు,ర్జనుః డైహికసౌఖ్యమున్
మఱిగి సంసారాబ్ధినిర్మగ్నుఁ డై, ధనసంపాదనకై
చరించును దురంతక్రూర సంతాపసా,ధనమా
తద్ధన మేల కాల్పనె ప్రశస్తా సర్వ... 35

శా. కాలాసన్నమునందు శాంతము దయాకళ్యాణ
భావంబు స,చ్ఛీలోజ్జృంభణవాగ్విడంబనములున్
జేకూరు మర్త్యాళికీ, లీలల్ జవ్వనమందు నేమ
యినవో లీలావతీమోహాపం,కాలీనం బఘు మెట్ల
డంగు గుణశూన్యా సర్వ... 36

మ. పనియున్నప్పుడు జూపు శాంతము కృపాభా
వంబు మర్యాద పా,వనవాచావిభవంబు గార్య
పుఁదుదిన్ బాటింప రెవ్వారు దు,ర్జనలోకంబు
పరప్రతారణవిచారంబందు ధర్మావలం, బనపా
త్రంబు ధరించుఁ గాదె గుణధామా సర్వ...

మ. పలుకుల్ తేనెలసోన లీనఁ గరుణాభావంబు
లేనవ్వు మోమలరింపఁ గనుదోయి శాంతి(?)రం
గంబై ప్రకాశింపఁగాఁ, దులువల్ వేసెడి బా
హ్యవేషముల నర్థుల్ నమ్మి యాశామహా, జల
ధిఁ మగ్నము నొందుచుందు రఖిలేశా సర్వ.

శా. తానే సర్వకళావిదుండ నను విద్యాశూన్యుఁ
డొక్కండు విజ్ఞానప్రాభవశాలి నే నను దురా
చారాత్ముఁ డొక్కండు ధర్మానుష్ఠానపరాయ
ణుండ నను మిథ్యాలాపి యొక్కండు సుశ్రీని
త్యాత్మకుఁ డీకలిఁ గుణవిహారి సర్వ... 39

మ. తగవుల్ దిద్ది కళావిదగ్ధతల నుద్యద్రీతి సాటింప
వచ్చుఁ గడుఁ నీతులు ధర్మశాస్త్రములు నెచ్చో
వల్లెఁ బెట్టంగ వచ్చు గుణాలంకరణాభిరాముఁ
డ నటంచుఁ జెప్పఁగో వచ్చు వాక్కుగొనం
బొక్కగతిఁ వెలార్ప వశమొక్కో సర్వ...40

మ పరులన్ నైపక దుష్టమార్గచరులై వర్తించు నిర్వే
లదుశ్చరితుల్ సంతతభోగభాగ్యవివిధైశ్వర్యా
ఢ్యులై మించుచుండిరి సత్యాత్ములు లేమిచే
మిగులఁ గుంఠీభూతులై నొచ్చుచుండిరి పాపా
త్ములె లోకపూజితులు తండ్రీ సర్వ... 41

మ. చదువుల్ నేర్వఁగవచ్చు దుర్విషయసంసర్గంబు
బోనాడవచ్చు దయాసత్యశుచిప్రచారముల

నెచ్చో గూర్చుకో వచ్చు నెమ్మది నిన్ దావక
పాదపద్మయుగళీమగ్నంబు గావించు నేర్పది
దుస్సాధము మానవాళికి సుభావా సర్వ...42

మ. సిరిపై రాజ్యము పై సతీజనము పైఁ జిత్తంబు
పోనాడి నిష్ఠురసత్యవ్రతధర్మకర్మరతితో శుద్ధాం
తరంగంబుతోఁ, గురువంశం బలరించె భీష్ముఁడు
తదంఘ్రుల్ మోచి పుణ్యైకవి, స్ఫురితంబై మన
మాతృభూమి తగ నెచ్చో సర్వ... 43

మ. అవనీమండల మండనాయిత యశోవ్యాసంగు
లౌ ధారుణీ, ధవులే పోయిరి కాలగర్భమున
కీద్రవ్యంబు కాయంబు వై, భవమున్ శాశ్వ
తమాయటంచు నెదలో భావింపఁ డెవ్వాఁడు
దు, ష్టపరిష్ఠంబగు కాలసత్వమున నీశా సర్వ...

శా. తారుణ్యాతిశయావలేపమున విస్తారాఘు మా
ర్జించి దు, శ్చారిత్రుం డనిపించుకొన్న కలు
షాచారుండు ప్రాయంపుఁబోం, గారన్ సంతత
ధర్మకర్మవిహీతవ్యాసంగుఁ డై యుండు ని, స్నా
రాంగుం డయి దాన నేమిఫల మీశా సర్వ. 45.

శా. సూనుల్ తుంగతరంగమాలికలుగాఁ జూపట్టఁ
బ్రోయాంద్రు స, త్వానీకంబుల శేవఁ గన్పడ
ననంతానన్యవాంఛాలతల్, పానీయంబుల రీతి

భాసిలెడి యీపాపంపుసంసారముం, జ్ఞానుల్
నెమ్మది నెంత్రు వారిధిగ నీశా సర్వ... 46

మ. స్థిర మొక్కించుక లేక, రోగములకుం జిత్త
వ్యథాపాళి కా, కరమై సంతతకష్టదుష్ట మగు
చుం గన్పట్టు మాంసాసృగు, ద్ధురశల్యాకర
మైన దేహమునకై దోషంబు లెన్నేనియుం,
నరు లేలా యొనరింపఁ బూనుట లనన్యా సర్వ.

మ. పరహింసావిముఖుండు భీరువు కృపాభావుండు
నిస్సారతా, భరితాత్ముండు పరాంగనావిముఖ
పుంస్త్వవ్యక్తిశూన్యుండు స, త్వరతాత్ముం
డసమర్థకీటకము ధర్మాధర్మసంఘట్టనం, బు రసా
భాసము నేఁటికాలమున స్వరూపా సర్వ... 48

మ. తనయైశ్వర్యసమృద్ధిఁ జూచికొని మాంద్య
స్వాంతులై తేండ్రు స, జ్జనసాంగత్యము నిచ్ఛ
గింపక ప్రపంచద్రోహు లై యుండి రీ,పని శ్రేయః
ప్రద మౌనె శ్రీదుఁడును గర్వంబేది భిక్షా
శనుం, జనుమానంబున గౌరవింపఁడె సురేశా
సర్వ... 49

మ. మనమే గొప్పయటంచు నెంచఁజనునే మాం
ధాతృముఖ్యుల్ గడిం, చినవిఖ్యాతి గడింతుమే
విజయుఁ డెంతే సంగరక్షోణియం, దునఁ
జూపించినధాటిఁ జూపఁగలమే ద్రోణుండు చేశా

న్నకీ, ర్తినిఁ జేకొందుమె? యేల స్వాతిశయ
ముల్ శ్రీసర్వ... 50

మ. తమసౌఖ్యంబులు తామె చూచుకొని స్వార్థ
త్యాగముల్ జేసినా,ర మటంచుల్ వచియించు
వారు పరకార్యద్రోహముం జేసి యు, త్తమధర్మా
త్ములమంచు వాకొనుజనుల్ దంభప్రతారంభు
లై, స్వమతద్రోహ మొనర్పఁ బూని రఖిలేశా
సర్వ... 51

మ. తొలుతల్ బెండిలి చింత పిమ్మట సుతాదుల్
కల్గ రెరన్న నెం,జెలి యాపైని కుటుంబసంభరణ
దుశ్చిత్తభ్రమంబుల్ జనుల్, కలకాలంబు గలం
చుచుండుఁ గలదే కాసంత సౌఖ్యంబు పం,కిల
సంసారనిమగ్నబుద్ధికి విరాగి సర్వ... 52

మ. నిరవద్యప్రతిభావిలాసములు పాండిత్యప్రభావం
బు భా, సురసాహిత్యకలాకలాపకములుల్
శుద్ధాంతరంగమ్ము దు, స్తరసంసారపయోధిభంగ
నిచయాంచద్ఘోరసంఘట్టన, స్థిరచింతాజడు పీడ
నాడును గుణాబ్ధీ సర్వ... 53

మ. నిరతంబుల్ శిశుపోషణాదరమునం జింతించు
చుం బ్రాయపుల్, గరితల్ గన్పడివంతఁ గొం
బెదవి పంటల్ నొక్కుచుల్ భాగ్యసం,భరితుం
డౌజనునిం గనుంగొనిన భావంబాదు బెగ్గిల్లు

చున్, దురవస్థల్ పడుదుష్టుఁ డెట్లు పరమొం
దున్ సర్వ...

మ. సమవేగంబునఁ బాఱుశైవలినులన్ స్నానాద్య
నుష్ఠానకా, ల్యములం దీర్చుచుఁ గందరాంతర
ములం దావాసముం జేయుచుం, బ్రమదాతీత
హృదంబుజాతుఁ డగుచున్ వర్తించుధన్యాత్ము
జన్మమె జన్మంబని యెంచఁగాఁదగు పరాత్మా
సర్వ...

మ. తరుపార్శ్వంబుల విశ్రమించుచు శకుంతస్వాన
ముల్ సమ్మదా, కరులై వీనులఁ జేర్చుచున్
విమలరాకాచంద్రదీవ్యన్నిశాం, తరవేళన్ జల
బిందుతుంద శశికాంతస్నిగ్ధపాషాణసుం, దరశై
లంబుల నుండ్రు ధన్యులు వదాన్యా సర్వ...

మ. తతశల్యాకరమాంసరూప మగుకాంతాగాత్ర
ముం దోర్యుగ, స్థితముం జేసి నితాంతసౌఖ్య
ములతో జీవించుచున్నాఁడనన్, గతలం దెల్వ
గృహస్థుకంఠెను బతంగస్వాదుకీతామృతో, ద్గత
సాలావృతగేహి; మాని సుఖి కాదా సర్వ...

మ. తరుణీవల్లుదృగంచలంబులకు మిథ్యాసౌఖ్యసం
పత్తికిన్, పరమార్థోచితనూత్నయౌవనము సర్వ
స్వంబు నర్పించి దు, స్తరసంసారపయోధిమగ్ను

లగు చింతాదంతురక్షుణ్ణు లౌ, నరు లేరీతి
తరింతు రైహికమునన్యా సర్వ... 58

మ. కలకుంజాఫుల పేరితూపులఁ బయిం గాడించి
లీలాలస, ద్దరహాసాంరకుసూచికాగ్రముల చేతన్
మేను తూటాడుసుం, దరు లెంచాఁకఁ గనంగవ
చ్చెదరో వ్యాన్నాళీక మందాఁక సు, స్థిరభా
వంబు గడింపఁబోదు పరవేదీ సర్వ... 59

శా. (?) నీరంధ్రద్రుమసంకులంబుగహనానీకంబొ? నా
నాజనౌ, త్కరసంచారవినోదరంగ మగునాస్థా
నంబొ? కాంతామణీ, విరళస్వేదతనూపగూహన
సుఖావిర్భూతశయ్యాతలం,బొ రుచించున్ నరు
జన్మ కేది సుఖదంబో సర్వ... 60

శా. ఆలోలాబ్ధితరంగవేష్టిత సమీరాంకూర సంచా
రసు, శ్రీలీలావనముల్ నిరంతరపరశ్రేయోను
కూలంబుగాఁ, గ్రాలన్ సంతతగర్వపర్వత శిఖా
గ్రస్థాయి భూమీశ్వరో, పాలంభంబులకేల
పాల్పడుట దేవా? సర్వ... 61

మ. పరహింసారతభూమిపాలకకుటుంబం బందు జ
న్మించి ని,ష్ఠురకార్యంబుల నుజ్జగించి భువనక్షో
భంబు పోకార్ప బం,ధురదీక్షావిభవంబు గైకొ
నిన ముక్తున్ బుద్ధదేవున్ దయా,కరు భావిం
చెద సత్వసిద్ధి కతిలోకా సర్వ... 62

మ. సదయాంతఃకరణాతిరేకమతి మించన్ విశ్వక
ళ్యాణసంపదఁ గాంక్షించి యహింసయే మను
జధర్మం బంచు చాటించి యభ్యుదయ శ్రీసము
పేతుండైన జినదేవోదారసత్యవ్రతా, స్పదవిజ్ఞా
నము నెంతు నెంతయు సుభావా సర్వ... 63

శా. సారాచారులఁ బండితోత్తముల నాస్థానంబునం
జేర్చి తత్, స్వారస్యార్థనిబద్ధసవ్యకవితాసంపత్తి
నాలింపఁగా, నేరాజైనను బూనఁడాంధ్రకవితా
హేలావతీవైభవ, శ్రీరమ్యంబు లదృశ్య మౌ
టరుదె వారీ సర్వ... 64

శా. పేరుంగ్రైకొన నెంచి మేటికవులం బిల్పించి యా
స్థానమం, దారూఢంబుగఁ జేర్చి కబ్బముల
వ్రాయం బంచి పోనాడుభూ, దారుల్ పండిత
పక్షపాతు లౌరా నిత్యస్వైరసంచారభూ, దార
ప్రాయులుగాఁ దలంప నగుగాదా సర్వ... 65

శా. పారావారపరీతభూవలయముం బాలించి సత్కీ
ర్తివి,స్తారుల్ తొల్లిటిధారుణీశ్వరులు వీసంబేని
గొంపోయిరే, తారుణ్యంబును రాజ్యవిస్తృ
తియు నిత్యంబంచు దుర్వారగ, ర్వారూఢా
త్మకు లెంతు రిద్ధి తగవానే? సర్వ... 66

మ. ఘనదుర్దాంతవయోవిజృంభణమునన్ గర్వించి క
న్పట్టు కాంతను బోనాడక రొట్టులోగలిసి తత్త

ద్వ్యాధిపీడాదిసం,జనితక్లేశభలఁ గుందుజాల్ముఁ
డు ప్రపంచద్రోహి యై యేన యా,వననిందాక
వినంచు నుబ్బునెద దేవా! సర్వ... 67

మ. పరకాంతావిముఖుండనంచు సభలన్ వాక్రు
చ్చి కబ్బంబులన్, బరుకన్ వచ్చును గాని శక్య
మొకో గ్రామక్రోడదుర్మాంసస,కరనానావిధ భ
క్ష్యభోజ్యనిచయగ్రాసావలేపాత్ముఁ డే, నరుఁ
డన్నట్టుల నిర్వహింప గుణధన్యా సర్వ... 68

మ. అటవీమధ్యములం జరించుచుఁ బ్రపంచాతీతు
లై మోక్షులం,పటు లై యున్న మహామునీశ్వ
రులె భామాదర్శనభ్రాంతు లై, విటచూడామ
ణులై చరించి రస మాధ్వీమాంసమద్యాశనో,
త్కటమత్తాత్ములు కామ మాపుటలు కద్దా సర్వ.

మ. కవియైనంత ఫలంబె యన్యకవిరాట్కావ్యార్థ
చౌర్యక్రియా, కవితాదూరుఁడు కావలెం గద
మహీకాంతుండు నై యంతనే, యవునే పౌరజన
శ్రమాహారణనిత్యోదార్యకార్యక్రియా, స్తవనీ
యాత్ముఁడు కావలెం గద రమేశా సర్వ... 70

శా. ఎన్నండో యొనరించినట్టి సుకృతంబే తేని
గావించె; ని, ప్డెన్నో పాపము లాచరించు నెడ
ముందే పాట్లు కానున్నవో, యున్నాళ్లా యమ

లోకవాస మగునో యేజన్మ రానున్నదో,
అన్నా! యేనృపుఁడైన నెంచఁడిది మేలా సర్వ...

మ. తరుణీపీనకుచద్వయీనిహితహస్తద్వంద్వుఁ డై
కామినీ, స్మరణానందసుఖాభిరాముఁడయి సంసా
రేచ్ఛ వర్తించు కా,తరుఁడైనన్ దృటిసేవు నిన్ను
మదిలో ధ్యానించుచో మోక్షము, స్థిరభాగ్యం
బుల నొందఁగాఁ గలుగుఁ గాదే సర్వ... 72

మ. వితతక్రూరనృపాలసేవనము గావింపంగనేలా?దు
రాగతదుర్వృత్తులయందు లోఁబడి మెలంగన్
బోవనేలా? జగత్పతినిం గొల్చినచో తరించెదవు
లేదా "ఆయురన్నం ప్రయచ్ఛతి" యంచున్
బుధులాడి రిద్ది నిజ మిాశా సర్వ... 73

మ. తనుదూషించినఁ గ్రమ్మఱన్ దెగడుకాతర్యంబు
తన్నెవ్వరై, నను భూషించిన నుబ్బు దుర్నయ
ము తన్ గాదన్న రోసంబునై, కొను దుష్టత్వము
లేని మానవుఁడె యోగ్యుం డట్టియోగత్వమె,
వ్వనియందుం గల దాతఁ డీవొకటె దేవా
సర్వ...

శా. తారుణ్యంబు గలంతకాలము సమస్తప్రాణిసం
తానవిస్తారంబై తగునీజగంబు నొగి నిత్యంబంచు
భావించితిం, జేరన్ వచ్చెను వార్ధకం బిపుడు

నాచిత్తంబు సర్వంబు మి,థ్యాపారంగంబని యెంచె
భ్రాంతి విడ దేవా సర్వ... 75

శా. ఏవో కొన్నికొలంత లున్నయెడ నేనెట్లవ్వి సం
పూర్ణముం, గావింపంగలవాఁడనంచు వగచుఁ
గర్మంబు బాగుండి సు,శ్రీవిశ్రాంతి లభించెనేని
సుఖముల్ చేకూలెనంచుబ్బి నీ,సేవల్ చేయు
టలెప్పుడీనరునకుఁ శ్రీ సర్వ... 76

మ. మతముల్ సర్వము నీమహాత్త్వమును సంభా
వించి బోధించు స, ద్గతి నీవొక్కఁడవే ప్రదాత
వని లోకంబెల్ల వాక్రుచ్చుశా, స్త్రతతుల్ నిన్నె
లుఁగ బరస్పరవిభేదంబూని వర్తించు నే, వీత
ముం గైకొనఁజాలుదుఁ విగతగర్వ సర్వ...77

శా. దీనత్రాణపరాయణుండవు జగద్గేయప్రభావై
భవ, శ్రీనీరంధ్రదిగంతరుండ వగునిఁ జింతించి
ధ్యానింపఁగాఁ, బోనుంబోను నశక్తి పెచ్చురి
లునో పోరామి చేకూరునో, గానఁ నేఁడె
స్మరింతుఁ గావు మకలంకా సర్వ... 78

శా. క్రీడారంగము నీకు లోకము మహాకీలాలవా
రాశినీ, రాడంగూర్చుసరోవరంబు పటుసత్వా
కీర్ణఘోరాటవుల్, వీడంజాలనినిష్కుటంబులు
నభోవీథిస్ఫురచ్చైలముల్, మేడల్ నీకగు
నెట్లు గందు నిను స్వామీ సర్వ... 79

శా. కుక్షింబోషణసల్పఁగాఁ దలఁచి పెక్కుల్ దొష్టకృ
త్యముల్ సల్పి యే, రాక్షేపించిన సిగ్గునొందక
ధనంబన్నంత నాశించుపా,పత్ముణ్ణాత్ములు చూచు
వారలకుఁ దత్త్వజ్ఞానుల ట్లుందు రీ, శికాపాత్రు
ల కేది నీతి పరవాసీ సర్వ... 80

శా. సహ్యాసహ్యవిచారశూన్యు లయి నీచద్రవ్యలా
భార్థమై, బాహ్యాడంబరులైనదుర్జనులు పాపం
బన్న లజ్జింప రీ,యేహ్యాస్వాంతులనేల భూతము
లపై సృష్టించితో ? నీతలం, బూహ్యాం బెట్లగు
నస్మదాదులకు వేల్పా ! సర్వ... 81

మ. పరిచర్యాభరముఁ సహించి, పరభూపశ్రేణినిం
గొల్చి సం, సరణంబుం గడుపంగనేరని దురా
చారుండు నిన్నుం బరా, త్పరు నర్థించి దురంత
బంధముల నుత్పాటింప యత్నింపఁ డీ, నరజ
న్మంబు తరించు టెట్లిఁక ననన్యా సర్వ... 82

మ. హరియే దైవమటంచు నొక్కరుఁడు పుణ్యస్థా
న సందర్శన, స్మరణంబే యపవర్గమంచు నొకఁ
డీసంసారమే మోక్షము,స్థిరకళ్యాణమయుం బటం
చువచియించెఁ వేఱొకం డీపర,స్పరవైరుధ్యము
దిద్దు టెట్టులగు దేవా సర్వ... 83

శా. కాలక్రూరదురంతకాసర మహాఘంటారవంబుల్
శ్రవః, పాళిఁ భిన్నము చేయుచో నిను స్మరిం

పఁ నేర్తునో నేరనో, కాలాసన్నము గాక
ముందు మదిలోఁ గాంక్షించువిజ్ఞానలబ్ధిలాభం
బౌనఁగూర్పుమయ్య గుణరాశీ సర్వ... 84

శా. సేవాధర్మము లేనెఱుంగ నిను బూజింపంగ
లేకుంటి స, ద్భావావేశము లేదు సుంతయు దరి
ద్రక్షోభ చేతఁ మనీ,షావిశ్రాంతి నశించె వ్యర్థ
ముగ నాజన్మంబు చేటయ్యె నఁ, గావం జూ
తువా! వీడెదో సుగుణగణ్యా సర్వ... 85

శా. తారుణ్యంబు గతించె, వార్ధకము చెంతఁ జేరె
నెమ్మేన దు, ర్వారవ్యాధులు కాచియుండెను
పటుత్వం బెల్ల వమ్మయ్యె నీ, కారుణ్యంబును
గోరుకాలమిది నఁ గాపాడెదో వీడెదో, లే
రెవ్వారలు దిక్కు సర్వసురమౌళీ సర్వ... 86

మ. పరసేవాకరణశ్లథంబయిన భావం బెట్లు నీనామ
సం, స్మరణానందము నొందనేర్చు; కలుషాచార
ప్రచారంబులఁ, బరుగుల్ పెట్టుచు నున్నజీవి
తము నీపాదాంబుజాతద్వయీ, పరిచర్యావిధి
నెట్లు ధన్యమగు దేవా సర్వ... 87

మ. తినుబండారము లెమ్మటంచు నిసువుల్ దివ్యాం
బరశ్రేణికై, వనితారత్నము గ్రంథసంతతి కభి
ప్రాయార్థమై స్నేహితుల్, ధనసంపాదనకై

దురాశయును సంతాపజ్వరజ్వాలలం, దనిశం
బుగ్ దహియించు సత్కృపుల నీశా సర్వ...88
మ. కవితాకాంతకు బుద్ధి భాషకు సమగ్రంబైన
యూహాదివై, భవముల్ కావ్యరసప్రపంచము
నకుం బ్రాణంబు సంసారసం,భవకష్టార్థము మేనొ
సంగిన కళాపారంగతుం డెట్లు నీ, స్తవముగ్
జేయఁగలాఁడు తీరికెగ శ్రీశా సర్వ... 89
మ. శ్రుతపాండిత్యముతో నినుం దెలియ నెచ్చో
శక్యమౌనే? సమం,చితవిజ్ఞానముచేత నీప్రతిభ
చర్చింపంగ సాధ్యంబె? శా,స్త్రతతుల్ తెల్పెడి
త్రోవలం జనక నీశాంతస్వరూపంబు హృ, ద్గత
ముం జేయనను గ్రహింపవె యనింద్యా సర్వ...
మ. గతకాలంబు సుఖంబుగా జరిగె; నింకగ్ మీఁ
దికాలంబునగ్, బ్రతు కేరీతి శ్రమాకులం
బగునో; నిర్బంధాకరంబైన సం,సృతి నన్నెట్లు
దురంతదుస్సహతరార్తిగ్ గూల్చునో యంచు
నా,మతిచాంచల్యమునొందె దిద్దుటకు రమ్మా
సర్వ... 91
మ. కలలోఁ గాంచినవెల్ల సత్యసరణుల్ కానట్లు
సంసారసం, కుల మౌనైహికమెల్ల కల్లయని
యొకొక్కం డైన విజ్ఞానిలో, దలపోయండు
వివేకులే కలుషసంతానంబు నార్జించుచో,

తులువల్ మోక్షము నొందఁగాఁ గలరె
యొందుల్ సర్వ... 92

మ. పరకాంతం గనినంతఁ గాముకుఁడుదుర్వ్యాపార
చింతాపరం, పరలం దేలుచునుండు గాని యెద
సౌభాగ్యత్రుస్వభావై కవి, స్ఫురితుండై నిజసోదరీ
మణిగ నెచ్చోఁ జూడఁ డీపాపి సో, దరులుం
దల్లియు స్త్రీలు గారో తెలివొందక్ సర్వ...

మ. తరుణీరూపముమాతృభావ మలరక్ ధ్యానించు
టక్ ఘోరసం,సరణాంభోనిధికంటియంటని గ
తిక్ సర్వత్ర వర్తించుటల్, నరుఁ డెవ్వం డాన
రించుచుండు నతఁడే నారాయణుం డాతఁడే, పర
మాత్ముం డని చెప్పఁగాఁ దగును దేవా సర్వ.

శా. తారుణ్యంబును బూర్తిగా నితరకాంతాదూరుఁ
డై పుచ్ఛి ని,స్సారంబై తగునైహికావళి యె
డక్ సంసర్గముల్ మాని యా,శారోపాదిపరా
ఙ్ముఖుం డయిన సౌజన్యాత్మ కక్సన్నులం, జేరుం
గాదె ప్రపంచమెల్ల గుణరాశీ సర్వ... 95

మ. మహనీయుల్ కవిసార్వభౌములు సుధామాధు
ర్య వాక్పూగధూ,ర్వహనానార్థకవిత్వమాలికల
చే రంజిల్లఁగాఁ జేయు నీ, మహితోరస్థ్సలి
దోషదూషితవచోమాలాదికం బుంచు నా,య

హామున్ నైచి కృతార్థుఁ జేయఁగదవయ్యా
సర్వ... 96

మ. గళసంస్తంభితమై కఫంబు హృదయోత్కంపంబు
గావించుచో, తలభారంబయి కంపమొందునెడ
లన్ ధాతువ్రజంబెల్ల సంకులముం బొందుత
ఱిన్ భవత్ప్రీతిభఁ బేరొకం నేర్తునో నేర్వనో,
తలఁతున్ వేఁడొకమారు నేఁడు దయరాదా
సర్వ... 97

శా. ఏరూపంబున నున్నవాఁడవని యూహింపంగ
నేర్తున్ మతే, పేరం బిల్చెద నెందు నుందువ
నుచుం బేరొకందు నెందేఁగుదున్, దారాపుత్ర
దురీషణావృతదురంతక్రూరసంసారచిం, తారంగ
స్థలి దాఁటుటెట్లు పరమాత్మా సర్వ... 98

మ. నిగమార్థంబు లెఱుంగ, వ్యాసముఖులౌ నిర్వా
ణవేత్తల్ పురాణగణంబందు లిఖించినట్టి విష
యాంతర్భావముల్ చూడలే, దగచాట్లం బడు
జ్ఞానశూన్యుఁడను నే నాత్మార్పణం బెట్లు చే,
యఁగ నేర్తున్ దరియించు టెట్లు పరమేశా
సర్వ... 99

శా. ప్రాచీనంబగు నార్షభావమది దుర్వారఖ్యాన
సంపత్తిచే, నీచస్థానము నొందె; సాంస్కృతిక
వాణీవైభవశ్రీల న, ర్వాచీనుల్ గ్రహియింప

కుండి రెటు తత్త్వజ్ఞానసంపాదన, వ్యాచిక్రిం
సకుఁ బూనుకోఁగలను దేవా సర్వ... 100

మ. కలికాలం బిదిగాన మానవులకుం గాలంబు
స్వల్పంబు నీ, చులపొందే లభియించు సజ్జనుల
గోష్ఠుల్ కల్ల వె ట్టీవ్యథా, కులసంసారపయో
ధి దాఁటనగునో క్రూరారిషట్కంబు నే, లలి
వంచింపఁగ నౌనో తోఁచదె యనల్పా సర్వ...

మ. మునుముందెప్పుడొ భక్తియోగకలనంబుంబూన
నేనంచు న్మానసమం దెంచితిగాని యెప్పటికి
నేమార్పానో, యీనాఁడె నీ, యనుగుంబిడ్డ
ను నన్నుఁ గావుమనుచుం బ్రార్థింపఁ బ్రాల్మాలితిన్,
చనె నజ్ఞానము బ్రోవరావె పరమేశా సర్వ...

మ. గ్రహతారాదులు దిక్కులాకసమువక్కాణించు
నీతేజ మ్మన్వహమున్ సర్వము నీయధీనమని
శాస్త్రార్థంబు బోధించు నీమహనీయత్వ మెఱిం
గి విస్మృతమహామాయాప్రపంచంబులో, విహ
రించం దొరకొంటి నన్నరయ లేవే సర్వ...

మ. తనువో చంచలమం చెఱుంగుదును, గాంతా
వ్రాతసంపర్కమున్, ఘనవిజ్ఞానహారంబు గాఁదెలి
యుదున్ గర్మానుబంధంబు లే, జననప్రాప్తికి మూ
లకారణముగాఁ జర్చింతునే గాని న్మానసమున్
నీపయి నిల్ప నేరఁ గనుఁగొమ్మా సర్వ... 104

మ. కవితాకల్పనముల్ రసప్రచురశృంగార ప్రబం
ధంబులున్, నవభావాకరనాటకాది కములున్
నాదృక్పథంబందు నుత్సవముంగూర్చును గాని
మోక్షమహితార్థగ్రంథసంబంధముల్, చవిగా
వెట్లు తరింపఁగాఁ గలనో యీశా సర్వ... 105

శా. ఈదేహం బొగి పంచభూతమయ మెందేవేళనో
తూలుమర్యాదాలేశమె నిల్చు శాశ్వతముగా
నర్థంబులుం జుట్టముల్, పాదుంజీవము బాసినట్టి
యెడఁ దోడ్పా టుండుఁగాఁ బోరు తృష్ణాదైన్యం
బదియేల జీవికి ననన్యా సర్వ... 106

శా. ఆండ్రంబిడ్డల నెంత దన్నినను మేలా? లేదు
సుంతేనిఁ బ్రోయాండ్రన్ నిత్యము గూడినన్
వలపునిప్పావంతయే నారదె, వ్వాండ్రం గొల్చినఁ
గాని సంసరణదుర్వారంబు పోకార దో, తండ్రీ!
నీవాకరుండె దిక్కు దయలేదా సర్వ... 107

మ. పరితః పుష్పితకేళికావనులు భావవ్యక్తకావ్యం
బులున్, సరసాలాపవినోదవర్తనములున్ సర్వం
సహాభాగసం, చరణంబున్ విడనాడఁ జాలని
మనుష్యశ్రేణి వైరాగ్యనిష్ఠురదీక్షావిధ మెవ్వి
ధిం బడయనేర్చున్ సర్వ... 108

మ. బ్రతుకా యన్యజనావలంబము శరీరంబా రు
జాభూమి, స్వార్జితమా నాస్తి సహాయబంధ

హీంతులా సర్వత్రపూజ్యంబు నా,గతి ముంబెట్టు
లమాఱునో యనుచు శోకం బందునే కాని పం,
డితుఁ డైనన్ విడలేఁడు సంసృతిని తండ్రీ! సర్వ.

మ. గతిలేకుండిన బిచ్చమెత్తుఁ దనకుం గర్జంబు
లేకున్న చో, మతిశూన్యుండయి యన్యగేహా
ములలో మాపుల్ పవళ్లుండు నే, చతురుండై
నను మిథ్య సర్వమనుచుం జర్చించి నిష్ఠాగరిష్ఠ
త నార్జింపఁ దలంపఁ డేమనెద నీశా సర్వ...110

మ. వినవచ్చెన్ యమధర్మరాజతురగద్విట్కంఠఘం
టాఘుణం, ఘననాదంబులు కంఠసంకలితమై కా
సప్రసారంబు నె,క్కొనె నీవే శరణంబు నాకనిన
నీకుం గూర్మి కాఁబోవ దీ,తనువున్నప్పుడె నిన్ స్మ
రింపవలె గాదా సర్వ... 111

మ. కలుషాచారులు దంభవర్తనులు లోకం బెల్ల
వంచించు చేష్టలు దర్శించి దదీయవర్తనపుఁ లన్
ఛద్మంబులం గేరి నే, నెలమిన్ వ్రాసితిఁ గొన్ని
పద్యములు నీకీనూత్నపద్యంబు లు,జ్జ్వలసమ్మో
దకరంబులంచు జగదీశా సర్వ... 112

మ. పరసేవాజనితవ్యథాభరము సైపన్ లేక యస్మ
ద్ధృదం, తరసంతాపము వెళ్లఁబుచ్చుటకుఁ బద్య
వ్రాతముం గూర్చి నీ, చరణాబ్జంబులచెంత

నుంచితిని దాస్యత్వో భవిచ్ఛేదనం,బు రహిం
గూర్చవె పాతకాళికి స్వయంభూ సర్వ... 113

మ. పదిరెండేడుల క్రింద నీకృతి సమాప్తం బయ్యె;
నిద్దాన డెబ్బదిపద్యంబులు పత్రికాంతరమునన్
బ్రవ్యక్తమై రాజిలెన్, దుదిపద్యంబులు గొన్ని
మిత్రుండొకం డెందో పాఱవేయంగ న,ల్పదిప
ద్యంబుల వ్రాసితిన్ మరల దేవా సర్వ...114

శా. మారీస్ఫోటకరోగదూర మగుచున్ మాతృత్వ
మాభాగముల్, పేరుం బెంపును గాంచుంగాంత
కవితాబింబోష్ఠి లీలాగతుల్, శ్రీరమ్యంబుగ
రాట్ప్రభాంతరములన్ జెన్నొందుతన్ సత్కృపి,
స్వైరవ్యాప్తికి హేతుభూత మగుచేవన్ సర్వ
లోకేశ్వరా. 115

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

# ఆంధ్ర గ్రంథములు.



## పద్యకావ్యము.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అచ్చ తెనుఁగురామాయణము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| డిటో కాలికో బైండు ... | 1 | 10 |
| అడవిమల్లెలు, ఎనమండ్ర నారాయణమూర్తిగారిది | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు ... | 1 | 8 |
| అనంతునిఛందో దర్పణము ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | 0 | 8 |
| అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారి విమర్శతో నున్నది ... | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | 0 | 4 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది ... | 5 | 8 |
| ,, అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | 7 | 8 |
| ,, 3 సంపుటములు ... | 9 | 0 |
| శ్రీమదాంధ్రభారతము, పద్యకావ్యము:— | | |
| 7 సంపుటముల ప్రతి ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి ... | 13 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆదిసభాపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము | ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ... | 2 | 0 |
| శాంతిపర్వము | ... | 2 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 8 |
| యుద్ధపంచకము స్త్రీపర్వము | ... | 3 | 13 |
| శాంతిసప్తకము | ... | 3 | 12 |
| ఆదిపర్వము మాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు | | 1 | 8 |
| ఆంధ్రభారత విమర్శనము, మల్లాదిసూర్యనారాయణశాస్త్రి | ... | 0 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికోబైండు | ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యప్రతితీర్థ శ్రీజనమంచి శేషాద్రిశర్మకృతము, 3 సంపుటములు | ... | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 14 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | ... | 0 | 12 |
| ,, కాలికోబైండు | ... | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహా | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది ... | 0 | 6 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజ ప్రణీతము, చక్కని కూర్పు, గిల్టుబైండు ... | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము | 1 | 8 |
| కవికర్ణరసాయనము, (మాంధాతచరిత్ర) ... | 1 | 8 |
| డిటో మేలు ప్రతి, కాలికో బైండు ... | 1 | 14 |
| కళాపూర్ణోదయము, దళసరి కాగితములు ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కని క్రొత్తకూర్పు ... | 1 | 8 |
| డిటో కాలికో బైండు ... | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 | 4 |
| డిటో గట్టి ప్రభుత్వము ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక - చక్కనికూర్పు ... | 0 | 6 |
| డిటో కాలికో బైండు ... | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము ... | 0 | 10 |
| గోపీనాథరామాయణము 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనము మిక్కిలి సొంపు; పీఠిక అతివిపులము ... | 7 | 8 |
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు ... | 0 | 2 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | 1 | 4 |
| డిటో రెండవభాగము, సాధారణప్రతి ... | 1 | 6 |
| డిటో మేలుప్రతి, గ్లేజు కాకితములది ... | 1 | 10 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 2 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము ... | 1 | 0 |
| డిటో కాలికో బైండు ... | 1 | 6 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | ... | 0 | 14 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 2 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము, చక్కని ప్రతి | ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 12 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము | ... | 2 | 0 |
| దశరాపద్యములు | ... | 0 | 2 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, మేలు ప్రతి | ... | 1 | 0 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | | 0 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగ్గడ, క్రొత్తకూర్పు | | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |
| పంచతంత్రము, వేంకటనాథరాజకృతము | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| ప్రబంధరత్నావళి | ... | 1 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు | | 0 | 8 |
| బసవపురాణము, పిడుపర్తిసోమనాథప్రణీతము | | 2 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| బ్రహ్మోత్తరఖండము | ... | 1 | 0 |
| బిల్హణీయము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కని క్రొత్తకూర్పు | | 4 | 0 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 1 | 2 |
| భోగినీదండకము | ... | 0 | 1 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితముల మీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కగా ముద్రించియున్నారము | ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 2 | 2 |
| మూన్నాళ్లముచ్చట, వేటూరి ప్రభాకరశాస్త్రి | | 0 | 4 |
| మొల్లరామాయణము, చిన్నసైజు, పెద్దక్షరములు | | 0 | 10 |
| రసికజనమనోభిరామము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద, క్రొత్తకూర్పు | | 2 | 8 |
| డిటో మేలుప్రతి | ... | 3 | 0 |
| రంగరాయచరిత్రము, దిట్టకవి నారాయణకవి | | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 12 |
| రత్నపరీక్ష, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | | 2 | 0 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 3 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 4 |
| ,, కాలికోబైండు | ... | 0 | 12 |
| రామరాజీయము, చక్కనిప్రతి | ... | 0 | 12 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| రామాభ్యుదయము ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు ... | 1 | 10 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి ... | 0 | 6 |
| ,, కాలికోబైండు ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 12 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 14 |
| ,, కాలికోబైండు ... | 0 | 10 |
| లంకావిజయము. (రావణసమ్మోహనము), సటీక, పింగళి ప్రోలు లక్ష్మణకవికృతము ... | 1 | 4 |
| ,, కాలికోబైండు ... | 1 | 8 |
| వసుచరిత్ర, సటీక, అనేకనూతనాంశములుగల చక్కని క్రొత్తకూర్పు ... | 4 | 0 |
| వసుచరిత్ర విమర్శనము, శ్రీ చినసీతారామస్వామి శాస్త్రికృతము, అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు ... | 1 | 0 |
| వసిష్ఠజనకసంవాదము ... | 1 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మది | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు ... | 1 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవికృతము | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 12 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది ... | 0 | 5 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.